గరదుండు గోశ మిత్రఘ్నరినిశర్కరను బాధితుఁ డగునరుఁ డన్యసతిని గన్న

ఆ. మహిషి గోవుఁ బరగి మదనాతురత మున్ను, గవిసినాఁడు శోషిరోగివిధి రోఁకువు
లనుభవింపఁ డెచ్చు ర్కోనినమాంసము దొంటి పుట్టువున హరించినట్టినీచు. 99

ఆ. ఊలుము గొన్నవాఁడు దోలుమేన నాఘాత, బంధనముల నోరులఁ ప్రస్నేదనము
సెఱచినాఁడు పంగు [1]వోటివఁగఁ గాలుసే, విఱిచి సాధుజనులఁ జఱచినాఁడు.

క. తిలకాదులఁ [2]గంతులచే, నలమటఁ బడువారు బడియు నడిచియు, పుష్టిం
జలమునఁ బొడిచియు సాధులఁ, దోలుబాము నొంచినట్టి దుష్టచరిత్రుల్. 101

ఆ. పాదరోగులు లశుచిపదముల దేవాలయములు మెట్టుటయును నసదువారిఁ
దప్పు లేక క్రోవ్విఁ దన్నుటయును దొలుపుట్టువందుఁ గలిగినట్టివారు. 120

చ. జ్వరమున గుల్మపీడ నతిసారమునం బలుపుంజులన్ మహో
దరమున వాతపిత్తకఫదారుణరోగములన్ నిరంతరా
తురు లగువారు నిర్దయతఁ దొల్లి వినోదము గాఁగ జీవులం
దర మిడి [3]చంపినారు గురుఁ దల్లడపెట్టినవారు పార్వతీ. 103

తే. గూనివాఁడును బిచ్చుకకుంటు [4]గుజ్జుఁ, గొలుచులమ్ముచోఁ [5]గ్రచ్చులు గలిపినరకు
దూఁచి పెట్టుచోటులఁ దూనిక్ దరసి, పూర్వభవమున లాభంబుఁ బొందినారు. 104

సీ. వెట్టులు దొలుమేన వెడ్డున సాధుజనము మోసపుచ్చి ధనంబు గొన్న
జను లనపత్యులు విను తొల్లి పితృకార్య, దూరులు బాలఘాతులును జీవ్వ
పోఁతి నపుంసకుల్ పూర్వభవంబున, నెద్దుఁ బట్టినవారు నేమి తప్పఁ
బొరయ కుండఁగఁ గోపమునఁ ద్రికచ్ఛేదంబు, గావించినారు గామసుఖము

ఆ. విఘ్నపఱిచినతులువలు విధవ దొంటి
జన్మమునయందు భర్తృవంచన మొనర్చి
ధనము గూర్చినయదియు మృదంబు పేర్మి
నోర్తుమగని హరించినయమ్మలియును. 105

తే. పయుతులై పుట్టి యేవంపుఁ బనులు గడుపు
బ్రోఁచికొనువా రహంకారమునను గర్వ
స్నానమదదంభములఁ దొల్లి మాన్యజనులఁ
బరిభవించినతుచ్ఛులు పద్మనయన. 106

సీ. చూఁకత్వ మొందిన యన్దల్పులఁ దిట్టుల, నాటులఁ బడు దుండునట్టి నీచు
లప్పాటఁ దోలుమేన నతిగర్వులై ప్రల్లదమ్ములఁ బెక్కండ్రఁ దప్పు లేక
తిట్టియు నడచియుఁ దిరిగిన వార లౌ, పాలువలపై గృప గలిమి మేలు
ధనికోత్కృష్టాద్యార్యమునఁ బ్రతిహరిద, మ్మాఁగంగ నుండి దైన్యమున దుఃఖ

---

1. గ. పటువంగ-జ.వోటవైన-గాల్సేయి...బఱచినాఁడు 2. ఙ. గ. జ. గ్రంథులచే 3.గ. నొంచి నారు. 4. క. ప్రతి 'గుజ్జు' 5. గ. జ. గ్రంథులు.

తే. పరజనంబులు భోగార్థపరతఁ దొల్లి, మానసీయుల కవసర మీనివారు
రాజదండితుఁ డయ్యుఁ ద్రాపరాధుఁ గ్రూర,దండదూషితుఁ జేసిన దంతుసూవె. 107

క. విను నష్టసకలధను లగు,జనములు నిక్షేప మిడిన సరకులు దొలుబా
మున మగుడ నీక నెప మిడి, కొనినట్టియసత్యలోభకుత్సితు లతివా. 108

క. తమబంధులుఁ దారును నొక్కమరియ తెగటాఱువారు కరుణారహిత
త్వమునఁ దొలుసేన వెడపగ, నమేయనరవధము సేసినట్టిదురాత్మల్. 109

వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో ని ట్లనియె. 110

సీ. ఇంతి నాచెప్పినయీపాపకర్ము లందఱకును నరకంబు దప్ప దండుఁ
బడుపాటు లెల్లను బడి వచ్చి నరు లైన,యప్పుడు వాటిల్లునట్టి తెఱఁగు
లివి యట్లు గాకయు నెక్కుడుగాని పాపంబుల మానుషభవము గలుగు
[1]నిల్లైన నమ్మేన నేకర్మమునఫల, మైనను మానవు లనుభవింప

ఆ. రోపి మునులు దేవయోనులు నత్తను,వునన తపముఫలము లనుభవింతు
రనిన దేవి యెఱుఁగనయ్యె నీదయఁ బెక్కు, లర్థములు కృతార్థనైతి ననియె.

వ. అని వెండియు నద్దేవునితో మనుజు లపరజన్మంబున గాని కర్మఫలంబు లను
భవింప రంటిరి తప్పు సేసిననరుల నరపతు లిట్టితప్పున కిట్టిదండం బనునిరూపణం
బున దండించెదరది యక్కర్మంబుఫలంబప్పట్టునన యనుభవించుటగాదె యనిన
గౌరికి గంగాధరుం డి ట్లనియె. 112

సీ. జనపతుల్ దమ రాజ్యసంబున దండించి,నారు గా నొల్ల నరులతప్పు
లకుఁ దగుదండంబులలన వారిఁ బఱతురు, తక్కొరు లెవ్వరుఁ దప్పు సేయ
వెఱచుట కై యట్టివిధి మూఁడు టది పూర్వ,కర్మంబువలనన కాని యపుడు
గల్గినతప్పునఁ గా దన్న నాదేవి, యవనిశదండితుఁ డైననరున

తే. కఘము వాయునో పాయదో యనిన నీశ్వ
రుండు నృపదండితుఁడు యమదండమునను
బడఁడు లేనితప్పున నరుఁ బఱచినతనిఁ
బఱుప కున్నాతనిని యమబాధ వొందు. 113

వ. అని నిర్దేశించి వెండియు. 114

క. విను తమచేసినకర్మం,బునఫల మెవ్వరికిఁ ద్రోచి పుచ్చఁగ రా ద
ట్లును గుడువక పో దది యన,పిని పార్వతి యిట్టులనియె విభునకుఁ గృష్ణా. 115

తే. కర్మఫలములు గుడిచినఁ గాని పోవ, వంటి వానిఁ బ్రాయశ్చిత్త మపహరించు
నందు రశ్వమేధంబున నఖలపాప,ములును జెడు ననఁగా విందు భూతనాథ. 116

వ. అని పలికియిది యెట్లొకో యనుటయు భవుండు. 117

---

1. చ. నట్లయిన నమ్మేన నాకర్మమూలఫల.

ఆ. అతివ కామకృతము § లైనకర్మంబుల,ఫలము లనుభవింప § వలయు వినుము
కామకృతము సేయుటఁ గలుగుఁ బ్రాయశ్చిత్త, మాచరింప సంశయంబు వలదు.
క. కావునఁ గుడువక పోలియదు, దేవాసురమునుల కైన § దేవీ! కర్మో
ద్భావితఫల మీయర్థము, నీ వలవఱుపుము భవన్మనంబునఁ జిరముగన్. 119
వ. అని చెప్పి యప్పరమేశుఁడు వెండియు. 120
క. సుకృతముల నరుఁడు నాకము,నకు జను నవి గొంచె మైన § నరుఁడ యయ్యనువా
నికి దివి కేఁగి డిగినయత,నికి మానుషవైభవములు § నెఱయఁగఁ గల్గున్ 121
వ. అని నిర్దేశించి యుద్దేశరూపంబునం గర్మంబుల ఫలం గెఱింగించి యింక నేమి యడుగ వల తడుగు మనిన నంబిక కర్మకరణంబు జంతువశంబు గ్రహవశంబు నా రెండుదెఱంగులం జెప్పుదు రం దెయ్యది దృఢం బని యడుగుటయు మృడుం డి ట్లనియె. 122
తే. నాతి విను గ్రహాచారంబు § హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ § డాచరించు
గ్రహము సేయించునే తాన § కాక చేఁత
కొడయుఁ డటె గాన ఫలములు § గుడువ వలయు. 123
వ. అనినఁ జావనునది యేమి యని యుమ యడుగ నీశానుం డి ట్లనియె. 124
తే. నిత్యుఁ డాత్ముండు దేహ మనిత్య మతఁడు
ముదిమిఁ దెవులున వికృత మై § యది వికలతఁ
బొందుటయు దానిఁ దొఱఁగి తాఁ § బోవునట్టి
దశకు మరణ మన్పే రయ్యెఁ § దనులతాంగి. 125
క. జీవుఁడు జీర్ణశరీరము, బో విడిచి నవంబుఁ బొందఁ § బుట్టనుపేరం
దా వెలయం దద్దశ జీ,వావలి వర్తించు నిటు గ§తాగతపర మై. 126
వ. అనిన విని పార్వతి శర్వునితో బాలురు సచ్చుటకును వృద్ధులు పెద్దకాలంబు బ్రదుకుటకును గారణం బేమి యనుడు నతండు. 127
సీ. మేను జీర్ణముగాఁ జేయుఁ § గాని మరణ
మొందఁ జేయదు విను కాల § మొందు నరుని
పూర్వకర్మంబు లాయువుఁ § బొదలఁ జేయ
సన్నముగఁ జేయ బ్రతుకును § జావుఁ గలుగు. 128
వ. అని చెప్పిన నాయు వేమిటం బెరుఁగు నెద్దానం దఱుఁగు ననిన విని యుమకు నుమాపతి యి ట్లనియె. 129

→ శివుఁడు పార్వతికి నాయుర్వృద్ధిక్షయంబులకుఁ గారణంబులు సెప్పుట. ←

తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
వలనిభక్తియు నాయువు § పొలుపు నిచ్చు

నలుక బొంకు క్రూరత శుచితాపగమము
గురువిరోధ మాయువుఁ గజం గుందఁ జేయు. 130

తే. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసమునను
వెరఁగు నాయు వాక్క్రియలపై నరుఁడు ప్రీతి
గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము. 131

క. తనలావున కధిక మయిన,పని సేయు[1]టయు క్తమును నపథ్యము నగుభో
జనములుహరించునాయువు, వనిత యవియుఁ బూర్వకర్మవశతన కలుగున్. 132

వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద. 133

ఆ. సుకృతు లమరలోకసుచివాసులు నిట
దిగి చిరాయువులును నగుదు రితరు
లతిచిరముగ నరకగతు లయి తుది నాయు
వల్ప మగుమనుష్యు లగుట గలుగు. 134

క. నా విని భవాని పురుష,స్త్రీవిధములు రెండు గలవు త్రినయన వానిన్
జీవుఁడు వర్తించు తెఱఁగు, నీ వేర్పడఁ జెప్పవే యనిన గంసారీ. 135

వ. అనిన విని మహాదేవుండు మహీధరతనయ కిట్లనియె. 136

క. తాత్త్వికము లైనపురుష,స్త్రీత్వంబులు లేవు పార్వతీ జీవున కా
తత్త్వమున నహంకృతిఁగ,ర్మత్వ మొలసి భావ్యవిధము నొందుచుండున్. 137

వ. అని మఱియును. 138

ఆ. కర్మములకుఁ గర్త గాఁ డాత్మఁ డతని సత్త్వము రజస్సుఁ దమము నావిత్త
కథము లెట్లు మర్త్యకాయగతములగు, నట్ల పొందుఁ గర్తలవియ చూవె. 139

తే. సత్యశౌచదయాదులు సాత్త్వికములు
రమణి లోభసంగాదులు రాజసంబు
లనృతహింసాపరత్వభయాలసత్వ
ధైర్యహానినిద్రాదులు తామసములు. 140

క. ఇవి నానాముఖములఁ బురుషు వికారముఁ బొందఁ జేయుచుం బరఁగును హై
మవతీ కావున సర్వం,బు వినుము గుణకృత్య మిట్టిబోధం బొప్పున్. 141

తే. తన్వి సాత్త్విక రాజస తామసాత్ము
లైనవారలఁ బుణ్యలోకానుభవము
మనుజభావంబు నిరయపీడనముఁ బొందు
వారలట్ల నిర్గుణులకు మునుఁగ మునరు. 142

వ. అని వెండియు. 143

1. క. ట. [illegible]

సీ. ఎట్టివి కర్మంబు లట్టివ నరులకు, శుభాశుభసంప్రాప్తు లట్లు గాక
పరవి ప్రియమున మేల్పడయుటయును గల్గుఁ, బలిభృత్యగోతిథిబుభుక్షార్తజనముల
నొజ్జ శిష్యులఁ దర్జనోక్తుల వెజ్జ రోగార్తుల నానావిధౌషధముల
నలమటఁ బొందింతు రవ్విధంబులచేత, లన్నియు సుకృతంబులై ఫలించు
ఆ. నని మఱియును జెప్పె నఖిలేంద్రియోపేత, మగు జరాయుజంబు నండజంబు
నవిద చోఁకు నెఱుఁగు ముద్భిజ్జములు స్వేదజముల నిదియుఁ జూపు సంభవించు.
క. నరుఁడు జరాయుజములలోఁ, దరుణీ విను మూత్తముఁడు శ్రుతము లేకున్నన్
సరి నతఁడు బశువుఁ గావున, నరిష్ట మగు నట్టివినికి వలయు నరునకున్. 145
క. ఇరుదెఱఁగు విను తమము శారీరమును దేహజము శార్వరము తేజస్సం
స్ఫురణమునఁ బాయు శ్రుతమునఁ, బరిహృతమగు దేహజంబు పర్వతపుత్రీ. 146
ఆ. బ్రహ్మయాతమంబుఁ బాపుటకై తపో, వ్యాప్తిఁ బడసె శ్రుతులు సంగములును
గాన కార్యములు నకార్యంబులును వానఁ, దెలిసికొనఁగ బుద్ధి కలుగు దేవి. 147
తే. క్రోధకామాదులైన దుర్గుణము లెల్ల, వాయుహతి మేఘపటలంబు వాయుపగిది
శ్రుతము చేఁబాయు నరులలో సురలకరణి, శ్రుతయుతులు దేజరిల్లుదు రతిశయిల్లి.
తే. శ్రుతము నరునిఁ బరిజ్ఞానయుతునిఁ జేయు, [1]వాని సుకృతమల్పమును ననూనఫలము
నిచ్చు నజ్ఞాని సత్కర్మ మెంతయైన, నఫలమగుఁ గాన శ్రుతవంతుఁ డగుట వలయు.
వ. అని నిర్దేశించి సర్వేశ్వరితో సర్వజ్ఞుం డిట్లనియె. 150
సీ. మృతిఁ బొంది వేగ జన్మించినఁ బూర్వదైహికములన్నియు బుద్ధి నెలయువాఁడు
జాతిస్మరుం డనఁ జను నయ్యెఱుక [2]పెద్ద, వాఁడు గాఁగాఁ జెడు వనిత వినుము
పుట్టుటుంగుట కల్మి బోధించుట గు నాస్తికులమును జన్మంబు గలుగు తెఱఁగుఁ
జచ్చిపోయినవారు వచ్చియుత్తను వొంది, మెలఁగుటొక్కొక చోటఁ గలిగియుండు
తే. నట్టి తెఱఁగు వెంగలులైన యవని దూత
లోరులఁ జని కొనిపోయినఁ గరుణతోడ
నమ్మహాత్ముండు మగిడి పో వమ్మనఁ నరుగు
దెంచు టని నీ వెఱుంగు సందియము లేదు. 151

శివుఁడు పార్వతికి స్వప్నాదుల తెఱం గెఱింగించుట.

వ. అని తెలిపిన గౌరి కల యనునది యేమి యెఱింగింపవే యనుటయు నతండు. 152
ఆ. స్వప్న మనఁగ సుప్తజనము మనశ్చేష్ట, [3]యనియెఱుఁగాంచు మన మనాగతములఁ
గాన కలలు సూచకము లగు భావిశు, భాశుభోదయముల కనియెఁ జెప్పె. 153
వ. చెప్పిన విని భవాని భవునితోడ. 154
సీ. దైతంబో కర్మవర్తనము జనంబును, త్వాసహంబో యనిన నతండు దైవ
మోహితకర్మంబు సేయుట లేదు దైవసంకల్పన ఫలం బిచ్చుఁ గాని వినుము

1. గ. దాన సుకృత మనల్ప మనూనఫలము 2. గ, సిద్ధ, వాఁడు. 3. అ. యదియు... బొగి నగా... కనుమటెప్పె.

దేవి పూర్వకృతంబు దైవనామకమునఁ, బరఁగు నిప్పటిచేఁత పౌరుషంబు
కృషివోలె నుండుఁ బౌరుషగతి వర్ష, దాయువులట్లు దైవప్రకార
తే. మెఱుఁగు ఖననమథనములనెట్లు జలముఁ, జిచ్చుఁబుట్టు నమ్మెయి నరుచేష్టదైవ
యోగమున సిద్ధిఁబొందు నుద్యోగరహితుఁ, డై తెఱంగున దైవవశవృద్ధిఁ బడయు.
క. కావున నుద్యోగంబును, దైవంబును గారణములు తామరసాక్షీ
యేవిధమునఁ గర్మములఫలావాప్తికి దీన సంశయము వలదు సుమీ. 156
తే. అనిన నంబిక గర్భంబు నాత్మఁ డెట్లు, సొచ్చు ననవుడు నభవుఁడు సురలబీజ
రక్తదైవముల్ నూవె కారణము లాత్మ, గర్భసంవేశనమునకుఁ గమలనయన.
క. మాయాసహితుఁ డహంకారాయత్తతఁ జూపి పుట్టు ననుచెఱఁ బడి నా
నాయాసంబులఁ బడు నాజ్ఞానయుతుఁ డై యాత్మఁ డింత చర్చింపు మదిన్.158
సీ. అని చెప్పి దైవరహస్యంబు వినిపింతు, విను మని పలికి యి ట్లనియె శివుఁడు
దొల్లి మనుష్యులు దొలుమేనికర్మంబు, తెఱఁగెఱఁగఁ జాలుట నల్లవారు
మేలు సేయఁగ ననిశమిమలోకమున సఖ్యం బగుసందడి గాఁగ మనుజు
లమరులై పేర్చిననజుఁడు వేల్పులసంకటము వాయుటకు నుపాయము దలంచి
తే. మానవుల కయ్యెఱుకకల్మి మాన్చి కామ, రోషముల నొలయించినదోషకృతుల
వారు నరకాదిసమ్మర్దకారు లగుడు, నదియుఁ గాదని చింతించి యనువుగాంచి.
క. సరిగా నారెండెడలకు, నరులు సనుట గోరి మనమునం గానమియుం
బరలోకవిధము శాస్త్రము, వెరవునఁ గనుటయు నొనర్చెవిధి వారలకున్. 160
వ. అనినం బార్వతి పునర్జన్మంబు గలదు లే దనుసంశయంబుతోన పుట్టుపొర లగుదురు నరులు దాని తెఱంగు నిశ్చయింపవే యనుటయు నంధకారాతి యిట్లనియె.
క. కలదో లేదో యనియెడు, తలపోఁతయ కాని నిశ్చితము గాదు సురా
దులకుఁ బునర్జన్మంబున, కలిమియు లేమియును నరులు గానమి దప్పే. 162
క. కల దది యారక కానఁగఁ నలవియె శ్రుతివాక్యసమితి యర్థంబులపై
నిలిచిన శ్రద్ధం గ్రమమునఁ, దెలివొందినఁ గాక యెట్టిధీమంతులకున్. 163
వ. అనిన విని గౌరి గంగాధరున కి ట్లనియె. 164
క. మృతులైనవారలు నిరాకృతులై యుండుదురు వారి కీనాశభట
ప్రతతి గొని చనుట యా పితృపతి శాసించు టవి యెట్టిభంగులు దేవా. 165
వ. అని యడిగిన సద్దేవుం డి ట్లనియె. 166
సీ. తఱి రైన మనుజులఁ దనువులు విడిపించి, మాయాశరీరసమన్వితులుగ
నొనరించి దూతలు గొని పోదు రందును, ధర్మవర్తుల సుగంధంబు మృదువు
నైనమార్గమున మధ్యమువారి నిర్బాధసరణిఁ బాపాత్ములఁ బరుసదవము
ముటికియుఁ గలపథంబున నడపింతు రిప్పరుసునఁ జని పితృపతికిఁ జూప
ఆ. నతఁడు పుణ్యలోకగతియును మానవత్వంబు ఘోరనరకవాసమును వి

ట్లనిరెుం జంద్రార్ధధరుం, డనుమోదోల్లాసి యగుచు — నంబుజాక్షా. 177

తే. ఔపరమికాభిధానంబు — నంబుజాక్షి
నిరుపకరణాఖ్యమును సోపకరణనామ
కంబు నయి లోకమున నుకృతంబు పరఁగుఁ
ద్రివిధముల వానిఁ దగ వివరింతు వినుము. 178

సీ. ఔపరమిక మనునది పాపవర్జన, మకట కానఁగ నేర — బజ్జజాక్షి
యత్నంబువలదు [1]వ్యయంబేమియును లేదు, పరలోకభీతిఁ బాపములు — దొలఁగి
నంతన సుగతిసౌఖ్యం బొడఁగూడెడు, నదియు నాత్మాధీన — మత్తిరాను
సుకరత్వ మెఱుఁగక — చొత్తురు నరకంబు, విరవయుల్ శ్రుతి నుశ్రీవృద్ధజనాగ

తే. మునను ధృతికల్మి నింద్రియవినిమయమున
నది దమకుఁ గలిగింతురు — యమ మనంగఁ
బరఁగు నది దాన నాకంబుఁ — బడయ వచ్చు
ననినఁ జెప్పంగ నేల ధర్మాభియుక్తి. 179

ఆ. నిరుపకరణమనఁగఁ — బరగు శౌచంబు సత్యంబు శాంత చాంతి — యార్జవంబు
వ్రతనిరాహార సముపవాసంబు బ్రహ్మచర్యంబుకల్మి నియమములు ప్రసూని. 180

సీ. అభ్యంతరంబుబాహ్యమునఁగా శౌచ, మిరుదెఱంగై యుండు — బాహ్యమనుకృత
మాభ్యంతరము విను — మాహారశుద్ధియు, నంగశోధనము బాహ్యంబు సత్య
మన్నది గన్నది — విన్నది యున్నరూపున నుక్త మగుట యంభోజవదన
శాంతి బుద్ధీంద్రియసన్నివారణ దాంతి, కర్మేంద్రియములదెసౌగ్య ప్రవృత్తి

తే. యార్జవము కుటిలుఁడు గామి — యగు వ్రతంబు
మంచిపని పూని నడపుట — యుంచితోప
వాస మశనని గ్రహ మనవద్యమైన
బ్రహ్మచర్యంబు కామునిగ్రహిం బడమి. 181

ఆ. నాతి తీర్థసేవనంబును నియమవి, శేష మగుట దానిఁ — జెప్ప వలయు
సకలనదులఁ దీర్థసంజ్ఞలు గల వబ్ధి, కరుగునట్టి విచ్చు — నధికఫలము. 182

తే. వానియందును మునిపత్యమానసీయ, దేశములు నబ్ధిసంగమాగ్ర దేశములును
దలియ మన్యోన్యసంగమ దేశములును, బరమతీర్థంబు లగుఁ బవిత్రపత్త్రినయన.

క. వనధి మహాతీర్థం బందును సంయమివరులచేతఁ — దొల్లి ప్రియమునం
గొనియాడఁబడినచోటులు, విను ముత్తమతీర్థములు వివేకాభరణా. 184

క. జలి శుచి యై మఱి తీర్థంబులు సొచ్చుట మేలు నియమములు దీర్చితగఁగా
వెలలినయెడ దేవార్చనములు విప్రార్చన లవశ్యము కృత్యంబుల్. 185

క. చేరువతీర్థముకంటెను, దూరపుఁదీర్థంబు మేలు — తోయజవదనా

1. గ. ప్రయత్న మేమియు.

శారీరాయాసము తత్కారణమై వేదవాక్యగతి యిట్లుండున్. 186

క. విను సోపకరణ మనునది, ధనధాన్యాదికసమగ్రతను గృహమేధుల్
గొనియాడు తెఱఁగు దానంబున నైదికపైతృకాదిపుణ్యక్రియలన్. 187

సీ. న్యాయార్జితంబైన యర్థంబు నేదవిత్యాము శాంతి మొదలగు వరగుణములు
గలవిప్రునకుఁ బుణ్యకాలపావనదేశకలితంబుగా భక్తి గలిగి యొసఁగి
మేలిదానము శక్తి మిగులుట శక్తికిఁ దగుట దానికిఁ గుంచుదగమి యుత్త
మము మధ్యమము నధమమును నగు దానివిధానంబు విను మిట్టి దైవికంబుఁ

తే. బైతృకంబును లోనైన పనులఁ దాను, వేడ్క-నేయువస్తువుఁ గొనువిప్రుకోర్కి-
కనుగుణంబగునదియును నర్థినిచ్చు, టధికతరమైనఫలమిచ్చునంబుజాక్షి. 188

తే. చేయు కొంతయు మేలైనఁ జేసి పిదప, వగచినట్టిదానము దనుఁ బొగడికొన్న
దానవిధి నిష్ఫలంబులు గాన రెండు, నుడుగుదాత మహాఫలముఁ బొందఁగాంచు.

వ. అనుటయు దాక్షాయణి దాతవ్యంబు లెయ్యవి సెప్పు మనిన భవుం డిట్లనియె.

శివుఁడు పార్వతికి దానఫలవిశేషంబుల నెఱిఁగించుట.

సీ. అన్నంబుఁ దోయంబు నఖిలజంతువులకుఁ, బ్రాణముల్ గాన యప్పరమవస్తు
వుల మేలు దాతవ్యములలోన నెల్లను, నతిథుల కవి యిచ్చు టమరలోక
చిరమహాసౌఖ్యంబుఁ జేయుఁ గాంచన మగ్ని, యగుట నద్దాన మత్యంతపావ
నము సర్వకామప్రదము గోవు సద్విప్రునకు నీఁగి తద్రోమనికరసంఖ్య

ఆ. వరుస నాకలోకవాసంబు గావించు, నందుఁ గపిల నిచ్చునాతఁ డిరుచ
దొక్క-తరమువారి నూర్ధ్వలోకమునకు, ననుపఁ జాలు వికచవనజవదన. 191

క. విను భూమిదానకర్తకు, ననిమిషలోకమున నిలువ నగు సౌఖ్యంబుల్
దనరుచు నుండఁగ నెఱపెం,పున భూమి గలంత కాలమును గిరితనయా. 192

ఆ. భూమి నఖిల మగువిభూతివిశేషజాతంబు గలుగుఁ గాన తత్ప్రదాన
మెల్ల వస్తువులును నిచ్చినయ ట్లగు, దానఁ బోనిపాపతతము లేదు. 193

క. అతివా కన్నియ నిచ్చినఁ, బితృపతి ముందు సురలుఁ బ్రీతు లగుదు రం
చితగతి కర్తకు దొరకును, నతితేజశ్శ్రీయశస్సు-మగు నభ్యుదయమున్. 194

తే. విద్య యిచ్చుట సత్పాత్రవిషయ మైన, నవ్యయానందపదముఁ జేయంగఁ జాలుఁ
దగఁ గదక్షిణ యిచ్చి పేదలకు విద్య, యానియోగించుట యుదత్తసమానకృతియు.

సీ. తిలరాశి యిచ్చినఁ గలుగు సగిష్టోమ్మఫలము వాసోదానఫలము చిరత
రాయువు గోడు నీఁగి యఖిలపీడలఁ బాపు, దాసదాసీజనదానమహిమ
కర్మవిమోక్షంబుఁ గలిగించు దీపదానముఫల మాత్మతేజోవిమలభావ
మంబు ప్రవాహంబు నధిగమింపఁగఁ జేతఁ, నిఖిలవ్యసనముల నిస్తరింపఁ

ఆ. జేయుఁ దెరువు లెన్న నేయుట సంతాన, మిచ్చు నౌషధంబు నిచ్చు నెల్ల
తెవులుఁ బాపుసాదుఁ దెరువరి కునికిపట్టొసఁగుటొసఁగుటదనుసుఖోదయములు.

వ. అనిన విని యజ్ఞంబు తెఱం గెఱింగింపవే యని పార్వతి ప్రార్థించినం బరమే
శ్వరుం డి ట్లనియె. 197

సీ. వినుమింతి వైదికంబును లౌకికంబును, నన రెండుదెఱఁగులు యజ్ఞవిధులు
వర్ణధర్మాగ్ర్యార్జనవర్ధనాంచితధన, ధాన్యముల్ గొని దేవతలకుఁ దృప్తి
యగునట్లుగా ఋత్విగర్చన మొప్పఁగాఁ, గావించునది వైదికంబు దేవ
తలకు మహోత్సవంబులు సేయుటయు గీత, వాద్యనృత్తము లనవద్యములుగ

ఆ. సంఘటించుటయును సద్గంధమాల్యధూ, పప్రదీపభోజ్యభక్ష్యములు స
మాదరంబుతో నివేదించుటయు లౌకికంబు రెండు నమరగణహితములు. 198

తే. ధర్మములు దానములును సద్వ్రతచయంబు
సదృశములు గావు వినుము యజ్ఞమున కరయ
యజ్ఞకర్త లోకోత్తరుం డతని కిచ్చు
టతనిచేఁ గొను టధికపుణ్యములు చెలువ. 199

ఉ. మానసకృత్యముల్ సురసమాజ మెఱుంగఁగఁ జాలుఁ గావునన్
మానస మొక్కెడేఁ దన మంచిగఁ జేసిరయేని యజ్ఞముల్
దానము నాదియైనసుకృతంబులు లగ్గ ఫలింప నీదు త
ద్ధ్యానపరత్వపూతసుకృతంబులకున్ ఫల మిచ్చు మెచ్చుచున్. 200

క. అని చెప్పిన హిమవద్గిరితనయ త్రిపురవైరితోడ దైవికవిధు లే
వినఁ గని సంతోషించితి, వినిపింపుము పైతృకంబువిధము వృషాంకా. 201

సీ. అనిన నా సర్వజ్ఞుఁ డద్దేవి కిట్లను, గయ కురుక్షేత్రంబు గంగ యాది
యగుపుణ్యదేశంబు లతిఫలదంబులు, మాఘభాద్రపదాఖ్యమాసములు బ
హుళపక్ష మపరాహ్ణ ముగ్మలి యమవస, [1] తేరసి నవమాద్యతిథులుఁ దుష్టిఁ
బితృదేవతల కిచ్చుఁ గుతపదౌహిత్రతి, లలు నితాంతపవిత్రములు పితృక్రి

తే. యలకు శౌచ మక్రోధ మవ్యగ్రభావ, మర్థములు శుక్లపక్ష పూర్వాహ్ణయుగ్మ
దివసజన్మదినములు నిందితము లాజ్య, ముద్గపాయసాపూపముల్ ముఖ్యకోటి.

క. శ్రోత్రియు లరోగు లవికల, గాత్రులు పాత్రములు పైతృకములకు సచ్చా
రిత్రత్వము ముఖ్యంబు స, గోత్రు మృతకళత్రు లనర్హులుఁ గొన రతివా. 203

ఆ. గంధపుష్పమాలికాధూపదీపవ, స్త్రముల నర్చ లిచ్చి తగఁగ భోజ
నములు నిర్వహించి క్రమవృత్తిఁ బిండప్ర, దానవిధి యొనర్పఁ దేను మెత్తు.

వ. అని యెఱింగించిన మేనకాత్మజ మృడునితో ని ట్లనియె. 205

క. మృతిఁ బొంది పునర్జన్మము, నతరక్యగుణ జంతుకోటి యప్పుడ పొందుం
బితృపూజన మని యెవ్వరి, కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు శివా. 206

ఆ. అనుడు నచట నున్నమునిజను లెల్లను, నగతనూజ నాత్మఁ బొగడి యభవుఁ

1. ఆ. తేరసి నవమియుఁ బరఁగఁ దుష్టి. చ. తేరసి నవమాద్యతిథులఁ దుష్టి.

డిచ్చును త్తరంబు § నేర్పడ వినువేడ్క, గదుర నుండి రవుడ § కింపసరమున. 207

సీ. అంబిక కిట్లను § హరుఁడు సందేహింపఁ, దగునది యని గుహ్యతత్త్వ మతివినుము
దివిజులట్టుల పితృ§దేవతలును దేవ,బృంద ముత్తరదిశఁ § బితృచయంబు
దక్షిణదిశ నుండుఁ § దత్పూజనంబులు, వరుసన హవ్యకవ్యంబు లందు
వచ్చినవారికి § శ్రాద్ధంబు సేయుఁగా, నా పితృసంఘంబు § హర్ష మొందు

తే. యాయువును శ్రీయుఁగీర్తియు§నాదియైన,యైహికంబులు సుగతియు § నాదరమునఁ
గర్త కొసఁగు సురాసుర§గరుడయక్ష,తతులకును బూజనీయంబు§పితృగణంబు.

వ. అని నిర్దేశించి వెండియు. 209

క. క్రమక్రమసారములకుఁదగఁ, గమలాక్షీ చేయుదాన§కల్పనలవిశే
షము నొక్క-రూప యగుఁ ద,త్ప్రమాణరూపణము సేసి § పలికెదఁ దెలియన్.

క. విను మొకకుంచెఁడుధాన్యము, దన కాయతి గల్గునతఁడు § దాని నొసఁగినన్
ధనకోటి గల్గువాఁ డ,ద్దన మొసఁగిన నొక్క-రూప § త త్తత్ఫలముల్. 211

క. పరుషత్వము లే కంతఃకరణంబున శుద్ధి సాలఁ § గలిగి ప్రియము వొం
పిరివోవఁ జేత దానము, పరిమోత్కృష్టంబు పద్మ§పత్త్రనిభాక్షీ. 212

క. అని చెప్పి కొన్ని ధర్మము, లనఘా యెఱిఁగింతు నీకు § నవధానముతో
విను మని పలికి శివుం డి,ట్లను విశదము గాఁగఁ గూర్చి § యంబుజనాభా. 213

చ. తెవులుగలు గొన్నవారి కవి § దీఱుట కౌషధ మీగి దుర్గతుల్
దవులుజనాలిఁ బ్రోవు సుపథంబుగఁ ద్రైర్థికకోటి నన్ను బాం
ధవరహితత్వదీనశివ§దాహము దుఃఖితు లైనవారిఁ దే
ర్చ వెరవు నోర్చుఁ గల్మియును § బ్రస్తుతి కెక్క-నమేటి ధర్మముల్. 214

వ. అని పలికినఁ బార్వతీదేవి పరమ ప్రియంబు నొంది. 215

శివుఁడు పార్వతికి ధర్మవిశేషంబుల తెఱంగెఱింగించుట.

సీ. ధర్మంబు నానావిధంబులఁబరఁగు నం, ద్రవి యెఱిఁగింప వేఁ§యనుడు హరుఁడు
వితతంబు లగుశ్రుతి§స్మృతులచేఁ జెప్పఁగాఁ,బడిన తెఱంగులు § పడఁతి వినుము
జాతిధర్మములు దేశ§జధర్మములుఁ గుల,ధర్మంబులును గణ§ధర్మములును
గాయంబువికృతులఁ § గాలపర్యయముల, వచ్చునాపద్ధర్మ§వర్తనములు

ఆ. గాఁగ నిట్లు ధర్మ§గతు లైదు గల వని, చెప్పుటయును గౌరి § శివునితోడఁ
బుణ్యలోకకలిత§భోగంబు లెట్లుండు, ననిన నిట్టు లనియె § హరుఁడు కృష్ణ. 216

సీ. ఎల్లపుష్పంబులు § నెక్కాలమును దట్ట, విలసిల్లుఁ గల్పక§వృక్షజనిత
మనులేప మాహార § మమృత మంబరములు, నిత్యామలినములు§నిరుపమాన
భంగి దీప్తంబు లా§భరణముల్ వాన ర,మించుచు సనో§త్సవ్య§మిత్రభావ
మొప్పంగ మేనుల§యొప్పును మనముల,మార్దవంబును గుణ§మాన్యతలును

తే. గలిగి పురుషులుఁగాంతలుఁ § గామవార్ష,లీల లెసఁగఁ గ్రోధాదులు§లేక రుజయు

జరయును నెఱుఁగక నవిఁ జరింతురు దివంబు,నందు సంతతనిర్భరానంద మొంద.

వ. అనిన విని హైమవతి సుగతిదుర్గతులకుం జనం గలవారిం జూచి వీ రిట్టివా రని నిశ్చయింప వచ్చునట స్వామి యెఱింగింపు మనవుడు మృడుండు విను మని యిట్లనియె. 218

చ. జనులకుఁ గీడు సేయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జనగురుపూజనంబులును ‡ సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును ‡ భూరిదయార్ద్రితయుం గలట్టివా
రనిమిషలోకగాము లని ‡ యాత్మ నెఱుంగుము మేనకాత్మజా. 219

చ. పరుసనిపల్కు బొంకు లగుపల్కులు నన్యధనాభిలాషముం
బరవనితావిలోలతయు ‡ బాంధవసజ్జనవిప్రియంబు దు
శ్చరితులతోడిమైత్రియును ‡ సంతతధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన ఘోరనరకంబున కేఁగెడివారిచిహ్నముల్. 220

క. అని చెప్పిన విని హిమగిరి,తనయ వృషధ్వజునితోడ ‡ ధర్మంబులు పె
క్కనుపమమూర్తీ పరమం, బనఁ జాలెడుధర్మ మెద్ది ‡ యన్నిటిలోనన్. 221

వ. చెప్పు మనిన నప్పరమేశ్వరుం డి ట్లనియె. 222

క. రమణీ వర్గత్రయధర్మము లిచ్చు సుఖములు దుఃఖమయము లచిరముల్
గమనాగమకరములు నిత్యమహాసౌఖ్యంబు మోక్షధర్మం బిచ్చున్. 223

సీ. కావున విను త్రివర్గంబుకంటెను మేలు,దలపోయ మోక్షంబు ‡ దానిఁ బడయు
తెఱఁ గెఱింగించెదఁ ‡ దెలివ గృహస్థధర్మంబున నిల్చి ఋణంబు లెల్ల
బాచి వనమునకుఁ ‡ బరమశాంతత నేఁగి, సద్గురుముఖమున ‡ సాంఖ్యయోగ
విదుఁ డగునది పంచవింశతి జ్ఞానంబు, సాంఖ్యంబు ధర్మనిశ్చలత యోగ

తే. మాసమాచారయుగళి మేకాధికరణ, మస్ఖలితముగ మది నది ‡ యలవరించి
ధ్యానపరుఁ డయి శీతోష్ణహర్షశోక,ముఖము లగువివిధద్వంద్వములఁ దొఱంగి.

ఉ. శౌచము బ్రహ్మచర్యమును ‡ శాంతియు లఘ్వశనంబు నై యిశం
జూచుచు నంతరాత్మ నెడ ‡ సొచ్చినవిఘ్నవిశేషముల్ ధృతిం
ద్రోచుచు భక్తియుక్తి గుఱుండు ప్రమోదమయుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠితమోక్షసుఖంబు సొప్పడున్. 225

తే. అది సదాభ్యాసకలన నత్యంతనిర్మ,లంబు నవ్యయమును నచలంబు ఘనము
నై జరావ్యాధిమరణజన్మాదిదుఃఖ,బహుళసంసారచక్రంబుఁ బాప నేర్చు. 226

వ. అని యుపదేశించి వెండియు. 227

క. విను సంసారముపకు విసు,వనిమర్త్యుఁడు శోకమోహవశగతుఁ డై మో
క్షనిరూఢిఁ బడయనేరఁడు, మనము విరక్తముగ విసివిసమతిము క్తిగనున్. 228

వ. అట్టిదశ చింతావివర్జనంబునను భూశాస్త్రిరత్నపరిజ్ఞానంబునను దృష్టారాహిత్యం

బునను గాని కలుగదు గావున వానిభంగులు ప్రకటించెద. 229

సీ. ధనములు సెడిన బాంధవులు సచ్చినఁ దదీ,యములగుగుణములయందు మనసు
పెట్టకయున్నది యెట్టన వగచిన, దాపంబు వొందుట దక్క నొందు
గలుగునే సుఖము దుఃఖంబును డోఁచిన, యవి మార్చి వచ్చును దనరుగుచుండుఁ
గేవలసుఖము లే దావాసవున కైనఁ, జేటు ద్వంద్వములకు సిద్ధ మగుట

తే. మున్నకనియున్న వగచి త్రమున జనింప, దరయఁ గీడు పరిగ్రహమది సమగ్ర
మైనతను పాత్రిమూలిప్రవృత్తి తాన,తనకు బంధంబు గావించి కొనులతాంగి.

ఆ. విను ధనార్జనంబు ధనరక్షణంబు ధ,నవ్యయంబు ధనవినాశనముఁ బ్ర
గాఢదుఃఖదములు గావున దుఃఖభా,జనము ధనము గాల్పుమనఁగవలయు.

క. రమణీ తృష్ణాసమదుఃఖమును బరిత్యాగసమసుఖముఁ గలవే కా
యము ముదిసిన ముదియదు ప్రాణము గొనిపోఁజాలు తెవులుకరణిఁ జనుఁదృష్ణన్.

క. కామములు భోగములఁ దెగ,నే కొలఁతుక నేఁ నాఱునే చిచ్చు ఘృతిం
గామములఁ దొఱఁగు సౌఖ్యము, నేమియుసౌఖ్యములుఁ బోలునే యరయంగన్.

క. విచ్చలవిడి నింద్రియముల, నెచ్చటి కైనను జనంగ నిచ్చిన నరకం
బచ్చపడుచుఁ గుదియించినఁ, దెచ్చు సుగతి నగున కది సతీమౌళిమణీ. 234

తే. కామరసమున నతితృష్ణుఁ డై మనుష్యుఁ డర్థతృష్ణాకరీతాంతరంగుఁ డైన
గొఱియ నడవిలో నత్తెడుఁ గోలువులియుఁ, బోలె మృత్యువాతనిఁ గొనిపోవుఁ దేవి.

వ. అని పలికి జరామృత్యువులఁ ద్రోవం జాలుమే లెయ్యది యంటేనిఁ జెప్పెద
నాకర్ణింపు మనుపలుకు వలికె యిట్లనియె. 236

తే. ధనములును దానములుఁ దపోధనము నాజి,పేయరాజసూయంబులు వేయునోపి
చేయుటలు గావు మోక్షదక్షత్వమొకఁడ, మందు జరకు మృత్యువునకు నిందువదన

తే. జాములును దివసములు మాసములు నేండ్లు
నైనకాల మాయువుఁ గొని యరుగుచుండు
నెల్లి సేయుపనులు నేఁడ యింతి మాపొ
నర్చుపని రేపచేయుట నామతంబు. 238

తే. మేలు గడు వేగ చేయరు కాలపాశ,బద్ధులై యేమఱుటఁ జేసి పడఁతి మనుజు
లింత యెఱుఁగుట సంసారమెడలఁ ద్రోచు,నట్టివిసువుటఁ బుట్టించునది హితంబు.

వ. ఇవ్విధంబున. 240

క. ఈతెరువు లాదరింపఁగఁ, జేతోగతికిని విమర్శసిద్ధి యొదవుఁ ద
జ్జాతవిరక్తియు ముక్తికి, నాతెరువ సమీపవర్తి యచలేంద్రసుతా. 241

క. వైరాగ్యంబు ప్రశాంతికిఁ, గారణము ప్రశాంతి ముక్తిఁ గను మోక్షానం
దారామము జరామృత్యువు, జేరావునఁ జేర నేర విద్ధచరిత్రా. 242

వ. అని చెప్పి ముక్తియు శివుఁ డిట్లు హిమగిరిసుతకు సాంఖ్యయోగములనన్వాదయా

విను వివరించెద సంసృతి, యనురోగంబునకు వైద్యమగు దాని నరయంగన్. 243

శివుఁడు పార్వతికి సాంఖ్యప్రకారంబు దెలుపుట.

ఆ. జ్ఞానమున విముక్తి సాంఖ్యులు వడయుదు, రరసి చూడఁగా నిరర్థకంబు
ఘోరతరము నండ్రు శారీర మైనతాపంబుఁ బంచవింశభజన మూఁది. 244

సీ. ప్రకృతి కవ్యక్తనామకమును గల దండ్రు, మహదహంకారతన్మాత్రలును మ
నముసింద్రియములు భూతములు జనకములుగాఁ, నోలిన వికారములు నాలుగయ్యెఁ
బంచవింశకతత్త్వభావితక్షేత్ర మా, తత్త్వసంతానంబు సత్త్వమును ర
జస్సుఁ దమస్సు నా జనునిజగుణంబులఁ, బ్రకృతిజాఁ గరణరూపములు గాఁగఁ

ఆ. గోని సృజించు లోకకోటి నయ్యవ్యక్త, మణువు సత్త మేక మక్రియంబ
హైతుకంబు చరాచరాదుల కగ్రాహ్య, మది ప్రధాన మనఁగ నతిశయిల్లు. 245

తే. సౌఖ్యతుష్టిప్రకాశముల్ సాత్త్వికములు
మోదఖేదాదికద్వంద్వములు లతాంగి
రాజసములు ప్రకాశసంత్రాసమోహ
ములును దంద్రయుఁ దామసములుగ నెఱుఁగు. 246

క. ధృతివిజ్ఞానశ్రద్ధలు, నతివ యసమ్మోహమును దయయు హర్షము నం
చితసత్త్వవృద్ధిఁ బరివర్ధితంబు లగు సత్త్వ మరుగఁ దెరలుం దారున్. 247

తే. క్రోధలోభకామానృతద్రోహచింత, తాపములకు రజోభివర్ధనము వృద్ధిఁ
జేయు వానికి నెల్ల సంక్షీణభావ, మావహిల్లు రజఃక్షయ మావహిల్ల. 248

తే. సంశయంబు విషాదంబుజడత నిద్ర, విను తమస్సు వర్ధింపఁగా బెనువు నొందు
నది విహీనతఁ బొందిన నవియు హీన, భావ మొందు వికస్వరపద్మనయన. 249

సీ. ఒక్కఁ డొక్కని చేత నొక్కచోఁ దఱుఁగుచుఁ, ద్రిగుణంబులును బ్రవర్తించు వీని
జనితంబు లగుప్రీతిసంతాపమోహాదు, లాదవినఁ దత్తద్గుణోదయములఁ
గని యుపేక్షించుచు మనము నూనఁగనిమ్ము, కార్యంబు ధర్మార్థకామములకు
నమరమనుష్యతిర్యగ్జనములకు, మూలముల్ సత్త్వాదు లోలి నెఱుఁగు

తే. బుద్ధి యనఁగ మహత్తత్త్వమునకు నామ
మది వివేకవిజ్ఞానచిహ్నంబు భూత
జని యహంకారమునకు లక్షణ మహంక
రణము దోఁచుట మోక్షకారణము దేవి. 250

ఆ. అన్నియింద్రియములు నడరింప మగుడఁ జేయంగ మనసు సాలు నవియు నదియు
భూతతద్వికారములును దేహము తదన్యుండు దానఁ బరిగ్రహుండు దేహి. 251

క. విను దేహియు దేహము వే, ఱనుసిశ్చయదృష్టి గల్గునాతఁడు సాలుఁ
మనసు మగిడింప నది నిర్మనస్కతఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్. 252

వ. అప్పుడు ప్రకృతిందొలంగి పంచవింశకుండు వెలుంగు నాతత్త్వంబుపరమహంసు

వసురుద్రాదిదేవతలను బితృదేవతలను వాలఖిల్యాదిసిద్ధులను వేదవ్యాసవాల్మీకి నారదాగస్త్యగౌతమకశ్యపాత్రికణ్వాదిమహామునులను రంభాద్యప్సరస్స్త్రీలను ధర్మతపస్సత్యంబులను నహోరాత్రంబులను దారాగ్రహంబులను నశ్విన్యాది తారకంబులను మాసర్తుపక్షసంవత్సరంబులను వైనతేయకాద్రవేయులను గాశీక్షేత్ర కురుక్షేత్రాదిపుణ్యక్షేత్రంబులను నైమిశారణ్య దండకారణ్యాదిపుణ్యారణ్యంబులను మేరుహిమవత్కైలాసాది ప్రభూతశైలంబులను దిఙ్నభోభూములను బుణ్యభూరుహంబులను భూసురులను జక్రవర్తులను రాజులను బరమభక్తిం దలంచి కీర్తించి నమస్కరించి యీసకలసమూహంబును నన్ను రక్షించి నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి పరమానందంబు నభినందనపూర్వకంబుగా నిచ్చుంగావుత మని యిచ్చం గోరి యోం నమో భగవతే వాసుదేవాయ నమః పురుషోత్తమాయ నమస్సర్వలోకగురవే నమస్సర్వలోకపిత్రే నమస్సర్వలోకపితామహాయ నమస్సర్వలోక ప్రపితామహాయ నమస్సర్వలోక ప్రధానాయ నమస్సర్వలోకేశ్వరాయ నమస్సర్వలోకవిశిష్టాయ నమస్సర్వలోకసుఖప్రదాయ నమస్సర్వలోకకర్త్రే నమస్సర్వలోకభర్త్రే నమస్సర్వలోకహర్త్రే నమస్సర్వలోకనిధయే నమస్సర్వలోకనిధానాయ నమస్సర్వలోకహితాయ నమస్సర్వలోకహితకరాయ నమస్సర్వలోకోద్భవాయ నమస్సర్వలోకోద్భవకరాయ నమో విష్ణవే ప్రభవిష్ణవే యని పఠించుట మహాజపంబు. 313

క. పాపంబులును భయంబులు, నాపదలుం బాయు నిమ్మహాజపమున ధా
త్రీపాలోత్తమ శుభములు, ప్రాపించును ధర్మతత్పరత సిద్ధించున్. 314

వ. అని యిట్లు గంగాపుత్త్రుం డజాతశత్రునకు సర్వసిద్ధికరం బయినయిమ్మహాజపం బుపదేశించె నని చెప్పి తదనంతరసత్కథ లాకర్ణింపు మని పలికి జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 315

తే. మనుజనాథ యశేషధర్మములు సర్వ
పావనములు శాంతనవుఁడు బహువిధములఁ
జెప్ప నివ్విధి విని యుధిష్ఠిరుఁడు భక్తి
నమ్మహాత్ముని నిట్లని యడిగె మఱియు. 316

చ. అతఁ డశోకరుండు లోకముల కన్నిటికిన్ మహనీయమైనదై
పరమఁ బరాయణంబు ననుకైవడి భవ మెవ్వాని గొప్పఁ నర్చన
స్తుతిరతి నెవ్వానిం గొలిచి శోభన మొందు జనంబు మేలు నా
నతిశయ మొంది నీకు మత మైన చను నెయ్యది ధర్మకోటిలోన్. 317

తే. జపములం దెల్ల నుత్తమజపము నాఁగ, సంచితం బయి తన్ను జపించు జంతు
వునకు జన్మసంసారబంధనము లూడ్చి, పావు నెయ్యది చెలఁగింపు పరమబోధ,

వ. అని యడిగిన నా భూపతికి భీష్ముం డిట్లనియె. 319

—భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రధ్యానం బవశ్యానుష్ఠేయం బని చెప్పుట.—

సీ. అఖిలజగత్ప్రభుఁ డగు దేవదేవు ననంతునిఁ బురుషోత్తమాభిధాను
నంచితనామసహస్రకంబున సంస్తుతించుచు సంతతోత్థితమనస్కుఁ
డై యజమానుఁ డర్చ్యయుఁ డైన తాఁ గని యర్చించుచును దృఢధ్యాననిరతుఁ
డగుచు నమస్కృతు లాచరించుచు నాద్యంతు నవిష్ణు నధ్యక్షు నెల్ల

తే. లోకములకు బ్రహ్మణ్యు బ్రహ్మలోకకీర్తివర్ధను సర్వధర్మజ్ఞు నవరెదు లోక
నాథు భూతభవోద్భవు నమిత భక్తిఁ గొలిచి సర్వదుఃఖంబులఁ దొలఁగఁ ద్రోచు.

తే. ప్రస్తుతులఁ బుండరీకాక్షుఁ బరమభక్తిఁ దలఁచి యర్చించుటయు నామస్తవంబు సర్వ
ధర్మములకును సమధికతమము నైన ధర్మ మెంత యెఱుంగుము ధర్మతనయ.

సీ. పరమ తేజంబును బరమ తపంబును, బరమైన బ్రహ్మంబుఁ బరపరాయ
ణముఁ బవిత్రంబులు నాఁ దగువానికి, నెల్ల బవిత్రంబు నెల్ల మంగ
ళంబులకును మంగళంబును నెల్ల దేవతలకుఁ బరమదైవతము భూత
సమితికి నవ్యయజనకుండు నగునట్టివాఁ డెవ్వఁ డెవ్వానివలనఁ దోఁచు

తే. నాదియుగమునాగమమున నంత్యవేళ, నడఁగు నెవ్వనియందుఁ జరాచరములు
విశ్వలోకప్రధానుఁ డవ్విష్ణు వేయు, దివ్యనామంబులును బాపభయహరములు.

తే. భూరిగుణయోగవిఖ్యాతములును ఋషీస
మాజపరిగీతములును నై మహిమఁ దనరు
నమ్మహాత్మునినామంబు లధిగతవి
భూతికై చెప్పెదను విను భూపవర్య. 323

వ. అని పలికి విశ్వంబు విష్ణుండు వషట్కారుండు భూతభవ్యభవత్ప్రభు వనునవి మొద
లై రథాంగపాణి యక్షోభ్యుండు సర్వప్రహరణాయుధుం డనియెడు నివి తుదగాఁ
గలసహస్రనామంబు లుపన్యసించి. 324

ఆ. కీర్తనీయుఁ డైన కేశవుదివ్యనామంబు లివి భవద్ధితంబు గోరి
తరతరంబ కీర్తితంబు లయ్యె నశేషభంగి వేయుఁ గురునృపాలవర్య. 325

—భీష్ముఁడు ధర్మజునకు విష్ణునామప్రభావంబు దెలుపుట.—

సీ. విష్ణునామంబులు వేయును నిత్యంబు, వినినఁ బఠించినమనుజుఁ డిహము
నందుఁ బరమ్మున నశుభంబు నొందఁడు, యత్యంతశుభముల ననుభవించు
విప్రుండు వేదాంతవిదుఁ డగు రాజు విజయ మొందు వైశ్యుఁ డక్షయధనంబు
వడయు శూద్రుఁడు సుఖభాగిత జెలయు ధర్మార్థకామప్రజార్థ్యర్థిజనులు

తే. గాంతు రమ్మై లెఱుంగు రేకాంతభక్తి, శౌచయుతుఁ డై విని కీర్తించి సారయశము
నచలలక్ష్మియు వంశవర్యతయు మేలి, పెంపుసొంపును గలిగి శోభిల్లు నరుఁడు. 326

సీ. [illegible]

దమితవీర్యమునఁ దేజమునఁ గాంతిని బల,రూపగుణంబుల ర్యూఢి కెక్కు-
లోకబంధాపదార్తులకుఁ బరనమాత్ర, నయ్యయుదురితము లడఁగు వాసు
దేవాశ్రయుఁడు వాసుదేవపరాయణుం,డును నగుమర్త్యుఁ డత్వినుతనామ

ఆ. కము లుపన్యసించి కల్మషంబుల నెల్లఁ, దోలఁగి దుర్గతులకుఁ దొలఁగి జన్మ
మరణములకు రోగజరలకు నందని,పరమ మైన బ్రహ్మపదము నొందు. 327

క. స్మృతిసౌఖ్యక్షాంతి శ్రీ,ధృతికీర్తులు గలుగు దుర్మతిఁ గ్రోధము లు
బ్ధతయును మాత్సర్యము లే, వతిపుణ్యత విష్ణుభక్తు లైనజనులకున్. 328

సీ. చంద్రార్కనక్షత్రసహిత మైననభంబు
నచరాచరోర్వియు జలనిధులును
సురదైత్యగంధర్వగరుడయక్షోరగ
వ్రజములు హరివశవర్తనములు
బుద్ధియు నింద్రియములును మనంబు స
త్త్వంబును బలముఁ దేజంబు ధృతియు
క్షేత్రంబుఁ దద్గతక్షేత్రజ్ఞవస్తువు
లరయఁగా వాసుదేవాత్మకంబు

తే. లాగమాదితాచారమయ్యుండు ధర్మ
మచ్యుతుండు తత్ప్రభువు సాంఖ్యమును యోగ
తంత్రమును శిల్పవేదశాస్త్రములుఁ గర్మ
ములు జనార్దనువలన సమున్భవించె. 329

ఆ. విష్ణుఁ డొక్కరుండ వివు మహాభూతంబు, లక్కభూతతతులు వెక్కగలవు
సరిఁ ద్రిలోకములను బరఁగి విశ్వంబు భూ,తాత్ముఁ డమ్మహాత్ముఁ డనుభవించు.

ఆ. వ్యాససంప్రణీత మైనయావిష్ణుస్తవంబు సకలశోభనంబులును సు
ఖములుఁ గోరుపురుషుఁ డమలినబుద్ధిఁ బఠింపవలయు భక్తి పెంపుతోడ. 331

క. అజు విశ్వాధీశ్వరు స,ర్వజగత్ప్రభ వావ్యయు ప్రభవర్తనకరు నం
బుజలోచను నెవ్వారలు, భజింతురు పరాభవమునఁ బడ రప్పుణ్యుల్. 332

క. కావున విష్ణునిపెల్లగు, [1]నీవేయుఁ బఠింపు నీకు నెప్పుడు నాయు
శ్శ్రీవిభవారోగ్యంబులు, భూవర సిద్ధించుఁ బరమబోధముఁ గలుగున్. 333

క. అని యి ట్లుపదేశించిన, విని యాదము నెమ్మనమున వెల్లిగొనఁగఁ బాం
డునియగ్రసుతుండు గాంగే,యుని కభివందన మొనర్చి యుచితవినయుఁడై. 334

వ. పూజానమస్కారంబులకు నెవ్వరు భాజనంబు లెవ్వరికిఁ జెట్ట సేసినం జేటు
వాటిల్లు నెవ్వారలు సంతోషించిన శుభంబులు సొప్పడుం జెప్పవే యనిన
నతం డతని కి ట్లనియె. 335

1. క. చ. జ. 'నీవేయుఁ బఠింపుమీపు నిచ్చలు'.

బ్రాహ్మణపూజానమస్కారంబులు పరమోత్కృష్టంబు లని చెప్పుట.

సీ. పూజానమస్కారకములకుఁ బాత్రములు బ్రా
హ్మణులు వారలకుఁ గీ ౯ డాచరించి
వాసవుండును జెడు ౯ వారిసంతసమున
నఖిలశుభంబులు ౯ నావహిల్లు
ధర్మసేతువు లోకధారకం బఖిలశా
స్త్రప్రవర్తకము విప్రవ్రజంబు
తపమును వాక్కును ౯ ధనము విప్రుల కొక్క
కుడువుమాత్రన పాపకోటిఁ బాతు
తే. రమ్మహాత్ములు సొప్పరు ౯ లఖిలమార్గములకు విను దేవతలు దేవతలకు బోలఁ
దజ్ఞఁ దన లేదు పూజకు ౯ నర్హు లనిన, నధిప వృద్ధులఁ బ్రాజ్ఞుల ౯ నడుగ నేల.
వ. అనిన విని యజాతశత్రుండు బ్రాహ్మణులఁ బూజించుటవలన విశిష్టం బయిన శుభం బెయ్యది దృష్టం బయ్యె వారలయందు వర్ణనీయం బగువర్తనం బేమి గానంబడియె నీవిట్లు వారలం గొనియాడ దెలింగింపవే యనుటయు నాపగాపుత్రుండు పవనార్జునసంవాదం బనునితిహాసంబు విను మది భవత్ప్రశ్నంబునకు సదుత్తరం బై యుండు నని పలికి యజ్ఞపతి కిట్లనియె. 337

పవనకార్తవీర్యార్జునసంవాదంబు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట.

సీ. అధిపసహస్రబాహార్జునుఁ డేడుదీవుల నేలి యుద్భుతబలపరాక్ర
మములఁ దనర్చి మత్సము లెవ్వరును నెందు, లే రని యత్యవలేపయుక్తి
నాడిన నొకభూత ౯ మాకాశమున నుండి, యెఱుఁగక పలికెద ౯ వెల్లవారి
కధికులు గారె ధరామరు లనవుడు, నతఁడు వారలు రాజు ౯ నాశ్రయించి
తే. నడపికొందురు మనుగడ ౯ పుడమితేని,కంటె న్నెల్లెక్క డై రట్లఁ ౯ గాక యేను
మనుతుఁగూర్చినఁ జెఱుతు నర్గలినసమస్తభూతములనన్న వెఱచి యాభూతమరిగె.
వ. అట్టియెడం బవనుండు గగనంబున నుండి తన్నెఱింగించికొని యన్నరపతితోడ.
సీ. భూదేవశక్తిన ౯ గాదె రాజులు ప్రజారక్షణ మొనర్చుట ౯ బ్రాహ్మణులకు
నధికులు గలరె యగ్నివాల్యాకై యింద్రుండు, గౌతముఁ డలిగిన ౯ గాసిఁబడఁడె
కుంభసంభవుచేత ౯ నంభోధి యుడుగదె, దైత్యులు వనలుండు భృగుశాపహతుఁడు గాఁడె
యన విని మఱుమాటయాడక యున్నయర్జునకుఁ బవనుఁ డిట్లని యొమ్మఱియు
తే. నాంగిరసవంశసంభవుం ౯ డగునుచథ్యుఁ
గోరి నిజపుత్త్రి సోముఁడు ౯ గారవమున
నిచ్చి నాతంపతులు తమ్మయిచ్చ వనము
నందు వసియించి మునిహృదయంబు లలర. 340
వ. వర్తింపఁ దత సోముఁ డొక్కనాఁ డమ్ముని [illegible] యనుటయు మున్ను

యవ్వనితం గావించి వేచి తిరుగువరుణుండు. 341

క. ఎత్తికొని పోయి తనపురి, నత్తామరసాక్షి నునిచె నమ్మునిపతియున్
మెత్తన చని నారదముని, యత్తెఱఁ గెఱిఁగింప నాతఁ డాలించి తగన్. 342

తే. తాన దిక్పతి దన కిట్లు దగునె యొరుల, భార్యఁ గొని పోవ నేఁగి వారికు మిట్ల
యనినఁ జని నారదుండు సెప్పినను వినక, దయ్యెగామాంధుఁడై యతఁడు నిర్భయుఁడు.

వ. విడువక యున్న నమ్మునియుచథ్యుకడకు మగిడి వచ్చి. 344

సీ. ఇంతిఁ దా విడువనిశ్చయుం డితఁడు గాదు నాకు, బెడతల వట్టి త్రోపించె వరుణుఁ
డని చెప్పుటయు నల్గి యతఁడు సర్వజలంబుఁ, ద్రావిన వరుణపురంబు ధూళి
మయ మైన భయ మంది సమానినిఁ గొనివచ్చి, యొప్పించి ప్రణమిల్లి తప్పు వాసి
కొని మునికృప గాంచి చనియె నాదిక్పతి, ధరణీశ రాజులో ధరణిసురులొ

ఆ. యెక్కు డనిన వినియు నక్కిల్బిష వడి యున్న, యతనితోడ ననిలుఁ డమరులసుర
సమితి గొడి వచ్చి శరణు సొచ్చిన నగస్త్యుండు విజయలక్ష్మి నొసఁగె టయును.

వ. గంగాతీరంబున గ్రతువు లొనరించు గీర్వాణులం బూర్వగీర్వాణులు గాసి చేసిన వసిష్ఠునికడకు వారలు వచ్చియుం బోయి తెఱం గెఱింగించిన యత్తాపసోత్తముని రోషానలజ్వాలలు ¹సాకారంబు లయి యాదైత్యలోకంబు నేర్చుటయుం జెప్పి యక్కుంభసంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠులగుట బ్రాహ్మణుల కొడఁ బాటు గాదో కదే యనినను బలుక కున్న యన్నరపతితోడం బవమానుండు మఱియు నిట్లనియె. 346

పవనుఁడు కార్తవీర్యార్జునునకు నత్రిప్రభృతులమహిమ సెప్పుట.

సీ. ఒకతఱి దేవతలకు దైత్యులకు మహారణ మయ్యె నప్పుడు రాహుశస్త్ర
సమితిచే నర్కుండు శశాంకుండు సొలసిన, వెలుఁగు గడంగుడుఁ దమసమొలసి నెగడు
పడినయద్దివిజుల వడి నంటఁ దాఁకి య, య్యసురలు నొప్పింప నత్రికడకుఁ
బాఱి మమ్ముం గావు పరమదయాత్మక, యనుడు నతండు చంద్రార్కతనువు

ఆ. లక్షితములు సేసి యసురసైన్యము రూపు, మాపె నిజకటాక్షమాత్రమునన
యతని నృపులకంటె నధికుఁ డందమొ హీనుఁ, డందమో నిజంబు నధిప చెపుము.

సీ. అనిన నూరక యున్న యర్జునుతోడ స, దాగతి యిట్లను ధరణినాథ
సురపతి యాశ్వినుల్ సోమపానంబున, కర్హులు గారన్న నా శ్రయంబు
వాటించి వారికై భార్గవచ్యవనుండు, దనమంత్రములబల్మి ననిమిషులకు
నగ్గు సేయంగ నయ్యింద్రుండు వోటున, వ్రేటున నాతని గీటడంచు

తే. బుద్ధి నొక శైలమును వజ్రమును రయమునఁ
గొని మహోగ్రతఁ గవియ నమ్మునివరుండు
జలము సల్లిన శైలవజ్రములఁ దాను

1. క. గ. ట. సాయకాకారంబులై

¹ముదుఁగఁబడి యబ్బలారాతి ♦ మూర్ఛవోయి. 348

వ. ఒక్కింత సేపునకుం దెలిసె నంతకు నమ్మునివరుండు మదుం డను వాని శతయోజన దీర్ఘరసనాస్యదంతుని సృజించి పంచిన. 349

ఆ. వాఁడ సురగణంబు ♦ వాసవుఁ గబళింప, వారు శరణుశరణు ♦ వరమునీంద్ర యనిన వారిఁ గాచె ♦ నమ్ముని వారిచ్చె,నపుడు సోమపాన ♦ మాశ్వినులకు. 350

క. నీ వాచ్యవనుండును ధాత్రీవరుసరి గామి యెట్లుఁ ♦ దెలుప కుడుగుదే నావినియు నొక్కమాటయు, నావిభుఁ డాడండ్ల దాని ♦ కలయక మఱి యున్. 351

వ. వాయుదేవుం డన్నరదేవునకు నికరుణం జేసి యతనిచే టోర్వనివాఁడై. 352

సీ. అకట దత్తాత్రేయునకు భక్తి శుశ్రూష, సేసి కాదె యవ్విశ్వశిష్టబలప రాక్రమంబుల నొంది ♦ రాజుల సెల్లను, నెక్కుడై తాక్రుత ♦ మేల మఱవ వినుమీ వోకండవే ♦ యనిమిషాదిసమస్తభూతంబులను వృద్ధిఁబొందు టవని దివిజులకృపన యోర్తెఱఁ గెల్లజనములు, నెఱిఁగినపని శాంతిఁ ♦ గొఱలి విప్ర

తే. కులము దైవస్వరూపం బగుట మనంబు,నందు దృఢముగ నిల్పి తదాశ్రయమున వెలయు వాఁడవై నను మేలు వినుము నాదు,బుద్ధి యనవుడు నతఁడు ప్రబోధ మొలసి.

క. నీపనుపు సేసి బ్రతికెద, నేపు నహంకృతియు విడచి ♦ యొల్లవలన మే లాపాదించుచు విప్రుల, శ్రీపాదము లాశ్రయించి ♦ చెందెద శాంతిన్. 354

ఆ. అనిన సంతసిల్లి ♦ యనిలుఁ డా నృపు బుద్ధి గలిగి బ్రదుకు మనుచు ♦ గారవించి పోవు కొల్పి చనియె ♦ విప్రులపం పెట్టి, దని యెఱుంగు కురుకులాగ్రగణ్య. 355

భీష్ముఁడు ధర్మజునకుఁ గృష్ణుని ప్రభావం బుపన్యసించుట.

వ. అనుటయు నవ్విభుండు బ్రాహ్మణమహానుభావం బింకను వినవలతుం జెప్పవే యనుటయు నప్పుడమితేనికి భీష్ముండు దనకు నింద్రియంబులును వాఙ్మనసం బులును నపుడు దుర్బలంబు లగుట యెఱింగించి యినుండు దక్షిణాయనంబు తుది సేరుచు వచ్చె దేహన్యాసంబు తడవు లేమి దోఁచుచున్నది కృష్ణుండు నీకు విప్రజనవిశేషంబు వివరించువాఁ డని పలికి యిట్లనియె. 356

తే. ఏను గృష్ణు నెఱుంగుదు ♦ మానవేంద్ర,యిత్తెఱఁ గ్రీడావరాహమై యుద్ధరిత్రి నిది యొకటఁడును జెప్పఁగా నేల కృష్ణు,లీలఁ గాదె భూమ్యాదిభూతాలి గలిగె.

వ. కృష్ణుండు. 358

తే. బొడ్డుతామరయం దొక్కపురుషుఁ బుద్భవించునట్లుగఁ ²జేసి తద్విరచనాని ధమున నఖిలచరాచరప్రభవ మయ్యె, నరయ సామాన్యమే కృష్ణుపరమలీల.

క. విను మెత్తఱి ధర్మంబులు, దనుజులచే బాధఁ బొందుఁ ♦ దత్సమయమునన్ జనియించి యద్దురాత్ములఁ, దునుముం గృష్ణుండు ధర్మధుర్యులఁ గాచున్. 360

క. తొలియుగం దాన దిశా, పాలురునుం దాన విశ్వపతియును గురుభూ

1. క. ముడిఁగిపడి 2. జ. జేసె. దద్విరచనావిభవము నఖిల.

పాలనరతాన కృష్ణుఁడు, కాలము దిక్కులును జూడఁ గలఁ డఖిలములన్. 361

ఆ. అరయఁ గృష్ణుఁ డధ్వరాత్మకుఁ డఖిలాగ, [1]హోత్రమంత్రతంత్రయుక్తి నతనిఁ
బ్రస్తుతించి మేలు వడయుదు రధ్వర, కర్త లైనజనులు కౌరవేంద్ర. 362

క. చయనంబుల ఋగ్వేదం, బయమహిమసువర్ణనాముఁ డగుకృష్ణుగుణో
దయము వినుతించు యజ్ఞ, క్రియానిరతు లైనసురలు ప్రీతిం బొందన్. 363

క. విను ఋగ్వేదము కృష్ణుని, వినుతించుట యిది యఖిలవేదంబులుఁ ద
జ్జనితవిలాసంబులు వే, దనిరూపితవస్తు వనఁ దాన కుమారా. 364

తే. అగ్నులును యజమానుఁడు నాహుతులును
యాగఫలరూపమును గృష్ణుఁ డని యెఱుంగు
మినశశాంకతారకముల నెసఁగు తేజ
ములును గృష్ణమయంబుల భూపవర్య. 365

క. పరమజ్యోతి యనఁగ నిర్జరామరపదం బనంగ సత్యం బన భూ
వర యమృత మనఁగ దేవకీ, వరసుతుఁడు వెలుఁగు వేదవర్గముతుదలన్. 366

క. అని యిట్లుపదేశించిన, విని మోదము నొంది పాండుప్రభునగ్రసుతుం
డనిమిషతటినీసుతునకు, వినతుం డై నెమ్మనమున వేడ్కదలిర్పన్. 367

కృష్ణుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట.

వ. కృష్ణునకుఁ బ్రణమిల్లి దేవా భూదేవమాహాత్మ్యంబు విన వలతు నానతీయవే
యని వినయసంభృతుం డగుచుఁ బ్రార్థించిన నప్పార్థివునిమీఁదఁ గరుణామృతమ
యం బగునాలోకనం బొలయ సద్భావుం డాదరభరితుం డై యిట్లనియె. 368

క. ననుఁ బ్రద్యుమ్నుం డివ్విధ, మున నడిగిన వాని కేను ముదమందుచు నా
తనిహితము గోరి కుంతీ, తనయాగ్రజ యున్నమాపఁ దగ నిట్లంటిన్. 369

సీ. వర్గత్రయము నపవర్గంబు సాధింప, నమరపితృప్రీతు లాచరింప
నైహికసుఖములు సార్జింప వలసిన, వారికి విప్రుల చేరుగడలు
దివిజుల కైనను నాయువు శ్రీయుఁ గీర్తియుఁ, దనరుట తత్ప్రసాదమునఁ జూవె
యలిగి భస్మము సేయ వలచి పెంపొసఁగంగ, నవనీసురులు శక్తులట్టు లగుట
తే. వారిఁ గోపింపఁ జేయక వారలకుఁ బ్రి
యంబు సేయుచు వారు ప్రహర్ష మొందఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండు రెండు
భువనములయందుఁ బెంపును బొగడుఁ బడయు. 370

దుర్వాసుఁడు కృష్ణునిమనశ్శుద్ధి పరీక్షించి యనుగ్రహించిన ప్రకారము.

వ. నాకనినయాశ్చర్యంబు సెప్పెద నాకర్ణింపుము స్వతంత్రప్రవర్తనుం డగుదుర్వా
సుండు మనమందిరంబునకు వచ్చి మందహాసంబు సేయుచుఁ గోపించుచు సుము

1. క. చ. జ. హోత్రమంత్రతతులఁ దత్క్రియాయుక్తి.

లై గంగాతీరంబునఁ గొన్నిదినంబులు నిలుచువాఁ డయి మునివర్గంబునకుఁ బ్రద
క్షిణంబును బ్రణామంబునుం జేసి. 136

క. మీకారుణ్యంబున నా, శోకం బంతయును బాసె ✽ సుమనస్కృత సు
శ్లోకాత్ములార కలిగెఁ, నాకుఁ విచ్చేయుఁ డింక ✽ ననుమతివకుఁడీ. 137

వ్యాసనారదాదిమునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట.

వ. అని పలికి విశేషించి వేదవ్యాసమునివరుపాదంబుల కెఱఁగి భవత్ప్రసాదంబునం
గందువ గనిన కనకమ్ము మిమ్ముం బురస్కరించుకొనిపోయి చేకొనం గలవాఁడ
నప్పటికి సన్నిధి సేయవలయు నప్పెన్నిధికి నాశ్రయంబైనహిమగిరి మహీధరం
బులలోన నెల్లను బరమాశ్చర్యనిధి యని సవినయంబుగాఁ బ్రార్థించి నాపైఁ
బెక్కులు కల్యాణకరణకల్యంబు లగుమాట లాడితిరి మహాభాగ్యవంతులకుఁ
గాక యిట్టివారికారుణ్యంబు దొరకొనునె మీకరుణయ నన్ను భాగ్యవంతుం
డని తెలిపెను నని [1]బహుప్రకారంబులం బ్రస్తుతి సేసె నట్లామంత్రితులై
యమ్మహాత్ము లందఱుఁ గృష్ణార్జునామంత్రణంబు గైకొని యంతర్ధానంబు సేసిరి
పదంపడి భీష్మునకుం బరలోకక్రియలు ధృతరాష్ట్రసహితుం డై యాచరించి
కర్ణప్రభృతికురుప్రకరంబునకు నూర్ధ్వలోకసాంద్రసౌఖ్యసిద్ధ్యర్థంబుగా నానా
విధదానవిధులు నిర్వర్తించి కృతకృత్యుం డై కతిపయదినంబుల కచ్చోటు గదలి
పాండవాగ్రజుండు పాండునృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని కరినగరం
బున కరిగి యతనిం బూజించి తదనుజ్ఞాశోభితుం డగుచుఁ గృష్ణుండును భీమా
ద్యనుజులును మోదంబు నొంద జనులు నభినందింపఁ బెం పారి[2]వసుంధరాపరి
పాలనధురంధరుం డయ్యె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున
కి ట్లనియె. 138

ధర్మజుఁడు ధరణిం బాలించునప్పుడు కృష్ణార్జునుల వర్తించువిధము.

తే. ఇవ్విధంబున ధర్మజుం ✽ డెలమి ధరణిఁ, బాలనము సేయుఁగాఁ గృష్ణ✽పార్థు లెట్టి
తెఱఁగువారలై యెచట వర్తించి రెఱుఁగఁ, జెప్పవే నాకు సజ్జన✽సేవనీయ. 139

వ. అని యడిగిన వైశంపాయనుం డి ట్లనియె. 140

సీ. ధర్మజుం డిమ్మెయి ✽ ధరణిఁ బాలింపంగ, ననఘ యింద్రప్రస్థమున వసించి
కృష్ణుండుఁ గ్రీడియుఁ ✽ గ్రీడాపరత సరి, త్కాననపర్వత✽సాను దేశ
ములఁ జరించుచు విప్ర✽పూజలఁ బుణ్యక, థాశ్రవణముల ✽ సత్కావ్యగోష్ఠిఁ
బ్రొద్దు పుచ్చుచుఁ దమ✽పూర్వవృత్తము లైన, సమరతంత్రప్రము✽ఖములఁ జెప్పి
తే. కొనుచునుండుదు రాత్మీయ✽తనయు నరుఁడు, దలఁచివగచినశోకంబు✽దలఁగునట్టి
వాక్యసంతతి నావృష్ణి✽వరుఁడు దేర్చు, సముచితోక్తుల ధర్మజు✽శాంతి వొగడు.

క. [3]విను మయకృతసభఁ గ్రొత్తగఁ, గని యచ్చో నొక్కమొద సకౌతుకనానా

---

1. క. మాన్యప్రస్తుతి సేసె. 2. ట. పృథివీ పాలించె నని చెప్పిన 3. ఙ. విను మాయయుసభ.

జనపరివృతు లై యుండుదు, రనూనవిభవమునఁ బ్రమద ‡ మూరఁగ వారల్. 142

వ. ఒక్కనాఁ డప్పుండరీకాక్షుండు గాండీవితో ని ట్లనియె. 143

సీ. సమరంబు ధర్మవి‡జయపరికీర్త్యంబు,గాఁ జేసి భూమి ని‡ష్కంటకముగఁ
బాలించుచున్నాఁడు ‡ ప్రజ ప్రీతి నొందంగ, విద్వజ్జనంబులు ‡ వివిధసుఖము
లనుభవించుచుఁ దన్ను ‡ వినుతింప నెగడెడు, శాంతియు సమతయు‡సకలజనముఁ
గొనియాడు సిద్ధులు ‡ మునులు సేవింతురు, ధర్మనందనుఁడి ట్లు‡దాత్తుఁ డగుట

తే. యతని కున్నతి గావించి ‡ రనిలజుంతుఁ గవలు నెంతయు నీచేతి‡గాండివంబు
లీల గల్గి మహాధర్మ‡శాలి సత్య,నిత్యుఁ డమ్మహీపతి కృత‡కృత్యుఁ డయ్యె. 144

వ. అని యగ్గించి యతనియాననం బాలోకించి. 145

ఉ. నీవలనన్ మహాత్మ విను ‡ నిర్భరచిత్తుఁడ నైతిఁ జూడఁగాఁ
బోవుతలంపు పుట్టెడుఁ బ్ర‡భూతగుణున్ బలదేవు వత్సలన్
దేవకి నార్ద్రచిత్తు వసు‡దేవుని మద్గతరాగసాంద్రస
ద్భావుల సర్వయాదవులఁ ‡ బార్థ ననుం దగ నన్పు పుచ్చవే. 146

క. ద్వారకకుఁ బోయి వచ్చెదఁ, గౌరవపతి కిత్తెఱంగు ‡ [1]కార్యజ్ఞానో
దారుఁడ వగు నీ వొచ్చి, త్యారూఢము గాఁగఁ జెప్పు ‡ తగుసమయమునన్. 147

తే. అవ్విభుఁడు వోయి వత్తు గా ‡ కనక పోను
మేనుఁ బ్రాణంబుఁ దనయులు ‡ మిత్రగణము
బంధులును నర్థచయము న‡త్పార్థ నేంద్రు
సొమ్ము లదనువర్తనము వ్ర‡తమ్ము నాకు. 148

వ. కావున. 149

క. మనము కరినగరమునకుం, జని పుణ్యాత్ముని నజాత‡శత్రుని నెలమిం
గని తగునవసరమున న్నిప్పని విజ్ఞాపించి యతని‡పనిచిన ఛంగిన్. 150

క. నడతము పోదమనుడుఁ గవ్వడి గొండొకవడి విచార‡వన్మానసుఁడై
కడు మేలటు సేయుద మని, యొడబాటుంబలుకు వలికి ‡ రొయ్యన విదపన్.

వ. అమ్మహాత్ముతో ని ట్లనియె. 152

ఉ. అనికిఁ దొడంగునప్పుడు మ‡దాత్మ గలంగినఁ గొన్ని తత్త్వబో
ధనమహనీయవాక్యములు‡దాత్తకృపం దగ నీవు సెప్పితే
మనమున వానియర్థములు ‡ మాధవ నిల్పఁగఁ జాలనైతి న
వ్వినుతవచస్సుధారసము ‡ వీనుల నిం కొకమాఱు నింపవే. 153

క. అనిన నగుచు నొకకేల న,తనిఁ గౌఁగిటఁ జేర్చి బుద్ధిహీ‡త్వవిహీనుం
డును శ్రద్ధారహితుఁడు నై, తని దూఱి ముకుందుఁ డిట్టు‡లను నాతనితోన్.

తే. [2]బ్రహ్మపద వేదనమునకుఁ‡బరము హేతు

1. క. కార్యవిధిజ్ఞోదారుఁడ. 2. చ. బ్రహ్మపదవి [illegible]

భూతములు నాఁటివాక్యముల్ బుద్ధిఁ దన్మ
హార్థములు నిల్పవైతి శక్యంబె యింక
నవ్వచనములు సెప్పంగ నలఘుశౌర్య. 155

### శ్రీకృష్ణుం డర్జునునకుఁ దత్త్వజ్ఞానస్థిరీకరణము సేయుట.

వ. తద్విషయం బగునది యొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము నాఁడొకనొక్క విప్రోత్తముండు వచ్చిన నేను దత్త్వజ్ఞానము తెలియ నుపదేశింపవే యనుటయు నతండు కాశ్యపనామధేయుం డగునొక్కధరామరుం డొక్కఁడ విజితేంద్రియుం డును జ్ఞానవిజ్ఞానశాలియుఁ ద్యక్తసంసారపరిగ్రహుండును బ్రబుద్ధసేవితుండును నగునొక్కసిద్ధునిం గాంచి సంభృతవినయుండై శిష్యత్వంబున భక్తి నాశ్రయిం చిన నమ్మహాద్విజునకు నమ్మహనీయుండు సెప్పినవాక్యంబులు సెప్పెద నవధానం బుతో వినుమని పలికి మదీయవదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె. 156

ఆ. అట్లు భక్తిఁ దన్ను నాశ్రయించిన శుచి, త్యాధికుండు నిర్మలాత్మకుండు
నతులవినయపరుఁడు నగువిప్రవరుని వీక్షించి యిట్లనియె సిద్ధవరుఁడు. 157

సీ. పుణ్యంబు లగుకర్మముల నెప్పుడును జేసి, యింపారుచుండు నైహికసుఖంబుఁ
ద్రిదివంబుఁ బడసితి ధీయుత యత్యంత,యత్నలబ్ధం బైనయట్టిపదము
పదపడి యొకమాత్ర భ్రంశంబు నొంది కా,మక్రోధముఖచిత్తమలవిశేష
ములఁ బొరిఁబొరి జన్మమును మరణంబును, గలుగంగ నేను దల్లులను దండ్రు
తే. లను సహోదరులను బుత్త్రులను ననేక,జాతికలితులఁ గాంచితిఁ జన్నుఁబాలు
వివిధభంగులదానిఁ ద్రావితి సుహృద్వి,యోగధననాశదుర్దశఁ బొందెఁ బెక్కు.

క. మానసశరీరము లగు, నానావేదనల వివిధనరకగతుల దుః
ఖానేకత్వ మొనర్చువి,మానవవధబంధనప్రమర్దనకృతులన్. 159

వ. అనుభవించుచు నుండి విసివి లోకతంత్రంబు పరిత్యజించితిఁ బదంపడి యాత్మ ప్రసాదంబున నిట్టిసిద్ధి వడసితి నింక లోకంబుల నాలోకింప నాకుం బ్రజాసర్గంబు గలయంతకాలంబును శుభంబ నిరంతరం బై కలుగుచుండు నే నంతకంతకు నెక్కుడులెస్స యగుదశలఁ బొందుదు బ్రహ్మానందంబు సులభంబ యని పలికి మఱియును. 160

ఉ. ప్రీతుఁడ నైతి నీదెసఁ బరిస్ఫుటభంగిని జెప్పు బుద్ధి నా
చేత నుపాస్తి నైనఁ బడయఁ జేరితి నీ కది గల్గునట్లుగాఁ
జాతు వదల్చ్యముల్ వినయసుందర నన్ను నెఱింగి వచ్చి తీ
వీ తెలి వస్మదీయమతి కెంచిన నిన్నుఁ బరిగ్రహించితిన్.

క. అనుడు నతఁడు హర్షించుచు, ననుఁ బరతత్త్వప్రబోధనమునఁ గృతార్థా
త్మునిఁ జేసి జన్మమృతిదుఃఖనిరాస మొనర్పు పరమకారుణ్యనిధీ.

వ. అనుచుం దచ్చరణంబులు గరంబుల నవలంబించి ప్రణతి యాచరించి కేలు
మొగిచి యున్న నయ్యుర్వీసురోత్తముతో నాసిద్ధసత్తముండు నీకుం బరిపాటిం
జెప్పెద సావధానమానసుండ వై యాకర్ణింపు మని యిట్లనియె. 163

ఆ. ధర్మసాధనంబు | దనువు ధర్మము పరిజ్ఞానదాయి యట్లు | గాన తనువు
నోమ వలయు మర్త్యుఁ డేమిట నేమఱి, కాత్మహితము గోరి యనఘచరిత. 164

వ. ఏమఱుటల తెఱంగు వివరించెద. 165

సీ. తనసత్త్వమును బలంబును దన కయ్యెడు, కాలంబు నారయఁగాఁ దలంపఁ
డాహారములు గొను | నవియును నగునవి, గానివి యనువివేకంబు బుద్ధిఁ
జొనుపఁడు బహుళభోజన మొకమఱి సేయు, నొకమఱి దుర్భిక్ష | నుపవసించు
గతకాలమును నపక్వంబును గురుదుష్ట, [1] విషమవిరుద్ధము | విపులరసము
తే. సైనయన్నముఁ దా నరయక భుజించుఁ
గుడుపుపైఁ గుడ్చు దిననిద్ర | గూరు సురత
పరత నొందుఁ బెల్లాయాసపడు విమూఢుఁ
డతని బాధించు దోషత్రయంబుఁ గెరలి. 166

వ. అని చెప్పి. 167

శ్లేష్మాదిరోగవికారంబుల నిరూపించుట.

ఆ. అర్హకర్మలోప | మవచయ మొనరించు, నసఘు దేహమున కనర్హ వేగ
ధారణములు రోగతతి జనింపఁగఁ జేయు, గామరోషములను | గాయ మెడలు.

క. అత్యంత ప్రబలంబులు, పైత్యవికారములు రేఁగి | ప్రాణములకు శీ
ఘ్రాత్యయముం జేయు మహో,ద్ధత్యంబున నెలవు వెడలఁదఱిఘనసుచరితా. 169

తే. అవ్వికారంబు లెక్కుడై | యుదరి యెచ్చు
టచటు భిన్నంబు సేయు నయ్యెడలు మర్మ
నామకంబులు మర్మభిన్నత్వ మెల్ల
సేయుచుండుఁ బరిచ్యుతి | జీవమునకు. 170

క. వినుము తెలియంగ శ్లేష్మం, బనుదోషం బారఁ బరఁగి | యవయవములు జా
డ్యనిరూఢంబులుగాఁ జేయును లోపలిబయలు నెల్ల | నొయ్యన కప్పున్. 171

వ. పదంపడి. 172

క. కుత్తుకకు నడ్డపడు న్వా,త్తిలి పోసి కయాఁగు | నూర్ధ్వశ్వాసం
బెత్తఁగఁ జేయుచు జీవుం, డత్తనువున నుండ నేర | కంతట వెడలున్. 173

క. స్రోతోమార్గంబులఁ జా, వే తమ కర్హంబు లైనవిషయంబులఁ బ్ర
స్ఫుటమతిం జాటుకొని, పతము లై యింద్రియంబు | తేనును బుట్టున్. 174

క. స్రోతోమార్గములు కఫము, చేత నిరుద్ధంబు లైనఁ | దెడు నింద్రియజా

1. గ. విషమపూర్ణరోషుల | విపులరసము,

తాతతశక్తులు దానను, పీతము లగుఁ జేష్టితములు ✽ విను మనుజులకున్. 175

తే. వాయు వంగంబులందు దుస్తర్వ్యాప్తిఁ గదిరి
నొవ్వఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వు సెడుచు
సంధు లెడలించుఁ గ్రమమున ✽ నెందుఁ బరఁగి
తనువు [1]మ్రానుగఁ జేసి జీవుని వెలార్చు. 176

క. నాలుక యాడుట గేలుం గాలు ముడుఁపఁ జాఁప నగుట ✽ కాయంబునయుం
దీలీలలు వాయుగతుల్, [2]మే లే నివి గలుగుఁ దక్క ✽ మే లనులాత్మా. 177

క. ఎక్కటి యిట్టివి దోషము, లొక్కకమరి రెండుమూఁడు ✽ నొదవి బెరయఁ దా
నక్కడు సన్నిపాతం, బక్కజముగఁ దనువుఁ బాపునది ✽ జీవాత్మున్. 178

క. ఈ విధమున వెడలి చనిన,జీవుఁడు నిజకర్మజాల ✽ సిద్ధగతులకుం
బోవుం దద్భవసుఖదుఃఖావేశముఁ బొందు చుండు ✽ నద్యోయెడలన్. 179

క. కృతకర్మఫలము దెగఁ గుడిచి తనకుఁ దగినట్టిపుట్టు ✽ వెందు మగుడ ని
ట్టి తెఱంగున జీవాత్ముఁడు, గతాగతము లనుభవించుఁ ✽ గల్మషరహితా. 180

క. పాపాత్ములు నరకముఁ బుణ్యోపేతులు దివము విధినిశ్చయుక్తినవశతం
బ్రాపింతురు గావున ని,శ్శ్లేపం బగు మోక్ష మొంద ✽ లే రట్టిజనుల్. 181

తే. ఊర్ధ్వగతి కేఁగుమానవు ✽ లుండునట్టి, నెలవు లార్యులు శాస్త్రసు ✽ నిశ్చయమున
గని యెఱింగింతు రవి నీవు ✽ విను ము నీకుఁ,దెలియునట్లుగఁ జెప్పెద ✽ ధీసమగ్ర.

తే. సోముఁడనఁ దారకములన ✽ సూర్యుఁడనఁగఁ,గలుగు తేజస్విమూర్తుల ✽ నెలవులందు
ధర్మపరులుండుదురు తార ✽ తమ్యములకు,మనసు లెఱియునట్టివి గడు ✽ మంచి వగున.

క. అదియును గాక ఫలంబులు, దుద ముట్టఁగఁ గుడిచి వెడలఁ ✽ ద్రోవఁ బడుదు ర
ట్టిది సౌఖ్యమగున శాశ్వత,పదంబు మోక్షంబ కాక ✽ భవ్యవిచారా. 184

వ. అని చెప్పి గర్భావాప్తిప్రకారం బెఱింగించెద వినుమని పలికి సిద్ధుం డా భూసురున
కి ట్లనియె. 185

తే. అశుభములును శుభమ్ములు ✽ నైనకర్మ,ములఫలంబులు గుడువక ✽ పోవఁ గాదు
మన్యువశగతమైనయా ✽ త్మకు నుదాత్త,చరిత యదికారణమును వ్వ ✽ జన్మమునకు.

క. ఎనయఁగ శుక్లము శోణిత,మును బెరసి కలందిగర్భ ✽ మున నెలకొను న
ప్పని బ్రహ్మశక్తి బీజ,త్వనిరూఢిం బొనరు నవి వొ ✽ దలఁ బిండం బై. 187

క. విను మాబీజము పిండము, తనువునఁ జైతన్యరూపతం బరఁగి శిరం
బును గేలుఁ గాలు నుదరం,బు నురము వెన్ను ననుసంగ ✽ ముల నేర్పఱచున్. 188

వ. అని చెప్పి. 189

క. జననార్హ వేళ వెలువడి, తనతొల్లిటికర్మములకుఁ ✽ దగిన వివిధవ
ర్తనములఁ బొందు నవిఁ దెగినఁ,జని మఱి యుం బుట్టుఁ గర్మ ✽ సంతతికిఁ దగన్, 190

1. గ. మ్రానుగ. 2. చ. త్న [illegible] దక్క [illegible]

క. నరుఁ డెంతకాలమేనిం, బరమం బగు ముక్తిపదముఁ | బడయక యుండుం
బురుషవర యంతకాలముఁ, బొరిఁబొరి సిబ్బంగిఁ జావుఁ | బుట్టువు నొందున్. 191

సీ. కావున ముక్తికిఁ | గారణం బగుదాని, నేర్పడఁ జెప్పెద | నెఱిఁగికొనుము
దానంబు శమమును | దమమును బ్రహ్మచర్యంబును వ్రతపరి|రక్షణంబు
దయయును బరధన|దారవర్జనమును, నియమయమంబు ద్రి|యనిగ్రహములు
జననీ జనక గురు|జనపూజలును దేవ,తాతిథి పితృ సేవ|తార్చనములు

తే. సత్యమును శౌచమును శుభ|సంవిధాన
నిరతియును ధైర్యమును గ్రౌర్య|నిరసనమ్ము
గలిమి పుణ్యావృత్తం బిది | గలుగునరుఁడు
మొనయు దీని నూఁతగఁ గొని | మోక్షమునకు. 192

క. పదపడి ధర్మాచరణము, వొదలుం దత్పూత్మవిధము | బుధజనులకడం
గదలక నిలిచి యెఱిఁగికొన, విదితం బగు వారిశీల|వృత్తములం గడున్. 193

క. వారలు సెప్పినకాంతో,దారవచనసమితి వినఁగఁ | దద్గతబహుగం
భీరార్థము లంతఃకర,ణారూఢము లైన బొరయ | వాపద లెందున్. 194

సీ. వ్రతపరినిష్ఠమై | వర్తించు చుండియుం, ద్రియవిజయమును | శాంతియును గలిగి
బ్రహ్మైకభజనత|త్పరుఁ డగు చుండెను, వతనికి బ్రహ్మంబు | హుతవహుండు
సంస్తరంబును యోగ్య|సమిధలు జలమును, మంత్రంబు గురుఁడు బ్ర|హ్మంబ యిట్టి
సచ్చరణంబు సూక్ష్మబ్రహ్మచర్యంబు, దీనియం దుత్తమ|స్థిరతఁ గలుగు

తే. వాఁడు హర్షశోకోద్దామ|వాయుహతుఁడు
గాఁడు మేదురమోహాంధ|కారమున వె
డంగుపడఁడు సంసారని|స్సంగసిద్ధిఁ
బొందుఁ గాలక్రమమున న|పూర్వమవరుఁడు. 195

వ. అని చెప్పి మఱియును. 196

తత్త్వజ్ఞానవిశేష ప్రదర్శనము.

సీ. ఆదిసృష్టిఁ బ్రధాన | మనుతత్త్వ మంబుజా, సనుఁడు గల్పించి చే|తన మొనర్చె
క్షర మద్ది దానిఁ దత్పర మగుతత్త్వంబు, నక్షర మనియును | నమృత మనియు
నార్యులు సెప్పుదు | రమ్మహాధనంబు న, యుందు సంపన్నంబు | లఖిలభూత
జాలంబులకును సం|జనకంబు లైనబీ, జము లిది శ్రుతివాక్య|సంభృతార్థ

తే. స్థితిఁ దగ గలిగించె గమనము | నాగమనము
జీవరాశికిఁ గావున | నావిధమున
నది భ్రమింపుచు నుండుఁ బు|ణ్యాతిశయము
తత్త్వబోధాత్ముఁ డౌ నతఁడు దన్ | గాంచినపుడు. 197

1. క. యమనియమంబు నింద్రియనిగ్రహంబు.

క. విను సుఖదుఃఖము లచిరము, లనియుం దను వశుచి యనియు § నఖిలపదార్థం
బును నశ్వర మనియుం గర్మనిరూఢత జాడ్య మనియు § మదినూహించున్.

క. ఊహించి తన్నుఁ గప్పెడు, మోహావేశంబు ద్రోచి § మోక్షపదప్రా
ప్తీహను సంసారాబ్ధివగాహనముం జేయ కుండు § గతకల్మషుఁ డై. 199

వ. అని పలికి వెండియు. 200

క. కనిరుగ్జరామరణములు, గని ప్రకృతివిధంబు లెస్సగా నెఱుఁగుటఁ ద
జ్జనితక్లేశమునకు విసివిసి మర్త్యులు పరమపదము § వెదకుదు రనఘా. 201

సీ. అట్టివా రిట్టివా § రగుట మేల్ గనుకొని, యుజనంబుఁ బూతంబు § నైనచోట
నాసీనుఁ డై హృదయంబున నొకచింతయును లేక యాత్మనిరీక్షయుంచి యెదరి
తోఁచుతోఁపుల నెల్లఁ ద్రోద్రోచి నడంచి నిరాలంబనుం డైనయతఁ డొకండు
సర్వమిత్త్రుండును § సర్వసహుండును, నిర్జితేంద్రియుఁడును § నిర్భయుఁడును

తే. గామకోపహీనుఁడు శమదమనుఁడు నైన
యతఁ డొకండు మానాభిమానాపగమము
సర్వభూతాత్మకత్వదర్శనముఁ గలుగు
నతఁ డొకండు వీరలు గందు § రనఘ ముక్తి. 202

సీ. ఒలయులాభాలాభములుఁ బ్రియద్వేషంబులును సుఖదుఃఖములును సమంబు
లై యుండు నెవ్వని § కాసపాటును నవజ్ఞతయు నెందును లేక § సర్వధర్మ
తంత్రలోలుండును § ధర్మశీలుండుఁ గాఁ, డెవ్వఁడు గూర్చువా § రెవ్వ రుండు
వా రని తనకు నెవ్వరును గల్గక శివ, గ్గెచ్ఛ యెవ్వనిచేత § నీడ విడుచుఁ

తే. బడు నకర్మభావంబుఁ దాపత్రయాప
గమము వైరాగ్యసుస్థిరత్వమును గల్గు
నరయ నెవ్వనియందేని § నతఁడు నతఁడు
నతఁడు నతఁడును గందు రవ్యయపదంబు. 203

క. అసమాలంబ మశబ్దము, రసగంధస్పర్శరూపరహిత మగుణ ము
ల్లసితగుణ మగు వెలుఁగు నభ్యసననియతిపరుఁ డొకండు § వడయుం బుత్త్రా. 204

తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ, బరమశాంతి చిత్తంబునఁ § బట్టుకొల్ప
నతఁ డనింధనానలము నట్లల్లఁ బొందు, విశ్రుతవర్జితమైన నిర్వృతి కృతాత్మ. 205

వ. అని నిర్దేశించి యోగిజనానుభావ్యంబైన నెల వెఱింగించెద నని పలికి యోగులం
దాని నాత్మదర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపు మని యి
ట్లనియె. 206

ఆ. అనఘ ముంజగర్భ § మగునిషీక నిదర్శనంబు గాఁగఁ గనుఁగొనంగ వలయుఁ
దనువు ముంజ మాత్మ § తమీకనిష్కర్షవిధము సూక్ష్మ యోగవిదునివరవ్వు.

క. తనవుతలన నిష్కర్షంబు, లొనర్చి జీవాత్ముఁ గాంచు § యోగివరుండ

య్యాను వొదవి యట్లు దన్నుం, గనినప్పుడు జననమరణగతులం దొలఁగున్. 208

క. ముక్తుండు జరామరణవి,యుక్తుం డై హర్షశోకరహితుఁడు మొదలి స
ద్భక్తులకును నప్పద మిా, శక్తుం డగుఁ జూవె బ్రహ్మచర్యము పేర్మిన్. 209

ఆ. ఒడలియస్థిరత్వ మూహించి యాత్మయఁ, దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా,గాదిదుఃఖములకు నగపడఁడు. 210

క. వినుమా యోగికి క్షుత్తుల, కును శ్రమహతికిం బాధ యగ్నిదాహము మొదలై
చనునవ్వికారములు లే, వనఘ నతఁడు గోరఁ డింద్రపదము నుపద మైనన్. 211

క. తనయంద తన్ను నెన్నఁగఁ, గనుటం గడచినసుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కయ్యెడు, వినుతానుష్ఠానమునకు వినుమవి వలయున్. 212

వ. అయ్యనుష్ఠానం బెట్టి దనిన. 213

క. తనయెఱిఁగిన తెరువున నా,త్మను సంతర్వర్తిఁ జేసి మఱి బాహ్యగతిం
జననీక యుండఁగ నది యొం,దనువునఁ బడు నిలుప వలయు నచ్చట దానిన్. 214

వ. అది యె ట్లనిన. 215

తే. దంతములు జిహ్వ గుత్తుక తాలుతలము
కంఠనాళంబు హృదయంబు గ్యాచరిత
మఱియు [1]లోపల నెచటికి మనసు మొలఁగెఁ
దాఁ గదల్పక యచటన యాఁగవలయు. 216

వ. అని చెప్పి నని చెప్పి నాతో శిష్యుం డని మఱియును బలికి తలంచికొని కొండొక నవ్వుచు నవ్విప్రుండు నామొగంబు సూచి యయ్యతో యూ సిద్ధుం డనువాఁడ నేన కదా నీయెఱుంగనిది యెదియును గల దె మఱియు నక్కాశ్యపనామధేయుండడిగిన తెఱంగు దానికి నుత్తరంబు నాయిచ్చినవిధంబును విను మని యి ట్లనియె. 217

ఆ. కేలు మొగిచి వినయశాలి యమ్మేధావి, విశదకరుణఁ జెప్పవే మహాత్మ
పరమమోక్షకరణపరిణతం బైనయుదా,త్తసూక్ష్మసుకరధర్మ మనియె. 218

వ. అనిన నవహితుండ వై యాకర్ణింపు మని పలికి యి ట్లంటి. 219

ఆ. పాలకడవ వెక్కసపునులపోడిం దిన,యాతఁ డెట్లు దాని నరసికొనుచు
నుండు నట్లు లోన నునిచినమనసు నేమఱక యాత్మ వెదకు తెఱఁగు మేలు.

క. ఈతెఱఁగున నుద్యుక్తుం, డై తెలి వొందినమనంబు నతులవివేక
ఖ్యాతి మరగించి కర్ప్యద్యోతిత మగు బ్రహ్మముం బ్రతుర యోగి గనున్. 221

తే. అయ్యనాదితత్త్వముచక్షురాదికంబు,లైనయింద్రియములకు గ్రాహ్యంబుగాదు
సకలమలనిరాసాజ్య ప్రసన్నతరమ,నః ప్రదీపంబు తద్దర్శనం బొనర్చు. 222

క. కలయఁగ నెల్లెడలం, దలలును లోచనములును బదంబులు హస్తం
బులు నై యుతాత్మ్యం బు,జ్జ్వలభంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్. 223

1. చ. లోపట...మలఁగె.

క. తగ నేర్పరించి కేవలముగను శాంతము నైనతత్త్వమును సంతతమున్
గనుచున్నఁ దన్ను నెఱుఁగం, గను జీకటిఁ బాపు వెలుఁగు గలుగుం బుత్రా.

వ. బ్రహ్మవిద్యారహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి నీ వింక సుఖవి గమ్ము పొమ్ము నేనుం బోయెద నని యామంత్రణంబు సేసిన నహాస్తసంకలయుం డయి యాశిష్యుం డరిగె నిట నిన్ను దర్శింప వచ్చితి నని పలికి యమ్మహాద్విజుం డంతర్హితుం డయ్యెఁ బరమహితం బైనయీవాక్యసంతానంబు సమవధానంబున వినం బడియెనే పాండవమధ్యమా నాఁడు రథస్థుండ వయిన నిన్ను నేతదీయం బయిన యర్థజాతంబు వినిపించితి నని యప్పురుషవరుతోడం బురుషోత్తముండు వెండియు ని ట్లనియె. 226

సీ. వ్యామిశ్రమతి యగునతనికి నశ్రుతాత్ముఁ, డైనవానికి నవధానరహిత
చేతస్కునకు నిది సెప్పంగ దేఁ దొల్లి, పలియంగఁ జెప్పితి దేవతలకు
గాండివి నీవు దక్కఁగ నిది మర్త్యులా, కర్ణింపఁ దగువారు గలరె యొరులు
పరమరహస్య మీపరిపాటి దీన నయ్యమృతవస్తువు గని యఖిలదుఃఖ

ఆ. ములుఁ దొలంగి నిత్యసుఖవృత్తి వెలుఁ గొందు, నరుఁడు వైశ్యులైన నాతులైన
శూద్రులైనఁ గందురు సువ్వాయిమ్మయిము క్తి బ్రాఁతె బ్రాహ్మణులకు రాజులకును.

క. వినిపించితి నిను బోధం,బునకు నుపాయంబు ఫలసముదయము మోక్షం
బును సౌఖ్యనిర్ణయము ని,క్కనుట గడవ సుఖము లొండు గలవే యరయన్.

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహాసంగంబు, నీడ విడిచి యెవ్వఁ డీయుపాయ
ముల భజించు వాఁడు మోక్షలక్ష్మికిఁ బతి, యగు నొకింతసందియంబు వలదు.

క. చెప్పం గలయది యెల్లను, జెప్పితి నీ కింత గడవఁ జెప్ప నొకఁడు లే
దిప్పాట నెలల నాఱిటఁ, జొప్పడు యోగంబు నియతిశుద్ధాత్మునకున్. 229

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణునకు నధ్యాత్మవిద్యావిషయంబు లగువాక్యంబులు సెప్పె నని చెప్పిన విని యన్నరనారాయణులు మఱియు నెవ్విధంబున వర్తించిరని యడుగుటయు. 230

చ. గుణసమతానుభూతివ్యాత్తికోవిదసారవివేకభవ్య చా
రణసురసిద్ధసాధ్యఖచరప్రముఖాఖిలభూతసేవ్య వీ
క్షణకలనాకృతార్థమునిసార్థబహుస్తుతివాక్యరత్నభూ
షణమహనీయఖేలన నిసర్గకృపాకృతలోకపాలనా. 231

క. నవ్యత్వపురాణత్వద,శావ్యపనయదుర్నిరూపసౌందర్యా వే
దవ్యాసవాక్ప్రశంసిత,దివ్యధురాధుర్య యోగిధీసత్కార్యా. 232

మాలిని. భువనభవనదీపస్ఫూర్తితేజోవిలాసా
సవితృశశిమయత్వస్ఫారచక్షుర్విలాసా

వివిధనిగమవిద్యాసంవేద్యమాత్మప్రభాసా
పవనవిజయలీలాప్రౌఢచేతోనివాసా. 233

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబయిన శ్రీమహాభారతంబునయశ్వమేధపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 234





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, ద్వితీయాశ్వాసము



సుఖనిష్పాదనకే
లీసక్తపదారవిందశ్రీలా సతతా
ధ్యాసవికాసిసమాధిస
మాసాదితశాంతిలోల । హరిహరనాథా. 1

### బ్రాహ్మణగీతలు.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

ఆ. అట్లు శౌరి పార్థు । నంచితబ్రహ్మవిద్యాప్ర । బోధకంబు । లైనయట్టి
వినుతవాక్యములు సవిస్తరముగ వినిపించి యతనివలని । ప్రీతి జేసి. 3

వ. వెండియు నిట్లని బోధించు. 4

సీ. భర్తృభార్యాకృత । భవ్యసంవాదంబు, నధ్వర్యునామకము నై । యతిశయిల్లు
నట్టిది యొక యితిహాసంబు విను పార్థ, జననుతసమధిక । జ్ఞానవర్తి
తాత్ముకుం డైనమహాద్విజుం డొకండు వివిక్తప్ర । దేశసేవిత్వనిరతి
నున్నెడ నల్ల నాసన్న యై వినయంబు, భక్తియు నెసంగం దత్పత్ని ప్రణతి

తే. యాచరించి మహాత్మ యధ్యాత్మబోధ,భరితం గాం జేయవే నన్ను । గరుణ పల్ల
వింప నని దయ పుట్టంగ । వేండుట యును,మందహాసవిభాసితాస్యుండై మగువం జూచి.

క. ఈ మాటకుం జారుముఖి, నామది ముద మందెం గాన । నాలికి నిది యే
లా మేటితలం పనుత్రో, పేమియు లే దోపి వినుము । హితవచనంబుల్. 6

వ. నా మొఱంగినభంగిం జెప్పెద నని పలికి యత్యతులవ్రతుం డా పతివ్రత కిట్లనియె.

సీ. వినను గానను జేయ । వెర వైనయవి కర్మములు వానిం గర్మకర్తలు సమస్త
సిద్ధిప్రదము లని । చెప్పుదు రజ్ఞానతిమిరాంధులై విను । ధీరచిత్త
జగమున లేదు నిష్కర్మత్వ మొందేనిం, గలిగె నేనియును మా । ర్గ్యముగ దాని
నిందింతు రెక్కుడుసనల వది యాత్మ నేం, గందు బ్రహ్మంబు నిష్కళత నంద

తే. వెలుఁగు నగ్నితో సోముండు గలసి మిథున
ధర్మమం దెప్డు నడపి భూతతములఁ దాల్చు
నజుఁడు మొదలుగ నఖిలోకప్రాప్తి యందుఁ
జేయుదురు శాంతి నింద్రియజిత్త్వ మొంది. 8

వ. అక్షరంబు తెఱంగెఱింగించెద. 9

సీ. స్పర్శంబు రసము రూపంబును శబ్దంబు, గంధంబుఁ గా కునికి కారణముగఁ
ద్వక్కున జిహ్వానేత్రమున శ్రోత్రంబున, ఘ్రాణంబునను బరిగ్రహవిధాన
మాచరించుటకు లోనై యుండ దాత్మ, [1]మమలినబుద్ధ్యవగమము దానిఁ
బ్రాపించుఁ బ్రాణాదిపంచవాయువులును, విను దానివలన వర్తనముఁ బొందు

తే. నంద దిందుఁ బ్రాణంబు నపానమును స
మాననామకవ్యానమధ్యమున నడచు
మెలఁగుచుండుఁ బ్రాణాపానములకు నడిమి
దెస నుదానంబు శ్రుతి యిట్లు దేటపఱచె. 10

క. నెలకొని ప్రాణాపానం,బుల బురుషుఁడు సుప్తుఁడైనఁ బొలఁతి విలీనం
బు లగు సమానవ్యానం,బులు యోగులు సంశయంబుఁ బొందరు దీనన్. 11

క. విను తెలియంగ నుదానం,బున సుప్తుం డైనఁ బ్రాణము నపానంబుం
వనజనిభలోచనా పురుషుని విడువవు యోగిజనులచూపి ట్లుండున్. 12

అంతర్యాగప్రకారంబు నిరూపించి చెప్పుట.

వ. ఇవ్వాయువు లేనును మనంబును బుద్ధియుం గూడ నేడును వైశ్వానరునకు జిహ్వలు వైశ్వానరుం డనఁ బ్రాణులదేహంబులం దగ్నిరూపంబున వెలుంగుచున్న యాత్మయందు ఘ్రేయంబును భక్ష్యంబును దృశ్యంబును స్పృశ్యంబును శ్రావ్యంబును మంతవ్యంబును బోద్ధవ్యంబును నగు నీసప్తసంఖ్య సమిధలు ఘ్రాతయు భక్షయితయు ద్రష్టయు స్ప్రష్టయు శ్రోతయు మంతయు బోద్ధయు నయిన యాయేడ్వురును వరుసను ఘ్రేయాదు లయినహవిస్సు లేడింటిని వేల్చుఋత్విజు లిది సప్తహోతృవిధానప్రకారంబు వైశ్వానరువదనంబులు పదియు [2]దిగ్వాయుసూర్యచంద్ర పృథివీపావక శక్ర విష్ణుప్రజాపతిమిత్రాత్మకంబులు శబ్దస్పర్శ రూపరసగంధవక్తవ్య కర్తవ్యగంతవ్యవిసర్గానందంబులు హవిస్సు లీపదింటిని గ్రమంబున నాహుతులు సేయుహోతలు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థంబు లయిన దశేంద్రియంబులిత్తెఱంగు దశహోతృవిధి యీరెంటిని నెఱింగి యర దేవిధంబున నేనియు జీవాత్మం దుపద్రష్టగా నంతర్యాగంబు నడపు యోగిజనంబులు జననమరణవిముక్తు లగుదురు బహిర్యజ్ఞపరులు గమనాగమనభ్రమణంబులం బొందుచుందు రని చెప్పి వెండియు. 13

1. గ. మమలినబుద్ధ్యవగమము 2. చ. దిగాకాశసూర్య.

క. విను ప్రణవాదికరూపస్వనిరూఢిం బుట్టు వాక్కు దాని వెనుచనుఁ
మనము పురుషార్థబుద్ధిం, [1]బనుపడి యని చెప్పి పతికి బ్రాహ్మణుఁ డనఘా. 14

క. విని యా విప్రునితో ని, ట్లను నయ్యేలనాగ మనమ యనఘ ప్రేరేపం
గ నెగయు వాక్కు తదనువ,ర్తనము మనంబునకు నెవ్విధంబునఁ గలుగుఁ. 15

వ. అనవుడు నతండు. 16

చ. మనసు నుదానవాయువును మానిని గూడి వెలార్చు వాక్కు నా
త్మనివలనన్ భవద్వచనమ్ముఁ జనతానుభవంబుచొప్ప యై
నను విను కార్యముఁ గుఱిచినం దగ వాగనువర్తనంబు నే
యన వలసెఁ మనంబునకు నమ్మొయి గల్గుట నట్లు సెప్పితిఁ. 17

వ. అని పలికి మఱియు నమ్మహీసురోత్తముం డి ట్లనియె. 18

క. మనసును [2]వాక్కును మాలో, ననఘచరిత యెక్కు డెవ్వ రని యంభోజా
సను నడిగిన నతఁ డెక్కుడు, మన మనవుడు వాణి యక్కమలభవుతో డన్. 19

వ. ఏను నీకుం గామదోహిని నయి యుండ న న్నిట్లు దక్కువగాఁ బలికి తనిన నతండు స్థావరంబును జంగమంబును నన నాకు రెండుమనస్సులు గల వందు స్థావరంబు నాయొద్దను జంగమంబు నీకడను నిలుచు భవద్గోచరత్వంబునం బరఁగువర్ణంబు మంత్రంబు స్వరంబు జంగమమనస్సుగా నెగడు దానికంటె నీ వెక్కుడు నీకంటె నెక్కుడు స్థావరమనస్సు గావున నిమ్మాట యాడం గల దానవు గా వని నిర్దేశించె.

క. విను మమ్మొయినిర్దేశం,బున నవ్వాగ్దేవి మూర్ఛ వోయినయు ట్లె
మిని బలుక కుండి పదపడి, వినయంబున నజుని శరణు వేఁడె లతాంగీ. 21

వ. అనిన బ్రాహ్మణి పతితో బ్రహ్మమాటకుం గొఱవోయినవాణి యేమిటం దేల నని యడిగిన బ్రాహ్మణుం డి ట్లనియె. 22

క. ప్రాణాపానంబులయెడ, వాణి నిలుచుఁ గాన ప్రాణవాయు వొదవి త
త్త్రాణత్వ ముడిపె నది గీ,ర్వాణజ్యేష్ఠప్రభావవాసిత యగుటన్. 23

వ. ఇట్టి వని వాఙ్మనసప్రకారంబు లెఱుంగుట మోక్షంబునకు మూలం బింకను వాణీమనస్సుల తెఱంగు సెప్పెద వినుము. 24

తే. ప్రాణుఁ బొదువుట వాణి యపానుఁ జెంది
తా నుదానభూతాత్మయై తనువు విడచి
వ్యానచేష్టిత సర్వసంవ్యాప్తి నొంద
మనసు సుస్థితి నొందు సమానునందు. 25

వ. మనసు సుస్థితిం బొందుట ముక్తికిం గారణం బని చెప్పి వెండియు. 26

సీ. ఘోషిణి నొకఁగ నఘోషిణి యన రెండు, తెఱఁగులు గలిగి వాగ్దేవి పరఁగు

1. క. బనుపడ నని. 2. గ. వాకును దమలో,

నం దఘోషిణి గరీయసి యుత్తమరసంబు, గోపుచందంబునఁ గురియుచుండు
నవ్యయరూపదివ్యప్రభావోజ్జ్వల, బ్రహ్మవాదిని యిట్లు బ్రాహ్మివిభము
గనుట మహానందకర మని చెప్పి యవ్విప్రుండు మఱియు నవ్వెలఁదితోడ

తే. వినుము ఘ్రాణాదికము లైదు మనసు బుద్ధి
యేడు నధిష్ఠానమున నుండియును నెఱుంగ
వబల యేడింటి విషయంబు నలమికొనఁగ
నవియ వివరింపు మా తెఱం గనియె నింతి. 27

వ. అనుటయు నయ్యవనీదేవుం డయ్యువిద కిట్లనియె. 28

సీ. గంధంబు ఘ్రాణంబ కాని తక్కినయూఱు, నధిగమింపఁగ నోప వధిగమించు
రసము జిహ్వయ యితరము లాపనికిఁ గావు, రూపంబుఁ జక్షుస్సె రూపు నెఱుఁగఁ
బెఱయవి యెఱుఁగవు తెఱవ సంస్పర్శంబుఁ, గాంచుఁ జర్మంబ తక్కటివి గానఁ
జాలవు శబ్దంబుఁ జాలుఁ బట్టంగ శ్రోత్రంబ యన్యమును దత్కరణమునకు

తే. పరవు లేవు సంశయితసంవేదనంబు
మనసుకృత్యంబ యికార్యమునకు నొండ్లు
పారవు నిష్ఠ బుద్ధిన యగుఁ జొరఁగ నేర
వి త్తెఱంగున నపరంబు లెఱిఁగికొనుము. 29

ఇంద్రియమనఃపరస్పరసంవాద ప్రకారము.

వ. అని చెప్పి మనస్సునకు నింద్రియంబులకుం దొల్లి గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మింద్రియంబులు మనస్సుతో నేము నీవు నొక్కరూప యనుటయు మనస్సు వాని కిట్లనియె. 30

చ. చన దిటు లంటఁ గొం పెఱుఁగఁ జాలదు నాసిక జిహ్వయుం జవుల్
గొన నెర లేదు రూపు గనుఁగొంటకుఁ గన్ను వలంతి గాదు సోఁ
కు నెఱుఁగుశక్తి చర్మమునకుం బ్రభవింపదు శబ్దజాతము
న్వినఁ జెవి కల్పనేనియును నేర్పడఁగూడదు నేఁ దొఱంగినన్. 31

వ. నిజంబుగా నేను దొఱంగితినేని. 32

ఉ. అప్రయోజనంబు లైయుండు నాఱిన,నిప్పులట్లు శూన్యనిలయములును
బోలె నిరాస్వరూపములు గాన మనలోన, నెక్కుడేన చూవె యింతనిజము.

వ. అనిన విని యింద్రియంబులు మనంబున కిట్లనియె. 34

సీ. ఇంతవట్టిద యిట్లైనయంతన, కలుగు నేర్చున యధికత్వ మేము
వెలి గాఁగ నీ భోగవిషయంబునేనియు, ననుభవించితి యేని నధిక మగుట
గావంగ వచ్చు మాలో నొకం డడఁగిన, ననుభవింపుము తదీయార్థ మట్లు

---

మూ. గ. జిహ్వయుం జవుల్ గొన నెర లేదు.

గాక ఘ్రాణంబున గంధంబు జిహ్వ రసంబు చక్షువున రూపంబు వినుము

ఆ. చర్మశక్తిఁ జేసి సంస్పర్శవిషయంబు, శ్రోత్రయుక్తి శబ్దమాత్రకంబు
కాని యొంటి నొంటి గలిగింపఁ జాల వె, ట్లధికతానిరూఢి నాసపడితి. 35

క. మును మే మాలంబించిన, వెనుకఁ గదా నీకు ననుభవింప వశం బో
మనసా [1]నీ వెంగిలి గాఁ, దనుమా యవ్విషయ మెక్కుడయ్యెడు మనలోన్. 36

క. నీ వడఁగినను ప్రాణముఁ, గావఁగ మాయంద బోధకం బగు ద్రవ్యం
బావర్తింపఁగఁ జేయుట, గావింతును నీకుఁ దెలివి గనికొను మిదియున్. 37

సీ. అట్లు గా దిట్లని యనుశాసనము సేయఁ, గడు నేర్చు శిష్యులకడకుఁ బోయి
వినిపింపఁ దొడఁగి యవ్వినుతార్థములు వార, లుగ్గడింపఁగ గన్నయోజఁ బోలె
మముఁ గొని విషయాత్మకరము నీవు భోగ్యంబు, గాఁ జేసికొందు నీకలలు గన్న
యప్పుడు మా లేమి నవ్విషయంబు బొం, కైన వాకిలి లేనియాలయంబుఁ

ఆ. జెంది మరలినట్లు సేడ్పాటు వొరయుదు, గాక సత్యభుక్తి గలదె నీకు
నింతవట్టుఁ గాన్పు మేమును నీవును, గలసి పరఁగ భోగకలన గలుగు. 38

వ. అని యివ్విధంబున మనంబును నింద్రియంబులును సంవాదంబు సేసె నని యు
ప్పురుషవరుం డావరవర్ణినితోఁ జెప్పె నొక్కండు వినుమని యిట్లనియె. 39

సీ. ప్రాణప్రభృతు లగుపవను లంభోరుహా, గర్భుని నొక్కటఁ గానఁ బోయి
యెక్కుడు మాలోన నెవ్వఁడు నావుడు, నవ్విభుం డెవ్వార లడఁగ నడఁగు
దురు మీరు వార లెవ్వరికిఁ బ్రవర్తన, మొందిన నల్లవారును జరింతు
రధికు లందఱకును నట్టివారలు మీరు, సనుఁ డని పలికినఁ జనక నిలిచి

ఆ. ప్రాణుఁ డాది గాఁగ [2]నందఱుఁ దమతమ, వలన నవ్విధంబు గలుగఁ దెలుప
నాతఁ డే సెఱుంగ నాయది యట్టిద, వినుఁడు మీవిశేషవృత్తిభంగి. 40

తే. ఎప్పు డెవ్వరివలన నేచొప్పు గలుగు
నవుడ వా రెక్కు డగుదు రన్యోన్యమిత్ర
భావమునఁ జాల్చుఁ దొందొరుఁ బవనులార
మీరు పరస్పరభావనాపరుల రగుఁడు. 41

వ. ఇత్తెఱంగున మీకు భద్రం బగుం బొం డని వుచ్చి న ట్లుపదేశించిన బ్రహ్మ
వాక్యంబుల వాయువులు సమత నొందె నని చెప్పి వాయువిషయంబైన యది
నారద దేవమతసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మని బ్రాహ్మణుండు బ్రాహ్మణి
కి ట్లనియె. 42

తే. దేవమతుఁ డనువిప్రుండు దేవమునివ, రేణ్యుఁ డగునారదుని నొక్కపుణ్యభూమిఁ
గాంచి వినతుండై యాతని కరుణ వడసి, భక్తిరసముఁ బొంగారఁ దత్ప్రాంతమునకు.

సీ. అల్లనఁ జన నాతఁ డాదరంబున నిందు, రమ్మెం డు మనుచుఁ గరమునఁ జూపు

1. అ. [illegible] 2. గ. [illegible]

నెడ సమాసీనుఁడై కడు వినయంబున, హస్తములు మొగిచి దయాసమగ్ర
మొఱఁగింపు పవనంబు లేనింటియందును, జాయమానం బగుజంతువునకుఁ
దొలితొలి యెద్ది దాఁ దొడఁగు వర్తింపంగ, ననవుడు నారదుం డతనితోడ

తే. వాయు వెయ్యది గర్భసంవాసమునకుఁ, జొనుపు జీవునిఁ దజ్జంతుజనన వేళఁ
దొలుత దాని ననంతరకలితమైన, మారుతంబు ప్రవర్తించు మఱియు వినుము.

తే. పురుషునందు సమానంబుఁ బొలఁతియందు
వ్యానమును జూవె పొడమించుఁ వరుస ననఘ
శుక్లమును శోణితంబును జాలఁ గల్గు
నయ్యుగంబును విధిచెయ్యి సమరఁ బొంద. 45

క. విను సృష్టశోణితంబునఁ, బనుగొను శుక్లంబువలనఁ బ్రాణుఁడు తగ వ
ర్తన మొందుఁ బ్రాణశుక్లము, లనూన హేతువులుగా నపానుఁడు నడచున్. 46

క. చనుఁ బ్రాణుఁ డధోగతి న, పూర్వనిరోధి నపానుఁ డివ్విధము గలయీరెం
టను నగ్నిమయోదానం, బును వ్యానంబును సమానమును వర్తించున్. 47

ఆ. పావకుండు సర్వదేవాత్మకుండు ప్రాణంబునకు నపాననామమునకు
నంతరమున వెలుఁగునా భవ్యమూర్తి యు, దానరూప మండ్రు తద్జ్ఞజనులు. 48

సీ. విను మహోరాత్రంబులును శుభాశుభములు
సత్యానృతంబులు సదసదాహ్వ
యములును నైన ద్వంద్వములు ప్రాణాపాన
ములకు నామాంతరంబులు తదీయ
మధ్యవర్తిత నొప్పు సమానియవహ్ని యు
దానంబు దాని నిర్ద్వంద్వభావ
మాంతరయోగవిద్యాప్రవీణులు గండ్రు
పరమశాంతి యనంగ బ్రహ్మ మనఁగ

తే. నరయ భేదంబు లే దన్నయట్టు లుండు, నమ్మహావస్తువును సుదానాకృతియు య
నంగఁ జెవి యార విందుము నలినగర్భు, చేతనని దివ్యముని యిట్లు సెప్పెఁ గరుణ.

వ. అని చెప్పి యింద్రియమనఃపవనంబుల భంగులు గనుంగొనుట యాత్మత్వంబునకుఁ
బరమం బగు నతత్త్వంబు గనుటకుఁ గతం బైయుండు నని పలికి యద్ధరామరుం
డా రామారత్నంబును సదయంబుగా నవలోకించి యుత్తమరహస్యంబు సెప్పెద
నాకర్ణింపు మని యిట్లనియె. 50

### జీవాత్మ స్వరూపనిరూపణ ప్రకారము.

సీ. కరణంబు కర్మంబు కర్త యన్నెతద్వి, రాజిత కారకత్రయము చేత
సఫలంబు సంవ్యాప్తమైయుండు ఘ్రాణాదు, లును మనంబును బుద్ధియును బ్రవరులు
కరణహేతువు లండ్రు గంధాదివిషయసం, తతియును ఘ్రాతవ్యబోద్ధవ్యములును

గర్మ హేతువు లగుఁ § గంపు గొనఁగ నానఁ, గాన ముట్టఁగ వినఁ§గాఁ దలంప

తే. నిశ్చయము దగఁ జేయంగ § నేర్పు [1]లేదు
గలవు జీవాత్మునకు నవి § కర్తృ హేతు
భూతములు [2]వాన విషయాను§భూతి నతఁడు
బొందఁగ నిష్మలుఁ మోక్షహే§తువులు సుమ్ము. 51

వ. కరణకర్మకర్తృకారకాత్మకుం డగుజీవాత్ముండు భోక్త యగుట దక్కిన వివిధ విషయమూర్తు లగుమావిస్నుల నుదాసీనత్వస్సుగ్గతంబులు సేసి వేల్చునిష్మ నాత్మస్వరూపం బగునవలంబు ప్రజ్వలితం బయి యవిద్యాధూమరహితం బగుచుం బొలుచు నది మోక్షప్రకారం బట్లు గాక భోక్త యగునేని నట్టిద బంధప్రకారం బని నిర్దేశించి ముక్తభావంబునకు మూలం బయిన యోగ యజ్ఞంబునం దేను బ్రవృత్తుండ నై యున్నవాఁడ దానికి సర్వపరిత్యాగంబు దక్షిణ దాన సకలాత్ముం డగునారాయణుండు ప్రీతుండై స్వీకరించు నద్దళపేరు మునులు ముక్తి యని చెప్పుదురని చెప్పి యవ్విప్రుండు వెండియు. 52

సీ. శాస్త్రయొక్కండ తత్§చ్ఛాసనంబునయేఁ, జరియింతు నొక్కండ § గురుఁ డతండు
సెప్పినయర్థంబు § చిత్తంబులో నుంతు, శ్రోత యొక్కండ తత్§ద్జ్ఞాతబుద్ధి
నెగడుదు నొక్కండ § నగవంగ విద్వేష్ట వాని వ్రాల్చినదిక్క§వ్రాలి యెడరుఁ
గడపుదుఁ గడవంగఁ § గారణ మయ్యేడు, తెలుఁగు పెద్దలచేత § నెఱిఁగినాఁడ

ఆ. వినుము దేవతలును § మునులును బరమేష్టి,యొద్ద కరిగి మోక్ష§సద్విహితము
యనిన నావిధాత § యక్షరోపాసన, మనియెఁ గాన దుర్గ § మబల కడతు. 53

వ. ఇంక నెక్కడ గడచెద మున్న కడచితిఁ గ్రోధతిమిరంబును లోభవ్యాళంబును గామదస్యుదూషితంబును నగుదుర్గంబు గడచి యొకవనంబు ప్రవేశించితి ననిన విని యవ్వనిత యవ్వనం బెట్టిదని యడిగిన నమ్మహాద్విజుం డి ట్లనియె. 54

ఉ. అంతకుఁ జిన్నలున్ వెదక § నంతకు బెద్దలు లేవు దుఃఖ మ
త్యంతముఁ జేయ సౌఖ్య మొస § లార నొనర్పఁగ నొండొకంటియం
దంతటినేర్పు లేదు వెలి § పన్నది యేమియు నవ్వనంబు ని
శ్చింతతఁ జొచ్చి యున్నసరుఁ § జెందదు నిర్వృతి సెందు నుగ్మలీ. 55

తే. కొన్నిటికిఁ బంచవర్ణములో§కుసుమఫలము,లందుఁ గొన్నిటి కేకవ§ర్ణాంచితంబు
లవనిజములుగొన్నిటికిన § వ్యక్తవర్ణ,కములుసౌరభ్యమాధుర్య§సమధికములు. 56

వ. అవ్విపినంబున. 57

క. వృక్షంబులకుం గలుగును, దీక్షాగుణములును నతిథి§త్వప్రకృతియుఁ బ
ద్మాక్షీ యతిథులు బ్రహ్మస,దృక్షులు సౌఖ్యంబునిట్టిఁ § దేలుదురు మునుల్. 58

1. గ. లేదు కలదు జీవా. 2. గ. వానివిషయజ్ఞానానుభూతి,

ఆ. కలకులకును వింటికిని మేర లివియన, రాదు గాన యయ్యరణ్యభూమి
వెలుఁగు లొండ్లు సారవృత్తివిసుము క్షేత్రజ్ఞుండు, రవి తదీయసేవకభవముఁ బాచు.

క. గగనము తు బ్రహ్మసంభవ, మగుజలము వహించుచుండు నందులనదులున్
నగములు విను దానఁ దపస్విగణం బవ్యయపదంబుఁ జెందం గాంచున్. 60

వ. ఇట్టి దవ్విపినంబు. 61

ఆ. మాననీయనియతి మహితతపోధనవంతు లైనయట్టివారు శాంతి
దాంతినిస్స్పృహతలుదలకొన సుసమాహితాత్ము లైవసింతు రంగసాధ్వి. 62

వ. అని చెప్పి మఱియును. 63

సీ. వినుము మార్కొనఁ జవిగొన దర్శనస్పర్శనము లాచరింప విననంగ నెలయు
నేమిసంకల్పంబు నెడఁ జేర్ప నిష్టార్థములను[1] ననిష్టార్థములను గోరు
టయును నొల్లకత్రోచుటయునుస్వభావకృత్యము లవిగనుఁగొంచునబలవానఁ
బొరయ నెట్లన్న మేల్ దొరకొనుఁ గోరక,యును బోదు కీడు ద్రోచినను దీని

తే. నెఱిఁగి యేను స్వభావంబు నెడఁ బరాజ, బత్రగతజలబిందువుభంగిఁ దాల్తు
నని యెఱింగించి బ్రాహ్మణుఁ డతివతోడ, మఱియు నిట్లను శాత్రవఘనకల్య.

వ. ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మధ్వ
ర్యుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి యిది హింస గాదే యనిన
నతండు. 66

తే. ఛాగ మిది యరయంగ నాశంబుఁ బొంద,దూర్ధ్వలోకసుఖంబుల నొందుఁగాన
శ్రుతులవాక్యముల్ నీ కెక్కనూనృతంబు, లగునయేనినీవిట్లంటయనుచితంబు.

వ. అని వెండియు నప్పశువు నుద్దేశించి. 67

క. భూతములు నింద్రియంబులు, నాతతగుణ యాత్మ రూపానులందుఁ గలయఁ బిం
డేతరుఁ డగుజీవుఁడు సౌఖ్యాతిశయం బొందు నధ్వరాతిశయమునన్. 68

క. అని పలుకుటయును యతి యిట్లను ఛాగము పుణ్యగతికి నరిగెడుఁబో యి
ప్పని నీ కెవ్విధము ప్రయోజనంబా సిద్ధించుఁ జెపుము సమ్యక్ఫణితిన్. 69

వ. అనుటయు నధ్వర్యుం డతని కిట్లనియె. 70

క. అగముపశువిధిం దగ, యాగ మొనర్చినఁ ద్రివిష్టపానేకమహా
భోగానుభూతిభవ్యస,మాగమ మది యనుట బొంకె యాగమువేదీ. 71

చ. అనవుడు హింస పాప మని యాగమవాక్యములంద కాదె యేఁ
గని యిటు లంటి నన్ను యతిఁ గన్గొని నీవు సమాధిఁ బ్రాణరో
ధనము మనోలయంబు సుకృతంబులుగా నొనరించి వెండి యో
గనిరతిఁ బొంకె తత్తఁగు గాదొకో హింస దలంచి చూడఁగన్. 72

వ. అని పలికిన నయ్యధ్వర్యునకు నయ్యతిముఖ్యుం డిట్లనియె 73

1. గ. [illegible]

చ. పరమతపంబు గాఢపరిపాకము [1]నొందినఁ జిత్సుఖాత్మకా
[2]క్షరమునఁ జిత్తభూతగుణజాలతముల్ క్షరమున్ వివేకితా
పరిణతిఁ బాపి చూచి యనపాయసుఖస్థితి నొంది పొల్లలం
బొరయక త్రోవు హింస యనుబుద్ధి విమూఢత గాక బోధమే. 74

చ. అనవుడు నాతఁ డార్యవచనామృత మానినవాఁడు గీఁడు మేల్
గనుఁగొనఁ జాలు నేను బహుకార్యమునప్పుడు మీరు రను గ్రహిం
చినక్రియఁ జూడ నేర్తుఁ జిదచిద్ద్వయమున్ విభజించి దాన హిం
సనము నొకింతయుం బొరయ జన్మము సేయుదు మేలు నొందుదున్. 75

క. అనుటయు నతనికి యతి యి, ట్లనుఁ బశుయజ్ఞమునకంటె ననఘ తపోయ
జ్ఞనిరూఢి మేలుగావున, వినిపింపఁ దలంచి యంటి వేయును నేలా. 76

వ. అనవుడు నమ్మాటకు నయ్యధ్వర్యుం డొడంబడియె నని చెప్పి యాభూసురవర్యుం
డాభామినితో నీయర్థంబున కొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము సహస్ర
బాహుం డగునర్జునుండు దుర్జయప్రతాపంబున నఖిలద్వీపంబులు నేలి వ్రాలి
తనకు నెదురు లేకున్న విజృంభించి పరశురాముం డొడరి యతనికి నత్యంతం
బప్రియం బాచరించిన నతండు బహుశాఖోపశాఖాశోభితం బయినపాదపంబు
నుఱుముగా నఱికి పడవైచినచందంబునం బరశుఖండితసర్వాంగునిం జేసె నంత
నిలువక తత్పుత్రంబురాజులుం గూడుకొని తదీయతనయులుం దారు నారాముని
యసన్నిధి నతనిజనకుం డగుజమదగ్నిం జంపినం బెంపారుకోపంబున నాటోపం
బెసంగ నాజామదగ్న్యుండు రాజుల నెల్లం దర మిడి యిరువదియొక్కమాఱు
పరశుధారపాలు సేసిన నతనికిఁ బితృదేవతలు సన్నిధి సేసి. 77

ఆ. పరశురామ నీవు బ్రాహ్మణుండవు నరే
శ్వరులఁ జంప నేల వలవ దుడుగు
మయ్య యనుడు నాతఁ డట్లన కుండుఁ డీ
రేను రాజపశువిధానమునను. 78

క. పారనియతిఁ బాటించి మహారోషాగ్ని పరితృప్త మగునట్టులుగా
వీరాధ్వరంబు సేసెద, వారింపక యరుగుఁ డనిన వా రతనితోన్. 79

క. యజ్ఞంబులలోనఁ దపోయజ్ఞం బుత్తమము దాని నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ చేయుము సర్వజ్ఞుఁడు ప్రీతుఁ డగు శాంతరస మొప్పఁగ మీరా. 80

వ. అని చెప్పి మఱియు నిట్లనిరి తొల్లి యలర్కుం డనురాజు మనస్స్పృష్టంబు
లగునింద్రియంబుల కలిగి దివ్యాస్త్రంబులు ప్రయోగింపం జూచిన నవి
యయ్యవనిపతితో నయ్యస్త్రంబులం దారు సెడ మనియెను రోషావేశంబునం
బ్రయోగించిన నతండ చెవు ననియూనుం బలికి యొప్పుదేని నీతపోమయంబు

1. గ. నొందిన చిత్సుఖా. 2. ఙ. క్షరమునఁ జిక్కి భూతగణజాలతనుక్షరమున్.

లైనయస్త్రంబులు[1] సంధింపు మనిన నతండు క్రోధంబు దక్కి యోగంబున శాంతి నొంది వానిం దప్రాపతపఃఫలాస్త్రసాధితంబులం జేసె నీవును దపంబున నంతశ్శత్రుజయసౌఖ్యం బనుభవింపుము బాహ్యశత్రుజయంబు జయంబుగాం గొనకుము. 81

క. అని నిష్ఠించి పలుక న,ర్వినుతచరిత్రుండు శాంతివిభవంబున నూ
నినమనసుతోడ మునిమా,ననపాత్రంబైనతపమునన మేలొందెన్. 82

సీ. అని చెప్పి బ్రాహ్మణుండయ్యింతి కిట్లను, దొమ్మిదిగుణములు గొమ్మ కలవు
స్తంభాతిమానవహర్షంబులు సాత్త్వి,కములు క్రోధసంరంభములును శోక
మునురాజసంబులు మోహాలంద్రాస్వప్న,ములు తామసము లిట్లు గలుగురిపులఁ
దునుమ నేయస్త్రంబు లను వగు వాన న,య్యాంతరశత్రుచయంబు నెల్లఁ

తే. దునిమి యేనింద్రియంబుల మనము నోర్చి
శాంతి నొంది శ్రేయస్సిద్ధిసాధనం బా
నర్చునది ముఖ్యవైరినిర్ణయముఁ జేయు
నంబరీషగీతలు విను మంబుజాక్షి. 83

వ. అంబరీషుం డనురాజు రాజనీతిపరత్వంబునం బరమప్రభుత్వంబు నొంది యరాతుల నెల్ల విగతాసులం జేసి పూజ్యం బగురాజ్యంబు పరిపాలించుచుండి యొక్కనాఁడు విద్వజ్జనంబులతో నిట్లనియె. 84

తే. అరుల నెల్ల జయించియు నదిజయంబు,గాఁగొనక యున్నవాఁడ న్వగలపుఁబగజ
యింపకున్కిఁదద్విజయవిహీనుఁడ్వృష్ణ,జనిజరామృత్యువశగవర్తనునిఁ జేయు. 85

క. అంతటిలోభము గెలువక, శాంతి గలదె యని తదీయశక్తి నడఁచి ని
శ్చింతత్వ మొంది యా భూ,కాంతుఁడు సామ్రాజ్యమున సుఖస్థితి వడసెన్. 86

జనకునకు విప్రరూపధరుం డైనయమునితో నైనసంవాదము.

వ. అని వెండియు నవ్విప్రుం డిట్లను జనకచక్రవర్తికి నొక్కబ్రాహ్మణునకుం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపుము జనకుండు దనకట్టెదుర బ్రాహ్మణుండు గొఱగామి సేసిన నతనితో. నీవు నావిషయంబున వసియింప వలదు పొమ్మనిన నతండు. 87

క. నీవిషయ మెంతవట్టది, యే విని పరమవిషయమునకు నేఁగెదఁ దెలియం
గా వినిపింపు మనుడు నా,భూవల్లభుఁ డూరకుండెఁ బుణ్యాచరిత్రా. 88

ఆ. ఊరకుండి మూర్ఛ నూని యొక్కింతసేపునకుఁ దేఱి యిట్టు లనియె నాదు
తాతతండ్రితరముధరణి మద్వశ్యత, నుండ నాకు మమత యొలయదందు.

వ. మిథిల నెప్పుడు వసియించెద నిప్పురంబును మదీయరం బని యంగీకరింపంబడదు కావున నిది నావిషయం బన లేమిం జేసిమున్ను నీతో నాడినమాటం బుట్టినవగ

1. గ. సాధింపు

పెంపున మూర్ఛ వచ్చె ననిన విని యవ్విప్రుం డా భూవిభునాననం బాలోకించి. 90

క. నరనాయక నీయేలెడు, పురమున భూమిని మమత్వబుద్ధి గలుగ కి
ట్లిరవై యుండుటకుఁ గతం, బరయఁగ నెద్ది వినిపింపు మది విశదముగన్. 91

వ. అనుటయు నజ్జనపతి యతని కి ట్లనియె. 92

తే. అరయ నివి [1]రొట్టుఁ జెడియెదు నవియ కాన
వినుము మర్దన మిది యని వీనిలోన
నొకటియందు నంగీకార మొలయ దెల్ల
విషయమును నాయదియ యను విధము గలదె. 93

వ. ఎట్లంటేని ఘ్రాణాదులకు గోచరంబు లయినను గంధాదులు పెడం గలయవిగా
వున నాయవి యన కుండుటం జేసి భూమ్యాదిభూతంబులు నాచేతనిర్జితంబు లై
[2]మద్వశగత్వంబు నొంది యుండు. 94

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్ను నారయ
న్మనమున వేడ్క పుట్టె నర నాయక వచ్చితి నేను ధర్ముఁడం
బనుపడునివ్వివేకపరిపాకము గాఢనిరూఢభావ మొం
ది నిలుచుఁగాత నీ దగుమదిన్ సతతంబును శాంతికారి యై. 95

వ. అని ధర్మదేవత జనకునకు వరం బిచ్చి యంతర్ధానంబు సేసె నని చెప్పి యా ధరణీ
సురోత్తముం డయ్యుత్తమాంగనతో హితోపదేశంబు సేసెద నవహిత వయి
యాకర్ణింపు మని పలికె యిట్లను సంసారవర్తనంబు వదల విడిచి యే నేక
తంబ యున్నయెడ నీవు మ్రుచ్చిలి వచ్చి మదీయవైరాగ్యంబు మాన్పఁ దలంచి
నాకు నధ్యాత్మబోధంబు గలుగం జేయు మని యభ్యర్థించిన నీతలం పెఱింగి
యు నెఱుంగనివాఁడపోలె నధ్యాత్మవిద్యాబోధక ప్రకారంబు లైనవాక్యంబులు
సెప్పితి నే నింక లోకంబులం గలసి చరించువాఁడం గాను నిక్కపుబ్రాహ్మణుండ
నయితి బ్రహ్మచారి నయితి జీవన్ముక్తుండ నయితి మిముబోంట్ల కొలఁదిఁగా నన్నుం
జూచెద వది నాతెఱం గెఱుంగమి యేను జగంబు సమస్తంబును వ్యాపించి
యున్నవాఁడ నాయున్నభంగికి నాబుద్ధి సకలపృథ్వీరాజ్యంబును నాకలోకాధి
రాజ్యంబును సరిగా వని తలంచు నాబుద్ధియు నాకు ధనంబు [3]దారువుల నగ్ని
యున్నచందంబున సర్వజంతువులయందును నంతర్గత యై సిద్ధి యున్నది గురు
వాసగృహవాసవనవాసపరు లగుబ్రాహ్మణుల కెల్లను శ్రేయఃప్రాపకం బెరు
వొక్కండ యందఱును సరిత్తులు సాగరంబుఁ బ్రాపించిన తెఱంగున బరతత్త్వంబు
నొందుదురు బుద్ధి నిర్మార్గంబు నధిగమింప నగుఁ గాని శరీరంబున వశంబు
గాదు కర్మంబు లాద్యంతవంతంబులు శరీరంబు కర్మబంధనకరం బింత యెఱుం
గుదుం గాన నాహృదయంబునం బరలోకభయంబు లేదు నాచెప్పిన యధ్యా

1. చ. రొట్టుఁ. 2. చ. మద్వశగతంబు లై యుండు. 3. జ. తరువుల.

త్మవిద్యావిషయవాక్యంబులతాత్పర్యంబు చిత్తంబున నెలకొలిపి భావనానిరత
వయి యుండుము నన్ను బోలెదు వెలువకు మనినఁ బత్ని సాష్టాంగదండప్రణామం
బాచరించి కేలు మొగిచి. 96

సీ. నీవు సెప్పినమహార్హనీయవాక్యని కాయ, మతిగహనం బకృతాత్ములకును
సద్గ్రహణశక్తియనఘ కల్గునె కృతాత్ముల కైనఁ గ్రమ్మఱఁదెలియ వచ్చి
యుండ దయ్యెఁ బుకకు నుదయింపఁ బట్టిన, యట్టియుపాయంబు నాదరమున
నాకుఁ బ్రసాదింపవే కరుణాకర, నావుడు నాతఁ డర్జునాతితోడ

ఆ. నరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి, తపము శ్రుతము నిర్మథన మొనర్ప
జ్ఞానవహ్ని పుట్టు మానిని యని చెప్ప, వనిత యట్టు లనియె వల్లభునకు. 97

క. జనవినుతచరిత బ్రాహ్మణుఁ, డనఁగా క్షేత్రజ్ఞుఁ డగుట యల్పమె దోఁచెన్
మనమున నతని నరణి గాఁ, గొను టవ్వస్తువు నెఱిఁగికొని పిదపఁ గదా. 98

వ. అనిన నతం డిట్లనియె. 99

ఆ. అతనిఁ దోఁపఁ జేయునట్టిసాధనము లే, దింద్రియముల కందఁ [2]డేమి లక్ష
ణములు లేవు నిర్గుణత్వనిరూఢుం డ, హంత లేమిఁ దోఁచుఁ గాంత కనుము.

వ. అని నిర్దేశించుటయు క్షేత్రజ్ఞవిషయసంశయంబు వాసి యయ్యింతి శాంతి
బొందెనని గోవిందుండు సెప్పిన గాండీవి యా బ్రాహ్మణుండును బ్రాహ్మణియు
నిట్టివా రగుదు రె వా రెచ్చటివారు వారల నా కెఱింగింపవే యని యడిగిన
నద్దేవుం డతనియాననం బాలోకించి. 101

క. నామనమును బుద్ధియును గృపామహితా బ్రాహ్మణుండు బ్రాహ్మణియు హృషీ
కామేయ మైనక్షేత్రజ్ఞామలవస్తు వన నేన యనియె నరేంద్రా. 102

— గురుశిష్యసంవాదంబు కృష్ణుం డర్జునున కెఱింగించుట. —

వ. అనిన విని యర్జునుం డచ్యుతునితో భవత్ప్రసాదంబున మదీయమతి యతి
విశదయును సూక్ష్మగ్రాహిణియు నయి యున్నయది పరమం బైనవేద్యం బగు
బ్రహ్మంబు నెఱింగింపవే యనుటయు నాకృష్ణుండు గురుశిష్యసంవాదం బను
నితిహాసంబు విను మది నీప్రశ్నంబునకు నుత్తరం బయి యుండెడు నత్తె
ఱంగున మేధావి యగునొక్కశిష్యుండు సంశితవ్రతుం డయిన గురు నడిగిన
నగ్గురుండు [3]ప్రజాపతిభరద్వాజ భార్గవ గౌతమ కాశ్యప వసిష్ఠాత్రివిశ్వామిత్ర
ప్రముఖు లగుమునిజనంబు లాంగిరసుం బురస్కరించుకొని విరించికడకుం జని
తచ్చరణంబులకుం బ్రణమిల్లి హితం బెయ్యది తత్ప్రాప్తికి సుపథం బెట్టిది
వివరింపవే యని విన్నవించిన నన్నలినాసనుండు కృపాధురీణం బైన చిత్తంబుతో
నత్తపస్విసత్తముల కెఱింగించిన తెఱంగు నీకుం జెప్పెద నవహితుండ వయి

1. క. బ్రహ్మణుఁ. 2. క. డేమి లక్షణములు లేమి నిర్గుణత్వ 3. బృహస్పతి భరద్వాజ.

యాకర్ణింపు మని పలికి యిట్లనియె. 103

ఆ. ఆదరార్ద్రిఁ దగుచు ననలరినమోహముల, శాంతి వింత గాఁగ గమలగర్భుఁ
డా తపస్విజనులయాననంబులుగల,యంగఁ జూచి యిట్టు లనియె వత్స. 104

తే. సత్యము నన భూతంబులు సంభవించు; నంద వర్తించు దాననయుఁగు నిదిగు
ణత్రయాత్మకసత్యచరిత్ర మమల,బుద్ధులార సత్యంబు ప్రసిద్ధి వినుఁడు. 105

క. శ్రుతి యనఁ దప మనఁగఁ బ్రజా,పతి యన సత్యంబునకు నపరనామంబుల్
వ్రతులార సత్యమన న,ప్రతిమమహిమ [1]మైనపరమవేద్యము సుండీ. 106

క. కావునఁ గామక్రోధస,మావేశము విడిచి యనవరతంబుఁగా
సేవింతురు సత్యము దృఢ,భావాకలనమున యోగపరినిష్ఠాత్ముల్. 107

వ. అది హితంబు తత్ప్రాప్తికి సుపథంబు సెప్పెద వినుండు. 108

క. చతురాశ్రమములును జరణ, చతుష్టయము గాఁగ వర్ణసముదయసంసే
వ్యత నొప్పెడుధర్మము సుం, డతులంబు శివప్రదంబు నగుపథ మరయన్. 109

వ. నాలుగాశ్రమంబులకు సామాన్యంబు యధ్యాత్మవిత్త్వంబు లేక పరతత్త్వంబు నొంద రాదు మాకుతాదిత్యేంద్రప్రజాపతులకును లోనుగా నిట్టిద యధ్యాత్మదర్శనం బనం జతుర్వింశతితత్త్వావలోకనంబు గావునఁ దత్త్వంబులు వివరించెద.

తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియము లిరుదెఱఁగు మునిసింహులార
మన మహంకారబుద్ధులిట్లొవరి ప్రకృతి
గలయఁ దత్త్వచతుర్వింశకత్వ మొందు. 111

క. వినుఁడు ప్రభవవిలయజ్ఞా,ననిరూఢము గాఁగ వీనినైజ మఖిలముం
గనిన భవమోహ మొందఁడు, గనుఁ బరతత్త్వంబు నతఁడు గతకల్మషుఁడై. 112

వ. అని నిర్దేశించి యుద్దేవుండు వెండియు. 113

క. వ్యక్త మనిర్వాచ్యం బవ్య,క్తము సుస్థిరము ధ్రువము వ్యాపిత్వధురా
యుక్తము కలితగుణత్రయ, శక్తి నవద్వారపుర మసాధ్యము సుండీ. 114

క. తత్సాధనంబు తద్గత,చిత్తులభత్వప్రసిద్ధిఁ జేయుఁ ద్రిగుణసం
పత్సారవంత మది [2]గుణ, జిత్సువ్రతులైనవారికే సాధ్య మగున్. 115

సీ. సంయమివరులార సత్త్వరజస్తమో,నామధేయములు గుణంబు లవియు
నన్యోన్యమిథునత్వ మన్యోన్యసంశ్రయ, మన్యోన్యసంకలితానువృత్తి
భావ మన్యోన్యోపజీవనాచరణంబు, గలిగి దురూహతత్త్వగాఢభంగు
లై యుండుఁ దమము నియమితమైనరజస్సుఁ,దన్నియమమున సత్త్వంబునడచు

తే. సత్త్వ మడఁగినచోఁదమశ్చరిత మొనఁగు
లోభశోకనమోమ్మాహనిద్రాభయములు

1. గ. మైనటి జాతివ్యము, 2. క, గ, ఱ. గుణ, జిత్సువ్రతు.

వికృతిదుర్మానమాధ్యపాపప్రకృతిశోక
శాఠ్యమాత్సర్యములు తమస్సంభవములు. 116

ఉ. పాములుఁ దేళ్ళునుం బసులుఁ బంధులుఁ గుక్కలు మీలుఁ గోళ్ళులుం
జీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంకనక్కలు
దోమలు మ్రాఁకులుం బాదలు నొవ్వులఁ బీడలఁ బొందువారు మఱిన్
తామసభాగు లట్లు మఱి తద్విధజంతువు లెన్ని యన్నియున్. 117

క. ఇవి తామసంబు లని గుణ, నివహములోఁ గీడు వాపి నేర్పునతఁడు త
ద్ద్వివిధవికృతినిరసనహే, తువివేకము గలుగఁగా నధోగతి దలఁగున్. 118

చ. బలమును శౌర్యమున్ మదముఁ బ్రాభవముం సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మి సేఁతయును గాంక్షయు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పవిభావములుం గామినీజనం
బులయెడ గాఢరాగతయుఁ బొంకును నుబ్బు రజఃప్రభూతముల్. 119

చ. అవి దొలుబామునం గలుగునట్టిజనంబులు నీతు లిట్టి వి
ట్టివి యని నీతు లన్మతిపటిష్ఠత గల్గి త్రివర్గవర్తనం
బు వెరవు నొంది యర్థములఁ బొంపిరివోవుచుఁ గామసౌఖ్యవై
భవములఁ గ్రాలుచున్ మనుజభావనిరూఢతఁ బొల్తు రెంతయున్. 120

క. రాజసగుణములకుం గల, నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
ధీజితములు గావింపఁగ, నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్. 121

సీ. సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును, నానందమును గరుణాభిరతియుఁ
క్షమయును సత్యంబు శౌచంబుఁ ధృతియు న, కార్పణ్యమును దితిక్షయు నహింస
యును నార్జవంబు ననసూయయును గ్రోధ, రాహిత్యమును నసంరంభతయును
సమత దాక్షిణ్యంబు శ్రద్ధానతయు న, క్రూరభావంబు హ్రీగౌరవంబు

తే. సత్త్వజాతంబు లివి పూర్వజన్మసంక, లితములైనట్టివా రహంకృతి మమత్వ
మర్థతృష్ణ [1]కామార్తి లేకతులబోధ, భరితులై యూర్ధ్వలోకవైభవము గంద్రు.

క. వినుఁ డా గుణంబు లన్నిటిఁ, గనికొని తత్తదనువృత్తి గలుగనివాఁ డ
ప్పనిచే భుజింపఁగాఁబడఁ, డనఘాత్మకులార మ్రింగు నతఁ డారాశిన్. 123

వ. అని చెప్పి యప్పరమేష్ఠి మఱియును. 124

సీ. వేర్వేఱ యుండవు వినుఁడు గుణంబు ల, న్యోన్యసంకలితంబు లగుచుఁ బరఁగు
సంగతత్వము నన సంసారయాత్రాప్ర, వర్తనం బొనరించు వానిలోన
నెయ్యది మిగులఁ దోఁచి చ్ఛేదజన్యంబు, లోలయుఁ బోయుటయు నొక్కొక్కమాటు
గలుగు [2]దమం బెఱుఁగలి యధికం బైన, స్రోతస్సధోముఖస్రుతి రజస్సు

ఆ. పెరిఁగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ, బొంద నూర్ధ్వవృత్తిఁ బొందు వీని

1. క. కామార్తి. 2. ఆ, దమంబు [illegible]

మును [1]ప్రకారభేదకథనము సెలవిచ్చితివి, యని [2]సత్తరంబుగలసఘులార. 125

క. స్రోతస్సున [3]జీవగమన, హేతువగు దశావిశేష యోగంబునఁ దా
నీ తెరువు నొందు నని కనుఁ, డాతతమతులార కరణ మగు నది త్రోవన్. 126

వ. గుణత్రయంబునం ద్రోచుటయే యది ద్రోవవడునట్టిచిత్తవృత్తిత్వంబు లే కుండునని. 127

క. సాత్త్వికులకు దివము రజో, మత్వకలితవర్తనులకు మధ్యభువనవా
సత్త్వముఁ దామసులకు నీ, చత్వకరాధోజగంబు సంప్రాప్తమగున్. 128

క. ధర్మార్థకామగోచర, కర్మములకు సాత్త్వికాదిక ప్రకరవికా
రోర్ముంబు హేతువు లగు ని, ష్కర్మత కైవల్యభూతి కారణము సుఁడీ. 129

క. క్రమమునఁ బ్రాణంబు నపా, నము సత్త్వంబును [4]రజస్సు నాకుం జూడఁగా
యమిపతులార యుదానము, తమ మిట్టుల శ్రుతియు సువిదితంబుగఁ జెప్పున్. 130

క. జపమును దానము యజ్ఞముఁ, దపమును గర్మజనచిత్తదశలను సత్త్వా
ద్యుపహితములగుటనడచుం, ద్రిపథంబుల సాత్త్వికపుగతియ మేలెందున్. 131

క. వినుఁ డొక్కట దక్కట లే, క సంయమము నెనసి గుణత్రయంబును జూరే
వినుతావ్యక్తం బనఁగా, జనుసత్త్వము శివ మచలము శాశ్వతమనయన్. 132

క. సదసత్ప్రకారనిత్యం, బది దాని తెలియంగఁ నాతఁడు విజ్ఞా
నదశావధూతగుఁ డై, యదీనగతిఁ బొందఁ గను నిరామయపదమున్. 133

వ. అని యుపదేశించి విరించి వెండియు. 134

మనోబుద్ధ్యహంకారాదితత్త్వప్రకారము.

సీ. అవ్యక్తమునను మహత్తత్త్వ ముదయించు, నది బుద్ధి మతి ధృతి ఖ్యాతి సంస్మృ
దుపలబ్ధినామంబు లొంది యొంటును గని, విని చని భావించి విభుత నొప్పు
దాన నహంకారతత్త్వంబునకుఁ గల్గుఁ, బ్రభవంబు వినుఁడు తద్భావితాత్మ
కంబై ప్రవర్తించుఁ గార్యనీతుల లోక, మఖిలంబు వర్ణత్రయ ప్రజనితు

తే. లధ్యయనమును వ్రతమును నధ్వరంబుఁ
దపము మొదలైన క్రియ లందుఁ దగిలి నడచు
నెల్లఁ దద్వ్యాప్తిఁ జేసియు నెల్ల మింత
జగము రంజిల్లు దాని తేజంబువలన. 135

క. వినుఁ డా తత్త్వంబుల సం, జనితము లగు మేదినియును జలమును దేజం
బును వాయువు నాకాశము, ననఁగ మహాభూతములు నిరతిశయమహిమన్. 136

తే. తద్గుణంబులు నూరె గంధంబు రసము
రూపసంస్పర్శశబ్దముల్ రూఢభంగిఁ
బరఁగు నవ్విషయములఁ బొరలుబడ్డమనసు
గలుగుజంతువు మోహాంధకార మొందు. 137

---

[1] గ. ప్రకారభేదములు తెలిపి 2. గ. సదుత్తరంబు 3. చ. త్రిదివగమన 4. గ. రజస్సు తమమును నాఁడేగ సంఖ్య...

క. దీన సకలజంతువులును, లీనము లగు చుండుఁ దమయం దలీనస్మృతిధై
ర్యానూనం బగు నిర్మల,మానసమునఁ బొరయనీరు మహితార్యజనుల్. 138

క. విషయంబులు నశ్వరములు, విషసన్నిభములు సమగ్రవిశ్రుతిజనకముల్
ధిషణాగుణముల నెల్లఁ గ,లుషములుగాఁ జేయు మోహలోభకరములై. 139

ఆ. మాంసశోణితాస్థిమజ్జశరీరంబులఁ, దారు గాఁగ [1]లగ్నతలఁచునట్టి
కృపణజనులు వీనిఁ గీడు గానఁగ లేక, చిక్కి చెడుదు రింత నిక్కువంబు. 140

వ. పండితులు వీనిచేతం జెడ రని పలికి పద్మసంభవుం డిట్లనియె. 141

తే. అంతరాత్మ యనంగఁ బ్రాణాదిపంచ,కమును వాఙ్మనోబుద్ధులుఁ గా నిరూఢి
గలుగు నీయష్టకంబు లోకమున కెల్లఁ, దా నుపాదానకారణత్వమువహించు.

వ. ఇవ్విధంబునం గనుంగొనుట బోధంబునకు నిదానంబు. 143

సీ. వినుఁ డహంకారసంజనితంబు లగుచక్షు,రాదికబుద్ధీంద్రియములుఁ బాయు
ముఖకర్మేంద్రియములును మనంబును, నేకాదశేంద్రియాళి నిట్టి
డింది సందడిఁ బడి కుందక యుండెడి, యుంపేనిఁ దనవంక కీడ్వఁ జాలు
బుద్ధితత్త్వము గల్గుశుద్ధాత్మకుఁడు పర,తత్త్వంబు గనుటకుఁ దా వలంతి

తే. యని యెఱింగించి మఱియు నిట్లను నజుండు, స్వేద ముద్భిద మండమున్ వెనఁబుట్టు
నధమమధ్యమోత్తమదశలైన భూత, రాసు లత్యుత్తమములు జరాయుజములు.

వ. భూతతారతమ్యజ్ఞానంబు మానసీయంబగుటనిట్లు సెప్పితినధ్యాత్మాదులం జెప్పెదఁ
దద్వేదిత్వంబు విద్యామూలంబై యుండు నవధానంబుతో వినుండు. 145

క. అంబర మాది యనిల తే,జోంబుధరలు వరుసతోడ నగుఁ జూడ ద్వితీ
యంబుఁ దృతీయంబుఁ జతు,ర్థంబును బంచమము భూతతతి యట్లుండున్. 146

వ. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానంబులు గావున భూతంబుల మున్నుపన్యసించితి. 147

సీ. శ్రోత మధ్యాత్మంబు నారి శబ్దం బధి,భూతంబు దిశలు ప్రబుద్ధులార
యధిదైవతము చర్మ మధ్యాత్మ మంటలి,సంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు
దానికి నధిదైవతంబు విద్యుత్తు నే,త్రంబు దా నధ్యాత్మికంబు రూప
మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ,యధ్యాత్మకము రస మారయంగ

తే. దానియధిభూత ముడుపతి తదధిదైవ,తంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ
మంది తాధిభూతము తదీయాధిదైవ,తంబు మారుతమం డ్రువిద్వజ్జనములు. 148

వ. ఇది బుద్ధీంద్రియ ప్రపంచంబు. 149

సీ. పాదపాయూపస్థపాణివాగ్వర్గంబు, కర్మేంద్రియములు సత్కర్ములార
యధ్యాత్మములు వాని కగునధిభూతముల్, గంతవ్యమును విసర్గమును శుక్ర
మును గ్రహమువ్యక్తియై వినుఁడు కర్తవ్యవ, క్తవ్యంబులును నధిదైవతములు
బభ్రుమిత్రప్రజాపతిశక్రవహ్నులు, మఱి యహంకారంబు మనసు బుద్ధి

[1] క. శాల్మలఁ దమ 2, జ. బ్రుందక రొండగిలి యిన్నింటిఁ భ్రమ 4 బ్రుందక రొండగిలి యిరకమిత్త క.

తే. పూజితాధ్యాత్మకము లధిభూతవృత్తి
వెలయు నభిమాన [1]మంతవ్యములును నిశ్చ
యంబు నధిదైవతము [2]రుద్రుఁ డమృతకరుఁడు
బ్రహ్మ మిది వేదవాక్యనిర్ణయము తెఱఁగు. 150

ఆ. ఇట్లు తెలియనేర్చి యింద్రియంబుల నింద్రియార్థములను భూతసార్థములను దె
మల్చి చిట్లకుండ మనసున నొదిఁగించు, టనఘులార తనరు ప్రాపకంబు. 151

వ. అని నిర్దేశించి నీరజాసనుం డా సంయమివరులతో సూక్ష్మభావప్రసంపాదిని యా
శివయు నగునివృత్తి తెఱం గెఱింగించెద ననుమాట మున్నాడి యిట్లనియె. 152

సీ. కమఠంబు దనయంగకముల నెట్టులు కా, ముముక్షువు విద్వాంసుఁ డింద్రియముల దివుచుఁ
గామంబుల మరల్చఁగా నోపుధీరుండు, విరజస్కుఁడై ముక్తి తెరువు గాంచు
నింద్రియంబులు పదియుఁ గట్టిని గుదియించు, టెక్కునెవ్వెడి వదియు నింధనముగ
నాత్మాగ్ని వెలుఁగుభూతావలి నాత్మఁ గాంచు, నన సూక్ష్మతత్త్వదర్శనము గలుగు

తే. భూతపంచకజలధి రోగాతిశోక,సహితభోగలవాంశకాశ్రయము దీని
విభులు కాముండుఁ గ్రోధుండు వీరి గెల్వ, వచ్చినప్పుడ మఱది గడపంగవచ్చు.

ఆ. మనసు మనసునందు మడఁచి యాత్మని నాత్మ,యందు గాంచునట్టి యతఁడు సర్వ
విదుఁడు సకలభూతవితతియందును దనుఁ, గనుచు నుండు నిర్వికల్పకముగ. 154

తే. ఆత్మతత్త్వ మేకంబ దీపాంతరములఁ
[3]గలుగఁ జేయు ప్రదీపంబుకరణి నావ
హించు రూపాంతరముల నద్వ్యోమమును బు
ధుండు గనుఁగొని బ్రహ్మమయుఁ డగుం డొకట. 155

తే. ఆ పరంజ్యోతి పేళ్ళు సూర్యుఁడు వరుణుఁ
డనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ డజుఁడు శివుఁ డ
నంగఁ బరఁగుశబ్దములు సన్మతులు దానిఁ
బ్రయతు లయి భజియింతురు నియతులార. 156

వ. అని చెప్పి యచ్చతురాననుం డమ్మానసీయులతో మఱియు నిట్లను ధర్మంబునకు నహింస లక్షణం బధర్మంబునకు హింసయు దేవతలకుఁ బ్రకాశత్వంబును మనుష్యులకుఁ గర్మంబును నాకాశంబునకు శబ్దమును వాయువునకు స్పర్శంబును జ్యోతిస్సునకు రూపంబును జలంబునకు రసంబును బృథివికి గంధంబును భారతికి శబ్దంబును మనంబునకుఁ జింతయు బుద్ధికి వ్యవసాయంబును దదీయ మహత్తత్త్వస్వరూపంబునకు ధ్యానంబును నవ్యక్తంబునకు [4] సాధుత్వంబును యోగంబునకుఁ [5] బ్రవృత్తియును జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు లక్షణజ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు. 157

1. గ. సంకల్పములును 2. గ. వేధయమృతకి. 3. చ. గనఁగఁ జేయు 4. చ. సమత్వంబును 5. క. చ. ట. వృత్తంబును

వ. అని వివరించి యానమంచి తాచారులతోడ నాశ్రమప్రకారంబు లెఱింగించెద నని పలికి యి ట్లని యుపన్యసించె. 167

సీ. గురునకుఁ బ్రియహితకరుఁ డగుచు వేదాధ్యయన మొనరించుచు¹ నశన ముమల
భిక్ష ²నొనర్చుచు ✗ బిల్వపలాశదండములలో నొకటి ధార్యముగఁ జేసి
స్నానశీలుఁడు బ్రహ్మచర్యపరుండును, నియమితేంద్రియుఁడును ✗ సత్యశుచియు
యజ్ఞోపవీతియు ✗ నబహుభాషియు మేఖలాఢ్యుండు నై శయనాసనప్ర

తే. చారవిధములు సముచితాచరితములుగ, సత్యధర్మనిరూఢుఁడై ✗ శాంతి గలిగి
వేళ్మ యిరుప్రొద్దు నడపుచుఁ ✗ గల్మషంపుఁ బనుల, కెలయక వర్తించు ✗ బ్రహ్మచారి.

సీ. అర్హప్రకారసమావర్తనుం డయి, నిజదారనిరతుండు ✗ నిర్మలప్ర
చారుండుఁ బంచయజ్ఞపరుండు నతిథిశిష్టాశియు శుక్లవస్త్రాన్వితుండు
శక్త్యనుగుణదానశాలియు నపచలేంద్రియుఁడును శుచియు మైత్రీపరుండు
స్వాధ్యాయశీలుండు ✗ సద్వ్రతనిష్ఠుండు, నై యాజనంబు నధ్యాపనంబు

ఆ. శక్యమైనఁ జల్పి ✗ క్షమ గల్గి సత్ప్రీతి, గ్రహ మొనర్చి మిత్త్రి ✗ లహితు లనక
మాటకార్యమునను ✗ మధ్యస్థుఁడై గృహస్థుండు నడచు దురితదూరుఁడగుచు.

సీ. గ్రామంబు దొలఁగి యరణ్యస్థలంబునఁ
బర్ణశాలావాసపరత నొంది
స్నానతంత్రము రెండు సంధ్యల నడపుచు
బ్రహ్మచర్యవ్రతభాసి యగుచుఁ
బూరిపంటలు ఫలంబులు మూలములు శాక
సముదయంబును నశనముగఁ గొనుచు
నజినంబు వల్కల ✗ మంబరంబుగఁ గొని
శయనకృత్యంబు భూస్థలి నొనర్చి

తే. యతిథులకు నెడ యిచ్చి యాహారములను
భక్తి నాశ్రమములలోనఁ ✗ బంచి పెట్టి
యధ్యయనహోమశీలుఁడై ✗ యన్ని యింద్రి
యముల గెలిచి వానప్రస్థుఁ ✗ డతిశయిల్లు. 170

క. ఈ మూఁ డాశ్రమములలో, నేమిట వర్తించువార లేనియు ముక్తిం
గామించినఁ జొరఁ దగు వి,ద్యామూలాచారమైన యత్యాశ్రమమున్. 171

సీ. సర్వభూతదయానుషంగంబు గలిగి య, తీతవస్తువులఁ జింతింప కెద న
నాగతంబులమీఁద ✗ నాస సేయక వర్త, మానలబ్ధము లుపేక్షానిరూఢిఁ
గూర్చు చంగంబులఁ ✗ గూర్మ మొట్టు ల్లింద్రియముల లోనికిఁ దిగిచికొనుచు
సముచితకాలభిక్షాచర్య దొరకొన్న, యంతన నిజదేహయాత్ర నడపి

1. [illegible]

తే. గ్రాసమాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ డర్థి నెయ్యది యిచ్చిన నంద కేక
వారభోజి యగుచు నమస్కారసఖ్యనుతినిరాకృతిరహితుఁడై యతి వెలుంగు.

క. అనసూయయు నక్రోధంబును దమమును బ్రహ్మచర్యమును ఋజుభావం
బును సత్యంబు నపైశున, మ్ము నహింసయుఁ జూపె యతికి ముఖ్యవ్రతముల్.

తే. వృక్షమూలనదీతీరవిజననిలయ, విపినగిరిగుహానిత్యవివిక్తదేవ
సదనవాసియై కౌటిల్య[1]సాధ్యవస్తుసంచయము నుడిగి యతి సంచరించు.

క. తనమేలు ప్రకాశింపక, తినుఁ గనుఁగొను నట్టిజను లుదాసీనతమై
మునికిఁ దగియెడుచందం, బున వర్తించుయతి సర్వముక్తత నొందున్. 175

వ. అని యెఱింగించి మఱియును. 176

సీ. సన్న్యాసమునఁ దపశ్చరణంబు పేరు తపోజ్ఞానముక్తిప్రబుద్ధులైన
జనము లచింత్యం బజర మమృతంబు నా, నెఱుఁగుతత్త్వము గండ్రు వీతకామ
సము నవధూతరాజసము నై శుద్ధసత్త్వాశ్రయం బగుహృదయంబు గలుగు
వారు తపోవృత్తివలన సుక్షేమమార్గంబున నడతు రేకత్వబోధి

తే. మహితనానాత్వ మనఁగ సమస్తభూత
సముదయస్థమై యున్నతత్త్వము ప్రకాశ
మగుట నఖిలగతులఁ దోఁచునవ్విధంబు
గలుగుబుధుఁడు నిర్ద్వంద్వుఁడై కాంచు ముక్తి. 177

వ. అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిటపంబును మహాభూత
పశాఖంబును నింద్రియకోటరంబును [2]సంతతాశాపల్లవంబును శుభాశుభఫలం
బును నై సంసారవృక్షం బొప్పుచుండు. 178

క. జ్ఞానాసి నది నఱికి యభి, మానాహంకారదూరమతి యగుపురుషుం
డానంత్యము ప్రస్ఫుటముగఁ, గానంగా నేర్చు విగతకల్మషులారా. 179

ఆ. అనిమిషమైనఁ బరమనియతి నాత్మని నాత్మ
యందు కనినఁ దెలివి [3]నారఁ బడసి
బోధమహితమునులు పొందునవ్యయగతిఁ
బొందఁ గండ్రు ప్రకృతిఁ పొందు దొఱఁగి. 180

ఆ. పరమసంయతి యనఁగఁ బ్రాణసంయమనంబ, యది క్రమాభివృద్ధిఁ జలపరింప
గాఁ బ్రసాదసిద్ధి గలిమి ధ్రువం బవ్వి, శేషకలన మిష్టసిద్ధిఁ జేర్చు. 181

క. అవ్యక్తతత్త్వజాతము, భవ్యము తత్త్వంబు దురితపంకహరం బై
యవ్యయ మమృత మనింద్రియ, భావ్యం బగుతత్త్వ మొందఁగఁ బ్రాఁ కగుఁ జూండీ.

వ. కావున. 183

తే. సత్త్వభావన కంటెఁ బ్రశస్తమైనకృత్య మరయంగ లేదండ్రు నిత్యవస్తు

1. గ. కౌటిల్యవస్తు. 2. గ. సంతతపర్ణపుష్పంబును; చ. సంతతశాద్వలంబును. 3. [illegible]

సమ్యగధిగమసిద్ధికి ✽ సంయమప్రసిద్ధు లాగమతంత్రప్రసిద్ధులార. 184

క. వినుఁడీ సత్త్వస్థుఁ బురుషుఁ, గనుఁగొను టనుమానసరణిఁ ✽ గాని మనము ద
క్కిన తెఱఁ గేమిట నైనం, గనుఁగొనియెద మనుట వెరవు ✽ గా కుండుఁ జుఁడీ.

సీ. ఇట్లగు నెట్లనియెదరేని సత్యంబు, సంతోషమును నహింసయును ధృతియు
క్షమయు నార్జవమును ✽ సన్న్యాసమును బరి, త్యాగంబు విజ్ఞానయోగదశయు
సాత్త్వికంబులు గాన తత్త్వవిజ్ఞులు యీ యనుమానమునఁ బురుషాధిగమముఁ
బడయుట యొప్పెడు పదమందు సత్త్వంబుఁ, బురుషుండు నొకఁడను బుద్ధి గొంద

తే. ఱార్యు లూఁదుదు రట్లేల ✽ యగు నుదుంబ
రమున మశకమ్ము వారి మీనమ్ము వసించు
నట్లు సత్త్వంబునం దంతరాత్ముఁ డుండుఁ
గాక యనియెడివారు పెక్కండ్రు గలరు. 186

వ. అనిన విని యమ్మునులమ్మహాత్మునితో ధర్మంబు లనేకవిధంబులు వీనిలో నెవ్వం
డెయ్యది యవలంబించె నదియ వాఁడు మేలను నేమన్నింటిమీఁదనుం బరఁగిన
బుద్ధులు గలిగి యనిశ్చయదర్శనుల మయి యుండుదు మిది ప్రధానానుష్ఠేయం
బని యుపదేశింపవలయు సత్త్వపురుషసంబంధప్రకారంబును బ్రస్ఫుటంబుగా
నెఱింగింపు మనుటయు వారికి వారిజాసనుం డిట్లనియె. 187

సత్త్వం బవశ్యానుష్ఠేయంబుగా నిరూపించుట.

సీ. సకలధర్మములలో ✽ సర్వభూతాహింస, మేటి యహింసాపరమేతుఁ డైన
వానికి నుత్తమజ్ఞానోదయం బగు, నది మోక్ష మొనరించు ✽ ననఘులార
కోరిక మొయిఁ గర్మ ✽ కారి యయ్యెడువాఁడు, పొందు గతాగతంబుల ఫలాభి
లాషంబు లేక నిర్దోషత మే లాచరించిన ముక్తి సిద్ధించు వినుఁడు

తే. విషయి పురుషుండు సత్త్వంబు ✽ విషయ మిట్లు
భోక్తృభోజ్యత్వసంబంధమునఁ బొసంగి
యుండియును బద్మపత్త్రపయోలవంబు
కరణి నతఁడు తత్సంగంబుఁ ✽ బొరయ కుండు. 188

క. సత్త్వము ప్రదీప మాపర,తత్త్వముఁ గాంచుటకుఁ గాన ✽ తత్సాధనతా
[1]తత్త్వము వదలక చిత్తసు,ఖత్వాకలిత మగు నెలవుగండ్రు కృతాత్ముల్. 189

చ. అది సదుపాయ మొందును నుపాయసమగ్రత లేమి నేర్పు ద
భ్యుదయము దూరమార్గమునఁ ✽ బొందెడు భద్రము వాహనాఢ్యుఁడుం
గది నెఱి నుత్తరించి కను నందము నౌసహితుండుఁ గాంచునో
ప్పిదము విసాధనుం డయినచో నిటు లొందఁగ నేర్చుఁ జెప్పుఁడా. 190

ఆ. ఇట్టు లగుట యొకఁగి యొకఁగి యేనియును న్రయింగ కేని బలిమి నెక్కొచ్చు గడిగి

1. గ. సత్త్వము...చిత్త్వసుఖ.

చేయుపని ఫలంబు సిద్ధింపకుండుట, కొలఁదిఁ బోక దుఃఖములును గలుగు. 11

క. స్థలపథమునఁ బోతమ్ము, జలమార్గమునందు వాహనము విని రౌద్ర్యం
బులు గావి మ్మెయి సాధనకలనవిభాగజ్ఞుఁ డైనఁ గడచు దురితముల్. 192

వ. అని చెప్పి. 193

తే. తటినిఁ దగ నుత్తరించుసంగతికను బోత
మాదరించి తక్కొల్లనిక్కముట్టు పురుషు
దర్శనము సంభవించుసంగతికను సత్త్వ
మాది విడుపఁ దత్సంబంధ మడఁగుఁ దనిరి. 194

వ. ఇట్లుపదేశించి మఱియు నిట్లను నవ్యక్తంబుగుణంబు మహత్తత్త్వంబు మహత్తత్త్వగుణం బహంకారం బహంకారగుణంబులు మహాభూతంబులు మహాభూతగుణంబులు శబ్దాదులం దాకాశంబునకు శబ్దంబు గుణంబు వాయువునకు శబ్దస్పర్శంబులు గుణంబులు తేజస్సునకు శబ్దస్పర్శరూపంబులు గుణంబులు జలంబునకు శబ్దస్పర్శరూపరసంబులు గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధంబులు గుణంబులు శబ్దంబు మృదుఖరాదిబహువిధభేదంబులు గలిగి యుండు స్పర్శంబు శీతోష్ణముఖ్యవివిధప్రకారంబులం బరఁగు రూపంబు శుక్లకృష్ణప్రభృతినానావిధంబులం జను రసంబు మధురతిక్తాదిప్రచురభంగుల నడచు గంధంబు సురభితీక్ష్ణప్రముఖానేకవిశేషంబుల వర్తించు నిట్లు పెక్కుచందంబులం జెల్లువిషయంబుల తెఱం గెఱుంగుట వానిం దొలంగుటకుం దోడ్పడం జాలు నని చెప్పి వెండియు.

ఆ. భూమిముఖచతుష్కమునకంటెఁ బవి యహం, కారతత్త్వ మంతకంటెదాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కు,డన్నిటికిని బురుషుఁ డధికుఁ డరయ. 916

క. భూతముల తారతమ్యము, చేతోగత మైనయట్టిశిష్టజనము ప్ర
ద్యోతితుఁ డగుపురుషుఁ గని ని, రాతంకావ్యయపదంబుఁ బ్రాపింపఁ గనున్.

సీ. పంచభూతంబులఁ బరఁగింపఁ గుదియింపఁ, జాలుదక్షత వానిఁ జేలుప్రభుతఁ
దనరు మనంబు రథ్యముల సారథి యట్లు, లట్టింద్రియంబులఁ దా నేగ నడప
నదియ పలంతి భూతాత్మకంబును బుద్ధిసనాహమును మనస్సారథికము
నింద్రియాశ్వము నైనయాద్యరథంబున, నభిమతిగతి నంతరాత్మఁ డెందు

తే. నలమివర్తించు నిట్లగు టెఱుంగుబుధుఁడు, ఘోరసంసారమహావ్యాఘురశులోను
గాక నిర్గుణపథమున నగ్గాలి కను ని, రామయము నవ్యయంబును నగుపదంబు.

వ. అని పిలికి మఱియును. 199

క. శరనిధితరంగలభంగిం, బోరిఁబోరి నవ్యక్తమునఁ బుట్టు నడంగున్
సురనరభుజగేంద్రముఖ, చరాచరానేక భూతజాలంబు లెల్లన్. 200

క. అవ్యక్తాదికసకలము, నవ్యయుఁ డగుపురుషుఁ డాత్మయంబుగఁ బరగున్

సువ్యక్తంబుగ నిది గను, భవ్యులు వడయుదురు మోక్షసంపదవిభవ ప్రాప్తిన్. 201

క. విను దక్కనుటకు మూలం, బనఘం బగుదపము యశోకట సమ్యక్సత్కో
ధనసమ్యగ్విధసముపార్జనం బవశ్యంబు వలయు సన్మతులారా. 202

సీ. భూరితపంబునఁ బ్రజారె ప్రజాపతుల్, బహువిధసృష్టిసర్గనాయకు
లైరి వన్యంబు లాహారంబులుగఁ దప, మాదరంబునఁ జేసి రాజమునులు
కాలత్రయంబు లోకత్రితయంబును, గాంతురు విప్రులు గౌరవంబు
లొదవఁ దపంబున నొంపువిధంబులఁ, బడయుదు రానియుత్కృష్టపదంబు

తే. లచ్చు మైనతపంబున వచ్చుఁ బడయ, బ్రహ్మవధమద్యపానాదిపాతకంబు
లెల్లఁ బాయు దపఃకృతి నిద్ధతపము, పేర్మి సర్వభూతంబులుఁ బ్రీతిఁ బొందు.

క. మమతాహంకృతిసహితత, పమునఁ బ్రజాపతిసమీపస్థభవ్యపదము సం
యమి వొందు నిందు సందేహ మొకింతయు లేదు నిర్మలాత్మకులారా. 204

క. మమతాహంకారవిము, క్తము శుద్ధము నైనయచలితధ్యానముతో
సమవేతం బగుతపమున, యమి గను సకలోత్తరావ్యయపదప్రాప్తిన్. 205

వ. అని చెప్పి వెండియు. 206

క. తమము రజస్సుఁ దొఱఁగి స, త్త్వమునన రమియించి యగుణతత్త్వము గని స
త్త్వమును దిగవిడుచు వైరాగ్యమహితుఁ డగు మునివరుం డకల్మషులారా. 207

క. పరమం బనంగ వేదాం, తరహస్యాత్మత వెలుంగుతత్త్వము నిక్కం
బరయఁగ క్షేత్రజ్ఞుఁ డనఁ, బరిణతి గలయతఁడు సర్వపదవిదుఁ డనుఁడీ. 208

క. వృత్తివిశేషమునఁ జలిన, చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా
నత్తెఱఁగునకుం దివియుమి, యుత్తమపురహస్య మండ్రు యోగమున మునుల్.

క. వినుఁ డవ్యక్తాంతం బగు, పని యొల్ల నవిద్య నొలయు బంధము మమతం
బనుపడిన మృత్యు వమృతం, బనఁ జనునది నిర్మమత్వ పూరఁ గలిగినన్. 210

సీ. కర్మముల్ మేలండ్రు కర్మతత్పరులు బుద్ధాత్ములు విద్య వర్యత నుతింతు
రవి షోడశవికార యగుమూర్తిఁ గల్పించు, నది నిత్యుఁ డగ్రాహ్యుఁ డనవెలుంగు
పురుషునిఁ [1]దోఁచించు నరయంగఁ గర్మము, తత్త్వంబు లేమి విద్యామయత్వ
మతనికి నైజమై యతిశయిల్లుట శ్రుతి, సాటు నిత్తెఱఁగు సుజ్ఞాన మేమ

తే. హాత్మునకుఁ గల్గి యుండు నయ్యార్యవర్యుఁ
డఖిలసంకల్పములఁ బాచి యాత్మ నాత్మ
యంద కాంచి యనామయ మజర మమృత
మనుపదమ్ముఁ బ్రాపించుఁ గృతాత్ములార. 211

వ. [2] (అని యిట్లు కమలగర్భుండు.) 212

క. జ్ఞానపరినిష్ఠితాత్మకు, లైనవిముక్తిపదనిర్ణయజ్ఞులచే స

---

1. తోఁచెంచు 2. ఈ వచనము పెక్కింటఁ గానరాదు.

మ్మానిత యగుఁగతి యిది [1]క,ర్మానుగతివిరక్తజనసమంచితసుండీ. 213

వ. అని నిర్దేశించి కొండియు. 214

క. కోరికలకుఁ జొరక యసం,గారాధత గలిగి యెల్లయెడ నంతమును సమతం
గూరినచిత్తంబులు గల,సారాత్మకు లీ పథమునఁ జనుటకు శక్తుల్. 215

క. చెప్పితి సర్వంబును నీ, [2]చొప్పున నడవుఁ డెడ నొండు సొరనీకుఁడు మీ
కొప్పెడు తెరు విది దీనం, దప్పదు పరమపదసిద్ధి ధార్మికులారా. 216

క. అని యిట్లు కమలగర్భుఁడు, మునులకుఁ దత్త్వోపదేశమును జేసిన వా
రనవద్యసమాధికులై, యనితరసులభ మగుసౌఖ్య మందిరి వత్సా. 217

వ. అని పలికి గురుండు శిష్యునితోడ. 218

క. నీవును నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి [3]పరమసమాధి
శ్రీ వాటింపుము నిత్యప,దావాప్తి ఫలించు నీ కనాయాసమునన్. 219

క. అని గురుఁడు ప్రబోధించిన, మనమునఁ దెలి వొంది తత్సమంచితమార్గం
బున నడచి పొందె శిష్యుం, డనామయం బజర మమృత మనిమొదుపదమున్.

చ. అని వసుదేవసూనుఁడు సమాదరమేపురచి తత్త్వవృత్తిఁ జె
ప్పిన విని వారియుల్లములు పెంపిటు లుండున వార లెవ్వరో
వినుటకు నాదుడెందమున వేడ్క జనించె నెఱుంగఁ జెప్పవే
యనుటయుఁ బార్థుమోముఁ గృప నమ్మహితాత్ముఁడు సూచినవ్వుచున్. 221

క. అనఘ విను మే గురుఁడ నా,మనంబు శిష్యుండ విమలమానస నీపైఁ
బనుపడు ప్రీతిం జెప్పితి, ననితరసులభాతిగుహ్య మగునిప్పదమున్. 222

క. విమలము నచలము నగుచి,త్తము నాదెస నేకభక్తితత్పరముగఁ జే
యుము నిత్యము నీయధ్యాత్మము ననుసంధింపు పాసెదవు దురితములన్. 223

క. సమరమునప్పుడు నీ కీ,యమృతపదప్రాప్తిహేతు వగుసమ్యగ్బో
ధము వివరించితి నచలత, రమింపు మిందెవుడు శమధురాధుర్యుఁడవై. 224

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణున కధ్యాత్మవిద్య వివరించె నని చెప్పినఁ బరమగురుం
డును విశిష్టశిష్యుండును నగునప్పురుషవరులు మఱియు నెవ్విధంబునం బ్రవర్తించి
రాకర్ణించుకౌతుకంబు నామనంబున నెసకం బెసంగెడు మునీంద్రా యెఱింగిం
పవే యని యడుగుటయు. 225

చ. పరమదయావిధేయ పరిపాలితవేదకలాప [4]పక్వని
ర్ఝరశమనూత్మతాతనువిభాసిత పన్నగతల్పభూషణా
దరభరితా పవిత్రపదతామరసస్మరణా పరాపర
త్వరహిత పద్మజాదిసురవందిత పశ్చిమనాళనందితా. 226

1. గ. కర్మానుమతివిరక్తి. 2. గ. చొప్పునదవుఁడెడఁదనొండు 3. ఖ. పరమసమాధిన్. 4. గ. పక్వనిర్ఝర.

క. వినుతచతుర్వర్ణకసం, జనకముఖభుజోరుపాద ॥ సంవిదభేదా
మునిహృత్కమలమరాళా, జననమరణహరణచరణ॥సరసిజలీలా 227

మాలిని. వదనమదమరాలీ ॥ భక్తసంపోషశాలీ
విదళితసురవైరీ ॥ విశ్వలోకైకధారీ
మదరహితహితైషీ ॥ మాన్యయోగప్రతోషీ
సదవనపరచిత్తా ॥ సర్వనిర్మాణవేత్తా. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున యశ్వమేధపర్వంబునందు ద్వితీయాశ్వాసము. 229





హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

అశ్వమేధపర్వము, తృతీయాశ్వాసము.



శ్రీసుతశాస్త్రమహితవి
ధానుతకిశల్యలసల్లతావేష్టనహే
లానిత్యశాద్వలతరు
చ్ఛాయానుగుణఫలప్రదత్వ హరిహరనాథా. 1

—తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁ డడుగుట.—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ఫల్గును నఫల్గువిద్యా విశారదుం జేసి శౌరి యతనితోడ. 2

క. నా చిత్తము వసుదేవునిఁ, జూచుట కోరియును నీవు సుమనోవృత్తిం
జూచి యనుమతి యొసఁగుట, వేచినయది నన్నుఁ బుచ్చవే ద్వారకకున్. 3

చ. అనవుడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ ని
ట్లను నటు లేనిఁ బోవలయు హస్తిపురంబున కేఁగి యందు చె
ప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్ని వుచ్చు న
య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా. 4

వ. అనిన విని దామోదరుండు దారుకు రావించి రథంబు పూన్పుమని నియోగించె నదనంతరంబ ధనంజయుండు దమతోడం జను దేరం దగు పరివారంబు సమకట్టం బడవాళ్ళం బనిచె నొక్కింత సేపునకు దారుకుండును దేరాయితంబు సేసి తేరం బడవాళ్ళునుం బరిజనంబుల సన్నద్ధులం గావించి సన్నిహితుం జేయ నా కృష్ణార్జునులు ప్రయాణోచితాలంకారాలంకృతులై రథం బెక్కి కరినగరంబు పథంబు గైకొని చను సమయంబున. 5

. ఎనయ మారంగ గోవిందున కిట్లను, గాండీవి దేవకీకరుణఁ జేసి
కౌరవసైన్యసాగర ముత్తరింపంగ, గంటిమి గురుభీష్మకర్ణముఖ్య

దుర్జయవీరులఁ గ నిర్జించితిమి నీవు, శాత్రవయోధులఁ గ సమయఁ జేయ
వెనుక నేము జయంబుఁ గొనుచు వచ్చితిమి తేజంబును జేసి సౌఖ్యంబు నతుల

తే. మైనభవదీయసుప్రసాదాతిశయము, కతనఁ బడసితి మప్రతిహతమహర్ధి
రాజ్యసంపూజ్యుఁ డయ్యె ధర్మజుఁడు సంశ్రి, తాభిరక్షణవ్రతనిరతాంతరంగ. 6

క. నీమహిమ వొగడఁ గొలఁదియె, దామోదర విశ్వసంవిధాతవు భవదీ
యామలతేజము యగ్నిష్టో మము కాలాత్మకత్వశోభివి కృష్ణా. 7

క. భవదీయశ్వసనము వాయువు నీక్రోధముఁ బ్రసాదరోగంబును మృ
త్యువు లక్ష్మియు నీవలనన, యవుఁ బ్రీతియు మరణమును మహానందంబున్. 8

క. స్థావరజంగమమగుజగ, దావిర్భావస్థితిక్రియావిలయంబుల్
నీవలనన యగుచుండును, భావాతీతుఁడవు సర్వపతివి ముకుందా. 9

వ. అని పొగడియు. 10

కృష్ణార్జును లింద్రప్రస్థమునుండి హస్తినాపురంబునకు వచ్చుట.

క. నారదదేవలకౌశిక, పారాశర్యాదిమునులపలుకుల భీష్మో
దారవచనముల నిను నఘ,దూర యే నెఱిఁగి యుండుదును సకలముగన్. 11

వ. కావున. 12

క. నావలనికరుణపెంపున, నీవు ప్రసాదించినట్టి నిరవద్యకవి
ద్యావిస్తారంబున దృఢ, తావిశదమతిఁ దమించ్వేఁడం గ్రతుపురుషా. 13

వ. అని యిట్లు సభక్తికంబుగా సంభాషణంబు సేసిన వాసుదేవుండును వితతా
దరవాక్యంబుల నభినందించె నప్పురుషవరు లట్లు సల్లాపంబులు సేయుచుం
బోయి తమరాకకు సమలంకృతం బైన సామజపురంబు ప్రవేశించి ధృతరాష్ట్రు
మందిరమున కరిగి యక్కురువృద్ధుని గాంధారిని బ్రణామవినయవిశే
షంబులం బ్రీతులం జేసి కుంతీసమారాధనం బాచరించి విదురధౌమ్యయుయుత్సు
సంజయులదర్శనంబులు సముచితప్రకారంబుల నడపి కౌంతేయాగ్రజు నత్యంత
భక్తిపూర్వకంబుగా సముచితవిధంబునం గాంచి తదాలింగనాద్యాదరణం
బులు వడసి పద్మనాభుండు నాఁడు సవ్యసాచిసదనంబున నతనిచేయు
పూజావిధానంబుల మానసం బలర వసియించి మఱునాఁడు మహనీయాస్థాన
మండపంబున నున్న యన్నరేంద్రునకడకు నయ్యింద్రసుతుండు దోడన చనంజని
సుఖగోష్ఠి నుండె నట్టియెడ నగ్గాండీవి యప్పాండవపూర్వజునాననంబునం జూడ్కి
నిలిపి నిభృతుండై. 14

తే. కమలనాభుండు పెద్దయుఁగాల మిచట
నున్నవాఁడు తండ్రియును సహోదరాది
సకలబంధులు నితనిదర్శనము గోర
కుతుకు రే వారిఁ జూడ నీక్ష తలఁచెఁ గోరె. 15

క. ద్వారకకు నిమ్మహాత్ముఁడు, మీరనుమతి సేయఁ జని యప్రమేయగుణుల నా
సీరిని వసుదేవునిఁ గని, గౌరవ మెసఁగంగఁ దల్లిఁ గాంచి ముదమునన్. 1

క. తక్కటిసోదరుల సుతుల, నక్కజపుఁ బ్రియము మీరఁ జేర్చి యప్పురజనులన్
మిక్కిలి మన్నన మక్కున, నెక్కుడుగా నాదరించి నిలువక మగుడున్. 1

సీ. దేవర యిప్పని దీక్షాధిష్ఠితంబునఁ, జూచి మీ కెట్టులు నూడఁ బోలె
నట్టుల యుత్తరం బొసఁగ నిత్తుఁగాక నావుడు నధిప ప్రియమున
మాతులుఁ గాంచి యమ్మాధవదేవుండు, మనమారఁ గాఁగ నమస్కృతులును
నాలింగనంబులు నాచరించి హలాయుధుని దేవకీదేవిఁ గనినయపుడు

తే. భక్తిమనకునై పూజించి బంధుజనుల, నందఱను దత్తదౌచిత్య మభినుతముగ
నాదరించి వారలకుఁ గుశలానుయోగ, విధము సత్కృతమ్ముగ విస్తరించి. 18

క. పరిజనయోగక్షేమము, లరసి పురజనమ్ములకుఁ బ్రియం బెసఁగఁగ వా
క్యరచనలుం గార్యసమా, చరణములు నొనర్చి నడపి సఖసత్కృతులున్. 19

తే. మఱియు వలయుకృత్యంబులఁ దెఱఁగుపఱుప
వలసినన్నిదినంబులు నిలిచి యశ్వ
మేధమునకు బాంధవజనమిత్రభృత్య
వర్గసహితుఁడై చనుదెంచువాఁడు గాక. 20

క. అని ధర్మజుండు పలికిన, విని కృష్ణుఁడు సంతసిల్లి వినతుండై గొం
తిని ద్రౌపది దగుమెయి వీడ్కొని తాను సుభద్రఁ దోడుకొనిపోవుటకున్.

వ. గొంతి కౌంతేయుం బ్రియంబున ననుజ్ఞసేయుటయు నర్జుననుమతియుం గొని.

తే. వివిధవాహనారూఢులై విభవ మెసఁగఁ, బాండవేయులుఁ దక్కనబంధుజనులు
ననుపరాఁగ సాత్యకిదోడ్కొనరుగుదేరఁ, బురము వెడలి రొక్కెడ నిల్చి కరము నెమ్మి.

క. సముచితభంగుల నందఱఁ, గ్రమమున వీడ్కొని పథంబు గైకొని తనచి
త్తము దృష్టియుఁ బాండవమ, ధ్యముపై నొలయంగ నల్లనరుగుచు నుండెన్.

ఆ. అట్లు మరలిమరలి యర్జునుం జూచుచు, జనఁగ నతఁడు చూడ్కి చనినయంత
దవ్వుఁ జూచు చుండె నవ్విధంబున సితాంబురుహలోచనుండు వోవునపుడు. 25

క. సరసన సాత్యకి రుచిరపుటరదంబునఁ జనియె వెనుక నలఁతిరథముపై
నరిగె సుభద్రయు నిమ్మెయి, నరుఁగ హరిమీఁద నింద్రుఁ డలరులు గురిసెన్.

క. పవనుం డనుకూలత మెయిఁ, బ్రవరితుం దద్యో వతిశుభప్రదభంగుల్
వివిధములు మఱియు ధరణీధవ తోఁచె నిమిత్తములు నితాంతస్ఫుటతన్. 27

— శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమమునకుఁ బోవుట. —

వ. అట్లు వోయి పోయి మార్గంబు కెలనం జేరువ నుదంకాశ్రమంబు గని
యందుఁ జని వినయం బొప్ప నమ్మునిం గని యతనిచేయు నతిథిసత్కారంబులం
బ్రియం బంది యుచితనిశాల నాసీనుండయ్యు యున్నంత నతఁడు దవ్వులం

కిట్లనియె. 28

చ. భరతులపాలి కేఁగి తగఁ - బాండవకౌరవబంధుభావసం
గరము దృఢంబు సేసియు సుఖస్థితి రాజుల వారివారివి
స్ఫురితమహాధిరాజ్యముల - చొప్పల నిల్పితె పక్షపాతితా
దురితము లేని నీవు జన - తోషవిధానవిశారదుండ వై. 29

వ. అని యిట్లెఱుంగనివాఁ డయి యడిగెడునట్లపోలె నిందాగర్భంబుగాఁ బలికినం బద్మనాభుండు దానును దాని నెఱుంగమి భావించి యా భార్గవునాననం బాలోకించి. 30

చ. కర ముచితంబుగాఁ బలికి - గర్వపుమాట నదల్చి భీతికిం
దెరు వగునట్లు చెప్పి కను - దీనత దోఁపగ నాడి సంధి క
క్కురుపతిఁ దమ్ము పోవు మొన - గొల్పగఁ జాలన నాకు భీష్ముఁడు
న్గురుఁడును దోడు చెప్పిరి మును - ల్ బహుభంగుల నొత్తి రత్తఱిన్. 31

వ. అతిలోభంబునం జేసి వంశధర్మంబు విడిచి యెవ్విధంబులను సంధికిం జొరక కురుకుమారులు పాండవులతో భండనం బొనర్చి సబంధుపరిజనంబుగా మరణంబు నొంది యుత్తమలోకంబుల కరిగి రిక్కడఁ బాండునందనపంచకంబు దక్కం దక్కటివా రెల్ల నట్ల పోయిరి కాలనియతి గడవ నెవ్వరికిని శక్యం బగునే యనిన విని రోషకషాయితంబు లగు తారకంబు [1]లుద్వృత్తంబులు సేయుచు నత్తపోధనసత్తముండు. 32

క. కౌరవకులమున మిథ్యాచారుఁడ వై త్రుంచి తకట - శక్తుఁడ వయ్యున్
నేరమిమైఁ జేయవ పొం, దారఁగ నిక్కిల్బిషమున - కంటటికిఁ దగన్. 33

వ. ఘోరప్రకారం బగు శాపంబు నీకిచ్చెద ననిన నచ్యుతుం డామునితో నామాటలు దేటపడ విని తగినయట్లు సేయుదుగాక యని పలికె యిట్లనియె. 34

చ. కినియుట మాను మేలె ముని - కిం గుపితత్వము శాంతవృత్తి నా
యనునయ మాదరింపు విను - మల్పతపంబులచేతఁ గోలుపో
దునె మఱియట్లుగాక యతి - దుష్కర మైన తపంబు సంచితం
బనఁ దగు బ్రహ్మచర్యమును - నాఁటిఁ బోవ కటా శపించినన్. 35

వ. అనిన విని యుదంకుఁడు శ్రీవత్సాంకు నవలోకించి. 36

క. అగుఁగాక నీవు సెప్పెదు, తగ నెయ్యది సెపుమ వినియెదం బోలిన నే
మగిడించెద శాపోన్ముఖ, మగుమన్మానసము ననుడు - నల్లన నగుచున్. 37

చ. తమము రజస్సు సత్త్వము ను - దంక మదీయవశప్రవర్తమా
నములు మరుద్వసుప్రభృతినాకిచయంబు మదుద్భవంబు స
ర్వమునను నేను నిల్తు సుఖవాసత నన్ దగఁ జెంది నిల్చు స

1. గ. [illegible]

ర్వము విను మేన చూపె యుపస్కరంబు పరం బనఁ గల్గు తత్త్వముల్. 38

తే. ప్రణవముఖవేదములుఁ జతుర్వర్ణములుఁ జ
తుర్విధాశ్రమములును దత్తత్సర్వకర్మ
జాతములును సముచితస్వర్గమోక్ష
ములును మన్మయములు గాఁగ దెలిసికొనుము. 39

క. క్రతుపరులు నన్ను దగ సంస్తుతించి ఫల మందఁ గందు రదోషయుతులు స
మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ, గృతాత్ము లగుదురు మదీయకీర్తనపరులై. 40

క. మానసు మదగ్రపుత్త్రుం,గా నెఱుఁగుము ధర్ము నిని జగద్రక్షకు నై
యే నభిమతకాలములను, [1]మానితజన్మముల నొంది మనుతుఁ దపస్వీ. 41

క. భవవర్ధనవిలయంబుల, నవలీలన వరుస బ్రహ్మ యనవిష్ణుఁ డనన్
శివుఁ డన నిర్వర్తింతును, భువనంబుల నేన చూపె భూరిమహిమలన్. 42

క. ధర్మంబు కలఁక గాంచి య,ధార్మికులం బొలియఁ జేసి ధార్మికులను జే
రర్మిలి రక్షింతు నుచిత,కర్మాచరణముల నె జగద్ధితమున కై. 43

వ. అట్టివాఁడ నయి యుండియు నధర్మపరు లగు ధార్తరాష్ట్రుల నత్యంతధార్మికులగు ధర్మనందనాదులతోఁ గలుపుటకుం బలుదెఱంగులం బసితి నది దివ్యజ్ఞానదేదీప్యమాను లగు పారాశర్యప్రభృతిమునివరులచిత్తంబుల కెక్కె నక్కౌరవులు దమ దౌరాత్మ్యంబున మాహాత్మ్యవంతు లగు నాకొంతేయులం దొడరి ధర్మసమరంబున సమసిరి నాచేసినపని యిట్టిది నన్ను నుదంక నీ వింక నేమని యొద నను
మని పలికిన నతండు వినతుం డగుచు నిట్లనియె. 44

ఉ. ఇప్పుడు నీమహామహిమ యేర్పడ సమ్యగనుగ్రహంబునం
జెప్పినయాసముచితవిశేషము లెల్ల నెఱుంగుదున్ మదిం
గప్పిన యా దురాగ్రహపుగర్వము నీ వొసఁగంగ నాకు ము
న్చొప్పడియెన్ సుధాసదృశసూక్తులఁ దేర్చితి వీవ యచ్యుతా. 45

వ. అని వెండియు. 46

ఆ. అతుల మైననీదయామహిమకు నేను, బాత్ర మగుదు నేనిఁ బద్మనాభ
యనుపమానతావకాకృతిఁ జూపవే, నాకుఁ జూడ్కియును మనంబు నలర. 47

కృష్ణుఁ డుదంకునకుఁ దనవిశ్వరూపంబుఁ జూపుట.

చ. అనుడు దయాళుఁ డైనహరి యర్జునుఁ జూచినదివ్యమూర్తిఁ జూ
పినఁ గని సంప్రమోదమును భీతియు విస్మయముం బెనంగొనన్
మునిపతి పాణిపద్మములు మోడ్చి నమః పురుషోత్తమాయ తే
యనుచు వినీతి నమ్రముగ నంగము నివ్వెఱ నిశ్చలంబుగన్. 48

వ. ఒక్కింత నిలిచి నిభృతస్వరంబున. 49

1. క. జ్ఞానిజననముల నొందినదడఁతుఁ దపస్వీ

చ. అనవుఁడు కృష్ణుఁ డిట్టు లను నాఁడడిగెదో ప్రయత్న మెల్ల నీ
వనఘ యెఱుంగ వైతి సకలార్థము బోఁకఁ డిమ్మి యిఁ గల్గె నేర్పడ
న్వినుము నిలింపవల్లభుని ♦ నీకును వేఁడితి నే సుధారసం
బనితరసాధ్య మెంచ శుభ ♦ వాక్యుఁడు భూతి దొలంగె నక్కటా. 59

వ. అది యె ట్లంటేని. 60

క. ఏను సుధ యిమ్మంటన హరి, మానవులకు నేల యను నదియు ర్త్యత్వము మే
లైన తెఱఁగొంత నోయు, దానిం దగ నిచ్చెదను ముదం బారంగన్. 61

వ. అనిన నయ్యనిమిషపతి మానసం బాలోకించి. 62

క. నిను వేఁడుట మోఘముగాఁ, జనునే యొల్లని నాదుర్వచనము సెఱప క
మ్మునిపతికి నచ్యుతరస మి, మ్మని ప్రార్థించిన మహాత్మ ♦ యాతఁడు నాతోన్. 63

వ. సమయంబు సేసికొని వచ్చె నత్తెఱం గాకర్ణింపు మమ్మహితసౌజన్యధన్యుండు. 64

శా. మాతంగత్వము దాల్చి యే నరిగి సమ్మానించి యా భార్గవుం
బ్రీతుం జేసెద నట్టు లిచ్చిన సుధన్ ♦ హృదూషితస్వాంతుఁ డై
యాతం డొల్లక యున్న నేమి విను నా ♦ కన్యాయ్యవృత్తంబు గా
దీ తంత్రంబున కీవ సాక్షి యని తా ♦ నేతెంచి నిన్ గానఁగన్. 65

వ. నీవు ప్రత్యాఖ్యానంబు చేసిన నతం డంతర్ధానంబు సేసెం గానిమ్ము దాని కేమి సేయ వచ్చు నాయిచ్చినవరంబు బొంకు గాకుండ నీకు జలం బెప్పుడుం గలుగ జేసెద. 66

చ. అనఘ జలంబు నీవలసినప్పుడ మేఘము లీమరుస్థలం
బున నొసఁగుం భవద్యశము ♦ పొంపిరివోవ నుదంక మేఘనా
మనుతవిహారముల్ గలిగి ♦ మాన్యత నెప్పుడు నియ్యెడం జరిం
చును జలదంబు లింక నను ♦ సువ్రత మాటకు పోయివచ్చెదన్. 67

క, అనినం బ్రీతుం డయ్యెను, మునియంతర్ధానకలనమునఁ గృష్ణుండుం
జనియె నని చెప్పి మఱియును, జనమేజయనృపతితోడ ♦ సంప్రీతిమెయిన్. 68

వ. వైశంపాయనుం డి ట్లనియె. 69

ఆ. మనుజనాథ యెప్పుడును మరుదేశంబునందు నియతవృత్తి ♦ నచ్యుతంబు
దలఁకొనంగ నయ్యుదంకమేఘంబు లొక్కొక్క పుణ్యతిథుల నొలసి కురియు. 70

వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా యుపేంద్రుని శపించుటకు నుత్సహించిన యుదంకుం డేవిధంబు తపంబున నమ్మహానుభావంబు నొందె నెఱింగింప వేయనుడు నా విభునకు వైశంపాయనుం డి ట్లనియె. 71

జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకుని చరిత్రంబు సెప్పుట.

సీ. అతనికి గురుభక్తి శక్తతనఁ జొప్పడియెన, తెలుఁగు తెల్ప పద్ధి ధిను ♦ తెలియు నల్కఁడు

దనఘరుం డైనగౌతమునకు శుశ్రూష, నియతిమైఁ జేయు నాస్తిక్యభక్తి
కంబుగఁ బెద్దయుఁగాలంబు సనిన నా, సంయమిపతి శిష్యసమితి కెల్ల
వివిధవరము లిచ్చి వీడ్కొల్పి పుచ్చి యు, దంకుని దిగ్గను దలఁపకుండె

ఆ. నుత్తపఃపరాత్ముఁ డతినిష్ఠఁ బరిచర్య, నడుపు చొక్కటంబు గనుచు వేఁగు
గలుగునట్టివంటకట్టియమోపు పట్టు, గుదియ మోచి తెచ్చెఁ గురువరేణ్య. 72

క. అటు మోచి తెచ్చియుండొక, జట పెద్దయుఁ దగిలి యుండ సరభసముగ నై
చుటయుఁ దెగి మోపుతో ముం, దట నది పడియెను జరాసితచ్ఛవి మెఱయన్. 73

సీ. దాన నన్నియతుండు దనవయఃపాకంబు, నెఱిఁగి శోకంబున నేడ్వ నమ్మ
హాముని యశ్రువు లంజలిఁ బట్టంగ, నిజపుత్రిఁ బనిచె నక్కన్నెరజాక్షి
రయమునఁ బట్టి కరంబులు వేఁడిమి, నెసిన విడిచిన ధరయుఁ దలరె
నమ్ముని యా శిష్యు రమ్మని చేరంగఁ, బిలిచి నీ వేటికి నలఁతఁ బొందె

ఆ. దనిన నతఁడు శిష్యు లందఱపైఁ గల, కరుణ మీకుఁ బెద్దకాలమేని
మునివరేణ్య నావలన లేద దానికి, నుమ్మలింప కెట్టు లుండవచ్చు. 74

వ. అనుటయుఁ గృప చిగురొత్తుచిత్తంబుతోడ. 75

క. ఎలప్రాయ మిచ్చితిని నీ, కలఘుమతీ యిచ్చెదను మదాత్మజ నుల్లం
బలరఁగఁ బెండిలి గమ్మని, పలికి మఱియు నా తపస్విపతి యిట్లనియెన్. 76

క. నీ తేజంబు సహింపఁగ, నీతామరసాక్షి దక్క నెవ్వరికి దప
స్స్ఫీతా శక్యము గా దిది, చేతోగతిఁ జూచి తగవు సిద్ధించుటకై. 77

వ. ఇమ్ముద్దియకును. 78

క. తను వొంపుగఁ జేసెద నది, జననాంతర మెట్టు లట్ల సజ్జననుత నీ
వనుమానము దక్కుము యౌ, వనమును గైకొనును కన్య వరియింపు తగన్.

వ. అధర్మము గాకుండునట్లుగా వరం బిచ్చితి నని యనుగ్రహించి యక్కన్యకా
రత్నంబునకును. 80

చ. తనులత యొందు నేసిన నుదంకుఁడు యౌవనలక్ష్మిఁ దాల్చి య
వ్వనిత వివాహ మయ్యె నృపవర్య పదంపడి యమ్మునీంద్రుతో
ననుఁ బని గొంపు మీరలు మనంబున నెద్ది దలంచి వేడ్క నే
సిన నది దెత్తు మీకరుణఁ జేసియ కల్గెడు నాకు శక్తియున్. 81

క. అని విన్నపంబు సేసిన, విని దత్సతి ప్రీతి యగుట వే యొరులకుఁ గా
కనఘ భవదీయచరితంబునఁ జూపే నాకు ననియె ముని మనుజేంద్రా. 82

తే. అంత నిలువక మునిపత్నికతఁడు భక్తి, నెఱిఁగి తల్లి మీ రానతీయుండు మీకు
వలయునట్టిపదార్థ మవశ్యమును సమాహరింతు నే ననుటయు నయ్యహల్య.

చ. కువలవదు లాఁతివాఁడ వె భర్తద్గుణతోషితగౌతమాంచితో
క్తులు మది నూఁదు మన్నను నకుంఠితచిత్తత నొత్తి పల్కె న

య్యాలఘుతపస్వి యాసతి ప్రియయుంబున మిత్రసహాఖ్యుదేవికుం
డలములు దెమ్ము నాకుఁ బ్రకటంబుగఁ బెంపువహింపు నమ్మఁడా. 84

వ. అని యిట్లు పనిచిన నాతండు ప్రీతుండయి యుప్పనికిం బసియెఁ బదంపడి గౌతముం డుదంకునిం జూడఁగాన మెచట నున్నవాఁ డని యహల్య నడిగిన నా భృగువంశవరుం డరిగిన తెఱం గెఱింగించిన నద్దయాళుం డద్దేవియాననం బాలోకించి. 85

క. ఆ సౌదాసనరేంద్రుం, డా సురచరితుండు శాప ♦ మాతని నటు గాఁ
జేసినయది మానుషమాం, సాసక్తుం డగు టెఱుంగఁ ♦ దమ్ముని యతనిన్. 86

సీ. అకట యెట్లగునొకో యనుపల్కు కృపదోఁప, బలికిన మ్ముగ్ధ ♦ భయముగొనుచు
నెఱుఁగ నిట్లగుట మునీశ్వర నామీఁది, దయ చిగురొత్త నాతనికిఁ గీడు
రాకుండునట్లుగాఁ ♦ జేకొని కావవే, యనిన నాసంయమి ♦ యంత వెఱవ
నేల యే నతనికి ♦ నెడరు రానీ నని, తగ నూఱడించె నుదంకుఁ డరిగి

ఆ. మనుజరక్తసిక్తతనువును గోరమీ, సములు వృత్తలోచనములు నైన
యుగ్రమూర్తితోడ ♦ నొక్కశూన్యాటవి, నెలమి నున్నయన్న ♦ రేంద్రుఁ గాంచె.

క. ముని యట్లు నెమ్మిఁ గాంచినఁ, గని యతఁ డాఁకొనుటఁ జేసి ♦ గాసిలి వచ్చెం
గనువాఁడనొ తగుభక్ష్యం, బనుచుండఁగ వచ్చితివి ప్రి ♦ యంబుగ ననుడున్. 88

వ. ఉదంకుం డతని కిట్లనియె. 89

క. గురుకార్యంబునకై భూ, వర నిన్నుం గాన నేను ♦ వచ్చితి గుర్వ
ర్థరతులు హింస్యులు గారిట్లరయక యాడుదె యధర్మ ♦ మగుమాట నృపా.

వ. అనుటయు. 91

క. దినమున మూఁడవయామం, బున యపరార్ధంబు యోగ్యముగ నాహారం
బునకుం గల్పించిరి నా, కనిమిషు లటు గాన మాన ♦ నాఁకలి పుత్తున్. 92

సీ. అని పల్కె సౌదాసుఁ ♦ డమ్ముని యిట్లని, యధిప మద్గురుకార్య ♦ మాచరించి
వచ్చెద మగుడ నవశ్యంబు నామాట, యనృతంబు గాదు నీ ♦ వర్థికోటి
కిష్టపదార్థంబు ♦ లిత్తు పాత్రము యేను, గురులకుఁ గాఁగ నా ♦ కోరుకోర్కి
నీవ తీర్తని కృతనిశ్చయత్వంబున, నరుగుదెంచినవాఁడ ♦ ననుడు నృపతి

ఆ. యట్లగా కేమి ♦ యర్థించి వచ్చితి, చెప్పు మనిన నతఁడు ♦ చిత్త మలర
ననఘ నీదుపత్ని ♦ యర్థిమై ధరియించు, కుండలంబు లని యతండు సెప్పె. 93

---

1. 'వ. అక్కట యెట్లయ్యెడునొకో యనుచుం బలికిన నమ్ముద్దియ భయంబు గొనుచు.
సీ. ఎఱుఁగ నిట్లగుట...మనుజాశిరక్తంపుఁ ♦ దనువును గోర,మీసములును వృత్తలోచనము లైన
ఆ. యుగ్రమూర్తితోడ ♦ నొక్కశూన్యాటవి, నెలమి నున్న యన్న ♦ రేంద్రుఁ గాంచె
ఘోరవికృతభయదఘూకవిరావమై, ప్రచురమైనకోప రాశి యనఁగ."
యని పాఠాంతరము గొన్నిఁటఁ గానఁబడెడి.

వ. చెప్పిన విని యమ్మనుజవరుఁ డారయలభసం బిచ్చువారలుం గలరె కుండలంబు లడుగఁ గొం డెద్దేనియు నడుగు మనుటయు నాసంయమి నీవు నెపం బిడి త్రోవం గలవాఁడవు గా వే నన్యవస్తువు లొల్ల నని పలికిన నాభూవల్లభుం డమ్మాట కియ్యకొని యున్నాతి యున్నచోటికిం జను మేఁ బుత్తెంచితి నని చెప్పి నీవాంఛితం బెఱింగింపు మని నియోగించిన నమ్ముని యద్దేవి యెచ్చోట నున్నయది యని యడిగిన నప్పుడమితేఁ డల్లదె తన్నివాసప్రదేశం బని చూపినం బోయి. 94

సీ. అద్దేవిఁ గని యుతంకుఁ డల్ల చెప్పిన ముని,వల్లభు నాకానవాలు దెమ్మ
నృపుపాల ననియె నక్కన్నెలఁత యుదంకుండు, నను దెంచి విభు నభిజ్ఞాన మడిగె
నాతఁ డీగతి నేమి యగు నని నిర్ణింప,గా దిది వెలి గాఁగ లేదు వేఱ
గతియును నను పలుకఁ గతివకు నాయిచ్చు,వర్ణితాభిజ్ఞాననిర్ణయముగఁ

ఆ. చెప్పు మనిన సంతసిల్లి యమ్మదయంతి,కడకు నరిగి తత్ప్రకారమునన
పలుకుటయును భర్త పనుపున నిచ్చెదఁ, గుండలములు నిక్కగురుహితార్థి. 95

వ. అని యక్కొమ్మ యమ్మహాత్మునితో మఱియును. 96

సీ. సురలు గంధర్వులు నురగులు నిక్కుండ,లములకుఁ జెక్కపాటయముల వేచి
తిరుగుదు రెంగిలి దవ్వొందిన నేమఱి, నివు సిద్ధించిన నేల నిడిన
నపహరింతురు భక్తి నర్చించి యివి దాల్ప, నాఁకలి నిదుప ట్టగ్నిభయము
విషవికారము భూతశోకాళబాధలు, వొరయవు వినుము బొక్కలురకు నైనఁ

ఆ. బెద్దవారి కైనఁ బెట్టిన నయ్యాయి,కొలఁది నమరి యుండుఁ గురియుఁ బసిఁడి
ననిన నప్రమత్తవృత్తిమైఁ గొని చను,మయ్య గురులు నిన్ను నభినుతింప. 97

— ఉదంకుండు మదయంతివలనఁ గుండలంబులు పుచ్చికొనుట. —

వ. అని చెప్పి యప్పరమపతివ్రత భక్తిప్రీతివినయములు మనంబున నంకురింప నుదంకునకు నక్కుండలంబు లొసంగినం బ్రమోదం బెసంగ నాశీర్వాదంబు సేసి యా సంయమివరు డబ్బామచేత నామంత్రితుండై భూమీశ్వరుపాలికి వికాసలసితవదనారవిందుం డగుచు నేతెంచి యక్కుండలలాభంబు ప్రకటించి దీవించి దేవా నీవలనం గృతార్థుండ నైతి నని పలికి నా కానవాలుగా నీవు సెప్పినవాక్యం బత్యంతగూఢంబు తదభిప్రాయంబు నెఱుంగవలతుం జెప్పం దగి యుండునేనిం జెప్పు మని యడిగిన నతం డతనితోడ. 98

సీ. బ్రాహ్మణజనముల రాజులు పూజింతు, రటు గాన యేను విప్రార్చనంబు
సేయుదు విప్రునిచేతన యిట్లైతి, వెడదప్పు నన యొండువెరవు నాకు
దురితంబు వాపంగ దొరకొన దది కారణముగ భూసురపూజనంబు దుష్క
రము దీని మేలు గన్నదు మనంగ రాదిది, గాదన్న వేఱొండు గలదె మార్గ-

తే. మని యభిజ్ఞానముగ మదయంతి యపుడు, సెప్పి పుచ్చితి నిట్లు విశ్లిష్టరత్న
మయమహాకుండలము లిచ్చి మాన్యుఁ గీడు, నీకొసఁగ నతఁ డలఁపు సకలలోకవంద్య. 99

వ. అనిన నా భృగుకులవరేణ్యుఁ డప్పుణ్యాసన్నిధిం జేసి యా సౌదాసనరేంద్రునకు [1]సంప్రాప్తసమాధానసూతనసత్త్వంబు గలుగుటకతంబునం గార్యవశమ్మునంబును గుండలదానశ్రద్ధయు శాంతవచనంబునుం గలిగెఁ దదీయవచనశ్రవణానంతరంబ యుదంకుండు తనతో మిత్త్రత్వంబు సంభాషణమాత్రసిద్ధం బగుట బోధవృద్ధులు సెప్పుదు రేను నీవలనం గృతార్థుండ నైతిఁ గొన్ని యున్నవాఁడ మగిడి వచ్చెద నని పలికితి బొంకు వడకుండ వత్తు ననినఁ జిత్తంబు కృపాయుత్తం బగుచుండ నా భూపతి యుత్తాపసోత్తమునానసం బాలోకించి. 100

ఉ. చంపెదు నట్టి నా కడకు సంయమివల్లభ వత్తురయ్య నీ
పెంపును నిక్కముం దెలిసెఁ బ్రీతుఁడ నైతి మదాత్రినీతప
స్సంపదఁ జేసి పావు మని సంస్తుతిఁ బల్కిన వీనులం బ్రచే
రిం బొలయం బ్రసన్నతి వహింపఁగఁ జిత్తము దంకుఁ డిట్లనున్. 101

ఉ. ఏమిట నైన నొప్పమి నరేంద్ర సుచిత్తులఁ బొందదే నియున్
వేమరలున్ భవద్గుణము వితకళంకునిఁ జేసె నిన్ను సాం
ద్రామలకీర్తి గౌతమమహాముని సల్లనిచిత్తవృత్తి నీ
పై మలఁగించెఁ గావలయుఁ బార్థివసత్తమ పొందు మున్నతిన్. 102

క. అని పలికి మఱియు బలుదీవన లిచ్చి యతండు గౌరవమున నతని మేన్
దనకరములు నివిరి ప్రియం, బొనర్చి నిర్దురితుఁ డైనయుర్వీపతియున్. 103

వ. భక్తివినయసంభరితుం డయి యప్పరమమునిం బ్రస్తుతించి నమస్కరించి యామంత్రణంబు సేసిన నమ్మహాత్ముండు కుండలంబులు కృష్ణాజినంబునం బదిలంబుగా ముడిచికొని గౌతమాశ్రమంబునకు రయంబునం బోయిపోయి పక్వఫలంబులం బెరిఁగినబిల్వంబుం గని యాఁకటి పెల్లునం దదీయవిటపంబున సకుండలం బగునయ్యజినంబు దగిల్చి యమ్మహీరుహం బెక్కి ఫలంబులు గోసికొను చుండె. 104

సీ. గాలి నవ్విటప మూఁగులాడ మఱుఁ డగు, తొడలి యయ్యజినంబు నపుడు మీఁద బడినఁ
గని మోక్కనాగంబు గ్రక్కునఁ జను దెంచి, పెసఁ బుచ్చుకొని తదుగ్రవేగపటిమ
గాంచి యుదంకుండు గ్రమ్మన దిగ దాఁటి, వెనుకొనునంతకు గనపట్టఁ
జొచ్చెనయ్యురగమూఁకను ప్రతిపరుఁ డుతీవ్రముఖశాస్త్రముగొని తత్త్రవ్వఁదొడఁగె

తే. దాని సైరింపఁ జాలక ధరణి దలరె, విప్రుఁడై వచ్చి గీర్వాణవిభుఁడు గొయ్య
గోలఁ ద్రవ్విన మాత్రఁ బాతాళయాన, మెలసిద్ధింప నేర్చు మునీంద్ర వినుము.

వ. పాతాళభువనం బిచ్చటికి [2]సహస్రయోజనంబుల నున్నది కుండలంబులు గొని

1. క. సంప్రాప్తసమాధానసత్త్వంబు. 2. గ. చ. ఙ. '[illegible] లున్నది.'

పోయినభుజంగం బైరావతాపత్యం బనిన విని యమ్మునిశిష్యుం డను. 106

క. తాపాతాళంబున నున్నను, వే తెత్తుం గుండలములు విను మప్పని నా
చేతం గా కున్న నను, వ్రాతము విడువఁబడు నిది ధ్రువం బని పలికెన్. 107

చ. పలికిన నత్తపస్విదృఢభావ మెఱింగి సురేంద్రుఁ డొంక ప
ల్కులవని నిల్పి కాష్ఠమునకుం గులిశంబునఁ గల్గువాఁడియున్
బలువును నిచ్చి వజ్రి సనెఁ బాంధవ పేర్పడఁ జెప్పి భీకమై
నిల దెరు విచ్చె నమ్మునియు నేత్తెఱఁ జొచ్చె భుజంగలోకమున్. 108

వ. చొచ్చి యనేక ప్రకారప్రాకారపరిరక్షితంబును బహురత్నదీప్తిజాలదేదీప్యమా
నంబును నైనయమ్మహనీయలోకం బాలోకించి దశయోజనాయామంబునుం
బంచయోజనవిస్తారంబును నగుతద్ద్వారంబు గని యతండు కుండలాహరణంబు
దుర్లభం బనుతలంపున డిల్లపడియె నయ్యెడ నరుణవదనంబును నసితాంగం
బును సితవాలంబును నై వెలుంగుతురంగం బతని కిట్లనియె. 109

ఉ. ఆతత మైననాదగు నపానము నూఁదు మొకింతయున్ జుగు
ప్సాతురవృత్తి నీదుహృదయంబునఁ బొన్నకు లోకవంద్యుఁ డ
గ్గౌతమునాశ్రమంబున నఖండితభక్తి నుపాస్తి సేసి నగ్ని
బ్రీతునిఁ జేసినాఁడవు వరిష్ఠతపోధన యట్లు గావునన్. 110

వ. నీకుం బొడసూపి యైరావతసుతుం డపహరించినసముచితకుండలంబులు మగుడం
జేరెడునుపాయం బుపదేశించితి ననిన నుదంకుం డేను నిన్ను నెఱుంగ నుపా
సించుట యెట్లు గలిగెఁ దెలుపు మనుడు నయ్యశ్వం బతనితోడ భవద్గురునకు
గురుండం బావకుండ నీవు శుచివయి సభక్తికంబుగా నిత్యంబును నన్ను నియతిం
బూజించి తత్తెఱం గెఱుంగవే యని పలికినం బ్రీతి నొంది యతండు తదీయోప
దిష్టప్రకారం బాచరించిన. 111

సీ. ఘోటకోత్తమరోమకూపంబులం దెల్ల, నొక్కట ఘనధూమ ముద్గమించి
కవిసి పాతాళలోకం బంతయును గప్పె, వాసుకిప్రభృతినివాసభూము
లుపరుద్ధభావంబు నొంద నైరావతా, వాసంబు హాహారవంబుతోడ
నాకులం బయ్యె నత్యంతదారుణం బైన, పెనుఁబొగ నంతయు భీతి నొంది

ఆ. యమ్మునీంద్రుకడకు నహివరుల్ రయమున, వచ్చి భక్తి నర్చ లిచ్చి వినతు
లై తదీయకార్య మడిగి యెఱింగి వే, తెచ్చి కుండలంబు లిచ్చి రధిప. 112

ఉదంకుండు గుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱచుట.

చ. అతఁడును వారిఁ బో బనిచి యగ్నికి భక్తిఁ బ్రదక్షిణంబు సే
సి తగ నమస్కరించి విలసిల్లఁగఁ దేజము ప్రీతచిత్తుఁ డై
యతలము నిర్గమించి రయ మారఁగ వచ్చి యహల్యఁ గాంచి తె
చ్చితి నివె కుండలంబు లని చే నిడి భూస్థలిఁ జాఁగి మ్రొక్కినన్. 113

తే. ఆ యమయు గౌతముండు నత్యాదరమునఁ, గౌఁగిలించుచు దీవించి § గారవింప
నతఁడు నమ్మునిపతికి నిన్నయ్యమకును, పెక్కుమాఱులు భక్తిమై మ్రొక్కి నిలిచి.

క. మీకరుణఁ గాక తగుమెయి, నీకుండలములు పరిగ్రహించుట నడుమన్
వైకృత మొనసినఁ దలఁగుట, నాకెలఁదియె యనియె వినయనమ్రుండగుచున్.

వ. అనిన విని వార లత్యంతసంతోషాంతరంగులై రగ్గౌతముం డతని కిట్లనియె. 116

ఉ. నీచరితంబు చిత్రమవశ్యపియము మిత్రసహక్షితీశ్వరున్
నీచతఁ బాప నాఁగ మపనీతము సేసినకుండలద్వయం
బా చతురత్వ మా బలిమి § యా దృఢనిశ్చయ మట్టు లొప్ప ధ
ర్మోచితలీలఁ దేర నొరుఁ § డోపున యేను నిజంబ పల్కితిన్. 117

వ. అనియె నయ్యుదంకుం డట్లు దనమహాతపంబుబలిమిం బరాక్రమించి యనన్యసులభంబు లగుకుండలంబు లాహరించి గురుజనమనోరథసిద్ధి గావించె నా భృగువంశమహాత్తరుమహానుభావం బిట్టిదనిన విని జనమేజయుం డమ్మహాత్మునకు వరంబొసంగి చనినవాసుదేవుననంతరవృత్తాంతంబు మునిసత్తమా యెఱింగింపవే యని యడిగిన నవ్విభునకు వైశంపాయనుం డిట్లనియె. 118

సీ. ఆ భార్గవోత్తము § నట్లు వీడ్కొని కృష్ణుఁ, డరిగి యలంకృత § మైననిజపు
రము సొచ్చునప్పుడు § రైవతకాచల, యాత్రామహోత్సవ § మఖిలజనులుఁ
గొనియాడుచుండఁ § నుగ్రగోవిందసందర్శ, నంబున నుత్సవోన్మత్తభావ
మిమ్మడి యై ప్రమోదమ్మునం దేలి ర, ద్దేవదేవుఁడు వసుదేవుఁ గాంచి

తే. దేవకీదేవి బలభద్ర § దేవుఁ దక్కఁ, గలుగువృద్ధబాంధవులను § గని వినీతిఁ
దత్తదుచితమనోజ్ఞవిధాసమంచి, తాచరణములు నడపెఁ బ్రియంబు చెలఁగ.

వ. వార లందఱకు ధర్మనందనుచెప్పినచొప్పునఁ బ్రణామాదియోగ్యోపచారంబు లాచరించె ననుజతనుజామాత్యభృత్యులు దన్నుం గనినం బ్రీతివాత్సల్యసంభావనాబహుమానంబులు మెఱయ నాదరించె సాత్యకిసుభద్రలం దగుతెఱంగులం దగినవారలం గానిపించె నట్లు సకలజనప్రమోదాపాది యైనదామోదరు నత్యంతసమీపాసీనుం జేసికొని వసుదేవుండు భారతరణప్రకారంబు యాతాయాతజనంబులచేత వింటిం బ్రస్ఫుటంబుగా విన వలతుం జెప్పవే యని యడిగిన నచ్యుతుం డతని కిట్లనియె. 120

క. అది యతివిస్తారము పెక్కుదినంబులు సెప్పఁ బట్టుఁ § గొంత దగం జె
ప్పెద నేఁ బ్రధానపురుషస, ముదయసమరవిధము లఘుతరోక్తులఁ దెలియన్.

సీ. కౌరవసైన్య మేకాదశాక్షౌహిణీ, కలితంబు దానికిఁ § గట్టువీర
పట్టంబు భీష్ముఁ డాప్రభువున కెదు రొడ్డి, రలమిమైఁ బాండుపుత్త్రులు శిఖండి
నక్కడ సప్తసంఖ్యాక్షౌహిణీక మనీక మిమ్మాడ్కిఁ బన్నినబలద్వ
యంబును ఖేచరు § లచ్చెరుపడఁ బోరెఁ, గాండీవి తోడ్పడఁగా శిఖండి

తే. యన్న దీనందనునిఁ బడి ✽ యవ్వదినంబు నందుఁ గూలిచె నుత్తరా ✽ యణము వచ్చు
నంతకును మృతిఁ బొందక ✽ యూరకుండె, నధిప శరతల్పమునఁ ✽ గడునద్భుతముగ.

క. గురుఁ డైదు దివసములు నిర్భరసమర కేళిఁ జొక్కి నతనిఁ ✽ బరిమార్చెఁగ నా
వెరవున నర్జునుప్రాపున, దొరకొనియె హుతాగ్నిభవుఁడు ✽ ద్రుపదసుతునకున్.

క. దంతున రాధాతనయుఁడు, రెండుదినంబులు పెనఁగి ✽ గ్రీష్మసమయసూ
ర్యుండుం బోలె వెలింగెను, గాండివధరుశరశరోష్మఁ ✽ గ్రాఁగె నరేంద్రా. 124

చ. విను మఱునాఁడు శల్యుఁ డతి ✽ విక్రమశాలి సమరం బొనర్చి యు
ద్దినము సగంబు సెల్లఁగ యుధిష్ఠిరుచేఁ దెగెఁ దుర్బలంబు గై
కొని యని సేయఁగా శకునిఁ ✽ గూల్చె వడిన్ సహదేవుఁ డంతలో
మనమునఁ జేవ దక్కి తనమానము డిగ్గఁగఁ ద్రావి హీనుఁడై. 125

వ. దుర్యోధనుండు దనతమ్ముల భీమసేనుండు సంగ్రామంబునం దెగటార్చి యుండ భంగంబున కోర్చి పలపలనిమూఁక విడిచి గద చేతం గొని పాదచారి యయి యొక్కండునుం బాఱి యొక్కమడుఁగు సొచ్చి నీళ్ళ (పాషాణమయముగా) మంత్రించికొని డాఁగియుండెఁ బాండవు లెఱింగిపోయి పొదివికొని మర్మభేదంబు లగుదూషణభాషణంబుల నొప్పించిన. 126

ఆ. అతఁడు మనువు వెడలి ✽ యనిలనందనుతోడఁ, దగఁ బెనంగి తద్గదావినిహతిఁ
దొడలు విఱిగి కూలి ✽ విడిచెఁ బ్రాణంబు లిబ్బంగి జయముగొనిరి ✽ పాండుసుతులు.

క. గురుసుతుఁడు పాండుతనయశిబిర మారే యడరి పొదివి ✽ భీషణవృత్తిం
బొరిగొనియెం గరిఘోటక, నరనిచయము నెల్ల ✽ నేమనం గల దధిపా. 128

వ. ఆ రాత్రి యేనును బాండుసుతులు నచ్చట లేమి నంత వ్రుట్టె నిట్లు పదునెనిమిది దివసంబులు సెల్లినసంగ్రామంబున నేమువ్వురము సాత్యకియునుం దక్క మా దిక్కున సమస్తజనంబులు నస్తమించిరి కౌరవులదెస నశ్వత్థామకృపకృతవర్మలు మువ్వురు బ్రతికిరి యాయుత్సుండు మున్న పాండవుల నాశ్రయించుటం జేసి చావునకుం దప్పె నిది భారతరణప్రకారంబు. 129

క. అని చెప్పెఁ గాని యభిమన్యునిచా వేర్పడఁగఁ జెప్ప ✽ నొల్లఁడ వసుదే
వునకు వగ మిగులుటకు నెమ్మనమునఁ దా నోర్వకునికి ✽ మాధవుఁ డధిపా. 130

వ. దాని నెఱింగి సుభద్ర గద్గదస్వరంబున గోవిందునితోడ నీయల్లుం డభిమన్యుండు దెగుట మీతండ్రికిం జెవులారం జెప్పు మన్నా యని వసుదేవుండు వినం బలుకుచుం బుడమిం బడిన వసుదేవాదియాదవజనంబులు మనంబులం గదిరినక్రొత్తనెవ్వగలం బలవించినం బద్మనాభుండు వారల నెల్ల నూరార్చి వారణపురంబున సుభద్రయు నుత్తరయు నభిమన్యునిదెస నత్తినశోకంబున నాకులత్వంబు నొందినచందంబును గొంతి దగుమాటల వారిఁ దేర్చినతెఱంగును నెఱింగించి పాండవు లేవురును వేర్వేఱ యభిమన్యునకై మణికాంచనగవాదివస్తువులు

విప్రప్రకరంబుల కొసంగుటయు మఱియుం దటాకకరణాదిధర్మంబు లాచరించుట
యనసం జెప్పి మఱియు దారంబునం దెరలక మరలక యా సౌభద్రుండు రౌద్ర
మూర్తియై దుర్యోధన ద్రోణ కృప ద్రౌణి కృతవర్మ కర్ణాదివీరవ్రాతంబుఁ
గలంచి యనేకనృపలోకంబు జమలోకంబున కనిచి యనిమిషులు వొగడ నుత్త
మలోకంబున కరిగి సుఖియై యున్నవాఁడు వానికి వగవ నేల యనియుం బలికి
యిట్లుపశాంతి గావించి. 131

ఆ. బంధులోకమునకుఁ ♦ బరమప్రియం బైన, యుచితవర్తనమున ♦ నుండెఁ గృష్ణుఁ
డని సవిస్తరంబు ♦ లగువాక్యములఁ బ్రీతి, సిగురు లొత్త నిట్లు ♦ సెప్పి మఱియు.

వ. కరిపురంబునం బుట్టు విశేషంబులు వినుమని పలికి వైశంపాయనుండు జనమేజ
యున కిట్లనియె. 133

వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట.

సీ. చుఱచుఱఁ దనచెవుల్ ♦ సూఁడినయట్లుగ, నభిమన్యుసంస్తుతి ♦ యైనవాక్య
యము ప్రసంగాధీనమై బంధుజనులందుఁ, బొడముటయును ధృతిఁ ♦ గొమడలి తలరి
యుత్తర విలపింప ♦ నత్తన్వియులమట, గనుఁగొని పాండునందనులు వనటఁ
గూరిన నచటికిఁ ♦ గారుణ్యమూర్తి వేదవ్యాసుఁ డేతెంచి ♦ శోకనమాట

తే. లాడి వారలవగ మాన్చి ♦ యశ్వమేధవిమయవిధులు ప్రసంగించి ♦ వేగ తొడఁగుఁ
డని నియోగించి వారెల్ల ♦ నట్ల కాక, యనిన నాతఁ డంతర్హితుం ♦ డయ్యె నధిప.

క. అన విని జనమేజయుఁ డమ్ముని యిట్లు హితోపదేశ ♦ ముం జేసినఁ బాం
డునృపాగ్రతనయుఁ డెమ్మెయి, ననఘ తొడఁగె నశ్వమేధ ♦ యాగంబునకున్.

క. అని యడిగిన వైశంపాయనుఁ డాతని కిట్టు లనియె ♦ నప్పుడు కుంతీ
తనయాగ్రజుండు దమ్ములఁ, గనుగొని యుత్సాహలక్ష్మిఁ ♦ గనుఁగవ నొప్పన్.

సీ. వ్యాసమహాముని ♦ వత్సలత్వంబున, నానతి యిచ్చి ♦ నమానసీయ
వాక్యంబు వింటిరే ♦ వసుధ యిత్తఱి వసు, హీనయై యున్నది ♦ దానఁ జేసి
భూదేవనిహితధనాదాన మావశ్యకం బయ్యె దానికిఁ ♦ గృత్యమును హి
మాచలయాత్రాసమాచరణప్రకారమును విచారణీయములు గావె

ఆ. యనుఁడు పవనతనయుఁ ♦ డతనితో నీశ్వరుఁ, బరమనియతిఁ గొలిచి ♦ కరుణ వడసి
ప్రమథగణము నెల్ల ♦ భక్తిఁ బూజించి యు, త్తలమునందు భూతబలు లొనర్చి.

క. తేత్తము గాక నరేంద్ర మ్మరుత్తరలిత మైనదానరూపము సుమహో
దాత్తస్థితి నున్నకనక, మిత్తఱి నిలదెసఁ దలంప ♦ నేటికి మనకున్. 138

వ. అప్పునికి సముచితసైన్యసమేతంబుగా దేవర విజయంచేయ వలయు ననిన
నర్జునుండును గవలును నట్ల పలికిరి దానికి ధర్మనందనుండు ప్రియం బంది
కృతనిశ్చయుం డయి ధృతరాష్ట్రుకడకుం జని యశ్వమేధయాగోపక్రమోత్సవ
శ్రవణంబునం బుత్త్రులం దలంచి శోకసంతాపసమాక్రాంతుం డయ్యు యున్న

నీయుం జెల్లి మీరెల్ల వారును త్ర్యంబకపూజను సెల్లింపవలయు నేఁటిరాత్రి
నియతులై దర్భాసంస్తరణంబుల శయనించుఁ డని యనియోగించిన. 148

ఆ. రమ్య మైనచిప్పకరంబుల దర్భసం, స్తరణములను యోగశయనమునను బ్ర
భాసమానములగు పంచాగ్నులనుబోలె, నమ్మహాత్ము లుండి రధిపముఖ్య. 149

వ. అట్లుండి యవనీసురాశీర్వాదంబుల నాదరించుచు నారేయి గడపి కల్యం బగుటయుం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి సర్వక్రియాకలాప నిర్వాహణధుర్యుం డగు పారాశర్యుండును వనుప ధౌమ్యప్రముఖపురోహితసహాయమహాసీయ సమాచారు లగు పాండవేయులు పరమస్థండిలంబునం బార్వతీపతి నావహించి యుత్కృష్టంబులును బహుళంబులు నగు గంధపుష్పధూపదీపంబులం బూజించి సముచిత మనోహరిభూరిపాయసాది [1]భవ్యద్రవ్యభారమహోదారం బగునైవేద్యంబు సమర్పించి వేఱువేఱ ప్రధానప్రమథులకును దక్షిణంబులకుం నర్చ లిచ్చి కుబేరమాణిభద్రప్రభృతిభూతయక్షజనంబులను సభక్తికావాహానకలితులం గావించి పూజనంబు లాచరించి. 150

క. రక్షాకరమంత్రకలన, దక్షాత్ములు నైనయట్టిధౌమ్యముఖోదా
త్తక్షోణీసురులు బెరయ, నక్షయపుణ్యుఁ డగుకౌరవాధిపుఁ డెలమిన్. 151

క. అనుజులుఁ దానుఁ బరాశరతనయపురస్సరముగా నిధానస్థలికిం
జని యరుణగంధకుసుమములను మాంసాపూపములను లాజములఁ దగన్. 152

ఆ. భూతతృప్తిఁ జేసి భూరిబలాఢ్యులఁ, బరిజనములఁ ద్రవ్య బయచుటయును
నతికుతూహలమున నార్చి వారలు ద్రవ్వి, రన్నిధానదేశ మధిపముఖ్య. 153

క. త్రవ్వినఁ బ్రభ లెల్లదెసల, నివ్వటిలఁగ వెలుఁగుచుండె నిధి యనిలజుఁడుం
గవ్వడియుఁ గవలు నలరఁగ, నవ్వసుధాధిపుఁడు దాని కర్చన లిచ్చెన్. 154

వ. అట్లు వివిధవిద్యానిధి యగు వేదవ్యాసుండు సన్నిధి సేసి యప్పెన్నిధి సాధించిన నా ధర్మనందనుఁ డాపరాశరనందను పాదంబులకు దండప్రణామంబు సేసి నిలిచి కేలు మొగిడ్చి ఫాలతలంబునం గదియించి వినయావనతుం డై యున్న నన్నరేంద్రు నమ్మునీంద్రుం డాలింగనాశీర్వాదంబుల నాదరించి యామంత్రణంబు సేసి యంతర్హితుం డయ్యె నమ్మానవనాథుండు. 155

సీ. శకటఖరోష్ట్రఘోటకకుంజరంబుల, నేకసహస్రంబు లెలమి సంఘ
టించి భారంబు లెత్తించి భారవహాత్యద్భుతజనుల్ పెక్కు లత్యుల్లరిఁ
గదిసి యేనె నని శకడఁగి మోపఁగ యాగ, నిలయంబుఁ గలపయ్యకలశములును
నలఁకులుఁ గాఁగులు నాదిగాఁ గలభాండ,ములును బీఠములు శయ్యలును బోళ్ళు

తే. రోఁకళులుఁ జట్టువంబులు స్రుక్స్రువాజ్య, పాత్రదండకమండలు[2]చాత్రములును
లోనుగాఁ గల్గువస్తుపుల్లుద్ధహేమ, మయము లొక్కట వడపించె మనుజనాథ.

1. ట. భక్ష్యద్రవ్యభారమహోదాత్తంబగు. 2. క. ఛత్రములును నిధిముల లోను గాఁగలిగిన యుద్ధహేమ

చ. మఱియును సన్నిధిం గలస్వయంచితకాంచనరాశి భూములం
బెఱికల మోపులం గొలఁది పెట్టఁగఁ బెక్కుబ్రాహ్మణుల్ దనుల్
వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కసమందఁగ శత్రుకోటికిన్
వెలి పొనరించువార్త పృథ్విపిం బరఁగఁగా నడపించె భూపరా. 157

ఆ. ఏరునేలకొలఁది నెడనెడ విడియుచుఁ, బోవ వలసి యుండె భూరిభార
వహ్నులదప్పి యొఱఁగు వాఁ డగునాధర్మ,నందనునకు ధరణినాథవర్య. 158

వ. అంత నక్కడఁ గృష్ణుండు. 159

తే. ద్వారకానగరమునకుఁ దన్నుఁ బుచ్చి, నపుడు ధర్మజుఁ డశ్వమేధాధ్వరంబు
సమయమగుట ప్రతీక్షించి సకలబంధు, యుక్తముగ రమ్మనినమధుహరోక్తి యాఁడి.

కృష్ణుండు సకలబంధుసహితుండై కరినగరంబునకు వచ్చుట.

వ. అరసికొని యుండి యప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు సేయుట చారులు సెప్ప నాకర్ణించి కుతూహలోన్నిద్రుండై బలభద్రసాత్యకికృతవర్మప్రద్యుమ్నచారుదేష్ణసాంబాదియాదవసమేతంబుగా వసుదేవదేవకీసమనుజ్ఞాతుండై సుభద్రం దోడ్కొని కరినగరంబున కరుగుదెంచిన ధృతరాష్ట్రుండును గాంధారియుఁ గొంతియుం బనుప నుత్సుకుండై యుయుత్సుండు విదురుం బురస్కరించికొని యప్పాంచజన్యధరు నెదుర్కొని పరమభక్తిం దోడ్కొని వచ్చిన. 161

తే. మున్ను ధృతరాష్ట్రుకడకు నా వెన్నుఁ డేఁగి
యతని గాంధారిఁ బ్రణతిపూర్వాతిమధుర
వాక్యములఁ బ్రీతి నొందించి వచ్చి గొంతిఁ
గాంచి ప్రణమిల్ల నద్దేవి గౌఁగిలించి. 162

వ. పెక్కుభంగుల దీవించె బలదేవాదులుం దగిన తెఱంగున నప్పాండురాజమహిషిం గని తత్కులపాలికాతిలకంబు పులకంబులం బెరిఁగిన మేనితో మాననీయచరిత్రుం డగునద్దేవకీపుత్త్రు సంభావించి. 163

క. ప్రమద మెసఁగ విదురుఁ బనిచి, సముచిత మగునర్చనంబు సంకర్షణపూ
ర్వము గాఁగ నడపి యదునికరమునర్చలు సంభృతాదరంబున నడపెన్. 164

వ. సుభద్ర దన్నుం గనినం బరమప్రియంబున గారవించి యభ్యంతరమందిరంబునకుం బుచ్చెఁ బద్మనాభప్రభృతు లగునాబంధుజనంబు నెల్లను నగరిచేరువ శోభిల్లుమందిరంబుల విడియింప యుయుత్సు నియోగించె నట్లయ్యందఱు నభినందితులై యున్నసమయంబున. 165

ఉ. ఉత్తరపుణ్యగర్భమున నుండి భవజ్జనకుండు పూరువం
శోత్తరుఁ డాదిరాజగుణశాలి పరీక్షితుఁ డుద్భవించినం
జిత్త మెలర్పఁ బుత్త్రుఁ డని చెప్పిరి వెల్పలివారి కింటిలో
నత్తఱి నున్నవృద్ధసతు లార్చి జనం బఖిలంబు నుబ్బునన్. 166

క. బాలుఁడు మృతజాతుం డని, యాలోచన యేమి సెప్ప నెరయఁ దలఁకుట నచ్చో
నాలలన లుగ్గడించినఁ, జేలిరి శోకమున జనులు ధీరవిచారా. 167

వ. అత్తఱి రోదనధ్వనులు గలయం జెలంగిన విషాదవేదనాయత్తంబు లయిన చిత్తాంగంబులతో శౌరి సాత్యకి యనుగమనంబు సేయ సత్వరంబుగా గొంతి యున్నెడకుం జనుదెంచె నప్పుడా కుంతిభోజనందనయు ద్రౌపదియు సుభద్రయు నార్తనాదంబు లెసంగం దనకెదురు రయంబున రా నెదుర నయ్యదువీరుండు గాంచి శోకసమాకులమానసుం డయ్యె నప్పాండురాజపత్ని పురుషోత్తముతో డగ్గుత్తిక నెలుంగు దగుల ని ట్లనియె. 168

పరిక్షిత్ప్రాణదానంబునకై కుంతీసుభద్రలు కృష్ణుఁ బ్రార్థించుట.

క. గతి నీవె నాకు మత్సం,తతికిని నీయల్లుఁ డుత్తరతనయుఁడు పుట్టీ
మృతుఁడై క్రూరుం డగు గురు,సుతునిషీకాస్త్రవహ్నిఁ జాఁడిన కతనన్. 169

సీ. దేవకీపుత్త్రు సంజీవితుఁ జేయవే, యబ్బాలు నద్దారుణాస్త్రసంప్ర
యోగంబునప్పుడు కృపాగరిష్ఠుండ వై, చేసితి ప్రతిన గాచెద నవశ్య
మును నుత్తరాగర్భజనితుని నని బాలు,బ్రదుకుతోడిద నాదుబ్రదుకు ద్రుపద
తనయాసుభద్రలు ధర్మజుం డనుజు లా,శిశువు సంజీవితుఁ జేయ కున్న

ఆ. బ్రదుక రన్వయమున నుదకపిండప్రదానంబు లెడలు మత్స్యనందనయును
నూఱడింపఁబడియె నొకనాఁడు నిచేత, దానియార్తి కరుణఁ దలఁగవయ్య. 170

వ. దేవా నీ విక్కలంబు గలిగించినవాఁడ వింక నీవ వీని బ్రదికింపవే యని పల్కుచుం బుడమిం బడిన గొంతి నగ్గోవిందుం డనునయవచనంబుల నూఱార్చి యొత్తె నట్టియెడ సుభద్ర యమ్మహాత్మునితో ని ట్లనియె. 171

క. గురుసుతుఁడు భీమునకునై, పరమాస్త్రం బెత్తె దానిఫల మందంగా
నరుఁడును దత్ప్రతిక్రియఁ గాం,చిరి తుది నే నీకు నేమి సెప్పుదుఁ బ్రభువా. 172

క. నీమఱఁది యాకొడుకుపైఁ, బ్రేమం [1]బెప్పుడును బెంపఁ బ్రేలెడి మనుమం
డీమెయి వమ్మయి పోయిన, నేమి యగునొ యెఱుఁగ నీవ యెఱుఁగుదు దీనిన్.

సీ. ధర్మజుం డెమ్మెయి [2]ధరియించు నెవ్వగ, పవననందనుఁడును గవలు నేమి
వా రెవ్వన నుపశమింతురు దీని విను దేవ, యస్త్రప్రయోగంబునపుడు నీవు
గురుసుతు నదలించి కుచ్చిత నిన్ను మోఘాస్త్రునిఁ జేసెద నంటి దాన
నూఱడి యుండుదు నుజ్జ్వలతేజ ని, మహితానుభావత మాకు నెల్లఁ

ఆ. దెలిసి యుండుఁ గాన [3]యులుకము సత్యద, యాశ్రితాభిరక్ష లనఘ నీకు
నైజములు శిరఃప్రణతి నేను వేఁడెదఁ, గరుణ నిక్కలంబు గాచికొనుము. 174

తే. ఏవిధంబునఁ గోలుపోనీవు నీవు, పాండవుల నీమనస్సన్నిధిఁ బాపకర్మ
శీలుఁడైనయశ్వత్థామ గోలుపుచ్చె, వాని నే మనఁగలదు దుర్వారతేజ. 175

1. క. బెప్పు సంగతుఁ బెంప. 2. గ. .రించు. 3. చ. యులుకము.

వ. అని వెండియు. 176

చ. భువనము లోఁకపెట్టు మృతిఁ బొందిన జీవము లావహింప నే
ర్తు వలచినట్టు లైన గుణాఢ్యుఁడు మేనమామ యందిపౌత్రుఁ జా
వ విడుతే వంతపెంపున నవారణ నీయెదురం బ్రలాపముల్
వివిధము లేటి మొనర్చితిమి వెట్టులమై యిటు భక్తవత్సలా. 177

తే. అనినఁ గృపయును శోకంబు నగ్గలింప, వనజనాభుండు జను లర్థిఁ వినఁగఁ బిన్న
వాని బ్రతికింతు వగవంగవలవదనియె, నెలుఁగుఁజెలఁగ దిక్స్వనమ్ము మిన్నులొరసి తోఁగ.

వ. ఎల్లవారును బ్రమోదంబు నొంద నట్లు పలికి సూతికాగృహంబునకుం గుంతీప్రభృతులు దోడరా నతండు వోవునప్పు డది ధవళకుసుమసితసర్షపలాజపూర్ణకుంభప్రముఖమంగళవస్తువులను బ్రజ్వలితపావకప్రదీప్తశస్త్రపిచుమందపల్లవాదిభూతపరిహారకపదార్థంబులను జతురవృద్ధాంగనాచికిత్సకదక్షపరిచారికాముఖ్యహితకారిపరివారజనప్రవర్తనంబులను బరిశోభితంబయి యుండె నమ్మందిరంబు గోవిందుండు ప్రవేశించె నట్టియెడ నంతకుమున్న. 179

సీ. కడచి ద్రౌపది సని యడలునఁ బడి యున్న, మాత్స్యనందనతోడ మాధవుండు
సనుదెంచె పీఁడె సవినయంబుగాఁ గను, మనవుడు నుత్థిత యై వికీర్ణ
వేణీభరంబుతో వినతి యొనర్చి భ, క్తార్తి వాపుట నీకు నతిదృఢవ్ర
తంబు కదే దేవ దయ వెలయంగ నీ, శిశువు సంజీవితుఁ జేయవయ్య

తే. నీవు గూర్తేని మేనల్లునికి వదీయ పుత్త్రు ద్రోణుని పుత్త్రుండు బొలియఁజేయు
వాఁడె పతిహీన యగుపాపవతికిఁ బుత్త్రహీనతయును బాటిల్లిన నెట్లు బ్రదుకు. 180

ఉ. నందనుచావు నిక్కమయి నం జను టప్పుడ కలు దేవకీ
నందన యెల్లభంగి నరనందనుపాలికి [1]నాజి కేచి పో
వం[2]దనతోడి తెంపునను వారక యిచ్చినబాస దప్పె నిం
కం దనుఁ గన్న దెప్ప నొడికాఁ డని కొంకెదఁ గాని యచ్యుతా. 181

తే. పద్మనాభుండు వచ్చినబాలుఁ జంకఁ, బెట్టికొనిపోయి మ్రొక్కింతుఁ బ్రీతి యొసఁగ
నని తలంచుచునుండితి నమ్మనోరథంబు విఫలంబుగాఁ జేసె ద్రౌణి పేర్చి. 182

వ. అని యంత నిలువనివలవంత పెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున నిడి
కొని తదాననం బాలోకించి. 183

ఆ. తాత లోకగురుఁడు దామోదరుఁడు వచ్చి, యుండ లేచి మ్రొక్కు పుజ్జ్వలాంగ
ధర్మవేది యైన తండ్రికిఁ బుట్టి యు, ధర్మపరుఁడ వగుట తగునె నీకు. 184

క. కను విచ్చి కొంతిఁ జూడుము, ననుఁ జూడుము ద్రుపదనృపతనయఁ జూడుము నీ
జనకునితల్లి సుభద్రం, గని, దనయా చూడు తల యెత్తి దరహాసముతోన్. 185

చ. అని పలవించి యాసరసజానన మూర్ఛ మునింగి నేల వ్రా

1. క. శ్యాతి కేచి. 2. క, దనతోడి తెంపునను.

లినఁ గరుణాంబుపెంపున విహ్వలితఁ బొందుమనంబులుఁ జలా
ష్పనయనయుగ్మకంబులును బొడమువారలు నైనకౌరవాం
గనలయులంతఁ గాంచిన పగల్ మిగులుం బగవారికేనియున్. 186

వ. ఒక్కింతసేపునకుం దెలి వొంది విరాటనందన ధరాతలంబునం బడి యున్నభంగిన ఫాలతలంబునం గేలు మోడ్చి గోపాలదేవునకు మ్రొక్కుచు వెక్కుచు శరణు శరణని పలికిన నప్పరమకృపాపరుం డొడఁ గొడకు మనుచుఁ బాద ప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి యశ్వత్థామ ప్రయుక్తంబును బ్రహ్మశిరోనామకంబును నగు నమ్మహాస్త్రం బుపసంహరించి యబ్బాలశవంబు శయ్యాతలంబునం బెట్టం బనిచి దరోల్లసితులై నయోల్లవారలం గలయం గనుంగొని. 188

కృష్ణుఁడు మృతజాతుం డైన పరీక్షితు లబ్ధజీవితుం జేయుట.

తే. మీఁద బొంకఁ గుమారుఁ డపేశ్యమీరు వినఁగ, నాడ నిబ్బాలు బ్రదికింతుఁ జూడుఁ డఖిల
జనులు నిప్పుడ చేలుండు సంతసమున, దీని విని పాండవులు ప్రీతిఁ బొందువారు.

వ. అని ప్రతిజ్ఞ సేసి యిట్లనియె. 189

తే. పగఱయెడ నైన నే బొంకు పలుకనేని, సమరముఖమున నెన్నఁడుఁ జలితవృత్తిఁ
బిఱిఁది కడుగిడనేని నిప్పిన్నవాని, యంగమున జీవ మిప్పుడ యావహిల్లు. 190

క. ధరణీసురకులము నెడం, గర మెక్కుడు ప్రియము నాకుఁ గలదేని సధ
ర్మరతుఁడ నయ్యేని నియ్యు, త్తరాసుతుఁడు లబ్ధజీవితత్వము నొందున్. 191

క. నరునియెడ నామనంబున, విరోధ మెన్నఁడును నేమివిధమున నైనం
బొరయమి నిజమేనియు సుస్థిరముగ నిబ్బాలు మేన జీవము సెందున్. 192

క. నిక్కపుధర్మువునన మే, నక్కంసాదుల వధింతు నటారసి చూడన్
నిక్కువమై యార్యజనుల, కెక్కినయేని నసువర్గ మీశిశువు గనున్. 193

తే. మహితసత్యంబుఁ బరమధర్మంబు గాఢ, నిర్మల బ్రహ్మచర్యంబు నిత్యసుప్ర
తిష్ఠితంబులై నాయందుఁ దేజరిల్లు, నేని నిబ్బాలునకు జీవ మిపుడ వచ్చు.

వ. అని యిట్లు పురుషోత్తముండు వలికిన. 195

సీ. బాలుని మేనికిఁ బ్రాణముల్ వచ్చిన, నల్లన కదలెఁ దపదంగకములు
మఱి కను విచ్చె నత్తెఱఁగు దెల్లంబుగాఁ గని గొంతి మొదలైన కౌరవాంగ
నలు మనంబులు నిండి [1]యలువులఁ బొంగెడు, నానందపూరంబులనఁగఁ బొల్చు
హర్షబాష్పములు రోమాంచకంచుకిత దేహంబులు నై యలరార నఖిల

తే. జనసమూహమ్ములును సంతసమునఁ దేల, గగనమున దివ్యవాణి యక్కమలనాభుఁ
బొగడె నీతం డిట్టియున్న యప్పుణ్యగృహము, గరము శోభిల్లె నప్పుడు కౌరవేంద్ర.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తికొని యొయ్యన నా మలరంగ వచ్చి య
త్యుత్తమతేజుఁ డైన పురుషోత్తము నంఘ్రులపొంత భూస్థలిం

1. క. యలవుల మిగుల బొంగునానంద. 2. 'యత్యుత్తమతేజుఁ డైన పురుషోత్తము' అని పెక్కు ప్రతులు.

జిత్త మెలర్పఁగా దనదు§చెన్నగుఫాలము సేర్చినన్ ముదా
యుత్తమనస్కుఁడై యతఁడు § సాదరభావుల గారవించుచున్. 197

క. వినుతబహురత్నవిస్ఫుర,దనేకభూషణనికాయ § మబ్బాలున కి
చ్చినఁ దక్క టియదువీరులు, జననాయక యొసఁగి రక్కజంబుగఁ దొడవుల్. 198

వ. అప్పుడు. 199

తే. ఆత్మకులము పరిక్షీణ § మైన జనన, మొందెఁ గాన యయ్యభిమన్యు§నందనునకు
నన్వర్థమగుఁ బరీక్షిన్నామ§మనియెఁ గృష్ణుఁ, డఖిలజనములు వినఁ బౌర§వాధినాథ.

వ. అట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు గలిగించె నట్టిపరమపురుషుచేతం బ్రత్యుజ్జీవితుం డైనభవజ్జనకుం డేకమాసవయస్కుం డగుగొలంది నొక్కపుణ్య దివసంబున. 201

సీ. ధర్మసుతుండును § దమ్ములు నమ్మహా, కనక మల్లిత్తించికొని యుదాత్త
వైభవ మొసఁగంగ § వచ్చినఁ గృష్ణుని, యుక్తులై వికురయు§యుత్సు లర్థిఁ
గస్తూరినీళ్ల§కలయంపులను గప్పు,రంపు ముగ్గుల బహు§రత్నతోర
ణములఁ దోరపుము§త్తియమ్ముల నొనర్చిన,ప్రాలంబమాలికా§పంక్తులను బ

తే. సింకిపూర్ణకుంభముల విశిష్టమరక,త ప్రకరమయకదళికా§స్తంభములను
గరము దోరంబు చిత్రరేఖంబుఁగా న, లంకరించిరి పురముఁ గుశలప్రదీప. 202

వ. సకలజనంబులుం గయిసేసి కలయం బొలయ నప్పు డప్పురంబు చంద్రోదయ ఘూర్ణమానం బయినయర్ణవంబు ననుకరించె నయ్యచ్యుతుండును బలదేవ సాత్యకి ప్రద్యుమ్న ప్రముఖులు ప్రమోదంబునం బొంపిరివోవుచుం బెంపారు నలంకారంబుల నభినవోదారచారుత్వంబు వహించి యెదురుచని పాండవులం గని రయ్యిరుదెఱంగులవారలును సౌహార్ద్రంబును సౌముఖ్యంబును సౌజన్యంబును నత్యంతంబును మెఱయ నర్హంబు లగునాచారంబులు నడపి రట్లు కృష్ణ సమేతులై యా రాజులు హర్షోల్లాసభాసమానులగుచు నాసమగ్ర కాంచన సంచయంబుఁ బురస్కరించుకొని పురప్రవేశం బాచరించి. 203

క. తొలుత ధృతరాష్ట్రగాంధా,రులఁ గని మఱి కొంతిఁ గాంచి § ప్రోన్మలచ్చ
క్షులుఁ బ్రమదసంభరితచి,త్తులు నయ్యయుయుత్సునిన్ విదురునిం బ్రీతిన్. 204

వ. కానిపించికొని సంభావించి సంభృతాహ్లాదు లగుచుం గృష్ణాదియాదవలోకంబు నుం దారు నొకరమ్యమండపంబున నుండి రట్టియెడ. 205

వ్యాసుఁడు కృష్ణసహితులై యున్నపాండవులయొద్దకు వచ్చుట.

సీ. తగువారిఁ గాంచి య§త్యద్భుతం బగు భవ,జ్జనకు తెఱంగు వి§స్తార మొప్పఁ
జెప్పిన వార లా§శ్చర్యరువాటు సంతసం,బును నెమ్మనంబులఁ § బెనఁగొనంగఁ
బద్మనాభు ననేక§భంగుల వినుతించి, యిట్టివి వింత లే § యెల్లనాఁడు
నిట్టుల కాక మా§యెడ నీదుకరుణ పెం, పని యభినందించి § రట్లు గలసి

తే. నెమ్మిఁ దారును గృష్ణుండు సమ్మదమున, నుచితవర్తనకలితులై యుండఁ గొన్ని
దినసములకు సంప్రీతి నేతెంచె బోధ, భాసితుం డైనసత్యవతీసుతుండు. 206

క. ఏతెంచిన గోవిందస, మేతంబుగ నెదురుకొని మహితపూజాసం
ప్రీతుఁ గావించి యతని, మీఁ దాతలు గొలిచి యుండి యమ్మృదువచనములన్. 207

వ. సముచితగోష్ఠి నడపి యప్పాండవాగ్రజుండు మునిజనాగ్రణితో భవత్ప్రసాదం
బునం బడిసిన యమ్మహాధనంబు సుపానీయంబుగా నశ్వమేధయాగంబునం దుప
యోగంబు నొందింపం గోరెద ననుజ్ఞ యీవే యనిన సంతసిల్లి యాసంయమి
వరుం డిట్లనియె. 208

ఆ. తురగమేధమఖసమస్తసారము నీ, వది సమగ్రదక్షిణాన్వితముగఁ
జేసి నిర్మలత్వశోభ సమానుండవై, వెలయు మమృతకిరణకులవరేణ్య. 209

చ. అనవుడుఁ బ్రీతి నొంది యతఁ డచ్యుతుఁ గన్గొని భవ్యమైన యు
ప్పని దగ నిట్లు సేయు మని పన్నుము తల్లియుఁ దండ్రియున్ గురుం
డును సచివుండు నిష్టసఖుండును గరుణాకర నీవ మాకు నీ
యనుపమముఖ్యవృత్తి జగ మంతటికిన్ గతి వేయు నేటికిన్. 210

వ. అనిన విని యంబుజనాభుం డతని కిట్లనియె. 211

ఉ. వ్యాసులు పంచినట్ల నియమాఢ్యతఁ జేయుద మశ్వమేధముం
జేసి కృతార్థతం బొరసి చిత్తము నెవ్వగఁ దొల్లఁ బాచి కా
మ్మానుకృతంబు ధర్మనిచయప్రవరం బని యేన చెప్పి కా
దే సుగుణాభిరామ నిను దీనికిఁ బొన్పితి మున్న దృఢంబుగన్. 212

చ. అనుమతి యింక వేఱొకఁడయుం దలఁ పేటికిఁ గౌరవేంద్ర న
న్ననుపుము వాజిమేధకరణంబున కేపని సేయువాఁడ నీ
యనుజులు నల్వురే నొకఁడ నధ్వరకార్యము లెల్ల నీదు న
మ్మనమున కెక్కఁ జేయుదుము మాన్యచరిత్ర తొడంగు మర్థితోన్. 213

సీ. అన విని సమ్మోద మారినచిత్తంబుతో నభినందించి యానరేంద్ర
వరుఁడు పారాశర్యువలనను గనుంగొని, దీక్షకు నయ్యెడుదినము విచారు
నూచి యా సంస్కార మాచరింపుఁడు దయ, ననవుడు నమ్మునియు యాజ్ఞవల్క్యుఁ
జేకొని పైలునిఁ బ్రీతి నెఱింగించి, వారును నేనును వసుమతీశ

ఆ. నడపవలయుపనులు నడపువారము చైత్ర, మాసకలితపౌర్ణమాసి నిప్పు
డరయఁ బనుపు మేధ్యమగు తురంగముఁ దద్జ్ఞు, లైనయట్టి జనుల నంచితాత్మ.

క. వేదోక్తవిధిసహితధ, వ్యాదరమున విడువఁ బడిన యయ్యశ్వం బీ
మేదినిఁ గలయం దిరుగును, నీ దగునిర్మలయశంబు నెఱయ వెలయఁగన్. 215

వ. సర్వసంభారంబులును సమకట్టింపుము స్రుక్స్రువాది క్రతుసాధనంబులు గ్రొత్త

లుగాఁ గనకంబునం గావింపం బనుపు మని చెప్పిన వ్యాసునకుం దేఁడు. 216

క. తురగపరీక్షావిదు లగుపురుషులఁ బిలపించి యశ్వరత్నము గొను మ
త్తరయుండు మనకోదమలలో, నిరుపమలక్షణముగ నొక్కటిచేయంబునం గాక. 217

వ. అని పలికి కర్మాధికారులం గనుంగొని యజ్ఞంబునకు వలయు యాగభాండ
ప్రముఖంబు లయినసాధనంబులును స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణ
మయంబులుగా వేగంబ చేయింపవలయు నని నియోగించిన నట్ల చేసి యాని
చని వారును బదంపడి. 218

క. తురగంబును సంభారో,త్కరమును గొని వచ్చి చూప ధర్మజుఁడు పరా
శరసుతునకు వాని వినయ,పరత సమర్పించెఁ గురునృపాలవరేణ్యా. 219

క. ముని యశ్వముఁ జూచి కరం, బనురాగముఁ బొంది మేధ్య మగు నిది దీనిన్
వినుతవిధానమున విడుత, మనవుడుఁ దత్రఁ దనసిక్కోడ నాదరి మంరన్. 220

తే. దీని రక్షింప నర్హుండు మానసీయు,బోధ యొవ్వండు సిదు సక్రసవ్యబద్ది నరసి
యిట్టివాఁ డని యానతి యిమ్ము నాకు, ననిన సమ్ముని నాథుఁ డిట్లు వ్యాధపుత్రోడ.

క. దివ్యాస్త్రవిదుఁడు ధిమణా,భవ్యుఁడు శౌర్యోత్తముండు పార్థుఁడు దగు న
శ్వావ్యాపనక్రియకు నితఁ, డవ్యాహతి నాచరించు నక్కార్యంబున్. 222

వ. భీమసేనుండును నకులుండును మనరాష్ట్రంబు రక్షించువారు భవదీయకుటుంబ
కార్యంబులు సహదేవుండు నడపువాఁ డని నిర్దేశించిన. 223

—●● ధర్మజుం డర్జును యజ్ఞాశ్వరక్షణంబునకు నియోగించుట. ●●—

సీ. అమ్మహీవల్లభుఁ డర్జునుఁ బిలిచి యుధ్వరయోగ్యమైన యత్తురగరత్న
మనఘ సంరక్షణీయంబు నీ కోరులకు, నప్పని శక్యంబె యెల్ల భంగి
నిక్కార్యమునకు నీ వేఁగంగవలయు నీ,యుచితాశ్వము చరియించుచుండ
నెసనెడ రాజుల కే నశ్వమేధదీక్షితుఁడ నై యుండుట సెప్ప ముచిత

తే. కరణనియతి నిరోధంబు గాకయుండ, నడపు మని చెప్పి భీమునకనకులు రాష్ట్ర
గోపనమునకు సహదేవుఁ గులకుటుంబ,సమితిరక్షకుఁ బనిచి యుత్సాహ మెసఁగ.

వ. మఱియునుం గలయలంతిపనుల కర్హజనంబుల నియోగించి గాంధారీధృతరాష్ట్రుల
యనుమతి వడసి కుంతీసమనుజ్ఞాతుం డయి యశ్వమేధమఖంబునకు నున్ముఖుం
డయ్యె నని యిట్లు ధర్మపుత్త్రపుణ్యచరిత్రంబు సెప్పిన నప్పరమధార్మికుండు సకల
లోకమనోజ్ఞం బగు యజ్ఞం బెవ్విధంబున నిర్వహించె వినువేడ్క నాచిత్తంబునం
జిగు రొత్తెడుఁ జెప్పవే యనుటయు. 225

ఉ. మానమదాదిదోషపరిమార్జననిర్మలచిత్తభక్త స
న్మానసలోల పీతపరిధానవిభూతివిశాల శాంతతా
హీనవిదూర విశ్వహితకేలివిచార నిరామయావ్యయ

స్థానకసిద్ధిమంగళవిధాయక[1]వేదసఖ్యైకనాయకా. 226

క. అనపేక్షితఫలతాశో, భనమహనీయక్రియావిధానాత్మకధూ
పనితాంతధూతసంశ్రిత,జనపాప పరమమిత్రసత్యాలాపా. 227

మాలిని. తరుణజరఠభావద్రావణోదారమూర్తీ
హారణకరణనిర్మూలనతాభ్యంతరార్తీ
మరణజననదుఃఖోన్మాదహృత్పుణ్యకీర్తీ
చరణకమలపూజాశాలిచిత్తానువర్తీ. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున యశ్వమేధపర్వంబునందుఁ దృతీయాశ్వాసము. 229



1. గ. వేద[illegible]ఖ్యైకనాయకా. జ. వేదపదైకనాయకా.

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, చతుర్థాశ్వాసము



విద్యాశాంతికృతి
ప్రావీణ్య [1]నిరూఢిగణ్యా పాదనతిత్రసం
సేవనతత్పరహృత్కమ
లావాసకృతప్రమోద హరిహరనాథా. 1

ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిం దిరుగ విడుచుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లశ్వమేధయాగోద్యోగప్రద్యోతితుం డయినపాండవాగ్రజుదీక్షకు నర్హం బయినదినంబు సంప్రాప్తం బగుటయు మాఘపూర్ణికదత్తశుభముహూర్తంబునం గృష్ణద్వైపాయనాదులైన ఋత్విజులు వేదవిహితవిధానమహితంబుగ నక్కురుక్షితిపతి దీక్షితుం జేసి రవ్వసుంధరావల్లభుండు సంవీతక్షౌమకృష్ణాజినుండును దండపాణియు నయి ఋత్విగ్జనంబులు బలయం బరమసంయమపరివృతప్రజాపతిప్రఖ్యుండును గనత్కాంచనాభరణభూషితుండు నయి బహుళప్రభలు నిగుడ సందీప్తపావకసన్నిభుండును నగుచు వెలెంగెం దత్తుల్యాకల్పకల్పనంబున ఋత్విగ్జనసమాజంబునుం దేజరిల్లె నావేదవ్యాసమహామునిచేత శాస్త్రోక్తప్రకారంబున ముక్తం బయి హయోత్తమంబు వెడలె నప్పుడు. 2

సీ. వివ్వచ్చుం డాగమోక్తవిధివంతముగ ధర్మనందను నామంత్రణంబు వడసి
గాండీవపాణి యై కవదొనల్ ధరియించి, తేజోవిశేషంబు రాజితముగ
నయ్యశ్వరత్నంబు ననుసరింపఁగఁ బ్రజ, బాలురు వృద్ధులు భామినులును
లోనుగాఁ బఱతెంచి లోలత [2]నతనినా హయమును గనుఁగొను నప్పు డగ్గ

తే. లంపుసంతస మాత్మ జనింప నాజ్యనంబు లవ్వీరునకు దీవనలఁ బొగడ్త
లను బ్రమోద మొనర్చిరి శ్వనధిరవము, ననుకరించె నయ్యాలిపు నృపాగ్రగణ్య. 3

1. క. నిరూఢ గణ్యపాదసతత, 2. గ. నతని హ్యామును గనుంగొను.

వ. ఇవ్విధంబునం జను నా కవ్వడితోడ యజ్ఞకర్మకుశలుండైన యాజ్ఞవల్క్యశిష్యుం డర్హవిధానంబులకయి మాననీయవిప్రజనసహితంబుగాఁ జనియె నప్పరమతురంగంబు ధరణిం బ్రదక్షిణరూపంబునం దిరిగి యుత్తరాభిముఖం బై యల్లనల్లన యరుగుచుండ నర్జునుం డనుసరించి పాలనపరుం డగుచు బ్రవర్తింపం ద్రిగర్తదేశంబునందు. 4

అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధము సేయుట.

సీ. ఉద్ధతులై త్రిగర్తోర్వరాపతిపుత్త్ర,పౌత్త్రు లయ్యశ్వంబుఁ బట్టువారు
గాఁ బూని తేరులు గడురయంబునఁ దోలి,కొని యడ్డముగ వచ్చి క్రోలుతలకు
నలుగక నరుఁ డన్న యానతి దలఁచియా,రాజకుమారవర్గంబుతోడ
ధర్మజునశ్వమేధంబున కపకార, మాచరించుట పాప మదియుఁ గాక
తే. యేము మీరును బాంధవులము సకల మనఁగ, నడచుటొప్పదె పగయేల వంగ వారు
సూర్యవర్మనాయకుఁ డగుశూరతముకు, మారుఁ డగ్రణి గాఁగ సుదారలీల. 5

చ. కవిసిన వారితో మఱియుఁ గవ్వడి యిట్టు లనుక్ దయాధురా
ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమరక్షకు నంపునప్డు భూ
పవితతి నెల్లనుం దగయె భారతయుద్ధమునందు వాలరం
దివిరి వధింపఁ గాదు కృపఁ దిన్నఁదనం బెసఁగం జరింపుమీ. 6

చ. అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిర యేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్క యనిఁ దప్పఁగఁ ద్రోవుము కిన్క మాను మ
న్నవచనవృత్తి నా దగుపు కనంబున నెక్కొని యుక్కఁ జేసి యా
హవమున గొల్లనయ్యెడఁ బ్రియంబులు గావొకొ మీకుఁ బ్రాణముల్.

చ. వలవదు పొండనంగ సలుకవం బడ కేవున సూర్యవర్మ య
బ్బలియుని మీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిష్ణుఁ డ
మ్ముల నది యెఱ్ఱనయ్యెఁ దనకమ్మ మనుతమ్మికి లేఁత యెండ యై
[1]చెలువము చెన్ను వింతలుగఁ జేయఁగ నావిజయుండు భూవరా. 8

వ. అట్టియెడ. 9

తే. సూర్యవర్మనితమ్ముండు శూరవరుఁడు, కేతువర్మ గాండీవిపై శాతబాణ
వృష్టిఁ గురియుచు సుదుర్ధరవేగ మొప్ప, నన్నుఁ గడచి బెట్టడరిన నన్నరుండు. 10

చ. అతని నొదుంగ సేయుటయు నాతనితమ్ముఁడు చండవిక్రమో
ద్ధతి ధృతివర్మ నాముఁ డతిదారుణసాయకపంక్తి సత్వరా
తతగతిఁ బర్వఁ జేయుచుఁ బృథాసుతుఁ దాఁకిన మెచ్చి వచ్చి య
య్యతిరథవర్యుఁ డవ్విభు తురంగము లేయఁగ నొల్ల కుండుటన్. 11

చ. శరములు ద్రుంప నాతఁడు వెసన్ బలునారసముల్ నిగిడ్చి న

1. చెలువముఁ జెన్ను.

న్నరుపయినాబలిష్ఠుఁడు మస్తకంబునఁ గొండొక యుల్క పుట్టి య
న్నరవరసూతి పేరురమునం బదితూఁపులు గ్రుచ్చి దాఁకి
దెరలక యక్కుమారుఁకును § దీవ్రశరంబులఁ జేయి నొంచినన్. 12

ఆ. ముష్టి సడలి చోద్యముగను గాండీవ మిలఁ, బడిన నా త్రిగర్తబలము దెసలు
సెలఁగనార్చె [1]నంతఁ జేయు నొవ్వఁగ లాఘవము, లక్కుమారవక్త్రముం గ్రోధి. 13

తే. ఇంద్రధనువుచందంబున § నెసక మెసఁగు
గాండీవముపాటు గంటిరే § చండవిక్ర
మాభిరాముండు గాండీవి § యన్నపలుకు
లకు మహోగ్రత సూప నోపల్లఁడు గాక. 14

ఉ. నిక్క పుఁగిన్క వచ్చిన నరుని నొసలం గను సూపు [2]వింటిపా
టక్కట రిత్త వోవునె నృపాత్మజులం దెగటార్చు నీతఁ డిం
దొక్కఁడుఁ ద్రిక్క కుండ మన § మొప్పమి నూడఁగ నేల మున్న పే
రుక్కునఁ దాఁకు టొప్పు నని § యొక్కట నర్జును నాక్రమించినన్. 15

క. ఆట మున్న గాండివం బుత్కటరయమున నెత్తి కోపదహనుం డత్యు
ద్భటమూర్తిఁ దాల్చె నన మిక్కుటమై కడగంటి కెంపు § గొమరారంగన్. 16

వ. ఆ భీభత్సుండు. 17

క. పిడుగులు వడిఁ బెక్కొక్కటఁ, బడియెడు ననఁ దొరఁగఁ జేసెఁ బటువిశిఖముల
ప్పుడు మేదిని దోఁపద చె, ప్పెడుకొలఁదియె రథికవరులఁ బీనుఁగుఁబెంటల్. 18

శా. ఆ యుగ్రోద్ధతి నూచి వెల్కటి త్రిగర్తానీకముల్ సల్గడం
బాయం బాఱెఁ దదాప్తు లేము దగ నీరపం పోసి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పేర్మిగ మమున్ § జేకొమ్ము సమ్యగ్దయా
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారి నెల్లం గృపన్. 19

వ. అట్లు వెనుకొనక నిలిచి మొలుం గత్తి వారలతో మీరిట్లు ప్రాణంబులు గాచి కొనుండు నాపంచినపని సేయం బూని బుద్ధి గలిగి సుఖులరై యుండుం డని పలికి యయ్యశ్వంబు ననుసరించి నది క్రమగతిం బ్రాగ్జ్యోతిషపురపరిసరంబునకుం బోయిన దాని తెఱం గాకర్ణించి. 20

సీ. భగదత్తతనయుండు § బాహుగర్వంబున, బాల్యసిద్ధం బగుఁ జాపల్యమునను
బురినిర్గమించి యత్తురగంబు వెలిపించి, కొనిపోవఁ గాంచి యయ్యర్జునుఁడు గాండి
వముసజ్యముగఁ జేసి § వాలమ్ములొక్కట, నక్కుమారుని మీఁదఁ బెక్కు గురియ
నవ్వజ్రదత్తుండు నొవ్వ దన్కిన దాని, నచ్చట దిగఁ ద్రావి చొచ్చెఁ బురము

తే. సత్వరంబుగ నటు సొచ్చి సామజంబుఁ, బన్నఁగాఁ బంచి వెస నెక్కి బలముఁ జలము
వీఁకయును నొప్ప నన్నరుఁ దాఁకి శాత,ఘనశరంబులఁ బరఁగించెఁ గౌరవేంద్ర.

1. గ. నందు పేయంగ. 2. జ. వింటిపాఁ డక్కట.

క. నడుమన వానిం బార్థుఁడు, వాడిగా నేయంగఁ గనలి । భూపకుమారుం
డడరించెఁ దోమరంబులు, గడఁ జెక్కవి మిడుతగుంపు గతిఁ గవియంగన్. 22

ఆ. అనలశిఖలు వోలె నయ్యమ్ములగమి వాని, రూపు మాపి యున్న । రుండు వాఁడి
లేనిదొడ్డతూఁపు । లేనింటఁ దొడి రాచ, కొడుకు నేసెఁ దూలి । పుడమిఁ గూల. 23

క. కూలియు నీడం బోవక, బాలుఁడు రయ మార దంతి । వైకిం జని దో
ర్లీల మెఱయ నరుఁ బటుశర, జాలంబులఁ బొదివె గగన । చరు లగ్గింపన్. 24

చ. అతఁడును దివ్యబాణముల । నా భగదత్తతనూజదంతి నా
వృతముగఁ జేసె నట్లు పృథి । వీవరనందన యేమి సెప్పుదున్
శతమఖపుత్త్రుతోడ [1]దివ్యసత్త్వ యు ముగ్ర రణం బొనర్చె న
ద్భుత మెసఁగం జతుర్థదిన । ముం దెగునంతకుఁ బోరె ధీరతన్. 25

వ. [2](తెగిమొదుసమయంబున). 26

ఆ. అక్కుమారుఁ డేచి । యర్జున యర్జున, యేను గలుగ నీకు । నెందుఁ బోవ
వచ్చు వృద్ధుఁ డైన । వాఁడు గావునఁ దండ్రి, సమసె నట్లు నన్ను । [3]సమతె జేల.

వ. అని యదల్చి. 28

క. పెనుసెలయేఱులు వారఁగఁ, దనరుగిరియుఁబోలె బహుమ । దంబుల దొరఁగం
గనుపట్టుకుంజరము సిం, హానిభుం డగుపార్థుఁ । డడరం జేసె. 29

క. అది [4]ఫూత్కారము సేసిన, నొదవినకరశీకరముల । నుర్వీవర యం
బుదముక్తసలిలధారలు, వొదివినగిరివోలె నిం ద్ర । పుత్త్రుం డొప్పెన్.

చ. కరి యిటు లేపునం గవియఁ । గా భగదత్తసుతుండు దీప్తని
ష్ఠురశరపంక్తి నాహవప । టుత్వము సూపిన నల్పకోపసుం
ధరుఁ డగుచుం నరుండు శత । ధారనిభం బగునారసంబు భీ
కరగతి నేయఁ గూలె నది । కౌరవనాయక పర్వతాకృతిన్. 31

క. కూలిన నేలకు వచ్చిన, బాలుం గని నాకలోక । పతిసుతుఁడు దయా
లోలుం డై మార్దవహృ, ద్యాలాపము లొప్ప నిట్టు । లను నాతనితోన్. 32

వ. ధర్మతనయుం డశ్వమేధదీక్షితుం డయి యత్తురంగంబుపజ్జ నన్నుం బుత్తెంచు
నప్పుడు. 33

క. చంపకుమీ రాజుల నను, కంపాతిశయంబు మెఱయఁ । గా నడవుము నీ
వెం పనుకుసుమమునకు న్పా, పం బొనరించుటయ సౌర । భముగ నెఱుఁగుమీ. 34

క. అనిమొం గావున నీపైఁ, గినుక వొడమ దలుక విడువు । గీతయశం డా
జనపతి యాగంబునకుం, జను దేరఁగ వలయు బంధు । జనములు నీవున్. 35

ఆ. అధిపతనయ నిన్ను । నామంత్రితునిఁ జేసి, పోవుచున్నవాఁడ । నీవు హాస్తి
పురికి భావిచైత్ర । మునఁ బున్నమకు ముద, మొదవ నరుగుదెంచు । టొప్పుఁజేయు.

---

1. క. చ. ట దివసద్వయము,,, దృతీయదినముం. 2. ఇది కొక్కటలేదు. 3. గ సుని తె. 4. చ. ఘీంకారము.

క. అనిన నతఁ డట్లు సేసె నని, వినతముం జేఁటయును బ్రీతి సితసముం దభినం
దన మాచరించి యాశ్వము, వెనుకఁ జనియెఁ బూరుకులపవిత్ర చరిత్రా. 37

అర్జునుఁడు సింధుదేశాధీశులతోడ యుద్ధంబు సేయుట.

వ. అది సింధుదేశక్షత్త్రియగుటంబు భారతరణహతుం డయిన సైంధవబాంధవులపుత్త్ర
పౌత్త్రులు పూర్వవైరంబు వాటించి యాటోపంబున ననేకసహస్రసంఖ్యలరథి
కులు రాజనందనులుం గూడుకొని కిరీటిపై నడచి రట్టియెడ. 38

సీ. అరుణాంబుదంబులు వరలఁగి పెన్నెత్తురుఁ, గండలుఁ గురిసె మార్తాండబింబ
మసితారుణచ్ఛాయ మగ్నోల్క నుల్కాతతిఁ, దెల్లదిక్కులఁ బెల్లు డుల్లె నశ్వ
సహితంబుగా సవ్యసాచిఁ జుట్టును ముట్టి, యతనిపై నరయోధ్యవితతి రొక్క
పెట్ట శస్త్రాస్త్రముల్ పెట్టుగాఁ గురిసిన, నప్పాండవుఁడు వెనుకఁ దప్పి సోలె
తే. నేమి సెప్పుదు నీకు నుద్దామవిక్ర
మాభిరాముండు నాఁ జనునక్కిరీటి
కరము కరము బెండగుటయు గాండివంబు
వసి వోఁ బుడమిపైఁ గురునరపతివరేణ్య. 39

చ. అనిమిషులున్ మునీశ్వరులు నప్పుడు శోకమునన్ మునింగి య
ర్జునజయకాంక్షులై నియతి శుద్ధి [1]వహించి సవీర్యమంత్రసా
ధనపరులైరి తెప్పిఱి యతండు ధనుర్ధరుఁడున్ సముల్లస
త్తనువిభవోజ్జ్వలుండు సముదగ్రమనస్కుఁడు నయ్యె భూవరా. 40

వ. ఇట్లు తెలివొంది విజృంభించి. 41

శా. నారాచప్రముఖాస్త్రజాలపటువిన్యాసంబు తీవ్రత్వరా
ఘోరం బై విలసిల్లఁ జేయ సమరక్షోణీతలం బంతయున్
వైరివ్రాతశవావృతం బగుడు గీర్వాణుల్ మునుల్ సిద్ధు ల
వ్వీరుం బ్రస్తుతి సేయుచుం బొదలి రుద్వేలప్రమోదంబునన్. 42

వ. హతశేషం బైన యాసింధురాజకుమారసైన్యంబు దైన్యంబు నొంది నలుదిక్కుల
విచ్చియు నొచ్చియు నివ్వచ్చుండు రణధరణిం బొలిచి నిలుచుటఁ జూచి మాత్స
ర్యధుర్యం బై మగుడం బోరికిం బూని యడరిన నప్పురందరనందనుం డందలి
యధికముఖ్యులతోడం దమయన్న సెప్పినవాక్యంబు లుపన్యసించి మీరేల జాలిం
బడియెదరు ప్రాణంబులు మీకింత సేఁ దయ్యెనే యని పలికినను నిలువక వైపయి
వా రురవణించిన. 43

క. నవ్వుచు నానాశరముల, నవ్వీరులఁ బొలియఁ జేయ నంతయు విని తా
నవ్వగతో దుస్సల యా, కవ్వడిఁ బౌత్త్రాన్వితముగఁ గానఁగ వచ్చెన్. 44

సీ. వచ్చి కన్నీళ్లు వదనంబుపై వెల్లిగొన రోదనంబు సేసిన నతండు ---- -

1. గ. వహించిన వీర్యమంత్ర.

దయ నిలిపెదవో యని యేడ్చుచుండ నప్పుడతుల, పౌత్త్రునిఁ జూపి యుగ్రబాష్పలుఁ గావు
మితఁడు మీ యల్లునిసుతుఁ డన్న నప్పార్థుఁ, డిప్పుడు నాయల్లుఁ డెచట నున్న
వాఁ డని యడిగిన వనిత వెక్కుచు నతం, డాత్మజుజనకుఁ దుగ్రాహవమున

తే. ననఘునీచేతఁ జెడుట దా విని నితాంత, శోకమగ్నుఁడై యుండి నీరాక బిట్టు
వినుట వెగిలి ప్రాణంబు విడిచె ననుచుఁ, దెలుఁగు గడలుకొనంగఁ [1]బెగ్లేడ్చె నధిప.

వ. అప్పుడు శోకాక్రాంతుండయి గాండీవి వదనంబు వాంచి యుండ నయ్యుగ్మలి యతని నుద్దేశించి. 46

సీ. ధార్తరాష్ట్రీ కీడు దలఁపక సైంధవు గొఱగామి తెల్లను మఱచి తండ్రి
లేనియీ శిశువుపై నూనితం బైనకృ,యక్కటికంపుఁజూ పడరఁ జేయు
మాశ్రితవత్సల యనుచు నబ్బాలునిఁ, జరణానతునిఁ జేసి శరణు శరణు
కృప నన్ను రక్షింపు కీర్తియు ధర్మంబుఁ, జేకొను మనవుడుఁ జిత్త [2]మడల

తే. రాచకోల మిదిగాఁ బ్రసేక్రౌర్యమూల, మని తలంచుచు నాతఁడయ్యతివతోడ
నధమవృత్తిసుయోధనుం డంతకంటె, నేముఁ గొఱగాము మాచేతనింతవుట్టె.

క. అనుపలుకు వలికి బహువాంఛనముల నూరార్చి యాసుదతిమస్తకముం
దనయక్కునఁ జేర్చి యుబ్బఁ, జనుము వగవు దక్కి యని ప్రసాదభరితుఁడై. 48

వ. వీడ్కొలిపిన దుస్సల దనమనుమనిం దమబలంబులం గొని ప్రియంబునం జనియె నయ్యనిమిషపతిసుతుండును గ్రతువిషయంబు లయి వలయు ననుష్ఠానంబులు విధివంతంబులుగాఁ జలుపుచుఁ దురంగంబు వెనుకం దా రా మృగానుసారి యయిన పినాకపాణిచందంబునం బోవుచుండ నదియును నిజేచ్ఛ నఖిలదేశంబుల సుఖసంచారంబునం బ్రవర్తిల్లుచుఁ గ్రమంబున [2]మణిపూరపురంబునుపాంతంబున కరిగిన నన్నగరంబుపతి యైనబభ్రువాహనుండు నిజజనకుండయిన యర్జునురాక యాకర్ణించి. 49

ఆ. వినయ మెసఁగ నాత్మజనసమేతంబుగా, నరుగుదెంచి యతనిచరణములకుఁ
బ్రీతి నెఱఁగ నక్కిరీటి యన్నరపతి, నాదరింప కుండె మేదినీశ. 50

వ. అట్లుండి తనయునాదరంబునకుం గారణం బెఱుంగక సవిచారుండై యూరకున్న యక్కుమారునితో ధనంజయుం డిట్లనియె. 51

ఉ. యాగవిముక్తమై చనుహయంబున కడ్డము వచ్చి పట్టక
కీగతి మెత్తఁబాటు దగునే నృపధర్మవిహీనత రణో
ద్యోగము లేక తక్కు భయ ముల్లముఁ జేరఁగ నిచ్చు రాజు రా
జే గుణహీన పొమ్మనిన నేమియుఁ బల్కక తలఁడు గ్రమ్మఱన్. 52

సీ. అరిగి పట్టణవీథి నల్లన చనుచుండ, నర్జునుం డతనితో నాడినట్టి

1. గ. క. చ. బెట్టేడ్చె. 2 ట. మణిలి. మరియు పె, భూలతమునను దెనుఁగునను 'మణలూరపుర' మనియు 'మణిపూరపుర' మనియు రెండుపాఠము లున్నవి.

తెఱఁగెల్లఁ దన దగుదివ్యబోధంబునఁ, గని భుజంగోత్తమతనయ సదయ
వృత్తిఁ బాతాళంబు వెలువడి యవ్వరా, ధవునిపాలికిఁ జనుదెంచి యేను
మీతల్లి నాగేంద్రసూతి నులూపి నా, పేరు హితంబు సెప్పఁ బనిచె

తే. నరుగుదెంచితి వినుము మీయయ్య యపుడు
దలఁకొనుము రాజులకు నర్హ ధర్మమైన
యని యొనర్పుము దనతోడఁ బెనఁగు టధిక
సమ్మదము సేయు నక్కురుసత్తమునకు. 53

క. అనిన సభక్తికముగ నవ్వనితకుఁ బ్రణమిల్లి యాహవము జనకునితోఁ
జనునె యొనర్పఁగ నని యప్పనికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ. 54

క. నీ వింత దెలిపి పలికెద, వా విభుఁడును మున్న నన్ను ననుమతిఁ జేసెం
గావునఁ దల్లీ మీకుం, గావించెద నిద్దఱకు నఖండప్రియమున్. 55

బభ్రువాహనుం డర్జునునితో యుద్ధంబు సేయుట.

చ. అని నిజమందిరంబునకు నయ్యెలనాగఁ దగంగఁ బుచ్చి య
మ్మనుజవరుండు సాధనసమంచితమైనరథంబు నాత్తరే
ఖ నెఱయ నెక్కి యర్హపరికల్పితభూషణలేపనాంబరం
బును సమరోత్సవోద్ధతవిభూతియు నైతనమే నెలర్పఁగన్. 56

ఆ. ఎక్కి హంసకేతు వేత్తెఱఁ గ్రాలంగ, నరిగి యశ్వమునకు నడ్డపడఁగఁ
జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ, గురిసె నతఁడు నిశితశరచయంబు.

శా. వానిం దా నవలీలమైఁ దునిమి దుర్వారోద్యముం డద్రిభి
త్సూనుం డొక్కట నాత్మసూనునొడలం దూఁపుల్ సిగిడ్చెం బదా
ఱా నిశ్శంకుఁడు బాహుసారమద మేపాఱంగ నవ్వీరు మీఁ
దే నారాచము లైదునాలుగులు పృథ్వీనాథ నాటించినన్. 58

చ. మదిఁ గొనియాడి యారిపువిమర్దనుఁ డంచసిడంబు ద్రుంచియే
పొదవఁగ మేను నొంప నచలోద్ధతి నాతనిజత్రు వేసె బె
ట్టిద మగునారసంబునఁ గడిందిమగం డగుబభ్రువాహనుం
డది వడిపేర్మి శోణితజలార్ద్రిత నొందక యుచ్చి పోయినన్. 59

క. అమ్మేటిమగఁడు దనచాపమ్మూఁతగ నిల్చి సోలి పదపడి తెలి వొ
ల్లమ్మున నొలసిన నౌరా, యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్.

తే. పొగడి యేఁ దీవ్రశరములు నిగుడఁజేయ
నుద్ధతికి మంచిబంటవై శౌర్య మలరఁ
జూపు మిఁక రా యని పలికి వాలమ్ము లధిక
రయమున మెఱయంగ బరఁగించె రాజముఖ్య. 61

ఆ. మొనసి వాని నతఁడు ముత్తునియలు గాఁగఁ, జేయ మత్సరంబు చిత్తవృత్తిఁ

దనికి సత్వరముగఁ దద్గాత్రమున నుంచె, నటుఁడు పెక్కు మెఱుఁగుఁ గనారసములు.

ఉ. దానికి నీడఁ బోవక యుదగ్రపరాక్రమ పెంపు ప్రజకీ
లానిభ తర్క మెఱుంగులవిలాసము నింగి వెలుంగ నుద్భటుం
డై నిగిడించెఁ బార్థుహృదయమ్ముపై నారసము న్నశస్త్రవి
ద్యానిపుణత్వశాలి యగు నన్నరపాలసుతుండు భూవరా. 63

—అర్జునుఁడు బభ్రువాహనుని శరంబుచేతఁ బడమిం దెల్పుట.—

క. వడి నది వీపున వెడలినఁ, బడియెం బుడమిని నర్జునుండు పదపడి త్రెళ్లెం
గొడుకును ము న్నతఁ డేసిన, బెడిదంపు టేటులయాలంతఁ బృథ్వీనాథా. 64

క. అట్లు దనపతియును సుతుండును భండనంబునం బడుట విని శోకాక్రాంత యగుచుఁ జిత్రాంగద యులూపియుం దోడన చనుదేర నచ్చటికి వచ్చె నట్లు వచ్చి యచ్చెలువ యయ్యిరువురం గనుంగొని యుల్లంబు జల్లనం దల్లడిల్ల మూర్ఛమునింగి మేదినిం బడి కొంతవడికిం దెలిసి యులూపి నాలోకించి. 65

సీ. నీకతంబునఁ బతి నాకుమారునిచేత, ననిఁ బడి యున్నవాఁ డతివ కంటె
నీవు పతివ్రత గావె ధర్మజ్ఞవు, గాని దానవె యేమికారణమున
నిది కార్యముగఁ జెప్పి తీపిన్నవానికిఁ, గొడుకుదిక్కున నాకు నడలు లేదు
పరుఁ జూచి పొక్కెద వామాక్షి నీ దెసఁ, దప్పు సేసిన నుసీతనిఁ గృపార్ద్ర

తే. చిత్తవై యొల్లభంగి సంజీవితుఁడుగఁ, జేయవమ్మ యక్కట నాథు నీయఁబనిచి
నావు నూచియు వగవవు సాహసమున, కొలఁది లేదు నిన్నే మందుఁ గులవరేణ్య.

వ. అని పలికి పార్థుం జేరం బోయి. 67

ఆ. మహితకీర్తిలోల మత్ప్రాణవల్లభ, యన్యజనుల ప్రాణ మరసి కావఁ
జాలునట్టినీకు నేల ప్రాణంబుల, నిట్లు వదలి పోవ నిచ్చియుండ. 68

సీ. నాథ నీ వెప్పుడు నన్ను మన్నింతువు, కను విచ్చి చూడక యునికి దగునె
హయమున కెవ్వరు నడ్డంబు రాకుండ, [1]నాఁగిటి వగ్రజానధ్వరంబు
వమ్మయి పోకుండ నెమ్మితురంగంబు, వెనుకొన వలవదే యనఘ నీకు
నని యార్తిఁ బలవించి యహిపుత్రి దెసఁ జూచి, సుతుఁ డిట్టులుండినఁ బలికి నిమ్మ

తే. జీవమాంద్రురఁ బెక్కండ్రఁ జేసికొనుట
పురుషులకుఁ దప్పె భార్యలు తెరువునందు
[2]నడవరే యోర్చి నీ దుమ్మనమున నింత
యెడిఁగి కలిగింపు వరు వేయు నేల తల్లి. 69

వ. అని యంత నిలువక. 70

ఆ. కొడుకుచేతఁ జచ్చి పడి యున్న యిక్కురు, కులవరేణ్యుఁ గరుణ గూరి నీవు
బ్రదుకఁ జేయకున్న బ్రాణాపవేళన, మాచరింతు నహీంద్రలాగ్రగణ్య. 71

1 క. నాఁగి నీయగ్రజానధ్వరంబు. 2 గ. నడతురే.

తలంబునకు వచ్చిన నాభామిని బభ్రువాహనునాననం బాలోకించె. 81

సీ. విజయుండు వచ్చునే ✽ వేయిమాఱు లాఱు యింద్రునిచేత నైన నీశ్వరునకైన నొక్క-
ప్రియము సేయంగఁ గోరియు నీకొలఁది యూరయుబుద్ధి నీతండు గరణి నొనర్పఁ
దలఁచిన దవ్వీరుకతలఁపు సిద్ధింపంగఁ, జేయుటయును సంత ✽ సేయ వలసె
నాకుఁ గావున మోహాస్త్రసం బగుమాయాప్రయోగంబు నడపితి ✽ నుజ్జ్వలాత్మ

తే. నరుఁడు నారాయణుఁడు మహాశ్చత్తరము సువ్యక్తి యతని తేజ మెవ్వరికి నెట్లు దాని
నార్పవచ్చు మీవగ వెల్లఁ ✽ దీర్ప నిపుడ యర్థితోఁ డగునీకౌరవోత్తముండు. 82

వ. మాయాప్రయోగంబ వేఱొండు గాదు నీకు దాతండ్రితోడ ఖండనంబు సేయ బుద్ధి పుట్టించితి నింతమాత్ర మని తత్ప్రదేశంబున నున్నయెల్ల జనంబులు నుల్లంబున నానందంబు నొందఁ బలికి యమ్మణిపూరపురపతికరతలంబున నమ్మణి యిడి దీని నిమ్మహాత్ముని హృదయదేశంబున మోపు మనవుడు నతం డట్ల చేయుటయుం బార్థుండు ప్రత్యుజ్జీవితుం డై. 83

తే. లేచి కూర్చుండి కలయంగఁ ✽ జూచి యొట్టి
సెరలకాంతియు దంతిరుచియును బెరయ
నతిమనోహరముగఁ దనసుతునితోడ
మనుజనాయక కుశలమె ✽ యనుచు నతఁడు.

సీ. వినయ మారంగ నాతనిచరణంబుల, కెఱఁగి భవత్పుణ్యవీక్షణమున
నఖిలంబుఁ గుశలంబ ✽ యసిన నిజ్జనముల, మొగములయం దెల్ల ✽ వగవు దోఁచి
యచ్చెరువాటును ✽ హర్షంబుఁ గదిరెడు, నిది యేమి సెప్పవే ✽ యయుఁగు దేని
నాచెప్పినట్లు రక్షణంబున కేతెంచి, తీవు చిత్రాంగద ✽ యేల వచ్చె

ఆ. నిచ్చటికి నులూపి ✽ [1]యేమిటి కిపుడు వ
న్దెంచె నను భక్తినిర్భరముగ
నతఁడు నాఁగి మ్రొక్కి ✽ హస్తముల్ మొగిచి య
య్యహితనూజఁ జూపి ✽ యతనితోడ. 85

వ. అంతియు నిమ్మహానుభావ నడుగుం డనిన గాండీవి యాయింతివదనం బాలోకించి కురువంశసంసారకాని కాకకుం గారణం బేమి యిమ్మణిపూరపురనాథుని దెస నావలన భవదీయచిత్తంబు ప్రసన్నం బయి యున్నయదియె యిన్నరపతియును నేనును జిత్రాంగదయును నీకేమియు నపరాధంబు సేయము గదా యనుటయును. 86

ఉలూపి యర్జునునితో వసువులకోప ప్రసాదంబుల నెఱింగించుట.

సీ. అల్లన నవ్వుచు ✽ నయ్యింతి యతనితో, నాథ నీయం దొకనాఁడు నగ్గ
గలదె నాపుత్త్రునివలనఁ గీడెక్కడి, యది విని తాత్మ చిత్రాంగదయును

1. గ. యేటికిఁ జను దెంచె, ననుడు నతల భక్తివినయగతుల.

గినియొక వినుమేను వినతోత్తమాంగనై, చెప్పెద నీసునాక్యచేత నీకు
నావహిల్లె నశుభ మాహవంబున నీవు, గంగాతనూజు శిఖండినెపము
తే. గాఁగఁ దెగటార్చి తద పాతకంబు దాని, కనఘ నిష్కృతి సేయక తనువు విడిచి
తేవి నరకవాసమునకుఁ బోవ వలయుఁ, గాన నిష్కృతి సేసితిఁ గనఁగి వచ్చి. 87
వ. అది యెట్లంటేని నాకర్ణింపు మేనొక్కనాఁడు సభపమెంబుగా సురనదీ
స్నానంబునకు వచ్చి యుండ వసువు లక్కడ కేతెంచి యంత నంత నొక్క
రేవున దోఁచి కృతస్నానులై నిజరూపంబున సన్నిహిత యైన గంగాదేవితోడ
గాండీవధరుండు శిఖండిం బురస్కరించుకొని గాంగేయుం డేయ కండం బరమ
సాయకంబుల నతనిం గూల్చె నట్లు కుత్సితజయార్జనం బొనర్చిన యయ్యర్జును
నేము శాపసంతాపితుం జేయుదు మని చెప్పిన నప్పరమపావయు దాని
కొడంబడినపలుకు వలికె నంతయు విని తత్క్షణంబ. 88
సీ. అరిగి యేఁ దండ్రికి నత్తెఱం గంతయు, నెఱిఁగించుటయు నతండెసక మెసఁగ
భయమున రయమునఁ బఱతెంచి వసువులఁ, బెక్కువిధంబులఁ బ్రియమువుట్ట
దెలిచి ప్రార్థించిన నలుక వో విడిచి వా, రతనితో విను సమయం బొకండు
సేసెద మనిలోన వాసవిఁ దత్సూనుఁ, డగుబభ్రువాహనుం డస్త్రవితతిఁ
ఆ. బఱపి కూల్చెనేనిఁ బాయు నక్కిల్బిష, మనిన మగిడి వచ్చి యాభుజంగ
నాథుఁ డెల్లఁ జెప్పె నాకు నిప్పని దగ, నిట్లు దీర్చితిని సమిద్ధ తేజ. 89
వ. తీర్చిన తెఱంగు నెఱింగించెద నని పలికి బభ్రువాహను నుపలక్షించి యి
క్కుమారుండు వోవు సమరంబు సేయ నొల్లక నీకు నమస్కరించి మరలి
మందిరమునకుం బోవు చున్కి బుద్ధిం గని సమయకార్యంబునకు నిది యవ
సరం బని యూహించి రయంబున నితనికడకు వచ్చి రణంబు మీతండ్రికిఁ
బ్రియంబును ధర్మంబు నని చెప్పి యితనిం బోరికి బురికొల్పి యివ్వీరునియందు
వసువులు సెప్పినవిధంబు గలుగునట్లుగా విక్రమవిశేషం బావహించితి. 90
క. అనినఁ బ్రియ మంది దేవీ, యనఘుం బగునీచరిత్ర మస్మత్కులవ
ర్ధనకారి యగుట యెప్పుడు, గనినది గాదె యని పలికె గాండీవి నృపా. 91
ఆ. పలికి సాదరముగ బభ్రువాహనుఁ జూచి, మానితాగమివ్యమాణచైత్ర
మాసపౌర్ణమాసి మహితాశ్వమేధకాలంబు దానిదెసఁ దక్కలంపు గలిగి. 92
క. నీవును దల్లులు బంధుజనావళియుం బరిజనములు హాస్తినగరికిన్
రావలయు ధర్మజునినం, భావనముం బడయ టొసఁగుఁ బరమశుభంబున్. 93
చ. అనవుడు నట్ల సేసెద ననదాత్తచరిత్ర పురంబు సొచ్చి యి
వ్వనితలు నీవు నావలని వత్సలతన్ గొనియాడు చిత్తమొదవ
మన మలరంగ నిల్చి జనకమాన్యునిఁగా ననుఁజేసి ప్రీతి సే
సనుపగ వచ్చి చేయు మన్యయానము యజ్ఞతురంగరక్షకై. 94

వ. అనుచుం బ్రణతుండై బభ్రువాహనుండు ప్రార్థించినం బార్థుం డప్పార్థివుతో
నేను దీక్షితుండ నగుట నెఱుంగవే నాకుం బురప్రవేశంబు సేయం జనదు
పోయి వచ్చెద మీరును సుఖులరయి యుండుం డనిన నట్ల కాక యని యతం
డుచితప్రకారంబునం బూజించి యామంత్రణంబు సేయ నబ్భూమలచేత నను
జ్ఞాతుండై యమ్మహాశ్వంబు ననుసరించె నదియును నిజేచ్ఛ నఖిల
దేశంబులం బ్రవర్తిల్ల నొక్కయెడ. 95

క. రాజగృహపురమునకడ న వ్వాజి చనుచుఁ జేఱఁగి యాహవమునకుఁ బిలిచెన్
రాజత్కీర్తిధనుం డగు, నా జిష్ణుని మేఘసంధి యనురాజధిపా. 96

వ. అట్లు లప్పురంబుపతి యగు జరాసంధపౌత్త్రుండు బాల్యంబునం దన్ను నెదిరి నెఱిం
గమిం గవ్వడిం గయ్యంబునకుం బిలిచి పుచ్చి తోడన కల్పితరథారూఢుండై
వెడలి యవ్వాసవికి నడ్డపడి. 97

సీ. వనితలలోపలఁ జనియెదుచాడ్పున, నివ్వాజిఁ గొని యుంచుకొని శంక
లేక పోయెదవు పోకేల యేఁ బట్టెద, దీని గయ్యము సేసి యేదేనిఁ జేయు
మనుడు నవ్వుచు నతం డమ్మగధేశుతో, విఘ్నకర్తల నేను వెరవుతోడ
మాన్పింతు వినుము నా కమనమునఁ గిన్క లే, దది యెట్టు లనిన మదగ్రజుండు

తే. [1]సామమునన కర్జము నీవు సక్కఁబెట్టికొందుగాని యెవ్వరియెడఁ గ్రూరవృత్తి
వలన దని నాకుఁ జెప్పిన వాఁడు గాన, యట్లు నేయుదు నీయిష్టమాచరింపు.

—అర్జునుఁడు జరాసంధపౌత్త్రునితో యుద్ధంబు సేసి యోడించుట.—

చ. అనవుడు నేమియుం బలుక కానృపపుత్త్రుఁడు నిర్జరేంద్రపు
త్త్రునిపయి నుజ్జ్వలంబు లగుతూఁపుగముల్ వరఁగింప వాని న
ల్లనతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁడయ్యెఁ ద
త్తను వొకబాణ మేనియును దాఁకఁగ నేయ నరేశ్వరోత్తమా. 99

వ. అగ్గాండీవికృప యే మని చెప్పుదు. 100

క. తనమీఁద మగధుఁ డేయఁగ, జననాయక రథ్యములను సారథి నైనన్
గొనకొని నొప్పింపక యుల్లన శరనికరంబు పై గప్పలయ నిగిడించెన్. 101

క. అది బలహీనతగాఁ గొని, మద మేపారంగ నక్కుమారుఁడు లీలం
గదిసి బలునారసంబులు, తదంగమున గ్రుచ్చె నతఁడు దాన నలిగియున్. 102

వ. ఆ సహదేవుపుత్త్రుగాత్రంబు దాఁక కుండునట్లుగా శరంబుఁ నిగిడించి. 103

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం
జీరి శరాసనంబుఁ బొడి చేసిన నమ్మగధుండు ధీరతో
దారగతిన్ సముజ్జ్వలగదాభ్రమణంబున బాహుఁ వొప్ప న
వ్వీరవరేణ్యుపైఁ గవిసె విక్రమ మాకృతి దాల్చి పొల్చెనాన్. 104

1. క. చ. ఖ. 'సామమునఁ గర్జమున నీవు'.

వ. అట్లు గవియుటయు. 105

తే. అప్పుడును మత్సరంబున కలఁడు భాజ
నంబు గా కుండెఁ గాన యశ్వనరుఁడు వెసఁద
వాడియమ్ముల గద పలువ్రయ్యలై మ
హీతలంబునఁ దొరఁగంగ జేసె నధిప. 106

వ. అట్లేసిన. 107

సీ. నివ్వెఱపడినయాశ్వపనందనునితోడ, నయ్యతిబలుఁడు మాయన్నయొకని
ప్రాణంబునకును దప్పకు మయ్య యని [1]ప్రాణ్యతిచ్చినకతన నే నేయ కున్న
నీ వింతవడి పోర నిలువఁ జాలితి విను, మది యట్టు లుండె రాజార్హ మైన
ధర్మంబు వాటించి తాఁకితి నన్ను నింతియు చాలు నింక శాంతియు నరేంద్ర

తే. తగినయది యని పల్కెఁ దత్తఁడు నిజము, నట్ల కా కని యూహించి యమ్మహాత్ము
పాదపరిసరమున భక్తిఁ బ్రణతుఁ డైనఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చె యక్కురువిభుండు.

వ. వచ్చుచైత్రమాసంబునం బున్నమనాఁడు పాండవాగ్రజునశ్వమేధం బనుసంధిం
చుటకై బంధులు నీవును రావలయు ననిన నవ్వసుమతీపతి యట్ల చేసెద నని
యత్యంతవినయంబున నవ్యాజయుం బ్రియపూర్వకంబుగాఁ బూజించి యామంత్రి
తుం జేసిన నాతండు ప్రీతుండయి యభినందించి యమ్మగధపతిం బురంబునకుం
బోవం బనిచి యశ్వరత్నంబు ననుసరించె నదియును వంగపుండ్ర మ్లేచ్ఛదేశం
బులం జరియింప నయ్యైరాజులు పెనకినం దేజోధనుం డగునాధనంజయుండు
జయించుచుఁ జన నత్తురంగంబు. 109

సీ. చేదిదేశంబు సొచ్చిన శిశుపాలుని, తనయుండు శరభుండు దనదుశుక్తి
పురము వెల్వడి యుద్ధపూర్వకంబుగఁ జేరి, యమ్మహావీరున కర్చ లిచ్చె
నతని వీడ్కొలిపి యయ్యతులతేజుఁడు ఘోటకము వెన్కఁ జనుచుఁ జేంకణకిరాత
ముఖదేశనృపతులు ముట్టినఁ దగ గెల్చి, కొనుచుఁ గ్రమంబున గోసలులను

ఆ. గాసలను జయించెఁ గ్రమ్మఱి యత్తురంగము దశార్ణదేశగామి యయ్యో
జిష్ణుఁ డనుసరింపఁ జిత్రాంగదుం డని, సేసి కూడి పూజ సేసె నధిప. 110

వ. ఇట్లు దశార్ణపతి పార్థునిం బూజించి యాతనియాదరణంబు వడసి పోవఁ బదంపడి
తురంగంబు నిషాదాధీశదేశంబునకుం జనిన నేకలవ్యనందనుండు పాకశాసననందను
మీఁద నైషాదసేనాసమేతుం డై తోఁతెంచిన. 111

చ. అతనిబలంబుఁ గ్రూరవిశిఖార్చుల నేర్చిన బాహుసారగ
ర్వితుఁ డగునన్నిషాదపతి వీక నెదుర్కొనినం గిరీటి యా
తతపటుబాణదీధితులఁ దన్మదసంతమసం బడంచె వాఁ
డతివినయంబునన్ వినతుఁ డై తగ నర్చితుఁ జేసె నాతనిన్. 112

---

1. క. యప్పగించినకతన నేఁ గినియకున్న.

బలము గ్రమ్మతి యయ్యెంద్రుపట్టిఁ జుట్టు
బలసి శస్త్రాస్త్రచయములు । పరఁగఁ జేయ. 122

చ. అవి నిశితాస్త్రపంక్తిఁ దునుమాడి రయంబు జెనఁగంగఁ గప్పి సా
హావతల మంతయుం దలర । నప్పటువిక్రమశాలి యమ్మహా
గ్రవిహారణంబునం గలఁగి । కన్కనిఁ జాతె బలంబు లక్కుచున్
రవరునిఁ గాచికొంటకు ధరావర మంత్రులు వానితల్లి యుకె. 123

వ. అర్ఘ్యంబు గొని రయంబున శరణు శర ణనుచు వచ్చిన నవ్వివ్వమ్పుంపును నశ్వ
లంది నభినందించి మంత్రులకు మాననీయవచనంబులం బ్రియంబొనర్చి [1]యశ్వాలు
నితో సాంత్వనస్వరంబున నిట్లనియె. 124

ఉ. నీ విటు వన్ని నాపయి ననిందపరాక్రమ రాక నూది మ
ద్భావము ఖేద మొందుటయు । ధర్మజుసం పిది రాజకోటి నే
నేవిధి నైనఁ జంప నని । యెల్లజనంబు వినంగఁ జెప్పనే
కావున నీబలంబులన । కాని నినుం దెగటార్ప కుంకితిన్. 125

వ. విశేషించి గాంధారీధృతరాష్ట్రులం దలంచి నాకు నీదెస నిట్లు గా వలసియుండె.

ఆ. అట్టు లగుటఁ జేసి । యవనీశనందన, యింత ప్రొద్దుఁ బోరి । తింక శాంతిఁ
బొందు టొప్పు ధర్మపుత్త్రునితోడిపొం, దొప్పదయ్యెనీకు । నుదితశౌర్య. 127

వ. అని చెప్పి యాగామియయినచైత్రంబుపున్నమనాఁ డన్నరేంద్రచంద్రునశ్వమే
ధయాగంబున కనురాగం బెసంగ రమ్మా యనియునుం బలికి యప్పాండవమధ్య
ముండు మేధ్యాశ్వంబు ననుసరింప నది కరిపురంబుదిక్కు మొగం బయి యరుగం
జొచ్చె నట్టియెడ నతండు వివిధదేశంబులం దిరిగిన తెఱం గెల్లనుం జారులచేతవిని
యజాతశత్రుం డప్పురుహూతపుత్త్రుం డశ్వరక్షణం బట్లు ధర్మప్రకారంబున
నిర్వహించుటకుం బ్రీతి వహించె నద్దివసంబు. 128

ఆ. మాఘమాసపౌర్ణమాసి యై యుండె నా,ధర్మనందనుండు । పేర్మి వెలయ
నెలమి మిగులఁ బెద్దకొలువున నుండి త,మ్ముల సగౌరవముగఁ బిలువఁబనిచి. 129

వ. అనిలనందనునాననం బాలోకించి. 130

క. నీతమ్ముఁడు తురగముఁ గొని, యే తెంచుట వింటిఁ జైత్ర । మింకఁ దడవు లే
దీతఱి మునులను నృపసం,ఘాతంబును బిలువఁ బంపఁగా వలయుఁ దగన్. 131

వ. యాగశాలయు శిల్పిజనులం గొని కల్పింపుము తగువారలకు విడియం దగియెడు
వివిధగృహంబుల నొనరింపు మని పనిచిన నతండు. 132

ఆ. యజ్ఞవాటమును జననాధిపులకు మునివ్రాతములకు విడియ । వలయునట్టి
మందిరములుఁ గనకమణిమయంబులు గా నొనర్చెఁ దద్యజ్ఞవంబు వొగడ.

1. గ. యశ్వాలుని సాంత్వవచనంబుల.

క. ధరణీసురులను బనిచెను, ధర నెంతయు దిరిగి మునుల ధాత్రీశుల న
ధ్వరమునకుఁ బిలువఁ డని యుత్సుకత్వసంతసంబు వారుఁ జని సముచితభక్తిన్.

చ. పిలిచిన రాజులున్ మునులుఁ బ్రీతి దొలంగ్ప బలోత్కరంబు శి
ష్యులుఁ దమతోడ రా మనము సంవ్రీళు లూరఁగ యజ్ఞవర్తనం
బులు గనుఁగొంటకై సకలభూవలయంబునఁ గల్గునట్టివా
రలు సనుదెంచిరం గురుధరాపతి చిత్తము వేడ్క నూనఁగన్. 135

క. ఎదురుకొని వీడుఁబట్లకు, ముదమూరఁగ దాన యునిచి మొక్కలములు నిం
పొదవించునట్టివియుఁ గాఁ, బదార్థములు[1] ప్రజ దలమునఁ బాటించితగన్. 136

క. భోజనశయనాసనములు, రాజిల్లెడునట్లు గాఁగ రాజుల కెల్లం
దేజోధనుఁ డాధర్మతనూజుం డిడఁ బనుచుఁ జనవినుతసుచరిత్రా. 137

చ. మునులకు నెల్లఁ గందములు మూలములున్ ఫలకోట్లునుం బ్రియం
బొనరఁగఁ దాన పోయి మధురోక్తులతోడ సమర్పణంబు సే
యు నిటుల సంవిధానములు లైనము లై విలసిల్లఁ జేయు న
య్యనిమిషనాథవైభవుఁ డహంకృతివర్జనసంస్తుతంబుగన్. 138

తే. యజ్ఞవాటంబుఁ దక్కటియాలయములు
లలితభంగి రమ్యములు సలక్షణములుఁ
గా నొనర్చినశిల్పినికాయమునకుఁ
బసదనం బిచ్చె సంతసం బెసక మెసఁగ. 139

సీ. పాండవాగ్రజుఁ డట్లు పవననందను బంచి, యజ్ఞశాలారక్షణాదు లైన
కృత్యముల్ నడపుటకు గృష్ణుండు గనుఁగొని, కడుఁబ్రీతిఁ బొందెనాగతనృపాలు
రచ్చెరు వొంది రయ్యమృతాంశువంశని,స్తారకుం డర్థిమైఁ దేర బనుప
ననవద్యపశువుల నఖిలజాతులవానిఁ, గొని వచ్చి రత్యంతకుశలపరిజ

ఆ. నంబు లన్నపర్వతంబులు నాజ్యవా,హినులుఁ గల్గి విప్రజనపరంప
రలు భుజించు పెర్మి యొలసి యాగాగారంభ,సమయమద్భుతప్రజనకమయ్యె. 140

క. విను లక్షభూసురులు గుడిచిన నొకమారి మ్రోయు భేరి సెలఁగుచు నుండున్
జననాయక యెప్పుడు నే, మని చెప్పుదు నశ్వమేధయజ్ఞవిభూతిన్. 141

చ. శరధిపరీతభూమిఁ గలసర్వజనంబును దోఁచె నమ్మహా
ధ్వరమున భూపతుల్ మకుటపంక్తులు భూషణరాజిఁ జక్కఁగాఁ
బోరిఁబోరిఁ ద్రోచికొంచు మదిఁ బొంపిరి వోయెడు వేడుకం బనుల్
వెరవులు లావులున్ మెఱయ వేయువిధంబులఁ జేయు టొప్పఁగన్. 142

సీ. కలయంగ రాజులఁ గనుగొని ధర్మనందనుడు భీమునిఁ బిల్చి మనుజపతుల
కెల్లను వే పూజ లిమ్మన్న నమ్మరుత్తనయుండు దగఁ దనతమ్ముఁ డోయి

1. అ. పసదనములఁ.

దెలుపుటయుఁ గృత్యమే విను, తెలిపెదఁ గలమాత్ర వసుమతీశ్వరముఖ్యా. 153

తే. సర్వగాత్రంబులందును సవ్యసాచి
కధికశుభలక్షణంబుల యతిశయిల్లుఁ
దనువుమాత్రకు నించుక ధరణినాథ
యెక్కుడై యుండుఁ జిఱుపొడ వీదియ కొఱఁత. 154

క. అలజిష్ణు దీనివలనం, గలిగెడునో కాని తప్పు గలుగ దరిత్రిం
బలఘుశుభలక్షణాప్తి, విలసితతనుఁడైన గాండివికి నెయ్యెడలన్. 155

వ. అట్టున్నరూపు సెప్పినవెన్నునివచనంబులు విని యవ్వసుంధరావల్లభుం డతని యాననం బాలోకించి యది యట్ల కాక యని పలికె నప్పుడు పాంచాలి పద్మనాభుం బ్రీతిస్మితం బగుచూడ్కి నాలోకించిన నాలోకనాథుం డది యర్జునవిషయం[1]బైన ప్రణీతంబు తెఱంగనుట యెఱింగికొనియె నట్టియెడ భీమాదులును యాదవకుమారులును సత్కిరీటిగుణంబు లగ్గించుచు నాప్తోద్దున కదియ గోష్ఠిగ సల్లాపంబు సేయుచుండ నగ్గాండీవిపాలనుండి కాలరి సనుదెంచి. 156

సీ. పాండవాగ్రజునకుఁ బ్రణతి యొనర్చి విబ్బచ్చుఁ డిప్పురి సేర వచ్చె నెల్లి
వచ్చు మీ శ్రీపాదవనజంబులకు మ్రొక్క ననవుడు హర్షాశ్రు లడరఁ బులకి
తాంగుఁడై వానికి నన్నరేంద్రుఁడు పస్రదన మాభరణవస్త్రకనకములు స
మగ్రంబుగా నిచ్చె నందఱు నానందరసమునఁ దేలి యారాత్రి పార్థుఁ

ఆ. జూచువేడ్క నూనుచును వేగు టెప్పుడో
యనుచు నుండ నుదయ మయ్యె నినుఁడు
క్రీడి సముచితవిహితకృత్యముల్ సలిపి హ
యంబు మునుగాఁగ నరుగుదెంచె. 157

వ. అప్పుడు. 158

అర్జునుఁడు యజ్ఞాశ్వంబుతోడ హస్తిపురంబునకు వచ్చుట.

క. విను మింద్రతురగసముఖే, లనమున నవ్వాజి జనములకు నెల్లను లో
చనపర్వ మయ్యె వారివ, దనములు సంతోషమధురసలలితభాషణముల్. 159

సీ. కలయంగ నిట్లని చెలఁగె నిగ్గాండీవి, దక్క నిమ్మాడ్కి నొక్కడొక్కరునకు
నశ్వంబు దనయిచ్చ నఖిలదేశములకు, నరుగఁగ ధరణీశు లచట నచట
బలములతో వచ్చి బలసి తదీయరోధం బాచరింపఁ దృణంబు గాఁగఁ
గొని లీలమెయి గెల్చు గొనుచోట్ల నుగ్రత, వాటింప కగ్రజు వ్రతపలుకక యొట్టి

తే. దళుల నైనను బాటించి తా నొకండ, ననుతలం బెప్పు నుల్లంబు వంసు లేక
తనువు గవు సెనకట్టి పుచ్చినవిధమున, [2]నరుగుదేవచ్చునే యిది యక్కజంబు.

క. సగరాదులఁ జెప్ప వినమె, మగటిమియును బలము నిట్లు మానుషభంగిన్

1. గ. ద్వైతప్రకారము తెఱం, 2. చ. నరుగుదెంచు నె యిది గడు నక్క

నెగడున యింతను బుట్టరు, జగతిని[1] గాండీవితోడ సరివచ్చు మగల్. 161

క. మానుషము దైవమును సరి, సేనే యని కార్యసిద్ధి నెలయింపఁగ ని
త్యానందుఁ డయ్యె ధర్మజుఁ, డీ నిర్మలభాగ్యమహిమ యెరికిఁ గలదే. 162

క. విను మట్లు నెలంగఁగ ఘూర్ణన మొందినయర్ణవం బనఁగఁ బొంగారెన్ 162
జననికురుంబం బావెం, ఘనఘూర్ణారవ వినఁ బడయు నఖిలజగములన్. 163

వ. మఱియును. 164

సీ. నృపు లోఁచాటింప జంత్రపుమీను నేసి చేకొనియెఁ బాంచాలునికూఁతు నితఁడె
సురసేనతోఁ బురందరు గెల్చి భుజగర్వ మేపాఱ ఖాండవం బేర్చె నితఁడె
యొక్కటిబవరాన నీశాను మెప్పించి, పాశుపతాస్త్రంబుఁ బడసె నితఁడె
యొంటిమై భీష్మాదియోధుల కురుపతి, ధృతిఁ బాపి గోవులఁ[2] దెచ్చె నితఁడె
తే. ప్రతిన నేసి విమతుసమరమునఁ బ్రొద్దు
గ్రుంక నీకాఁగి సైంధవుఁ గూల్చె నితఁడె
యనుచు సందడిగాఁ గ్రమ్మి యఱ్ఱు లెత్తి
చూచె జనలోక మాసవ్యసాచిఁ బ్రీతి. 165

క. ఆ వాక్యము లెల్ల వినుచు, భావ మలర నర్జునుండు భాసుర మగున
మ్మా వగ్రేసరముగ యజ్ఞావాసంబునకు వచ్చె నంచితలీలన్. 166

వ. అట్టియెడ ధర్మనందనుండును భీమాదులును గృష్ణుండును బలదేవ ప్రభృతులును ధృతరాష్ట్రుం బురస్కరించికొనుచు నప్పార్థు నెదుర్కొని రతండు వారల నెల్ల సముచితాచారసం ప్రీతులం గావించి గాంధారిని గుంతినిం గాంచి యాతఁడు తీరంబు గనినచందంబు నొంది యందఱు నభినందించుచుం బొదివికొని యుండ నొక్కరమ్యప్రదేశంబున నుండె నాసమయంబున. 167

సీ. బభ్రువాహనుఁడు వైభవ మొప్పఁ జిత్రాంగ
దయు నులూపియుఁ గ్రమపదంబుతోడఁ
దోడ రా ధర్మపుత్రునిమందిరమునకు
నరుగు దెంచుటయు నక్కురువరేణ్యుఁ
డును దమ్ములును గృష్ణుఁడును బలభద్రాది
యాదవులును బ్రీతు లై తదీయ
సందర్శనము నర్హసత్కారచరితార్థ
ముగఁ జేసి రతఁడును దగినవిధుల
తే. నందఱకుఁ బ్రియ మొనరించి యాంబికేయ
నతనిభార్యలఁ గని నమస్కృతు లొనర్చి
కొంతిఁ గాంచి తా యమయదుగులకు నెఱఁగి

1. క. సరివచ్చుమగల [illegible]. 2. గ. [illegible].

1పలుదోఁగుదీవనలును గౌఁగిలియుఁ బడసి. 168

వ. ధర్మపుత్త్రుం గొలిచి కూర్చుండ నతని కక్షంబును ననుజులును వేర్వేఱ సర్వరత్న రాజివిరాజితంబు లగుభూషణంబులును బరమాంబరంబులును నొసంగిరి సీరపాణి శౌరి ప్రభృతులు ప్రభూతాభరణంబులను భాసురవాసోవిశేషంబులను నతని నర్చించి రయ్యవసరంబున. 169

సీ. చిత్రాంగదయును నాగకన్యాత్రితయముఁ దోతెంచి, గాంధారిఁ గనిగొంతిఁ గాంచి రెలమి
దీవించి గాఢసంశ్లేషావనిఁ గౌఁగిటఁ, జేర్చి యాద్రౌపది శక్తిఁ జూర్చి లెసఁగు
తొడవుల నర్చించె ద్రోవదియును సుభద్రయుఁ బారుఁ డమ్మచిత్ర ప్రకార
మునఁ గన్న నమ్మెయి విసుతపూజనములఁ, నతులసమ్మోదము నావహించి

ఆ. సౌభాగ్యపీఠములను నుచితసల్లాప, సౌఖ్య మొందిరట్లు సకలవర్త
నముల నశ్వమేధసవప్రక్రమం బుదాత్తాభిరామ మయ్యె నధిపముఖ్య. 170

వ. పదంపడి యర్హదివసంబు సంప్రాప్తం బగుటయు సాత్యవతేయమునిపతి కురుపతి పాలికిం జనుదెంచి నేఁడు యజనంబునకుం దొడంగుము యాజ్ఞికులు శుభముహూర్తం బాసన్నం బయ్యె నను చున్నవారు నీమఖంబు మహనీయంబు నీవు మహాధనవంతుండ వైతి దక్షిణలు మున్ముడుంగులుగా నిడి మూఁడుమఖంబుల ఫలంబు నొందు మశ్వమేధావభృథంబు పరమపావనంబు సమస్తదురితపరిహరణ నిపుణంబు నీకు భారతరణకృతజ్ఞాతివధంబు పాతకం బను వెరవెర మానంబునం గలిగియుండు నట్టివి యెల్లను దీన నిస్తుషంబు లగు సమస్తశుభంబులు నావహిల్లు నని యనుజ్ఞాపనంబు సేయుటయుఁ బ్రాజ్ఞప్రవరుం డైనయా భూవరుండు. 171

ధర్మరా జశ్వమేధయాగంబు సుప్రయోగంబుగాఁ జేయుట.

క. ప్రయతుం డై హయమేధ, క్రియాకలాపంబునకుఁ బ్రకీర్త్యముగాఁ జొ
చ్చి యుదాత్తభంగి జనమే,జయభూవర నడపె గాఢసంప్రీతి మెయిన్. 172

క. క్రమయుక్తియు యుక్తముగా, నమరగురుప్రతిము లైనయాజ్ఞికులు క్రియా
సముదయము నడపఁగా స్ఖలి,తము లేకపహూతము సారకతత్కృతువొప్పెన్.

చ. అవహితులై ప్రవర్గ్యము బుధాభినుతంబుగఁ జేసి ఋత్విజుల్
సవనము లుక్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేదవా
క్యవిహితవృత్తిమై నభినవాభ్యుదయం బొసరించి రక్షి మా
ధవుఁ గొనియాటలం దమకృతంబులకున్ మెఱుఁగిడ్డయట్లుగన్. 174

వ. అట్టియెడ. 175

సీ. 2వివిధభోజ్యపదార్థవిభవంబువలనను, సంతృప్తిఁ బొందక చనునరుండు
ధనధాన్యవస్త్రసంతతిలబ్ధి దారిద్ర్య, మపనయింపక పోఁగునట్టివాఁడు
గోరి కొయ్యది యైన గాగవ మొసఁగంగఁ, బడయక రిత్తవోయెడుమనుష్యుఁ

1. గ. పలుతెఱఁగుదీవనయును 2. గ. నానాన్నముల మెసఁగెహారిపానములను.

డొద్దియేనియు దుఃఖ ♦ మెలసినఁ జనుదెంచి, యెది ని స్తరింపక ♦ యడుగునతఁడు
తే. మందునకు[1] వెదకినను లేఁ♦డండ పొంద నరసి కుతువ్రుఁడు కట్టఁ డించ్చా♦పురూప
వస్తువులు గైకొనఁడు దుర♦వస్థ దెలిపి, పావికొనుఁ డని భీముండుఁ♦ బలుకు చునికి.

ఉ. ఆయతులాధ్వరంబున బ్ర♦తాభిరతత్వము లేనివాఁ డుపా
ధ్యాయుఁడు గానివాఁడు నిగ♦మాంగకలాపము లేనివాఁడు లేఁ
డేయెడఁ జూచినన్ సభ స♦దేశ్వర యట్టి సదస్యు లమ్మరు
న్నాయకుకొల్వు దివ్యముని♦నాథులు దక్కఁగఁ గల్గ రెచ్చటన్. 177

వ. అట్లుం గాక. 178

సీ. కనుఁగొను కౌతుకం♦బునఁ గూడి చనుదెంచి, దివ్యమునీంద్రు ల♦తి ప్రియమున
నభినందనము సేయ ♦ నఖిలగంధర్వులు, నానందనము లగు♦గానములను
నప్సరఃస్త్రీలు హృ♦ద్యము లైన నృత్యవి, శేషంబులను నుల్ల♦సిల్లు చుండ
సిద్ధవిప్రజనంబు ♦ సేసలు సల్లుచు, బహువిధాశీర్వాద♦పరతఁ బరఁగ
తే. నాఢ్యులై పేరు గలుగు వ♦దాన్యు రవని
వరులయాగంబులకు సరి♦వచ్చు మిగులఁ
గానిగ యిది వ్రటవడ దనఁ♦గా వెలుంగు
ధర్మతనయుని యశ్వమే♦ధము నరేంద్ర. 179

వ. పసిఁడియిటికలం జతుశ్చిత్యంబు నష్టాదశకరాత్మకంబు గరుడాకృతియును గా యజనం బొనర్చి మహనీయం బై యొప్పుచుండు యూపక్రియాసమయంబున ఖాదిరంబు లాఱును బైల్వంబు లాఱును బాలాశంబు లాఱును దేవదారుమయంబులు రెండును శ్లేష్మాతకతరుకల్పితం బొకండును గా నిరువదియొక్క యూపంబులును దక్కను శోభనార్థంబుగా ననేక కాంచనయూపసంచయంబును శాస్త్రోక్తప్రకారంబున యాజకులు నిలిపి వానియందు. 180

క. నలుగాలివానిఁ బక్షుల, జలచరముల విధియుతముగ ♦ సంయోజింపం
బొలిచెం బశువులు మున్నూ,ఱలఘుయశోమహిత యమ్మ♦హాయజనమునన్. 181

క. వరయూపసుయోజిత మగు, తురంగమము చుట్టఁ బశుత♦తుల నిల్పిన సుం
దరభావము దక్షమఖ, స్ఫురణం బిట్టి దని చూపు♦పోలిక మెఱసెన్. 182

తే. ఆగమోక్తంబు దర్శనీ♦యంబు నైన, యానుతంత్రంబు నొనరించు♦యాజకోత్త
మావలికిఁ జా నలంకార♦మై పరాశ, రాత్మజునిశిష్యకోటి యొ♦ప్పారె నధిప 183

—♦ ధర్మరాజు వ్యాసునకు యజ్ఞదక్షిణగాఁ దనరాజ్యం బంతయు నిచ్చుట ♦—

వ. సర్వపను[2] శ్రవణంబు లాచరించి ఋత్విజనంబు లశ్వాలంభసమయంబున యాజ్ఞసేని సన్నిహితం జేసి యశ్వంబునవయవంబులమాంసంబు లయ్యై దేవతలకు నాహుతు లిడునప్పు డమ్మహాదేవి నిజహస్తంబునం జేయం దగియెను

1. క. వెదకిన లేఁడు ♦ నంద. 2. గ. విశసనంబు లాచరించి.

వ. మఱియును. 198

తే. అతులకనకమయములై నవరత్నపుజ్జపాటు, వేదికాదులు తోరణాదివివిధభాండ
దండకలశాసనాదుల ♦ ధరణినాథుఁ, డొసఁగె బ్రహ్మసదస్యుల ♦ కెల్లపలర. 199

తే. అట్లు విప్రుల కిచ్చి య♦నంతరంబ
రాజులకు వైశ్యులకు శూద్ర ♦ రాజికన్య
జాతులకు మ్లేచ్ఛులకును బ్ర♦భూతధనము
ద్రవ్యతండంబు లిచ్చె నా ♦ ధరణివిభుఁడు. 200

క. ఇమ్మెయి సకలజనులు హేమమ్మునఁ బరితృప్తులై య♦మందమ్మగు మో
దమ్మునఁ జేలుచు నిజవా, సమ్ములకుం జని రజాత ♦ శత్రుఁ బొగడుచున్. 201

క. రెండవమరుత్తుఁడై యు, ప్పాండవముఖ్యుండు సేయు♦వరమవితరణం
బొం డొకరుండెఁ గల్గునె యొన్నండును జూడ విన సజ్జ♦నస్తుతచరితా. 202

క. తన యంశమైన కనకము, వినుఁ కుంతీదేవి కిచ్చె ♦ వేదవ్యాసుం
డనఘా యదియంతయు న, వ్వినుతచరిత ధర్మకృత్యముల ♦ వినియోగించెన్. 203

తే. సకలబాంధవభూపతి♦సంయుతముగ, నానరేశ్వరుఁ డవభృథ ♦ స్నానపూత
గాత్రుఁడై చిత్రగతసన్న♦కల్మషములఁ, బాచి నిర్జితస్వర్గజ్యోంభాసి యయ్యె. 204

వ. అట్లొప్పి యప్పాండవముఖ్యుఁడు పరాశరనందను చరణారవిందంబులు దన పెడంద నొసలు సోఁక జాఁగి మ్రొక్కి యక్కులపతిం బెక్కుభంగులం బ్రస్తుతించి యామంత్రితుం జేసిన నా మునిశ్రేష్ఠుండు శిష్యసంఘసహితంబుగా నంతర్ధానంబు నేసె నట్టియెడ. 205

— ♦ ధర్మజుఁడు యజ్ఞంబునకు వచ్చిన రాజుల నెల్ల సత్కరించి పంపుట ♦ —

క. అనుజులు నఖిలనృపాలురు, దనుఁ బరివేష్టింప నొప్పె ♦ దారలలోనం
బెనుపొందు చంద్రుగతి న, మ్మనుజాధీశ్వరుఁడు కురుకు♦మార ప్రవరా. 206

తే. క్రతువుఁ జూడ నేతెంచిన♦రాజవరుల కందఱకు మణిభూషణ♦హస్తివాజి
వారకాంతాచయముల న♦న్యసమమతిఁ, డొసఁగె ధనదుని కై వడి♦నెసకమెసఁగ.

ఆ. బభ్రువాహనునకుఁ ♦ బరమవిశేషంబు, మెఱయ గారవించి ♦ మేలివస్తు
కోటు లొసఁగి ప్రీతి ♦ గూరిన మనముతోఁ, బతని దత్పురమున ♦ కరుగ బనిచె.

క. చిత్రాంగదయు నులూపియు, పృథాతారితనూజుపాల ♦ విభవమహితలై
గోత్రావర నిలువఁగ వృద్ధాత్రీశుఁడు సలిపె సమ్మ♦దం బెలరారన్. 209

తే. మున్న చనుదెంచి ప్రీతిమై ♦ నున్నయట్టి
దుశ్శలకుఁ బెంపు గలుగఁ ద♦త్పుత్రపుత్త్రు
సింధుదేశంబునకు నభి♦షిక్తుఁ జేసె
దోహలమున నజాత♦శత్రుఁడు నరేంద్ర. 210

క. తమతమదేశంబుల భూరమణుల నెల్లను విభక్త ♦ రాజ్యులుగా 1నె
య్యమున నెఱయ నిలిపెఁ బాండుకుమారమణి పెద్దకొడుకు ♦ కౌరవముఖ్యా. 211

వ. ఇత్తెఱంగున నెల్ల రాజులయుల్లంబులు ప్రమదంబునం బొందం జేసి వీడుకొల్పి కృష్ణునకు నత్యుత్తమవసువిస్తారమహోదారంబగు నుపహారం బిచ్చి దేవోపచారంబుల నారాధించి కృతార్థత్వంబు నొంది యప్పార్థివోత్తముండు బలభద్రునకు భక్తియుక్తంబును వివిధరత్నవిరాజితంబును నగు పూజావిశేషంబునం బరమసంతోషం బావహించి సాత్యకిప్రభృతి యాదవలోకంబున కితిలోకంబులగు నానావిధపదార్థంబు లొసంగి యయ్యందఱుం దనచేత నుచితప్రకారంబుల నామంత్రితులై ద్వారకానగరంబున కరుగం దాను మఱియు ననేక దేశాగతులైన జనంబుల నన్నపానంబులం గనకవస్త్రాదిదానంబుల ననురక్తులం గావించి మహారావంబున దిశలు పిక్కటిల్లం జెలంగు మాంగళతూర్యంబులు మొరయం బుణ్యపాఠకరవంబులు నానందనగానంబులు వినుచు మందిరంబునకుఁ జనుదెంచె నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె. 212

ఆ. అనఘ మత్ప్రపితామహునియశ్వమేధయాగంబునకు మునుఁ గరంబు విస్మ
యంబుఁ జేయఁజాలు♦నట్టిది యే మేనిఁ, గలిగెనేని వినఁగ ♦ వలతుఁ జెప్పుమా. 213

వ. అని యడిగిన యమ్మహీనాయకునకు వైశంపాయనుం డిట్లనియె. 214

క. అమ్మెయిఁ బ్రభూతధనలాభమ్మున భూమిఁ గొఱయట్టి♦ బ్రాహ్మణు లెల్లన్
సమ్మద మొందఁగ హయమేధ మ్ముజ్జ్వలభంగి నొప్పె ♦ తత్సమయమునన్. 215

తే. అఖిలజనములు నచ్చెరు♦వంద ధర్మనందనుని మానసమున నా♦నంద మొలయ
నతనిపై మకరందధా♦రాభిశోభి, కుసుమవర్షంబు పెల్లుగఁ ♦ గురిసె నధిప. 316

వ. అట్టియెడ. 217

—♦ సక్తుప్రస్థచరిత్రంబు నకులంబు బ్రాహ్మణునకుం జెప్పుట. ♦—

సీ. ఒక్కబిలంబుననుండి వెల్వడి ♦ యొక్కనకులంబు విప్రజ♦నంబునడుమ
నిలిచి సక్తుప్రస్థ♦నలఘుధర్మంబు నేమియుఁ బోల దీయశ్వ♦మేధ మనిన
నవ్విప్రు లతివిస్మ♦యం బంది యమ్ముంగిఁ, గనుఁగొని మంత్రవ♦ర్తనముఁ దంత్ర
గమనికయును వివి♦ధములైన దానవిధులు బహుళత్యాగ♦ములును లోక

తే. సంస్తుతము లయ్యె భక్తియు ♦ శ్రద్ధయును బ్రి
యంబు వినయంబు సురమునిహర్ష మావ
హిల్లఁ జేసె నీ వేమిట ♦ నిమ్మహాధ్వ
రంబుఁ గీడంటి చెప్పుము ♦ ప్రస్ఫుటముగ. 218

వ. అనుటయు నన్నకులంబు వారి కిట్లనియె 219

సీ. వినుఁడు ధర్మక్షేత్ర ♦ మన రూఢమైన కు

1. క. నెయ్యమున నిలిపెఁ బాండుకుమారమణుని పెద్దకొడుకు కురురాజ ప్రవరా.

రుక్షేత్రమునయందు ♦ గోపశాము
విరహితుం డొక మహా♦ద్విజుం డుంఛవృత్తిమై
నుండు భార్యయుఁ దన♦యుండు నతని
పత్నియు సహచర♦భావంబు నొంది వ
ర్తింతు గట్టులు తప♦శ్శ్రీ వెలుంగ
మున్నెడఁ [1]బులుపంట ♦ లన్నియు నశ్వంత
వికలంబు గా ననా♦వృష్టిదోష

తే. మానహాల్లిన నకని ♦ యాహార మొసరఁ
జేసికొనుట దుర్ఘటమయ్యె ♦ జెల్లు చుండఁ
దారు నలువురుఁ జవి తృణ♦ధాన్య ల్ప
మేటి కొని పత్తు రాఁకలి ♦ దీఱ క్రొంచ. 220

వ. అట్టి యెడ నొక్కనాఁ డయ్యందఱును రేపు దొడంగి పడపాటిబా నుదుకు వెదకి తెచ్చినపూరికొలుచు ప్రస్థమాత్రంబు సక్తువయ్యెం గర్తవ్యానుష్ఠానంబులు నడపి యనంతరంబ యా కాంచినుఁ పేలపిండియుఁ జేటి మానెంగు (నలుగురకు సమంబుగాఁ) బంచికొని యుపయోగించువారై యున్న సమయంబున. 221

—♦ యముఁడు సక్తుప్రస్థునికడ కతిథి యై వచ్చుట ♦—

తే. అతిథియొక్క-ధరామరుం ♦ డరుగుదెంచెఁ
గని ప్రియంబున వారెదు♦ర్కొని సభక్తి
కముగఁ బర్ణశాలాభ్యంత♦రమున కతనిఁ
దోడికొనిపోయి యాసన♦స్థుఁడుగఁ జేసి. 222

చ. అడుగులు గడ్గి ప్రీతి యెస♦ లారఁగ దద్దయు నెమ్మిఁబల్కర
వ్యాడు మది పల్లవింప ముని♦పుంగవుఁ డాతనిఁ గాంక్షభాగ మొ
కృఁడగు వినీతిఁ జూచి బుధ♦కుంజర నిర్దరితార్జనంబునం
బడసినయట్టి సక్తువు కృ♦పారతి నాఁకలి దీఱఁ దీర్పవే. 223

వ. అని సమర్పణంబు సేసిన నమ్మహీసురోత్తముం డా సక్తు వుపయోగించె దాన నతండు తృప్తింబొందఁ డునికి యమ్ముని గనుంగొని యేమిట నితండు తృప్తుండగు నట్లు సేయుదునొకో యను విచారంబు వొడమి డోలాయమానమానసుం డయ్యెం దదీయభార్య తదింగితం బూహించి యతనితోడ. 224

క. నాపాలిసక్తు విచ్చెద, నీపురుషునిఁ దృప్తుఁ జేయు ♦ మీ వనిన నతం
డాపొలఁతిదప్పియును సం,దీపితజఠరాగ్ని యైన♦ తెఱఁగును గనుచున్. 225

వ. ఇట్లనియె. 226

1. క. బలుపంట.

క. మృగములుఁ బక్షులు లోనుగఁ, దగు నాహారములు దెచ్చి ♦ తమ ప్రియులకు నిం
పుగ నిచ్చు నాకుఁ గొనఁ గాఁ, దగునె భవద్భోజ్యమైన ♦ ద్రవ్యము సాధ్వీ. 227
క. స్త్రీ సంతోషించు తెఱం, గాసపడని మనసు గలుగు ♦ నట్టి యధముఁ డి
చ్చో సడిఁ గనుఁ జని యచ్చోఁ, గాసింబడు జమునిభటులు ♦ గాఱియ వెట్టన్. 228
వ. అనిన విని యవ్వనిత యతనివదనంబునం జూడ్కి నిలిపి. 229
తే. పతియ చుట్టంబు బక్కంబుఁ ♦ బతియ చెలియుఁ
బతియ తల్లియు దండ్రియుఁ ♦ బతియ గురువుఁ
బతియ దైవంబుఁ గావున ♦ దనిపని యొ
నర్చుటయ మాని ధర్మంబు ♦ నాతి కరయ. 230
వ. అట్లుం గాక. 231
క. మానితగుణ నీవాఁకలితో నుండఁగ నేటిపాలు ♦ దోషం బిది యి
ట్లే నాహారము గొందునె, యీనిర్మలమతికి దీని ♦ నిమ్ముచితవిధిన్. 232
చ. అని తన సక్తు విచ్చినఁ బ్రి♦యమ్మున నమ్ముని యమ్మహాద్విజుం
గనుఁగొని దప్పి వో దిదియు ♦ గైకొను మన్న నతండు ప్రీతి నె
క్కొన భుజియించి పెండియును ♦ గూరఁడ తృప్తిఁ దదంతరంగముం
గనుఁగొని యత్తపస్విపతి ♦ గ్రమ్మఱ నెమ్మదిఁ జింత నొందినన్. 233
వ. తదీయతనయుండు తద్దశావిశేషం బెఱింగి. 234
సీ. తనపాలిసక్తువుఁ ♦ దండ్రికిఁ జూపి యీ, యతిథిఁ దృప్తునిఁ జేయు ♦ మనఘ దీనఁ
దనయుండు దండ్రి మెచ్చి ♦ త్తమాన నెక్కొసినకృత్యం బాచరించుట ♦ యర్థధర్మ
మన విని యమ్మహా♦ముని యెంతప్రాయంబు ననినను విను జన ♦ కునకు సుతుఁడు
బాలుండ యాఁకలి ♦ బాలుర కగ్గల, మట్లు గావున నిది ♦ యనుచితంబు
తే. నావుడును దాన పుత్త్రుఁడ ♦ నంగ నిందు
నన్నుఁ గాచుట యరయంగ ♦ నిన్నుఁ గాచి
గొనుట యిప్పింపి యిమ్మహా♦త్మునకు నిచ్చి
కావవే నన్నుఁ గారుణ్య♦భావితాత్మ. 235
వ. అనినం గొడుకుమాటలకు సమ్మహితాత్ముండు ప్రీతాత్ముండై యాసక్తువా యతిథి
కిచ్చినం బుచ్చుకొని యతం డుపయోగించి దానను నాఁకలివోని తెఱంగు దోఁచిన
నయ్యుంఛవ్రతుని డెందంబు గుందు నొందినం గోడలు తదాకార ప్రకారంబు
గని తనయంశం బైన పిండి మామముందటికిం దెచ్చి. 236
సీ. ఇదియును నతిథికి ♦ నిం డన్న నక్కట, యాఁకటఁ దలరి నీ ♦ యంగకములు
శిథిలంబు లైనవి ♦ నేడ్పడి యున్నది, చిత్తంబు దీనిఁ బు ♦ చ్చుకొని నిన్ను
దప్పితో నుండంగ ♦ నెప్పాట జూఁడఁగ, లాఁడ నేననుసు నా ♦ లఱన మీకు
మద్దురుగురులరు ♦ మహితశుశ్రూషకుఁ, గాదె ప్రాణములు నం♦గములఁ గలిమి

మనఁగ నది భూమి కవతరిం♦చినఁ బ్రమోద
మునఁగ నాధర్ముఁ డాతని ♦ కిట్లు లనియె. 249

క. వేడుక నాలుం గొడుకును, గోడలు నీవును బ్రభూత♦గుణ యొక్కనుసం
క్రీడమెయి ని వ్విమానము, నీడితగతి బ్రహ్మసభకు ♦ నేఁగఁగ వలయున్. 250

క. అనవుడు సక్తుప్రస్థుఁడు, దనవారును దాను నెక్కి ♦ ధర్ముం డనుపం
జనియె నది యంతయును నేఁ, గనుఁగొనుచు బిలంబు వెడలఁగా నామేనన్. 251

—♦ సక్తుప్రస్థుఁడు సకుటుంబముగా బ్రహ్మలోకంబునకు బోవుట ♦—

వ. ఆసక్తువు గంధంబును నతిథిపాద్యజలక్లేదంబునుం బొరసి సక్తుప్రస్థకృతం బైన పరమధర్మంబుమహిమం జేసి మదీయమస్తకంబును నొక్క పార్శ్వంబునుం గనకమయంబు లయ్యె నాఁడు దొడంగి యేను దానవిధిస్థలంబులకును బుణ్యాశ్రమభూములకును వివిధాధ్వరవాటదేశంబులకుం జనుచుండుదుఁ దక్కటి వక్క పసిండియగు నవుతలంపున నెన్నిచోట్లకుఁ బోయిననుం గాకుండు లోకోత్తరచరితుం డజాతశత్రుం డశ్వమేధంబు సేయుచున్నవాఁ డయ్యెడ నాకోర్కి సిద్ధించునని యిద్దయు నాసతో నరుగుదెంచితి నించుకవిశేషణంబునుం గాన వినుం డది కారణంబుగా నయ్యుంఛవృత్తి విప్రునిధర్మంబు నీయజ్ఞంబువోల దంటి నని పలికి యన్నకులంబు దానెక్కడ బోవుటయు నెఱుంగకుండం బోయెఁ బాండుకులపవిత్ర యమ్మఖంబునం గలిగినయాశ్చర్యంబు తెఱం గెఱింగించితి ననిన విని జనమేజయుండు.

సీ. జన్మంబునందు శా♦జన్యులఁ దపమున, మునిజనంబులు శాంతి ♦నసఘు విప్రు
లాసక్తు లగుదుర ♦ ట్లగుటఁ గాదే పుణ్య, రవనీశ్వరులు దొల్లి♦యాగకృతుల
నతులకీర్తులను స♦ద్గతులను బడసిరి, ధర్మనందనుఁ డత్యు♦దాత్తభంగిఁ
దొంటిభూనాథులకంటె సత్యమునను, శౌచమునను భక్తి ♦ శ్రద్ధ [1]నెగి

తే. నతిశయిల్లె వేదవ్యాసుఁ ♦ డావిరాగఁ, గలుగు నార్యజనులచిత్త♦ములకు నెక్క
నమరవల్లభుచందన మం♦దముగఁ జేసె, నశ్వమేధంబు మెచ్చుల ♦ కాకరముగ. 253

వ. అట్టి పరమధర్మం బావకులంబుచేత గర్హితం బగుటం గారణం బేమి యని యడిగిన వైశంపాయనుండు ధర్మపుత్త్రునధ్వరంబు నీ చెప్పినయట్టిద యైనను నొక్కటి సెప్పెద నవహితుండ వగు మన్నకులంబు హింసాత్మకం బైన పశుయజ్ఞంబుకంటె [2]నహింసామహితం బైన తపోమయయజ్ఞం బధికం బని చెప్పిన యది యయ్యె రిత్త చెప్పుటగాక తనశిరంబును శరీరార్ధంబును సువర్ణమయంబు లైనకతంబునుం బలికెం గాన దానివచనంబులు ద్రోపువడ వేదద్వేషయుం బైనది యొక్క యితిహాసంబు గలదది యాకర్ణింపు మని యమ్మునినాథున కిట్లనియె. 254

1. క. గలిగి యతి. 2. క. నహింసవిభినుతం బైన

సీ. అమరాధిపతి దొల్లి ♦ యాగంబు సేయంగఁ
దొడఁగ మహాముని ♦ స్తోమములును
సురసంఘములుఁ గూడి ♦ గురుముఖ్యు ఋత్విగ్గ
ణముల నేర్పఱిచి సాం ♦ పసుర వేది
గల్పించి తగ నగ్ని ♦ కార్యంబు నడపంగ
నస్వాలు పసువిచ♦యంబుఁ జేర
నమ్మునుల్ గనుఁగొని ♦ యధికదయార్ద్రంబు
లగు చిత్తములతోడ ♦ నమ్మహేంద్రు
ఆ. నానసంబు సూచి ♦ యక్కట హింస ధర్మంబు గాదు కృపయు♦గంబు సొచ్చె
ననఘ వత్సరత్ర♦యము ప్రాఁతగిలినబీజంబు లిపుడు యజన♦సాధనములు. 255
క. వేదోదితప్రకారం, బాదర మెసఁగంగ నడపు ♦ మది యుత్తమ ధ
ర్మోదయము సేయు నీకు ద,యాదృష్టిం జూచు పసుగ♦ణార్తి మహాత్మా. 256
ఆ. అనిన వారిమాట ♦ లాదరింపక యుండె, వాసవుండు దాన ♦ వాదు పుట్టె
నమ్మునీశ్వరులకు ♦ నతనికి సురసంఘ, మతని గూడ వాద ♦ మతిశయిల్లె. 257
వ. అట్టియెడం గర్మకాండవిదుం డగు నవఁచరవసువు సన్నిహితుం డగుటయు నయ్యిరుదెఱంగులవారును నా రాజన్యుని సాక్షిగాఁ గోరిన నతండు దేవతా పక్షపాతంబున బశువిశసనంబు కర్తవ్యం బని పలికి యధఃపాతంబు ప్రాపించెం గావున హింసారహితంబగు యజనంబు పూజనీయం బగుటకు సంశయింప వలవ దట్లుం గాక. 258
ఆ. ఉంఛవృత్తి యైన♦యుర్విసురోత్తముం, డట్లు ప్రాణరక్ష ♦ కై ఘటించి
స్వజనములును దాను♦భుజియింప నుండి యా,న్నసక్తు నతిథి కిచ్చెఁ ♦ జనదె పొగడ.
వ. అనిన విని జనమేజయుం డది యట్టి మునీంద్రానీవచనంబుల కొడంబడితి ధర్మమార్గగతంబైన ద్రవ్యం బింత భవ్యంబు గదే యవ్వస్తువు దానంబునకుం బ్రధానం బగుట యింకనుం బ్రస్ఫుటంగాఁ బ్రకీర్తింపు మనవుడు నాసంయమి యవ్వ్యాసపౌత్రపౌత్త్రు నాలోకించి యి ట్లనియె. 260

— ♦ అగస్త్యమహాముని ద్వాదశవార్షిక యజ్ఞప్రభావము ♦ —

సీ. ఇవ్విషయంబున ♦ నొండుఁ బ్రసిద్ధతం, బరఁగెడునట్టిది ♦ ధరణినాథ
విను తేతిహాసంబు ♦ వినుము చెప్పెద నగ,స్త్యుండు పండ్రెండేండ్లు ♦ సువ్రతాభి
రతిఁ జేయుమహితాధ్వ♦రమునకు దివ్యాను, భావంబు గలయట్టి♦ పరమమునులు
వేడ్క ఋత్విజు లయి ♦ వెలయ నిజప్రౌఢి, నఖిలతంత్రంబులు ♦ నాచరింప
తే. నాసమయమున వర్షింపఁ♦డయ్యె నింద్రుఁ, డోషధులు వికలత్వంబు ♦ నొందె దానిఁ
జూచి యత్తపోధను లగ♦స్త్యునకు నన్న,దానవిధు లెట్లు సెల్లునో♦ యనువిధమున.

వ. ఇతండు ద్వాదశవార్షికం బైన దీక్షావిశేషంబు నొందినవాఁడు ధర్మమార్గాగతం
బయిన ద్రవ్యంబు దక్క నొండు వినియోగింపండు దానయును గురియుదని ము
చ్చిరి తమలోఁ[1] బలుకపలుకులు ప్రతాపదీపితుం డగు నక్కుంభసంభవుం డాలించి
వారలతో నిట్లనియె. 262

ఉ. న్యాయము గల్గి యధ్వరము♦నందు విఘాతము పుట్టఁగఁ జేయఁ దాఁ
దోయదకోటిఁ బన్ని హరి ♦ తుష్టిగ వృష్టి యొనర్పకున్న నే
[2]నా యమరేంద్రపదం గొని మ♦హోద్ధతవృత్తి జగంబుఁ బ్రోచెదన్
మీ యెదఁ జింత దక్కుఁడు స♦మిద్ధతపఃప్రభులార నా దెసన్. 263

క. కాదేనిఁ ద్రిజగములల బహుళోదార ద్రవ్యకోటు ♦ లున్నయునికి మీ
పాదములపరిసరమునకుఁ దే దొరకొను నక్షణమునఁ ♦ దెచ్చెద వానిన్. 264

తే. అంత సేయంగ వలయునే ♦ యన్న ననఘు
లార యుత్తరకురుభూము ♦ లారఁ బండి
యున్నయవి యాగకాలోచి ♦ తాన్నములకు
వలయు ధాన్యముల్ దలఁపున ♦ వచ్చు నిందు. 265

వ. అని పలికి వెండియు. 266

క. ఆజాలి యేల నిర్మల,బీజహవిస్తంత్ర మేను ♦ ప్రీతి నొనర్పం
గా జగతి వఱపునం జెడు, నే జన్నము విఘ్నపడునె ♦ యేటికి వగవన్. 267

సీ. అన విని నీవు ధ♦ర్మాగతి సంసిద్ధ, వస్తుదాయివి నిర♦వద్యతపము
వ్యయముగా నీ కేల ♦ వాసవుపై కిన్క, సకల జగద్ధన ♦ మాహరించి
కొనవేల యుత్తరకురుభూములందలి,ధాన్యంబు లేల స♦న్మాన్య బీజ
హుతములందు ఫలేచ్ఛ♦ యోజింపనేల మా, కై యిన్ని దెఱఁగుల♦ యందుఁ బాత్ర
తే. నీదు చిత్తంబు దీని వి♦నిశ్చయముగఁ
జేసి సుఖ వగు మేము మా♦ చేసినట్టి
సుకృతములఁ దెచ్చికొందుము ♦ సులభములుగ
వలయు నాహారములు లోక♦వందనీయ. 268

మ. అని సల్లాపము సేయుచుండఁగ ననే♦కాంభోదజాలంబులం
బనిచెం బెల్లుగ వర్షముల్ గురియఁగాఁ ♦ బర్జన్యుఁ డాప్రొద్ద తా
నును నాచార్యుఁ బురస్కరించుకొని వ♦న్నుం గావవే యంచు న
మ్మునిశార్దూలుని గాన వచ్చె వినయం♦బుం భక్తియుం దోఁపఁగన్. 269

ఉ. వచ్చిన గారవించి యన♦వద్యపుటర్చన లిచ్చి సంయము
ల్మెచ్చఁగ శాంతసద్వచన♦లీలఁ బ్రమోద మొనర్చి యాతనిం
బుచ్చె సురేజ్యయుక్తముగఁ ♦ [3]బోఁడిగఁ బ్రమ్మఱ వేల్పువీటి కా

1. క. బలుకుబలుకులకు బ్రతా...సంభవుండు రోషించి. 2. గ. నాయమరేంద్రురీతిని 3. గ. ప్రోడిగ.

సచ్చరితుండగు లోకేశుఁ ♦ డనఘ రంజించె ధర్మసుతుని ధాత్రిఁ దనర. 270

తే. క్రతువు సంపూర్ణమైన యీ ♦ నరులు వినయ
భరితులై యోగ్యభంగి సంప్రీతి నృపుల
కర్చ లిచ్చి యనుపం గరుణ ♦ నాచరింప
వారుఁ బ్రీతి నేఁగిరి నిజా♦వాసములకు. 271

—♦ జమదగ్ని మహాముని పితృదేవతల శాపంబున నకులంబై పుట్టిన కథ ♦ —

వ. ఇవ్విధంబున హింసారహితంబుగా నాహితయాగంబు సుప్రయోగంబు సేసి యగ
స్త్యుండు మహాప్రశస్తి సుజ్ఞుఁడయి వెలింగెఁ గావున ధర్మమార్గాగత ద్రవ్య
కృతం బై తపోమయంబగు యజ్ఞంబు ప్రాజ్ఞజనమనోజ్ఞంబై వెలయు నని చెప్పిన
విని జనమేజయుం డిట్లనియె 272

తే. అనఘ నకులరూపంబున ♦ నట్లు దోఁచి
బ్రాహ్మణుఁ తోడ మానవ ♦ భాషణముల
నెవ్వఁడేనియు నొక్క యు ♦ హీనబోధ
ఘనుఁడు సల్లాప మొనరించె ♦ నని తలంచి. 273

తే. అతఁ డెవ్వఁడో యని నిన్ను ♦ నడుగఁ జూచి
యొండియును బ్రస్తుతోక్తుల ♦ విందు ననుమ
నంబుతో నూరకుంటితి ♦ నాకు నతనిఁ
జెప్పఁ దగు నేని బోధన♦శీల చెపుము. 274

క. అనుటయు వైశంపాయనుఁ, డనూనపుణ్యప్రదీప్తుఁ ♦ డగు నీ కెందున్
వినఁదగనియదియుఁ గలదే, వినిపించెద నంగివిధము♦విను తెలియంగన్. 275

సీ. జమదగ్ని పితృకార్య♦సంకల్ప మత్యంత,నియతాత్ముఁడై చేసె ♦ నిమ్మ యొప్పఁ
జారునూతనకల♦శంబున హోమధే నువుఁ దాన పిదికి గా♦రవముతోడ
నిర్మలనయెడఁ బది♦లమ్ముగా డించిన। నతనిచిత్తము తెలియఁ ♦ గరయు బుద్ధి
కాసారవృత్తిఁ గ్రో♦ధాధిదైవము వచ్చి, ప్రామాదికం బను♦భంగి దోఁపఁ

ఆ. గుండతోడిపాలు ♦ గూల్చినఁ గినియక, యూరకుండె నాస♦ముజ్జ్వలాత్ముఁ
డప్పు డాత్మ మెచ్చి ♦ యద్దైవ మతనికి, నిట్టు లనియెఁ గురుమహీశవర్య. 276

క. భృగువులు క్రోధను లనఁగా, జగతిఁ బరఁగు వాద మది [1]మృ♦షావరికలితం
బగుట దెలిసె నోడితి నీ, కగణిత మగునీతపమున ♦ కలికేద ననఘా. 277

వ. అని యొండియు. 278

క. నాదెసఁ బ్రసన్నుఁడవు గ, మ్మాదరమునఁ జూడు మైపు ♦ మపరాధము వి
ద్యాదయిత యనిన నమ్ముని, యాదైవముఁ జూచి శాంతి♦యుతుఁడై యనియెన్. 279

వ. నాయొక నివ్వాడు. 280

1. క. మృషాపరికల్పం బగుట.

క. నీ వేమితప్పు సేసితి, క్రోధము శంకాభయంబు ◆ దొలఁగఁగ సంక
ల్పావిలతకు నలుగుట పితృ, దేవతలకుఁ గలుగుఁ బొమ్ము ◆ దిగ్గున ననుమన్. 281

వ. భీతి నాభూతం బంతర్ధానంబు సేసెం దదనంతరంబ యా జమదగ్నిం బితృదేవ
తలు కోపించి పొడసూపి యతనితో నీవు శ్రాద్ధంబునకు సంకల్పించి యుండి
తద్వైకల్యంబు పుట్టిన నూరకుండ తని పలికి ముంగిసవయి పుట్టుమని శపించిన
నతండు వారలకు దండప్రణామంబు సేసి తపస్వికి నలుగం దగదని [1]యపరా
ధంబు గనియునుం గ్రోధాధిదైవంబునకు నలుగ నైతి. 282

ఆ. తప్పు సైఁచి నన్ను ◆ దయఁ జూచి శాపమోక్షము ననుగ్రహింపుఁ ◆ డమితతేజు
లార యని వినీతి ◆ లంపటుం డగుచుఁ బ్రార్థించుటయును వారు ◆ దెలివు నొంది.

వ. విదగ్ధవిప్రసమూహం బొడంబడ నట్టి యుచితవాక్యంబుల నీ వెన్నఁడేని మహా
ధర్మంబు గీడని యాడితి నాఁడు నీకు శాపమోక్షం బగు నని నిర్దేశించి
ర న్నకులంబును సక్తుప్రస్థనికతంబునం దగినమాటల నా తెఱంగున సదస్యులతో
ధర్మనందను నశ్వమేధంబు నధిక్షేపించి విగతశాపత్వానందంబుపొంది యంతర్హితం
బయ్యె నని యిట్లు జనమేజయునకు వైశంపాయనుండు పాండవాగ్రజు నశ్వమే
ధంబువిధంబు విస్తారప్రస్తవనీయంబుగా వివరించుటయు. 284

శా. భక్తిస్మేరమునీంద్రచిత్తకమల ◆ ప్రస్ఫీతసౌరభ్యసం
యుక్తా[2]రూఢతరప్రకాశితమురా ◆ ప్లోల్లాస రాగాదిని
ర్ముక్తైకాంతిజనైక తారసిక చి ◆ న్ముద్రాసదోన్నిద్ర ధీ
శక్తిస్వైరవిహారదూర లలితా ◆ సద్భావనోన్మీలితా. 285

క. అజరామరపదశరపద.భజనా సంసారజలధి ◆ పారీణస్తో
తృజనా స్వమూర్తివైదిక,యజనా. పాశ్చాత్యనాడి ◆ శార్ద్రివ్యజనా. 286

మాలిని. శ్రియుగకమలవీథీ ◆ దీప్తసంచారలీలా
నియమితపవనాత్మా ◆ గ్నిప్రభాస్నిగ్ధసంగా
స్మయవికచమహాబ్జ ◆ స్వైరమాధ్వీకధారో
దయమయ [3]మధురాత్మా ◆ దర్శితానందవర్త్మా. 287

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందు
సర్వంబును చతుర్థాశ్వాసము. 288

శ్రీమదాంధ్రమహాభారతమునందలి
యశ్వమేధపర్వము సమాప్తము.

---

1. క. నపరాధం బల్పంబనియు గ్రోధా. 2. గ. గూఢతర ప్రకాశితమరూపోల్లాస-చ. రూఢతర ప్రకాశితమహోత్ఫుల్లాస. జ. రూఢతరప్రకాశితమహోస్సోల్లాస 3. క. గ. చ. మధురత్వాదర్శిత.



హరిహరనాథాయ నమః.

# శ్రీ మదాంధ్ర మహాభారతము

## ఆశ్రమవాసపర్వము, ప్రథమాశ్వాసము.





సాధనపదపద్మో
పాసనవిద్యా శమైక ♦ పరతానిత్యా
భ్యాసజనహృద్య వేద
వ్యాసవచోవిభవవేద్య ♦ హరిహరనాథా. 1

—♦{ యుధిష్ఠిరాదులును గాంధారీధృతరాష్ట్రులును నొండొరులయెడల నడచికొన్న ప్రవర్తనము }♦—

వ. దేవా జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. నట్లు పితృపితామహక్రమ ప్రాప్తంబయిన సామ్రాజ్యంబు జగత్పూజ్యప్రకారంబునం గైకొని మహాధ్వర ప్రముఖధర్మకార్యధుర్యులును సముపాసితార్యులును దయావిధేయులు నగు పాండవేయులు ధృతరాష్ట్రువలన నెవ్విధంబువారై నడచిరి. హతపుత్త్రమిత్త్రామాత్యుండును గతైశ్వర్యుండు నగు రాజును యశోమహిత యగు గాంధారియు నెట్టిభంగి వర్తించి రత్తెఱంగు నాకెఱింగింపుము. 2

సీ. అనవుడు నమ్ముని ♦ యమ్మహీపతికి ని, ట్లను బాండునందను ♦ లాంబికేయు
నెడ భక్తివినయంబు♦లెసఁగంగ వర్తింతు, రతనియోగక్షేమ ♦ మరసి యెప్పుడుఁ
దత్సమీపంబునఁ ♦ దగ నిల్చి తమకు న,య్యది యైన నెఱిఁగించు ♦ నట్లు గాఁగ
నుఁదురు విదుర యు♦యుత్సు సంజయులు దా,రును నిత్యమును వచ్చి♦వినతిఁ జేసి.

తే. కొలిచి కూర్చుండి యానృపు ♦ నలఘుకార్య
విధము లేర్పడ నడిగి య♦విభుని చెప్పి
నట్ల చేయుదు రతఁడును ♦ నాదరంబు
గాఢవత్సలత్వంబును ♦ గలిగి యుండు. 3

ఉ. కౌరవనాథ కుంతియును ♦ గౌరవ మొప్పఁగ వచ్చి కొల్చు గాం
ధారి నతిప్రియత్నమున ♦ ద్రౌపది తాను సుభద్రయుఁ ముఁదం

బోరఁగ నిత్యముం [1]గొలుచు • నక్కురువంశమహోత్తరుఁ ఘనో
దారము లైన వస్తువు లు•దాత్తత నిత్తురు వార లందఱున్. 4

క. చిత్రాంగదయు సులూపియు, ధాత్రీశ్వర వత్తు రెపుడు • ద్రౌపదితోఁ దద్
గాత్రములు భూరివినయమా, త్రములుగ సుఖసుఖ ప్రమదమునఁ గొలువన్. 5

క. అతఁడింకిఁ దండ్రికి సం, ప్రీతి యలరఁ గుడువఁ గట్టఁ • బెట్ట సుదాత్త
స్ఫీతంబు లైన వస్తువ్రాతంబుల నిచ్చు ధర్మ•రా జనుదినమున్. 6

తే. గుళ్ళుఁ జెఱువులుఁ గట్టించుఁ గోరి యూళ్ళ
లగ్రహారముల్ గావించు • నాంబికేయుఁ
డధిప ధర్మతనూజుఁ, డ•త్యంతహర్ష
చిత్తవృత్తియై యనుమతి • సేయుచుండ. 7

క. జనవర ధర్మజుఁ గొలువం, జనుదెంచినయట్టి వివిధ•జనపతు లెల్లన్
ముని ధృతరాష్ట్రునిఁ గొలుతురు, విను మాకొడుకుమది పల్ల•వించును దానన్. 8

క. సూనులు లేమిం గలిగెడు, దీనత్వము దోఁప కుండఁ • దేజస్సౌఖ్యా
నూనులుగ జేయు ధర్మజుఁ, డానరపతి నతని దేవి • నతులితభక్తిన్. 9

సీ. వంశవృద్ధులు పుత్త్ర•వర్గవియుక్తులై, యున్నవా రేమిట • నుమ్మలింతు
రో యను పుయిలోట • నాయుధిష్ఠిరుఁడు దమ్ములకును దగు సమాత్యులకు నిష్ఠ
భృత్యులకును మీరు • ప్రీతియు భక్తి, నాంబికేయుని దెస • నతిశయిల్ల
నారాజు పంచిన•యట్ల చేసి చరింపుఁ, డతని నారాధించు • టస్మదీయ

ఆ. చిత్తమునకుఁ బ్రియము • సేయుట యతనికి, మనసు గానియట్టి•పనివొనర్చు
టగ్గలంపుదుఃఖ • మావహించుట యని, యనుదినంబు జెప్పు • మనుజనాథ. 10

క. విను మెల్లవారు నతనివ, చనములు మది నూఁది యట్ల • చరియింప మరు
త్తనయుండును నమ్మెయి వ, ర్తనము నడపుచుండు మనసు•దద్దయు నెరియన్. 11

క. ద్యూతంబున దుర్యోధను, చేతం దమ పడినపాటు • చిత్తంబున క
త్యాతురతఁ జేయుచుండుట, నాతఁడు ధృతరాష్ట్రుఁ జూచి•యలుగు మనమునన్. 12

తే. శ్రాద్ధదివసంబులందుఁ బుత్త్రవ్రజమున
కాంబికేయుండు గోకన•కాదిదాన
కీర్త్యముగఁ బారలౌకిక • క్రియలు సేయు
నట్లుగా సంఘటించు ధ•ర్మాత్మజుండు. 13

సీ. అతులభోగంబును • నంచితత్యాగంబుఁ, దొల్లింటియట్టుల • చెల్లఁ జేయు
ధృతరాష్ట్రునకు ధర్మసుతుఁడు గాంధారికిఁ, బూర్వప్రకారసం • పూజ్యదాన
[2]నిరతిఁ జెల్లించు న•క్కురువృద్ధుఁ డిమ్మెయిఁ బాండుపుత్త్రులు దన్నుఁ•బరమభక్తి
శిష్యవర్తనమున • సేవింపఁ దానును, గుసునట్లు వాత్సల్య•పరత నెపుడు

1. గ. గొలుతు రక్కురువంశమహోత్తరున్. 2. చ. నిరతిఁ జెల్లించుచు • నిష్ఠ నక్కురువృద్ధు, పాండు.

తే. వారలకు శ్రీయు నాయువు ♦ వైరిజయము
మానసమున నాశాసించు ♦ మానసేంద్రి
యుతని తొంటివర్తనముఁ ద♦ప్పనునికికి
నాత్మఁ దలఁపఁ డెన్నండును ధ♦ర్మాత్మజుండు. 14

క. విను మొకరి తెఱఁ గెఱిఁగి పరిజనములతో నాంబికేయు నుపచితులు పొత్తో
ధనుకొలఁగామియు నెవ్వాఁడును నాఁకన్యాగ వెఱుకు♦ను కురుప్రవరా. 15

సీ. రాజ్యాధిపత్యసం♦ప్రాప్త్యనంతరమున ధృతరాష్ట్రపాండుసు కాంత♦రంబు గాన
రోఁకటులు జనప♦దోత్కరమునఁ బౌరవర్గంబునందును ♦ వసుమతీశ
యుమ్మాయి నశపెను♦నప్పాంకవాగ్రజువలన నిజాత్మజు♦వలనికంటె
నధికుఁడు రాజు ప్రీ♦యుం బందు నట్లున్న, యక్కాలమునఁ బర♦నాత్మజుండు

తే. సన్నిహితుఁ డైనయప్పు డ♦జనవిభుండు
దన తనూజులఁ దలఁచి సం♦తాప మందు
నతనిఁ గనుగొని యబ్బిముఁ ♦డతని సుతులు
దమ్ముఁ బఱచినపాటులు ♦ దలఁచి యలుగు. 16

తే. హృదయముల నొండొరులదెస ♦ నిట్టివార
లయ్యు నతఁడు నతండు న♦న్యోన్యభావ
ణముల యప్పుడు మృదులవి♦న్యాస మొప్ప
నాడుదురు చుట్టములు మెచ్చు♦నట్లు గాఁగ. 17

వ. ధృతరాష్ట్రుం డేకతంబ యున్నయెడ వృకోదరుం డతనికి నింత నంత నుండి
గాంధారియు వినుచుండ. 18

సీ. అంధునికొడుకుల♦యం దొక్కరునిఁ దప్పఁ బోనీక త్రుంచితి ♦ భూరిశక్తి
దర్పితంబైనమ♦ద్బాహుపంజరము సొచ్చిన రిపురాజన్య♦సింహములకు
వెడలంగ వచ్చునే ♦ వెంగలులై వారు, గయ్యంబు సేసిరి ♦ గాక నన్ను
నెఱిఁగినఁ దొడరుదు ♦ రెట్టులు దుర్యోధనాదుల నడఁ దెగ♦టార్చినట్టి

తే. నాదుదోర్దండములఁ జంద♦నం బలంది
కుసుమదామముల్ సుట్టి మ్రొ♦క్కుడు మహోప
కారు లరయంగ దైవముల్ ♦ గావె యనుచు
[1]దీయమర్మంబు లెల్ల భే♦దిల్ల నదిమె. 19

వ. దీని ధర్మనందనుండు ధనంజయుండునుం గుంతియు ద్రౌపదియు నెఱుంగరు గవ లొక్కొక్కమా టిట్టిమాటలు విని సంతసిల్లుదురు ధర్మనందను తెఱం గెఱుంగు టం జేసి పురుషులోడి తా రేమియు నాడరు ధృతరాష్ట్రగాంధారులుం గాల పర్యాయంబు గనికొని డెందంబులఁ గంద నూరకుండుదు రట్టిభంగిఁ బంచదశ

1. క. దీయమర్మమర్మములు భేదిల్ల.

వత్సరంబులు సనియె నంత నొక్కనాఁ డయ్యంధనృపతి బంధుజనంబులం
గూర్చి ధర్మనందను రావించి యతండు వినుచుండ గద్గదకంఠుండగుచు వారల
తోడ. 20

— ♦ ధృతరాష్ట్రుఁడు ధర్మజునితోఁ దనమనోరథంబు దెలుపుట ♦ —

సీ. నా కతంబున జేసి ♦ యా కౌరవులకు నాశంబు వాటిలుట దెల్లంబు మీకు
జడుఁ గ్రూరు నతిలోభి ♦ జ్ఞాతిజనద్రోహకరు రాజుఁ జేసితిఁ ♦ సుదుశ్చరిత్రు
కచ్యుతుఁ జెప్పిన ♦ యమలవాక్యంబులు, విన నేరనైతి నా ♦ తనయువలని
ఘనతరస్నేహంబు ♦ నను మొగమోటను, దగియెడు మాటలఁ ♦ దలఁచి యొత్తి
తే. యూడ నుండితి భీష్ముండు ♦ నస్త్రగురుఁడు
విదురుఁడును సంజయుండును ♦ వేవిధముల
నాకుఁ జెప్పిరి గాంధారి ♦ నన్ను దూఱి
చెప్పె నమ్మాట లేఁ బెడ ♦ చెవుల నిడితి. 21
వ. ఇత్తెఱంగు నంతరంగంబున శల్యంబై యున్నయది యని చెప్పి వెండియు. 22
క. సుతులు సమరమునఁ దిరుగక, మృతులై సద్గతికిఁ జనిన ♦ మేలిమి యస్మ
న్మతిఁ దలఁచి వరతపశ్చరిత మని యప్పనికి వగవఁ ♦ బ్రీతియ కలుగున్. 23
వ. అని పలికి పాండవాగ్రజుఁ జేరం బిలిచి యతనితోడ. 24
సీ. నీ వరయంగ సు ♦ ఖావాప్తిఁ గొఱఁత లే, కుండితిఁ జనపును ♦ నుజ్జ్వలంపుఁ
దేజంబుఁ గలిగి వ ♦ ర్తించితి దానంబు, లంచితములుగఁ బె ♦ క్కాచరింపఁ
గంటి శ్రాద్ధంబులు ♦ గాంధారిసుతులకుఁ, బలుమాఱుఁ జేసితిఁ ♦ బరమధర్మ
శీల పాంచాలికిఁ ♦ జెట్ట సేసి రగణ్యపుణ్యుండవగు నీదు ♦ భూరిభక్తి
తే. నపహరించి రద్దుర్యోధ ♦ నాదు లట్టి
కష్టచరితులఁ బాడిమై ♦ గయ్యమునను
నిహతులుగఁ జేసి తక్కురు ♦ నికర మూర్ధ్వ
భువనగతిఁ గాంచి సుఖ ముండె ♦ భూపవర్య. 25
ఆ. కావున నేమియుఁ జేయం, గా వలవదు వారికయి య ♦ కారణకరుణా
శ్రీవిలసితుఁ డగు నీతో, నా విధముం జెప్పవలసె ♦ నరవరముఖ్యా. 26
సీ. ఏ కార్యమైనను ♦ నెవ్వఁడేనియుఁ జేయఁ, దొడఁగునప్పుడు విను ♦ పుడమితేని
చే ననుజ్ఞాతుఁ డై ♦ కాని తొడంగఁ గా, దట్లు గావున పార్థ ♦ కాభిలీఢ
మైన మదీయ కా ♦ ర్యమునకు సంస్కార, మాచరింపఁగఁ ♦ దప మాచరించు
పనికి భూపాల నీ ♦ యనుమతి వడయంగ, వలసి చెప్పెద రాజ ♦ వంశజునకు
ఆ. సమరమరణ మొండె ♦ విమలతపమునకుఁ, జొచ్చి యందు నిలిచి ♦ చచ్చుటొండె
తలఁప నస్మదీయ ♦ కులముఖ్యు లిట్టుల, సరసి రనుపు నన్ను ♦ నడవి కనఘ. 27
క. రాజు గురుఁ డెల్లవారికి, రాజోత్తమ గురునియాజ్ఞ ♦ రంజిల్లఁగఁ బే

రోదనం జేసెనక్కృతఘ్నుము,సూ జగముల రెంటియందు ♦ శోభన మిచ్చున్. 28

తే. ఏను గాంధారియును దపో♦యానవీయ,మునులచేసిన వల్కల♦ములు ధరించి
కందమూలఫలముల నాఁ♦కలి హరించి, నిన్ను దీవించుచుండెద ♦ మన్న నతఁడు.

క. ధరణీరాజ్యము నాకును, వరవర సౌఖ్యంబుఁ జేయు♦నా నీ విమ్మై
దురపిల్లి దుష్కరం బగు, నరణ్యవాసమున కేఁగి♦నట్టివ యైనన్. 30

తే. గూఢబుద్ధి వై నమ్మించి ♦ కురువరేణ్య, యే నెఱుంగక యుండంగ♦ నిట్లు శోక
వనధిఁ దేలుచుండి తి♦వ్వనట గంటి,నింక రాజ్యంబు నాకెట్టు♦ లింపుఁ జెపుము.

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు ♦ దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ నీవు కానన ని♦వాసము గోరి చనంగ నెట్లు లే
నుల్లము వట్టి హస్తిపురి ♦ నుండఁగ నేర్తు యుయుత్సుఁ జెంపు శో
భిల్లఁగ రాజుఁ జేయు నినుఁ ♦ బ్రీతి నెలర్పఁగఁ గొల్చి వచ్చెదన్. 32

క. అతఁ డౌరసుండు నీ క్షితి కొడయుఁడు దుర్యశంబు♦చేఁ గుందుట భూ
పతివర [1]కని కని దూఱ, ట్లతిమాత్రము నేయుఁదగునె♦యక్కట నాకున్. 33

సీ. నీవు రాజవు గాక ♦ నీ కేను రాజనే, గురుని మహారాజుఁ ♦ గురువరేణ్యు
నిటు సేయుమని పంప ♦ నే నోడయుండనే, దుర్యోధనాదుల♦దుష్కృతములు
నామదిలో నిల్ప ♦ నేమును వారును, [2]విధిమోహమున నైన విరసభావ
మావహిల్లినఁ బుట్టె ♦ నంతలు పదులు గాంధారియు గొంతియు ♦ గారవమున

ఆ. నాకు నొక్కరూప ♦ మీకుఁ గాననవాస, మెల్లభంగిఁ గలుగు♦నేని నేనుఁ
దగిలి తోన వత్తుఁ♦దగుమాటగా నాట, గాదు నామహృదయ♦గతియు నిట్లు. 34

క. పలికెద నే సత్యము నా, కిల ప్రీతిం జేయు దధిప ♦ యీవిట్లునం
గులముకలఁక దైవకృతం, బలఘుమతీ విడువు శోక ♦ మనయము నన్నున్. 35

తే. నీకు శుశ్రూష యొనరించి♦నృపవరేణ్య, చిత్తతాపంబు మానఁగఁ ♦ జేసికొందు
ననితలంచుచున్ విడువంగ♦నగునె యనన,త్యంతనై నిన్ను వేఁడెదఁ♦దోడుఁగ నగలు.

క. అనుచు నతని చరణంబులు, దనఫాలతలంబు సేర్చి ♦ ధర్మతనయుఁ డా
తని గ్రుచ్చి యెత్తి కౌఁగిట, నెనయంగాఁ జేర్చి యాతఁ ♦ డిట్లను నధిపా. 37

తే. నీవు శుశ్రూష చిరకాల♦నియతిఁ జేసి, తేను వృద్ధుండ నైతి నా♦కింక దపము
వలవ దయ్యె రాజును బాలి♦వాఁడ వెవ్వ,రేమి సేసినఫలముల♦నెద నృపాల. 38

వ. అని పలికి విదురకృపసంజయుల నుద్దేశించి తపసు మఖశోషయుం దనుగ్లానియుం గలిమి నుగ్గడించి నాలుకదొట్రువడ వారలతో మీరలును మపచనంబుల నజాతశత్రుం దెలివొందం జేయుం డని చెప్పి దప్పి యెక్కుడు గదిరిన గాంధారితనువుప మేను సేర్చి మూర్ఛిల్లుటయును నార్తి నొంది యుక్కుంతీనందనాగ్రజుండి ట్లని పలవించె.

1. క. కనికని - మీరిట్లతి; అ. కనుకనిఁ దుది నిట్లతి. 2. గ. విధిమోహితులమయి. విరస.

క. కరిదళనహాసబలవిస్ఫురితుఁ డగువిచిత్రవీర్యపుత్త్రుఁ డొకతలో
దరి నూఱఁగొనియె విధి యెవ్వరి హీనులఁ జేయఁ డకట వక్రుం డై నన్. 40

చ. అనిలజుమేనిచంద మగునాయసరూపము చూర్ణితంబు సే
సినబలమూనసీయుఁ డొకచేడియ నక్కట యూశయించె నే
మనఁ గల దన్విధాత్మ నని యాతనికిఁడును మానసంబునం
జొనపమి లావ పేసుకొని శోకము ధర్మజుఁ డొందె భూవరా. 41

సీ. అప్పుడు గాంధారి యల్లన ధర్మజుతోడ మాతండ్రి యతులతపంబు
తోడ సంతతచింతఁ గూడుఁ దొఱంగి తా నంతటఁ గూర్చుండ నోవ కునికి
నిట్లయ్యె ననవుడు నెవ్వనికతమున నిమ్మహాత్ముని కిట్టిమొదరు పుట్టె
[2]నట్టినామనుపు నే మనఁగల దంచు నాతఁడు శీతజలము హస్తమునఁ బుచ్చి

తే. కొని యతనిమోమునందు నొక్కొన విదిప్పు
సమయమున విదురుండును సంజయుండు
నఖిలభరతభార్యలు నేడ్చి రవ్విభుండు
నివిరెఁ జలికేల నాప్పుపునవయవములు. 42

క. నివురంగఁ దెలిసి యతనిం గవుఁగిటిలోఁ జేర్చి మస్తకము మూర్కొను కౌ
రవవృద్ధు నతఁడు నాశ్లేషవిశేషంబున నొనర్చె సంప్రీతునిగన్. 43

వ. అట్లు దెలివొందిన ధృతరాష్ట్రుండు ధర్మరాజుతో నాకెట్లునుం దపంబునకయి కాననంబునకుం బోవవలయు ననిన వజ్జనపతి నీ నారగింపు మన్నని మఱి సెప్పె దనని తోఁపుమాటగాఁ బలికిన నయ్యాంబికేయుండు పెక్కుమాట లాడ శక్తి లేదు న న్నింక నలజడిఁ బెట్టకుము తపశ్చరణంబునకు నీయాజ్ఞ వడసి కాని కదుప ననియె నయ్యవసరంబున సాత్యవతేయుండు కృపావిధేయుం డై యచ్చటికి వచ్చి సకలజనంబులవినతులు గైకొని దీవన లిచ్చి యా ధర్మతనయునాననం బాలోకించి. 44

—॥ వ్యాసుఁడు ధృతరాష్ట్రువనవాసంబున కనుజ్ఞ యిచ్చుట ॥—

సీ. అంబికేయుఁడు సెప్పినట్టుల చేయుము వృద్ధుఁడు నాత్మజవిరహితుండు
నైన యాతఁడు తప మాచరింపఁగఁ గోరెఁ గున్నిగాంధారి శోకోపశమము
దాలిమి నొదవి యింతదాకఁ బ్రవర్తించె నింక నియ్యమకును నిదియె తలఁపు
గావున నీకు నీ కార్యంబు సెప్పంగ వచ్చితి వీరిఁ బోనిమ్ము టొప్పు

తే. ననఘ పూర్వరాజన్యులు ననినయట్టి సౌఖ్యపథమున నీరాజు ననుట మేలు
గాన యాతని కాననగమనమునకు నిమ్మనుజ్ఞ విచారంబు తెల్లఁదక్క. 45

క. నీవినయము భక్తియు సంభావనమును వీరివగలఁ బాపఁగ నుర్వీ
పావళవర్తిత నడచితి భూవర చిరకాల మింకఁ బోనిమ్ము తగన్. 46

[1] ... యాతనికిం దనమానసం [2] చ. నట్టినామనను నే మనఁ..

చ. అని విని యాకురుప్రవరుఁ ♦ డమ్మునివల్లభుమోముఁ జూచి యి
ట్లను మహితాత్మ మాకు గురుఁ ♦ డన్నను ధర్మవిధోపదేష్ట య
న్నను బరదైవ మన్నను మ♦నఃప్రియకార్యకలాపకర్త య
న్నను విను నీవ నీ నుపచ♦నంబున కడ్డము పల్కువాఁడనే. 47

ఆ. అనిన నమ్మహాత్ముఁ ♦ డను రాజులకు రణ, మరణ మొండె నృపసమాధిఁ దనువు
విడుచు టొండెఁ గాక ♦ వృద్ధులై రోగతల్పమునఁ జావు మేలె ♦ భరతముఖ్య 48

వ. అనిన విని ధర్మతనయుం డొండు వలుకక వెఱచి యి ట్లనియె. 49

క. అనఘా యిక్కురుముఖ్యున, కనుజ్ఞ యే నిచ్చితిని మహాత్తరమగు మీ
యనుమతియుఁ బడసెఁ జనుఁ గ్రాక నిజేచ్ఛను నాకువిఘ్న♦కరణము దగునే. 50

సీ. అనుటయుఁ బ్రియమంది♦యమ్మహామునియు న,మ్మహీశ్వరుతోఁ బాండుఁ♦డీనృపాలు
గద్దియ నిడికొని ♦ క్రతువులు సేయించి, యవిరళభోగాను♦భవము నడపి
యాతనివారలఁ ♦ బ్రీతి నీక్షించె తా, శిష్యుండపోలె సం♦సేవనంబు
భక్తిమై నొనరించెఁ ♦ బదపడి నీవును, ద్విజవరాదులఁ ♦ దేజ ముకని

తే. నొందునట్లుగఁ జేసితి ♦ వొకటఁ బినపఁ, దాన పదము మూఁడువర్షముల్ ♦ ధరణి యేలె
నీవు సుశ్రూష [1]యుత్తటి ♦ నియతి నడపి, తితనిమది లేదు కలఁక యొ♦క్కింతయేని

క. కేవలతపఃక్రియాస, క్తావనతాత్పర్య మిపుడు చిత్తంబున యం
దావేశించినయది యీ,భూవరునకు నితని ననిచి♦పుచ్చు మడవికిన్. 52

ఆ. అనిన ధర్మతనయుఁ ♦ డట్టుల కా కని, పలికె దక్షిణంబ ♦ బరమయోగి
వంద్యుఁ డయిన సత్య♦వతి కొడు కాత్మతపోవనమున కరిగె ♦ భూపవర్య. 53

సీ. తదనంతరమ ధర్మ♦తనయుండు ధృతరాష్ట్రు,తోడ నీ కెట్టులు ♦ నూడఁ బోలె
విదురుండుఁ గృపుఁడు నె♦య్యదికృత్యమని విని,శ్చయ మొనరించిరి♦సంజయునియు
యుత్సునిమనముల ♦ నొలసినకర్తవ్య, మెద్ది దానిన చేయు ♦ మెంతయేని
నాకుఁ బ్రియంబు భూ♦నాథ యానతుఁడ నై, వేఁడెద నొకటి నీ♦విశదబుద్ధి

ఆ. నేమి సేయఁ దలచి♦తేని నీ వక్కట, యారగించి చేయు మయ్య యనుడు
నరిగె నానృపాలు ♦ డభ్యంతరావాస,మునకుఁ దోన సుబల♦తనయు ననఁగ. 54

వ. ఇట్లు కురువృద్ధుండు వృద్ధసామజంబుచందంబునం బనుసమ్ము విదురుండును యుయుత్సుండును గృపాచార్యుండును సంజయుండును వెనుకొన చని రజ్జనపతి దివసకృత్యంబు లాచరించి భూమిసురులం భుజించి యాహారతంత్రంబు నిర్వర్తించి గాంధారియుం గుంతీప్రముఖభరతభార్య లనుసయింప భోజనవిధి యొనర్పం దదనంతరంబ విదురాదులుం బాండవేయులును వనితాజనంబులుం గృతాహారు లయి యా వైచిత్రవీర్యు బరివేష్టించి యుండఁ బాండవాగ్రజు వప్పాండునృపాగ్రజుం డేకాంతస్థానంబునకుం దోడ్కొని పోయి యతనితోడ

1. చ. తటి సెడ్డ నియతి.

సప్తాంగంబయిన రాజ్యంబు పూజ్యంబగు ధర్మంబుతో నెనయ నశక్యం దుష్కరంబు గావున నాయెఱింగినంత బోధించెద నాకర్ణింపు మని పలికి యి ట్లనియె. ౫౫

—◆ ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు రాజనీతివిశేషంబులు సెప్పుట. ◆—

సీ. నీవు నిచ్చలును వి◆ద్యావృద్ధజనములఁ, దగ నుపాసింపు మ◆ర్థముల వారి
ప్రీతులఁ జేయుము ◆ నీతులు వారువ, దేశింప వాని నా◆దినమనంబు
కలిగి [1]వర్తింపుము◆కార్యంబు నింద్రియంబుల రాజ్యతంత్రంబు◆బోలె నరసి
రక్షింపు మప్పుడు ◆ రక్షితం బైన శుభంబులఁ గాంచు ◆ భావశుద్ధి
ఆ. ధామములను బిత్రుపి◆తామహక్రమసమాగతులు విశదమతులుఁ◆గాఁగవలయు
సచివు లతివిదగ్ధ◆చారులఁ బనుపుము, పరుల యాప్తజనుల◆భంగు లరయ. ౫౬
క. పురరక్షణము దృఢంబుగ, నరవర చేయంగ వలయు ◆ నమ్మఁగలుగు స
త్పురుషుల నిడఁదగుఁ గుడుపుని, దురమొదలగు లోనివనుల◆తోడ రవ్వు లరయన్.
సీ. ఆప్తవృద్ధులఁ బెట్టు ◆ మంగనాజనుల సం,రక్షకు నెల్ల కా◆ర్యముల మంత్రి
జనములతోడ వి◆చారించి చేయంగ, వలయును గుప్తని◆వాస మొండె
మాడుపుమీఁదొండె◆మాటు లేనియరణ్య, తల మొండె మంత్రవి◆ధానమునకు
సర్వముల్ కేవల ◆ [2]మైనట్టిమంత్రంబు, గోపనం బొందినఁ గురువరేణ్య
ఆ. యఖిలకర్మములు ఫ◆లావాప్తి నొప్పఁ బం,గ్వాంధజడులు చీకు లైన నీర
హాస్యభాషణముల◆యప్పుడు నేఁడువ, నునికి యొప్ప దార్య◆వినుతచరిత. ౫౮
క. విను మంత్రభేదమున వచ్చినకీడున కనఘ శాంతి ◆ సేయు టరిది గా
వున మంత్రులతో మంత్రా,వనియమం బూఁది చెప్ప ◆ వలయుం జుమ్మా. ౫౯
సీ. వ్యవహారములు శుచు ◆ లైన విద్వాంసులఁ, బోడుగఁ గొని తీర్పు ◆ దుష్టజనుల
దండించునెడ వారి◆తప్పులకొలఁదులు, మదిఁ [3]దూఁచి చూచి త◆న్మాత్రదండ
మాచరింపుము విను ◆ మాయవ్యయములు సం,క్షేపరూపంబున ◆ లేపకడలు
దానికి మును దేవ◆తాపూజనము భూసు,రార్చనమును జేయు ◆ మతులబుద్ధి
తే. ప్రొద్దు చాలంగ నెక్కిన◆ప్పుడు సమగ్ర,భోజనక్రియ నిర్వహిం◆పుము సుశీల
మాన్య తదనంతరమ గంధ◆మాల్యభూష,ణాంబరము లుని చేర్చుమై◆ననుభవింపు. 60
క. కోలు విమ్ము మాపుకడ యోధుల కెల్లను సంధ్య వడ్డ ◆ దూతలను జా
రుల సంభావింపుము రాత్రులఁ గాంతాభోగతత్పరుఁడ వగుము నృపా. 51
తే. ఏమి ప్రొద్దుగఁ బుట్టిన ◆ నించుకేని, యనువు గాక దాన నీ ◆ వరసి తీర్చు
[4]మిట్టి తెఱఁగుల కీప్రొద్దు ◆ లింతవట్టు, సర్వములు కౌరవక్షితి◆పాగ్రగణ్య. 62
క. న్యాయంబుతోడ వివిధో,పాయంబుల నర్థముల◆నుపార్జింపుము భూ
నాయక రాజ్యవిఘాతము, సేయుజనుల నెఱిఁగి చంపఁ ◆ జెల్లవ వలయున్. 63

1. గ. నిర్వర్తింపుకార్యంబు. 2. చ. మాప్తమంత్రంబులు. 3. జ. నూఁది. 4. అ. మిట్టితెఱఁగుగ నేప్రొద్దు◆నింతవట్టు.

క. పనులయెడ మేలు గాంచిన, మనుజుల యగ్గలము సేసి ♦ మన్నింపుము రా
జనయజ్ఞ భృత్యకోటిం, గొనియాడుము సేఁత పేరు ♦ గ్రుచ్చి కొలువునన్. 64

క. నీవలనను భక్తిస్నేహావేశము గలిగి శూరుఁ ♦ డై యలజడికిం
దా విసువనిసత్కులజుం, గావింపుము సైన్యవిభునిఁ♦గాఁ గుణముఖ్యా. 65

సీ. ఆత్మరంధ్రము లింతు ♦ లైనను నొరులకు, నెఱుఁగ రాకుండఁగ♦ మఱువుసేయు
మన్యరంధ్రంబుల ♦ నారసి కనుము శత్రులకడ బుద్ధియు ♦ బలుపుఁ గలుగు
వారల నెఱిఁగి భూ♦వర యొక్కమై నీగి, మన్నన నెఱపి త♦న్మానసములు
నీయెడ నార్ద్రంబు ♦ లై యుండఁ జేయుము, చేరువనృపులకు ♦ వైరబాధ
ఆ. పొట్లు గలుగు దాని ♦ నేమఱ కుండుము, వారియవుల నున్న ♦ వారు మిత్రు
లగుదు రెల్లభంగి నధిప యుదాసీను, లట సమీపవర్తు ♦ లైనవిభులు. 66

క. వీరలసప్తాంగంబులు, నారసికొని యునికి కార్య ♦ మవనీశ సదృ
శ్సారబలుఁడైననృపుతో, గారవమున సంధి సేయఁ♦గా వలయుఁ దగన్. 67

తే. దైవ మానుష బలములు ♦ దఱిఁగి యుండు
నెవ్వరికి నెవ్వ డప్పుడ ♦ యొసక మెసఁగ
వైర మతనితోఁ బాటింప ♦ వలయుఁ జెఱచు
టప్పనము గొను టర్త్వా ♦ మరసి నడపు. 68

క. నడపునఁ గొల్పుచ్చుగ నగు, నెడయు విడిసి యుండి చెఱచు♦నిక్కయు నీ వే
ర్పడఁ గనుఁగొని యందర్వాము నడపుము నిజసైన్యరక్ష♦ణము వలయుఁజుమీ. 69

క. ప్రెగడలమనసులు విరసము, లగుగతి నడపు రిపురాజ్య ♦ మరసి విభిన్నం
బుగఁ జేసి కలఁచి పైకొని, జగతీవర కొనఁగవలయు ♦ సౌకర్యమునన్. 70

ఆ. బలము లెసఁగ దైవ♦బలమును కలిగి లో, గుట్టుచేటు లే♦నియట్టినృపతి
వలన మత్సరంబు ♦ వలదాశ్రయంబుచా,దంబుపొందు వడయఁ♦దగు నృపాల. 71

—♦ ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు శత్రురాజుల జయించు తెఱఁగు సెప్పుట. ♦—

ఆ. కుడువ నిచ్చుతఱియుఁ ♦ గురువర [1] శక్కించు,నవసరంబు నెఱిఁగి ♦ యరినృపాలు
నీవు ధీరవృత్తి♦నిముఁ ద్రాటఁ బోనిమ్ము, క్రమ్మఱ కపిల యనఁగ ♦ గ్రమ్మి[2] చెఱుపు.

సీ. ఉత్సాహశక్తియు ♦ నుర్వీశ మంత్రశ,క్తియుఁ బ్రభుశక్తియుఁ ♦ గెలనివాని
కిని నీకు నిట్టివి ♦ యను తారతమ్యముల్, వెరవునఁ బరికించి ♦ వేర మెత్త
వలయుట నెఱి గల్గి ♦ పలుకక యుండంగ,దగుట యూహించు టు♦త్తమవిధంబు
మూలబలంబును ♦ మొత్తాలవారును, మిత్రబలంబును ♦ శత్రుబలముఁ
ఆ. గానవంబుబలముఁ ♦ గైజీతగాండ్రును, నైనయట్టిబలము ♦ లాఱు నరసి
యుచితకాలదేశ♦యుక్తంబుగఁబన్ని,కొనఁగవలయువాని♦కొలఁదు లెఱిఁగి. 73

తే. సంపదల నాపదల నొక్క♦చంద మగుట

1. జ. శంకించు. 2. గ. చెఱుపు.

విక్రుతి నొందుట యాబల♦వితతులందుఁ
గాంచి యెల్లప్పుడును హిత♦కారి యైన
బలము నెక్కుడుగాఁ బ్రోవు ♦ భరతముఖ్య. 74
క. [1]పగుల గెలిచి నిర్భయముగ, ధరణిఁ బ్రజం గాచు పేరవు ♦ ధర్మపథమునం
బరిపాలించిన పెలయుం గురువర కృపపెంపు వదల♦కుము ప్రజలయెడన్. 75
క. వినికి గలిగి రక్షించుచు ననువున దయతోడిపాడి ♦ నాయతు లెల్లం
గొనుచుఁ దగ నేలి పొగ డొందినరాజున కుర్వి కామ♦ధేనువ కాదే. 76
సీ. ధర్మమార్గంబున ♦ ధరణిఁ బాలించిన, నైహికసుఖములు ♦ నగ్గలంపుఁ
బొగడును బరలోక♦భూరిసౌఖ్యములును, సిద్ధించు విపులద♦క్షిణలు పెట్టి
యశ్వమేధ ప్రముఖాధ్వరంబులు పెక్కు, లాచరించుటకంటె ♦ నధిక మంత్రు
మేదిని ప్రజల న♦త్యాదరంబును గరుణాతిశయంబు మ♦ధ్యస్థతయును
తే. గలిగి బిడ్డల నరసిన♦కరణి గాఢ రక్షణం బొనరించుట ♦ రాజవర్య
వినుము తమ్ముల నీగి మ♦న్ననల ననుదినంబు గొనియాడు మానందనంబుగాగ.
చ. నరవర రాజనీతులు జ♦నస్తుతుఁ డైన నదీతనూజుఁడున్
హరియుఁ బరాశరాత్మజుఁడు ♦ నాదిగఁ గల్గిన పెద్దలెల్ల నీ
కరయఁగఁ బెక్కు సెప్పిరి మ♦హాత్మక యు నీదెసఁ బ్రీతి [2] పెద్దయుం
బొరయుట నేనుఁ గొన్ని యిటు ♦ వోలినభంగి నెఱుంగఁ జెప్పితిన్. 78
క. [3]నిత్యవిధిసద్వివేకము, సత్యవ్రతశీల ధర్మ♦సారజ్ఞ భవ
న్మత్యాకలితము లైనను, నిత్యంబును వృద్ధసేవ ♦ నిమ్మఁ జలుపుమీ. 79
సీ. అన విని ధర్మజుం ♦ డంబికాపుత్రుతో, నాపగాసుతుఁడు లేఁ ♦ డబ్జనాభుఁ
డాత్మపురంబున ♦ కరిగె [4]వాత్సల్యత, నీవు దక్కఁగ నాకు ♦ హితము సెప్ప
నొడయఁ డెవ్వఁడు భవ♦దుపదిష్టపథమున, నిమ్మమై నడచెద ♦ నెమ్మనమున
నీవు ప్రీతిని బొందు ♦ నృపముఖ్య నాపుడు, నాతఁడు సంతస ♦ మంది యతని
ఆ. నధిప విశ్రమింపు ♦ మధికశ్రమంబు న్నాతనువునందుఁ జెందె ♦ నని తగంగఁ
బోవఁ జెప్పి బాంధ♦వావళి కభిముఖుఁ, డయి నిజాలయముల ♦ కరుగఁ బనిచి. 80
వ. తాను నభ్యంతరగృహంబున కరిగి సుఖాసీనుం డై యున్న నమ్మానవనాథుతో గాంధారి దేవి వనంబున కెపుడు విచ్చేయువాఁడ వని యడిగిన నాభూవల్లభుం డద్దేవి కి ట్లనియె. 81
క. మాతండ్రి పరాశరసుతు, చేతం బడసితి ననుజ్ఞ ♦ శీలపరతో
పేతుఁ డగుధర్మతనయుఁడు, ప్రీతి నొడంబడియె బంధు♦బృందయుతముగన్. 82
ఆ. ఇంకఁ దడయ నేల ♦ యింతి వే వెడలుద, మట్లు గల్లుజాద ♦ మాడి పాప

1. గ. అరుల. 2. క. బద్ధముం- ట. బంధముం. 3. గ. నిత్యము వినికి వివేకము- జ. నిత్యవినీతి వివేకము. 4. ట. వత్సల నీవు, దక్కంగ నాకు హితంబు సెప్ప.

భాగు లైన నీదు♦[1]పట్టుల సుగతికి, ననుచు వారిఁ దపము♦నకు నియమున. 83

—♦ ధృతరాష్ట్రుండు వనవాసంబునకుం బురజనులచే ననుజ్ఞ గొనుట ♦—

వ. అని పలికి యాయుష్మత్సుతుల కెల్ల మోక్షంబయి వారికి సుగతి గల్గునట్లుగా నిప్పుడును గొన్ని పుణ్యక్రియ లాజాతశత్రు ననుమతితో నాచరించి పోదము గాక యని నిశ్చయించి తనకుం దపోవనగమనంబునకై పౌరులయనుజ్ఞ గొనవలయు నని పాండవాగ్రజునకుం జెప్పం బనిచిన నతండు దగు పురజనుల నెల్లను [2]బనిచి సేసి వెలార్చికొనుచు నఖిలబంధుమిత్త్రులునుం దానును వచ్చి ధృతరాష్ట్రమందిర ద్వారపురోభాగంబున నిలిచె నయ్యంబికేయుండు గాంధారియును దోడరా వెడలి వారిసన్నిధికిం జని బ్రాహ్మణక్షత్త్రియ వైశ్యశూద్రసంకులంబైన యన్నగరజనప్రకరంబు నుద్దేశించి. 84

సీ. కౌరవకోటియు ♦ మీరుఁ బెద్దయుఁ గాల, మనఁగి పెనఁగి యు♦న్యోన్యసంభృ
తాధికస్నేహుల ♦ రై ప్రవర్తించితి రనఘవర్తనులార ♦ వినుఁడు నాదు
పలుకు వృద్ధునకుఁ ద♦పశ్చరణంబున, కై వనంబున కేఁగు ♦ టర్హకర్మ
ముచితకృత్యంబుఁ♦ దోడ మీ రెఱిఁగిన, యదియ కా మది ముద♦మార మీర

ఆ. లెల్ల నా కనుజ్ఞ ♦ యిచ్చి కానకుఁ బుచ్చుఁ, డనుడు సర్వజనులు ♦ నశ్రుపిహిత
దృష్టు లగుచు గద్గ♦దిక నెలుం గెడలఁగ, నార్తి దోఁప నేడ్చి ♦ రధిపముఖ్య. 85

వ. విని ధృతరాష్ట్రుండు వారి కిట్లనియె. 86

సీ. ప్రజ మును మొందంగఁ ♦ బాలించెఁ బుడమి శం
తనుఁ డనంతరము శాం♦తనవుచేత
రక్షితుఁ డగుచు మీ♦రలు ప్రీతిఁ బొదల వి
చిత్రవీర్యుండు ని♦ష్ఠాత్రి యేలెఁ
బడపడి పాండునృ♦పాలుండు మీరు హ
ర్షింపంగ భూమి ర♦క్షించెఁ బిదప
ధర్మనందనుని చం♦దము మీ రెఱింగిన
యది సత్యధర్మాత్ముఁ ♦ డైన యితని

తే. ననుసరింపక యన్యాయ♦ మాచరించి, దుర్ణయంబున నిల యేలి♦ తుంచెఁ గులము
నుర్విఁ గల భూపతులను దు♦ర్యోధనుండు, వానికు శ్చేష్టలకు మూల♦ మేన కాదె.

వ. అది మీ మనంబులం బెట్టక. 88

క. మహి నెప్పగ రక్షించిన, మహితగుణులయన్న కొడుకు ♦ మమ్మనుం డని నా
కు హితంబు గోరి కరుణా, సహితుల రై యిం డనుజ్ఞ ♦ సన్న్యాసముకున్. 89

వ. అని యప్పౌరజనంబుల మనంబుల లే కున్నను దనకీల్గ్గడించి యరణ్యగమనాను జ్ఞాకరణంబునకుం బ్రార్థించి యవ్విభుండు వెండియు. 90

---

1. క. పట్ల సద్గతికిని. 2. చ. బిండు సేసికొని వెలార్చి.

ఆ. వృద్ధ కృపణ పుత్త్ర•విరహిత గాంధారి, యీ నెలంతఁ జూచి • దైన్య మీర
లకట కానసమున • కరుగుట మే లని, మా కనుజ్ఞ యిందు • మాన్యులార. 91

వ. అని పలికి పాండవాగ్రజుం జూచి. 92

సీ. తమ్ములనకుము నీ•తండు దిక్పాలక [1]మధ్యభాసితుఁ డైన•మఘవుఁ బోలి
మహనీయవిభవస•మగ్రత వెలిఁగెడు, నేమిట నేమఱ • కెపుడు మీర
లితనిఁ బొదివి సం•ప్రీతిగ వర్తింపుఁ, డయ్య యిల్లడ యిమ్మ•హానుభావు
నిడితి మీకడ మిమ్ము • నెల్లభంగులఁ దన పరిపాలనంబునఁ • బరమసుఖులు

ఆ. గా నొనర్పువాఁడు•గా నప్పగించిన వాఁడ నేను మీకు • వేఁడి దాఁకు
నట్లుగాఁ జరంప • నస్మత్కులీనుల, కధిక దుఃఖకారి • నైతిఁ గాని. 93

క. అరయ నెన్నం డైనను, మీరలు నా కెగ్గు గాఁగ • మెలఁగుట లే దో
పౌరవరులార నన్నున్, గారవమున ననుప రయ్య • కాననమునకున్. 94

వ. అనినం బౌరజనంబు లేడ్పులు మ్రింగికొని యొండొరులం జూచుచు నూరకున్న
నమ్మహీశ్వరుండు మఱియును. 95

సీ. సాధుచరిత్రయు • శాంతయు నైన యి•గ్గాంధారియును నేను • గాఢవినయ
మార మీ తెలి విట్లు • గోరుచు నున్నార, మఖిలధర్మాభిజ్ఞుఁ • డగు పరాశ
రాత్మజుండును ధార్మి•కాగ్రణి పాండవా•గ్రజుఁడును నాకు న•రణ్యగమన
మునకు నిచ్చి రనుజ్ఞ•మోడ్పఁగేలు దల•గదియించి మిమ్ము వేఁ•డెదఁ గృపాధ్యు

తే. లార యనుమతి సేయుఁడు • మీరు ననుడు, వార లుత్తరీయంబులు•వదనవినిహి
తములుగాఁ జేసికొని రోద•నము రవంబు, లెసఁగఁ జేసిరి విను ధర•ణీశవర్య. 96

వ. అ ట్లేడ్చి యుడిగి తమయంతవట్టునుం గూడికొని కార్యవచనంబు లార్యచరితుం
డును జతురాలాపకల్యుండును న[2]గు శంబు వనువిప్రోత్తమునకుం జెప్పి యుత్తెఱం
గున ధృతరాష్ట్రునితో నాడు మని నియోగించిన నాతం డారాజు నగ్రభాగంబున
జేరి సవినయంబుగా ని ట్లనియె. 97

— ధృతరాష్ట్రునితో శంబు వనువిప్రుఁడు పౌరజనసమ్మతి సెప్పుట —

సీ. భరతవంశోత్తమ • పౌరజనంబులు, దమమాటలుగ భవ•త్సన్నిధాన
మున న న్నుపన్యాస • మొనరింపఁ బంచిన, యట్టిభాషణము లే•కాగ్రబుద్ధి
నవధరింపుము మీమ•హాన్వయంబునమహీ•విభులయం దొప్పయి • వెదకిరైనఁ
గానము మము మీరు • గన్నట్టిపగిదల న్నెట్లట్ల రక్షించితి • రాదరమున

తే. వినుము దుర్యోధనుండు సే•సినయవర్త
మొక్కటియు లేదు నినుఁ దిరో•కోత్తరుండు
సత్యవతికొడు కే మని • సమ్మతించి
పంచె దానిన చేయుము • వరమనియతి. 98

1. గ. మధ్యభాసితశతమఖుఁడుంబోలె. 2. క. చ. ట. కాశల్యం డను.

క. అడలెడఁ బడఁగా మమ్మును, విడిచితి గురువై సశోక ♦ వేదన యే మిం
కఁ డిపికొన నప్పటికిఁ దోడ్పడు నీ దగు సద్గుణములు ♦ బంధులువోలెన్. 99

ఆ. ధాత్రి శంతనుఁడు వి♦చిత్రవీర్యుఁడుఁ బాండుఁ, రాజు సెట్టు లట్ల ♦ రాజరాజు
ప్రజకు సంతసముగ ♦ బాలించె నీయుండు, నతనియందుఁ గలదె ♦ యధిప మెగ్గు.

వ. భీష్మద్రోణకృప ద్రౌణికర్ణ కృతవర్మశల్యు లోనగు దిక్కులను భీమార్జుననకులసహదేవ
ద్రుపదవిరాటసాత్యకు లోనగు దేవయు నై విధిప్రేరణంబునం బోరి వారివలన
నఖిలక్షత్త్రియసంక్షయం బావహిల్లె నది యొక్క దుర్యోధనుచేతన యయ్యెనె
యట్లుం గాక రణంబు రాజుల కుత్తమధర్మంబ కాదె యందుల మరణంబును
సుగతికరణకల్యంబు నీసుతుండు సహాయులుం దానునుం బుణ్యలోకసౌఖ్యం
బునం బొంది యున్నవాఁడు ధర్మాచరణశాలి వగు నీకును సుగతిప్రాప్తి సులభంబ
యగు నిట కూఁదటికి మాభాగ్యంబునం జేసి పరమకృపాభరితు లైన పాండవులు
మాకు రక్షకులుగాఁ బడసితి మాకర్ణింపుము. 101

తే. స్వర్గమైనను బాలింపఁ ♦ జాలువారు, వీరలకు భూమిపాలన ♦ విధి యనంగ
నెంతపని వీరిచేతికి ♦ నిచ్చితిపుడు, మమ్ము నెల్లవిధంబుల ♦ మనిచి తధిప. 102

సీ. ధర్మపుత్త్రుఁడు దీర్ఘ♦దర్శి మహాత్మ, సచివుండు బంధుర♦క్షణపరుండు
రిపునెడ నైనను ♦ గృప పెద్ద భావసం, శుద్ధియుఁ బ్రతిభయు ♦ సువ్రతంబు
నితనికి వెన్నతో ♦ నిడినవి యొగులను, దనయట్ల కాఁ జూచుఁ దమ్ము లెల్ల
సన్నుతి కెక్కిన ♦ సకలగుణముల నిమ్మహితాత్ముచందాన ♦ మమ్ముఁ బ్రోచు

తే. మాత్రయే దేవవిషయస♦ముచితాగ్ర, హారసజ్జనమాన్యంబు ♦ లైన గ్రామ
ములు దగంగ రక్షింతురు♦వెలయఁ దాకు, నిత్తు రూళ్ళలు దేవమ♦హీసురులకు.

క. మృదువులకుఁ జాలమృదువులు, విదితముగా వినుము పాండ♦వేయులు గడుబె
ట్టిదులు బెడిదంపువారికి, మదలోభిత్వములు లేవు ♦ మందున కైనన్. 104

క. శూరులు శాంతస్వాంతులు, పౌరజన ప్రకరజాన♦పదచయనిత్యా
పారప్రమదాపాదన, పారగు లతుల గురుభక్తి ♦ పరతంత్రాత్ముల్. 105

తే. కొంతిదేవికిఁ గోడండ్ర♦కును మనముల, గరుణ యగ్గలమై యుండు♦ధరణినాథ
పౌరులందును జనపద♦ప్రజలయెడను, నాడునురు మేలు దమ కగ్గ♦మైనయపుడు.

తే. వీర లెప్పుడు మము నీవు ♦ గారవించు
కొలఁకి మన్నింతు రమలిన♦హృదయ కలక
దక్క ధర్మజుపై రాజ్య♦తంత్రభార
మిడి మనంబున నూఱడి ♦ యిచ్చ సలుపు. 107

వ. అని చెప్పి నిట్లు విప్రప్రముఖంబునం బౌరులభాషణంబులు విని ధృతరాష్ట్రుండు
ప్రీతుండయి సముచితప్రకారంబుల సజ్జనంబులం గ్రమంబున వీడుకొలిపి
కౌంతేయాది బంధువులను మిత్త్రులను నిజనివాసంబులకుం బోవం బనిచి

గాంధారీసమేతుండై యభ్యంతరమందిరంబున కరిగి యద్దినశేషంబును రాత్రియుం దగు వర్తనంబులఁ గడపి మఱునాఁడు విదురుని రావించి మృతు లయిన బాంధవుల కెల్లను సవిశేష శ్రాద్ధంబులు సేయుతలంపు పుట్టె కొన్నిదినంబులు పయనంబు మానితి మానితమాననీయచరిత్రుం డగు ధర్మపుత్త్రుపాలికిం బోయి నీ వీకార్యంబు సంఘటింపు మని పనిచిన నతం డట్ల చేసెద నని చని యనుజసహితుం డై యున్న యన్నరేంద్రునిం గాంచి. 108

సీ. మీతండ్రి సురనదీసూతిబాహ్లికులకు, సోమదత్తునకుఁ దత్సూనునకును
దుర్యోధనాదిసుతులకును దక్కను, గలుగు బంధులకు నుత్కర్ష మెసఁగ
శ్రాద్ధముల్ సేయువిచారంబు దోఁచిన, మసలెఁ గార్తికపౌర్ణమాసిదాఁక
వనమున కరుగఁ డప్పని నీకుఁ బోలిన, యట్టులు గావింపు మనిన నాతఁ
తే. డెంతయును వేడ్క నమ్మాట కియ్యకొనియె
నర్జునుండును బ్రీతుఁ డై యర్థి మనియె
భీముఁ డపుడు [1]గమర్బ్సమోహముతోడ
విదురువదనంబు సూచుచుఁ బెదవు లదర. 109

వ. ఏమేనిం బలుకం జూచిన బీభత్సుండు మెలుపున నతని వారించి యుల్లస యిట్లనియె. 110

సీ. రాజు వృద్ధుండు ధృతరాష్ట్రుండు భీష్మముఖ్యజ్ఞాతులకు శ్రాద్ధకర్మ మాచ
రింపఁ దలంచి యర్థించె భవజ్జిత,ధనధాన్యములు నీవు దాని కియ్య
కొనమి యశంబునకును ధర్మమునకు విధ్వంసంబు సేయుటే ధర్మతనయ
తలఁచినపని విఘ్నితము సేయఁ దగునయ్య మనకు నయ్యంబికాతనయుఁ డొల్లి
ఆ. వేఁడికొండు మఱఁడు వేఁడెనుఁ గానకుఁ నేఁగు చుండి మనల నిష్ట దింత
నూడ వలదె యొండు లాడక యప్పని, సలుపు టొప్పు బాహుశాలిసీకు. 111

క. అని చెప్పఁగఁ జెవి [2]దారిచి, విని ధర్మతనూజుఁ డంత విజయునిఁ బొగడెన్
మనమున నమ్మాటల కయ్యనిలతనయుఁ డిట్టు లనియె నన్నరుతోడన్. 112

—భీముఁ డర్జునునితో ధృతరాష్ట్రునుద్యోగంబునకుఁ బ్రతికూలించి చెప్పుట—

క. మును చేసినయవి సాలవె, విను గాంగేయాదిబంధువితతికిఁ దగ నిం
కను శ్రాద్ధంబులు వలసిన, మనము దగమె చేయ దుష్టమతి యతఁ డేలా. 113

క. మఱచితె యాతఁడు మనలం, బఱచినబన్నములు భీష్మబాహ్లికముఖు ల
త్తఱి నట వోయిరి వారల, నెఱుఁగమె మన మట్టిబంధు లేటికి మనకున్. 114

వ. వారివిషయం బైనమేలునకు మాఱాడుట యొగ్గు గాఁ దాకర్ణింపుము. 115

తే. కర్ణునకుఁ జేయవలసినగౌరవమున, గొంతి యింకను శ్రాద్ధ మత్యంతవిభవ
ములసిల్లంగఁ జేయుఁ గాకుచితనిరతి,యావిధమునకు మాఱాటసూవె యొగ్గు.

1. క. క్రశల్య. 2 గ. వాలిచి.

దనియెఁగ నిమ్ము సర్వవసు◆ధాసురకోటులకున్ నిజేచ్ఛ నీ
తనయులు పుణ్యలోకసుఖ◆ధాములు లై వెలసిల్లునట్లుగా
నను టయు నాంబికేయుహృద◆యంబున మోద మెలర్చె భూవరా. 131

చ. పదపడి భీముమాట లొక◆భంగి నెఱుంగఁగ జెప్పె వాఁడు దు
ర్మదుఁ డవి పాటి గావు కురు◆రాజమహాత్తర పెట్టకుండు నీ
హృదయమునందు వాని నని ◆ యేర్పడ ధర్మజపార్థవాక్యముల్
విదురుఁడు సెప్పి సంతసము ◆ వెల్లిగొనంగ ననేకభంగులన్. 132

ఆ. అట్లు సంతసిల్లి ◆ యధిప కార్తికపౌర్ణ, మాసి నవ్విభుండు ◆ మహిత భూమి
దేవకోటి నెల్ల ◆ రావించి యుచిత, శ్రద్ధఁ జేయఁ దొడఁగె ◆ శ్రాద్ధవిధులు 133

సీ. కనకాదివస్తువుల్ ◆ గడువేడ్క ధర్మనం,దనుఁడు పుత్త్రేర ను◆దాత్తభంగి
బాహ్లికునకు గంగ◆పట్టికి సోమద,త్తునకుఁ దదీయపు◆త్త్రునకుఁ దొలుత
[1]నంచితశ్రాద్ధంబు ◆ లాచరించె సుయోధ,నాదికుమారుల ◆ కందఱకును
వేర్వేఱఁ గ్రియ[2]లు నీ◆ప్సితవిధంబులఁ దగ, నొనరించె సింధురా◆జునకుఁ దక్కఁ
ఆ. గలుగుబంధులకును ◆ వలయురాజులకును, ద్రోణునకును బుద్ధిఁ ◆ దోఁచినట్టి
యిష్టజనములకు న◆హీనభవ్యప్రకా,రములఁ బారలౌకి◆కము లొనర్చె. 134

చ. అతులిత రత్నకాంచనగ◆వాశ్వవిభూషణవస్త్రకన్యకా
క్షితిముఖవస్తుదానములు ◆ కీర్తన కెక్కఁగ నవ్విభుండు సు
వ్రతుఁ డయి చేసెఁ బంచదశ◆వాసరముల్ నిజదానలౌల్య మ
ప్రతిహతవృత్తిఁ జెల్ల విని ◆ పాండుసుతాగ్రణి ప్రీతిఁ బొందఁగన్. 135

ఆ. భూమిదానవిధులు ◆ భూవర యొకమాత్ర, నంబికాతనూజుఁ ◆ డాచరింప
నంతఁ బోక యూళు ◆ లగ్రజన్మలకు నీ, నతని బనిచెఁ బాండవాగ్రజుండు. 136

—◆ ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుం డై వనంబునకుఁ బోవుట ◆—

వ. వచ్చిన ప్రియంబు పెంపున హృదయంబు పల్లవింప నాభూవల్లభుం డనేక గ్రామంబు లగ్రహారంబులు గావించె గాంధారరాజు మొదలయిన నిజబంధువులకు బహుళదక్షిణలుఁ గాఁ బారలౌకిక క్రియలు సేసె నిట్లు ధృతరాష్ట్రుండు భారతరణంబున మరణంబు నొందిన బంధులోకంబునకుం బుణ్యలోకసౌఖ్యాతిశయపదంబు లగు పరమశ్రాద్ధంబులు నిర్వర్తించి కృతకృత్యుం డై సర్వకృత్యంబులుం జలిపి పాడ్యమినాఁడు రేవకడ ఋత్విక్సమేతుం డై యిష్టి నడపి పాండవులను దక్కటిబంధువులను మిత్త్రులను రావించి వనవాసంబునకు సంకల్పంబు సేసి సకలభృత్యజనంబులకు నర్థధనంబు లిచ్చి గాంధారీసమన్వితుం డై వల్కలాజినంబులు ధరియించి యక్షతగంధపుష్పంబుల గృహంబుఁ బూజించి సర్వపదార్థంబులు బరిత్యజించి యుద్దేవియుఁ గదిసి నడవ యాజకు

1. క. నక్షిష్ఠ శ్రాద్ధంబు. 2. జ. లతిప్సితవిధంబుల నొనరించె.

లగ్నులు నుపకరణంబులును ధరియించి ముందటం జేరువ నడుగ నడుగ వెడలె
నట్టియెడ నేతెంచి. 137

క. కొంతి మొదలైనకౌరవ, కాంతాజను లెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ
ర్యంతంబుల బాష్పసలిల, సంతానము లురలఁ దోన చనుదేరంగన్. 138

వ. అజ్జనపతి సనుచుండె. 139

తే. పాండవాగ్రజుఁ డక్కుఱుభర్తవలను, శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి
హా మహారాజముఖ్య యెం దరిగెదనుచు, నొడలు కంపింపఁ జదికిలఁబడియె నధిప.

క. నతఁ డనునయించి కొన నన్నరపతి నెత్తుచును దా నయనయుమున్ వనటం
బురపురఁ బొక్కుం గురుభూవరు యుద్దెసఁ దెలుఁగు రాదు వాక్రువ్వంగన్. 141

వ. భీమసేననకులసహదేవులును గృపయుయుత్సుసంజయులును ధౌమ్యాదిధరణీ
సురులును శోకవ్యాకులత్వంబు నొందిరి కొంతి యడలుచు గాంధారికరంబు
నిజస్కంధంబున నిడికొని నడవ నయ్యంధనృపతి గాంధారీస్కంధభాగకలిత
బాహుండై పోవుచుండె నప్పుడు పాంచాలియు సుభద్రయుఁ జిత్రాంగదయు
నులూపియు సపుత్రి యగు నుత్తరయు మఱియుం గలయట్టి మగువలుం గురరీవిచ
యనాదంబులచందంబు దోఁప నాక్రందనంబు సేసి రయ్యవస్థ జూడఁబునాఁడు
పాండవులు పురంబు వెలువడినప్పటిదశం బోలియుండె నట్లు ధృతరాష్ట్రు
కాననగమనంబు నిశ్చితం బగుటయు నాబాలవృద్ధంబుగాఁ బురజనంబు గనుం
గొనం జనుదెంచిన. 142

ఆ. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుం, గనిపురంధ్రు లెల్లఁ గరము వంతఁ
దలరు నంతరంగములతోడ నక్కుఱు, వృద్ధుఁ జూడ నార్తివికలగతుల. 143

క. నెలఁతలు హర్మ్యంబులపై, నోలి నిలిచి చూచుచు నాహాత్కారములశో
కాలాపవిలాపంబులు, నేలకు మింటికిని నడుము నిండి చెలంగెన్. 144

వ. ధృతరాష్ట్రుండును బురద్వారంబు నిర్గమించుచుండి సకలపౌరజనంబుల నిలువం
బనిచె విదురుండు నక్కురువృద్ధునితోడ వనంబున కరుగుట దృఢనిశ్చయుండై
పలికె సంజయుండు నవ్విధంబు వాఁడయ్యెఁ గృపాచార్యుండును యుయుత్సుండు
నత్తెఱంగుమాటలాడిన నాంబికేయుండు వారిని వారించి ధర్మనందనున కప్పగించి
నిలిపి కోడండ్ర నెల్లను సముచితవచనంబుల మరల నియమించిన వార లావైచి
త్రవీర్యునకు గాంధారికిం బ్రణమిల్లి బాష్పంబులు వదనంబున వెల్లిగొనుచుండ
వీడ్కొనియును బాండురాజమహిషిం జూచికొని వెనుకం జను చుండి రా సమ
యంబున నజాతశత్రుండు గొంతి కిట్లనియె. 145

క. మాయయ్య కాననమునకుఁ, బోయెడు నే నితనితోడఁ బోయెద శ్వశ్రూ
పాయత్తుండనై యుండెద, నీయువిదలఁ గొనుచు మగిడి యేఁగుము తల్లీ. 146

చ. అనుటయు గొంతి యక్కురుకులాగ్రణి కిట్లను నీవు దోడఁ గా

వనమున కేఁగు దెంచుట జ♦న స్తవనీయ చరిత్రుఁడ విద్విభుం
డనుమతి సేయునే యుడుగు ♦ మావని యియ్యమ యత్ర నాకు నీ
మనుజవిభుండు మామ గరి♦మంబుగ వీరలఁ గొల్చి పోయెదన్. 147
తే. ఇతని కియ్యనుకునను విను ♦ మేన చుప్పో, వలఁతి సు శ్రూష సేయంగ♦వత్స మీఁర
లావనికి నేర్తురే వీర ♦ లవని కరుగ, నింట నుండంగ నామన ♦ మియ్యకొనుని.
వ. అనిన నాధర్మపుత్త్రుండును దమ్ములు నుచితవచనంబుల వేఁడికొనిన నద్దేవి యుగ
తనయుం గనుంగొని. 149
క. వీరలయెడఁ గొడుకా [1]యుపచారంబులు పలుకుదు నె వి♦చారము విను మే
నేరూపంబున నిలునన, గారవమున నిది వ్రతంబు ♦ గాఁ గైకొంటిన్. 150
వ. అని పలికిన నిజస్కంధంబున నున్న గాంధారికరంబుఁ గర బు నమునంబునం బాపి
యతనిదిక్కు మొగంబై 151
క. నీ వేమియు వనవాసము నహ, దేవుని నేమఱక యరయు ♦ దినకరసుతుండిల
భావమునఁ దలఁపు మే న్యా, దేవసనునిపుట్టు వదంచి తొం గవటమునన్. 152
క. అది పావము దానికి నా, మది నెప్పు ను వగతు విమల♦మానస యక్కి
డు దొలంగకమ్ముగా నత్పు దధానములు సేయు ♦ తాత్పర్యమునన్. 153
ఆ. అవిరోధమునఁ గర్ణుఁ ♦ డాజిఁ బోము న, నాదు మానసంబు ♦ వోసు నీరు
వఱియులై తలంప ♦ ఒలుకాలఁ జేసిన, నాకు గాఁగ పలపు ♦ వంశపర్వ. 154
క. నీవును దమ్ములు భక్తిభ, రావేదయులొడఁ దలఁపుఁ ♦డమ్మసిలాత్మ
ద్రోవది నెప్పుడు దృఢసం, భావన నున్నంపు మయ్య ♦ పౌగవబాహ్యా. 155
క. భీమార్జునసకులసహ, దేవులంబుల సఫలతా వ్రతకాలంబులు గా
భూమిగాక యరిసి యెునపు, మేమింట నేను అట ధర్మ♦మిట యరయు నెడన్. 156
వ. అని పలికి నానిశ్చయంబు శిథిలంబు గాగ మీరు మరలుం డని పలికినం బాండ
వాగ్రజుండు విషాదం బంది యూరకుండె భీమాదులు డెందంబులు గొందలం
బంద వ్రమ లోచనుల దల ఆ ంచి రి ట్లచ్చెమ్మత్తంబుగ మనంబు [2]కుడివడుచు
మందంబై చెల్ల ధృతరాష్ట్రునకు [3]గొండొకయెడ గాఁగం జనియె నాధర్మతన
యుండు తల్లియాననం బాలోకించి. 157

— ♦ ధర్మరాజు కుంతిని వనంబునకుఁ బోవలదని ప్రార్థించుట. ♦—

సీ. ఇది యేమి సేయంగ ♦ నెత్తికొం టిమ్మాట, యాడకు మేను ని ♦ న్నడవి కేఁగఁ
బనుతునే మముఁ దొల్లి ♦ పనిచి పనులఁ గొను, భంగిన సామ్రాజ్య♦భారనిర్వ
హణము లెఱుంగును ♦ నప్పటికప్పటి, కి ట్లని యానతి ♦ యిచ్చినడపఁ
బంపక యున్న నొ♦ప్పమి రాదె మాకు ము, న్నీవును గృష్ణుండు ♦ నేవిధమున
తే. నడపితిరి కార్య మెఱుఁగవే ♦ యడలు వెల్లి

1. క. యుపచారంబులు. 2. గ. నుడివడుచు. 3. గ. గొండుకయెడ.

మమ్ముఁ బాంచాలి నిటు ముంచి • యమ్మ యడవి
నెట్లు యుండెద వనఁగ నయ్యింతి బాష్ప
పూర్ణనయన యై యూరక • పోవుచుండె. 158

ఉ. అ య్యాశ్రములాత్మతోడఁ బవ•నాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రు నీ
వెయ్యది యుక్తహేతువుగ • నెమ్మెయిఁ బాసెదు నీదుపుణ్యవం
గయ్యము సేసి భూపతిని•కాయములం బరిమార్చెఁ దల్లి నీ
కియ్యన లక్ష్మి నూఁది [1]చరియింపగ నిప్పుడు వాయ బాడియే. 159

క. మనమునఁ దోఁచినదానము, లనుదినమును జేయుచును స•మాశ్రితజనులం
బెనుచుచు బంధులఁ బ్రోచుచు, జననుతచరితమున బరఁగు • సౌజన్యనిధీ. 160

క. వనమున మాదీపుత్త్రులు, [2]వెనుఁబడుటకుఁ దలరి తట్లు • విక్రమమునవెం
గొనగొల్పి తిట్లు వీరల, ననూనదుఃఖముల ముంచి • యరుగం దగునే. 161

వ. అనియె నట్టియెడ. 162

క. ద్రోవదియు సుభద్రయు శోకావేశం బడర మోహము • లగ్నలఁ దోఁగం
గా వెక్కి వెక్కి యేడ్చిరి; భూవర పాండుక్షితీశ•పుత్త్రులు నేడ్వన్. 163

క. పరిజనములు గన్నీళ్ళులు, దొరఁగఁగ [3]నవశ లొంది వారి•తోడం జని రి
ప్పగిదిఁ దనదుతనూజులు మరలమికిం బాండురాజ•మహిషి మొగుచున్. 164

వ. తెగనాడ కున్నఁ బోవ రని కన్నీరు దుడిచికొని వారలం గలయం గనుంగొని వా
రలు వినుచుండం దక్కినజంబులతోడ. 165

సీ. దుర్ద్యూతమునఁ దాసు • నాలపోవుటయును, నాసభ నపకీర్తి • యగుటెఱుంగు
వాటిల్లుటయుఁ బెక్కు • భంగుల నడవుల, నిడుమలఁ బడుటయు • నే సహింపఁ
జాలక కార్యంబు • చెప్పించి సంధికై నోవఁనివా రెల్ల • నవ్వఁ దలఁచు
వంచి కౌరవులతో • వర్తింప నే లని, హరితోడ నాడితి • నవ్విధమున

ఆ. మానినీయు ధర్మసూను నాగాయుత,బలుని భీము శత్రుభంజనైక
శీలు బార్థు శౌర్య•లోలురఁ గవల దైన్యంబు నొందఁ జూచు • టర్హ మగునె.

వ. అని ధర్మతనయుపదనంబు వీక్షించి పాంచాలిం జూచి. 167

సీ. గౌరవంబున ను•మారత్వమున నొప్పు, నిప్పొత్తిఁ దల వట్టి యీడ్చి తెచ్చి
సభలోన నట్లు దు•శ్శాసనుం డవమాన, పెట్టంగ వచ్చుటే•పెద్ద లెల్లఁ
బలుకక యుండ న•బ్బన్నంబునకు నోర్వ, వలసె మీ కప్పటి • కలఘుతేజ
నీతేజ మట్టులు • నీ అయిఁ బోయినఁ, బాండునికులము సె•ప్పంగఁ జూప

తే. లేక [4]పోదె యబ్బంగిఁబ•ల్కితి ముకుందుతోడ నేను మీ రెమ్మెయి•రూఢి కెక్క
వెలుఁగఁ గోరుటకతమున•దలఁచిదాని, ననిలసుతుఁడె త్రిప్పె నే • మనఁగఁగలదు.

1. గ. చరియింపఁగ నిప్పుడు. 2. క. చ. ట. 'వెనుఁబడుటకు...విక్రమము మెయిం గొనివచ్చి యిపుడు వీరల'. 3. గ. నడ లాడ వారి. 4. గ. పోక కబ్బంగి.

వ. అనిన విని ధర్మసుతుండును భీముండును సిగ్గువడి రిట్లు వలికి గొంతి యిమ్మాటకు భీముచిత్తం బెట్లగునో యనుతలంపున ధర్మసుతుని కతనిం జూపి. 169

ఉ. నాకుది నొండు లేదు విను ♦ నవ్విభు నీతనితోడ నీదు ల
క్ష్మీమహిమోన్నతం బలరఁ ♦ జేసితి నుత్తమదానముల్ జన
స్తోమనుతంబుగా నడపఁ ♦ జూచితి జన్నము గన్నులార నిం
కేమికొఱంత నా కుడుగ ♦ నెట్లును బోదు నరణ్యవృత్తికిన్. 170

తే. రాజ్యఫలము గావింపఁ బు ♦ త్త్రి సమగ్ర, తపమునకు ఫలమైనయు ♦ త్తమగతి ప్ర
సిద్ధి గోరుదు నది గల్గఁ ♦ జేత కిట్టితోడు మఱి నాకుఁ గలుగునే ♦ దురితదూర.

క. కురురాజునకును దేవికిఁ, బరిచర్య లొనర్చుచుం ద ♦ పంబునఁ గృశితం
బొరయుతనువుతోఁ గడపెదఁ, గరము నియతి నింకఁ గలుగు ♦ కాలము వత్సా. 172

వ. మీరు మరలుం డనియె నట్టియెడ నప్పాండురాజమహిషి దమతోడ వనవాసంబున కై వచ్చుటకుం గడంగుటయు దాని కొడంబడక పాండవులు దగు పలుకులం బ్రార్థించుటయు నెఱింగి గావున ధృతరాష్ట్రుండు ధర్మతనయుం డెట్లు సెప్పె నట్లు సేయు మని విదురసంజయులచేత నద్దేవికిఁ జెప్పి పుత్తెంచి వార లేతెంచి యబ్భంగి సెప్పినను వదలక వారిపలుకులు లాయము విచారించి దృఢనిశ్చయంబునఁ గొడుకులఁ గోడండ్రను దక్కటిబాంధుజనులను సర్వభరతభార్యలను బరిజనంబులను గలయం గనుంగొని యిట్లెల వచ్చెదరు నిలువుండు సుఖులరై యుండుం డనుటయు. 173

క. హృదయములు దలర నందఱుఁ, బ్రదక్షిణము గాఁగ నేడ్వఁ ♦ గందు వెలుఁగు లె
ల్ల దెసలఁ జెలఁగఁ దిరిగి తత్పదంబులకు నెఱఁగి వంత ♦ దనువులు దూలన్. 174

వ. నిలిచి రందుఁ బాండవు లేవురుం బాండురాజమహిషి ననుప మఱియుం జని యాయమను ధృతరాష్ట్రగాంధారులను గలసి వారల నిరువుర నుద్దేశించి మీరు వనంబునకుం బోయి తాను లే కున్న మా కెట్లు కాలంబు గడపవచ్చు నను తలంపునం దన్ను నెంత ప్రార్థించినను గొంతి నిలుచుట కొడంబడ దయ్యె నీసాధ్వికి బుద్ధి సెప్పికొనుచుం బరిచర్య సేయించుకొండని యప్పగించి యా రాజునకు నద్దేవికిం గుంతికిం బ్రదక్షిణంబు సేసి దండప్రణామంబు లాచరించిన దీవించి వారామంత్రణంబు సేయ నా ధర్మపుత్త్రాదు లశ్రుప్లావితంబులగు వదనంబులతోడ మరలి వనితాజనంబులం దోడ్కొని. 175

తే. పొగులుచును నల్లనల్లన ♦ పురికి నరిగి
[1]రదియు సమ్మిళికంబు ప్రో ♦ వైనయట్లు
నూఁడి గూడక యుండంగఁ ♦ జొచ్చి రాత్మ
మందిరంబు లందఱును బుధ ♦ మాన్యచరిత. 176

1. క. వ్యథయు సమ్మిళికంబు.

వ. అట్లు పురప్రవేశంబుసేసి ధర్మనందనుండును దమ్ములుం దగినవర్తనంబుల నుండ నట యక్కురువృద్ధుండును నిశ్చింతుండై గాంధారియుం గుంతియు విదురసంజయులు నగ్నిహోత్రంబునకు వలయుఋత్విగ్జనంబులతోడ నరుగుదేర నలయక భాగీరథీతీరంబునకుం బోయి యొక్కయోగ్యప్రదేశంబున విడిసెఁ దదనంతరంబ యతండు. 177

క. స్నానాదికవిహితానుష్ఠానంబులు నడపి శ్రుతివిశారదభూదే
వానీకప్రణయనమున, మానితరుచి వెలుఁగు చున్నసమహితాగ్నులకున్. 178

తే. అర్చలిచ్చి హోమంబు సక్రమంచితముగఁ, జలిపి యెల్లవారలకు భోజనము సంఘ
టించి యాహారవిధి యాచరించి విదుర,సంజయులయొనర్చినదర్భశయ్యనుండె.

— ధృతరాష్ట్రుఁడు శతయూపరాజర్షి యాశ్రమంబున వసియించుట. —

వ. ఆశయ్యకు ననతిదూరంబునం గల్పితం బైనతల్పంబున గాంధారియుం దదనంతర సన్నిహితశయనంబున గొంతియు నింతనంత విదురసంజయులును జుట్టం దమకుఁ జూడం బోలినచోటుల యాజకజనంబును విశ్రమించిరట్టిదినశేషంబు సనిన సాయంతనకృత్యంబులు సలిపి రత్ర్యాఖని యచ్చటఁ గడపి సూర్యోదయసమయంబునం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి యాంబికేయుండు దనవారును దానును గంగానది యుత్తరించి చని కురుక్షేత్రంబుఁ బ్రవేశించి యొక్కపుణ్యాశ్రమంబునుపాంతంబునం దరుచ్ఛాయాశీతలం బైన సికతాతలంబున నాసీనుం డయ్యె నట్లుకురురాజు నిజాశ్రమప్రదేశంబునకు వచ్చుట శతయూపనామధేయుండును గేకయవంశవర్యుండును దపోధుర్యుండును నైనరాజర్షిసత్తముండు విని యయ్యెడకు వచ్చి. 180

క. కని గారవంబునం దోడ్కొని చని యర్ఘ్యాదివిధు లశకుంఠితవినయం
బున నడపిన నయ్యాశ్రమ, మున నతఁడు వసింపఁ గోరె భూపవరేణ్యా. 18!

క. కోరిన విదురాదులు నా, కౌరవపతిత్తలఁపు మేలుగాఁ గొని తగ న
చ్చేరువను బర్ణశాలలు, వే రచియించి రుచితంపువిధమున నధిపా. 182

వ. అం దక్కురువిభుండు దానును గాంధారియుఁ జీరాజినవసనులును సువ్రతపరులు నగుచుఁ గుంతీవిదురసంజయులతో వసియించి తపం బాచరింప యాజకులు నిజకృత్యంబులు నడపుచుండి రిట్లు నియమనిష్ఠ లతిశయిల్ల నాభూవల్లభుం డచ్చటిమును ల(చ్చెరువంద న)చ్చెరువ నతితీవ్రతపశ్చరణంబున నిజాంగంబు నిర్మాంసత్వంబునం జర్మాస్థులు గదియునట్టికార్శ్యంబు దనకు నొప్పుగా వర్తిల్లె నని యిట్లు ధృతరాష్ట్రు వృత్తాంతంబు సెప్పిన వినియ వ్విచిత్రవీర్యనందనుండుపదంపడియెట్టివాఁ డయ్యె మునీంద్రా యెఱిఁగింపు మనుటయు. 183

శా. ఆశాపాశవిమోచనోపకరణవ్యాలోచనవ్యూఢధామ సం
క్లేశోత్సారకదివ్యనామ వరదృక్లీలాప్తనిస్సీమ ల

త్క్రిశుంభత్సురలోక చక్రపరశుచ్ఛిన్నాసురానీక వి
ద్యాశోభాస్ఫురణాకృతీ శమదమాద్యంతర్యభాస్వీకృతీ. 184

క. మునిహృదయనిలయపాదా, వినతజనావనవినోద విద్యావిద్యా
ఘనచింతాంతికదూర లసనపీతస్మితసామజత్వగ్వసనా. 185

మాలిని. అపరిమితవిభూతీ యప్రమత్తానుయాతీ
[1]లపననిభృతవేదా శ్లక్ష్ణస్వైరనాదా
జపపరవరదాయీ సర్వవిద్యావిధాయీ
విపులకృపకటాక్షా విశ్వసంహ్లాదదక్షా. 186

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున యాశ్రమవాసపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 187



1. గ. లపనవిస్మృతవేదా.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆశ్రమవాస పర్వము, ద్వితీయాశ్వాసము

—:0:—



సంబంధాయుర్గురు
తాసిద్ధిదచరణపద్మ ! దాంత్యున్మీల
ద్ధీసద్మ శాంతిసేవ్యా
వ్యాసాదిమునీంద్రభావ్య ! హరిహరనాథా. 1

ధృతరాష్ట్రుపాలికి నారదుండు మునులతో వచ్చి యత్తపోవనమహిమ సెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు వైచిత్రవీర్యుండు పరమ తపోధుర్యుండయి యుండె నంత నొక్కనాఁడు నారద పర్వత దేవల మహాంజా యను లమ్మహీనాయకుం జూచువేడ్క నయ్యాశ్రమంబునకుం జనుదెంచిన. 2

క. శతయూపుఁడు నయ్యెడకుం, గుతుకంబున వచ్చె వారిఁ ! గుంతి వినయసం
భృతయై యందఱను సమ్మర్చితులుగఁ జేసినఁ బ్రహృష్టచేతసు లగుచున్. 3

వ. ధృతరాష్ట్రుకడకుం బోయిన నతండు వినయసంభ్రమంబులతో వినతుండైన దీవన లిచ్చి యతని పెట్టించిన దర్భాసనంబుల నాసీనులై యుచితసల్లాపంబులు సేయుసమయంబున నారదుం డన్నరనాథుతో [1]శతయూపనామధేయుం డయిన ధరాధిపుపితామహుం డగు సహస్రచిత్యుఁ డనుమహారాజు దనపెద్దకొడుకైన శతచిత్యునందు రాజ్యభారం బిడి యియ్యాశ్రమంబునకు వచ్చి తపశ్చరణంబున దుశ్చ్యవనసఖత్వంబు వడసె మఱియును బృషధ్రుండును శైలాలయుండును బురుకుత్సుండు నిందుఁ దపంబు సేసి యింద్రలోకంబు వడసి రాజర్షిసత్తముల నెల్లను నే నీలోకంబున వెలుంగు చుండి యియ్యెడం గంటి నయ్యెడం జూచితి నిది యితరదుష్ప్రాప్యం బయినపుణ్యప్రదేశంబు నీకుం గృష్ణద్వైపాయనుప్రసాదంబున నిచ్చట వసియింప సంభవించె నని పలికి వెండియు.

సీ. ధరణీశ యిచ్చటఁ దపమున నీవు నన్నృపులయట్టుల విశిష్టపుఁబదంబుఁ

---

1. ఇ. శతజిహ్వుఁడు...ధరాధిపున ప్తయగుసహస్ర.

గందు నీతోడన । గాంధారియును వచ్చు, మీకు శుశ్రూష యొనమేయభక్తిఁ
జేసి కుంతియుఁ బతిఁ । జేరంగ నరుగు న,ప్పాండుభూపతి సురపతిసమీప
మున నుండి యెప్పుడు । నినుఁ దలంచు నతండు, పోఁడిమి నీయుఁ గన్గొలఁదు నీకు
ఆ. ధర్మమూర్తియైనధర్మసూనుఁడు దన, యాత్మ గాన విదురుఁ । డన్న రేంద్ర
వినుతతనువుఁ దగఁ బ్రవేశించు సంజయుఁ, డతులనాకలోకగతి వెలుంగు. 5
వ. అనిన విని యాంబికేయుండు గాంధారీకుంతీసమేతంబుగా సంతోషంబు నొందె
నచ్చటియందఱును బ్రీతాత్మకులై రప్పుడు. 6
క. శతయూపుఁడు నారదుతో, నతులజ్ఞానాభిరామ । యడిగెద నిన్నుం
గుతుకంబున నొక్కటి నీ,వితతకృపం దెలియఁ జెప్పవే నా కనుడున్. 7
వ. ఆదేవముని నీయదుగఁ దలంచినది యెయ్యది యడుగు మనిన నతం డక్కురుపతి
సుగతి గను నని నిర్దేశించితి తద్విశేషంబు వినవలతు వివరింపు మనుటయు. 8

నారదుఁడు శతయూపునితో ధృతరాష్ట్రాదులు సుగతిఁ బొందెడు తెఱంగు సెప్పుట.

సీ. ఆ సంయమీశ్వరుం । డాతని కిట్లను, నిచ్చలు నేను మహేంద్రుకడకు
నరిగి సంభాషణ । మాచరించుచు నుండ, నాసభ నిక్కురవాధినాథు
వలనివార్తలు పుట్టి । యలఘుతపోవృత్తి, నిష్ఠాతిశయము వర్ణించి రప్పు
డవ్యాసవుఁడు సెప్పె । ననఘు నాతో ముని,జాతుఁడు ధృతరాష్ట్రజనవిభుండు
తే. తపము మూఁడేఁడులొనరించి తానుసతియు, దేహముల్విడిచి చనిధనాధీశుచెలిమి
నతిశయిల్లు దివ్యాభరణాభిరాముఁ, డై విమానవిహారమహాప్రశస్తాత్ముఁ డగుచు. 9
క. అని పాండునిమది ప్రమదం,బునఁ దేలఁగఁ జెప్పె ననుడు । మోదము ధృతరా
ష్ట్రుని నెమ్మనమున నుండా, రె నఖిలజనచిత్తములను । బ్రియము దలిర్చెన్. 10
వ. ఇట్లు సద్గోష్ఠి నడపి యుత్తాపసోత్తము లక్కురుపతిసత్తము నభినందించి యామం
త్రణంబు సేసి నిజనివాసంబులకుం జని రక్కాలంబున. 11
సీ. పాండుపుత్త్రులు దల్లిఁ । బలుమఱుఁ దలఁచుచు,వగతురు ధృతరాష్ట్రవలనసుబల
నందనదెసను మనం బిడి చింతింతు, రట్ల పౌరులు వంత । నారఁ గూరి
వృద్ధుండు ధృతరాష్ట్రవిభుఁడు సుఖార్హుఁడు, వికలజనం బైనవిపినభూమి
నెత్తెఱంగున వసియించు గాంధారియుఁ, గుంతియు నత్యంతక్షోమలాంగు
తే. లడవి నుండంగ నెట్లోర్తు । రకట యిట్టి
కొడుకులను రాజ్యసౌఖ్యంబు । విడిచి యట్లు
సను నె యక్కుంతిభోజునితనయ జనని
దొఱఁగి పోవుట కెంత గుందుదురొ వీరు. 12
క. ఆయాసంబున విదురుని,కాయము సంజయుని మేనుఁ । గందక యున్నే
పోయిరి ధృతరాష్ట్రమహీ,నాయకు పై భక్తిఁ గావననమున వసింపన్. 13
క. అని రొండొరువులతోడ, న్ననట యొసఁగఁ బలుకుదురు మననరబులఁ గుంతీ

తనయులు మాతృవియుక్తత, కనయము నడలుదురు కౌరవాన్వయముఖ్యా. 14

సీ. ధర్మపుత్రాదు లందఱు నొక్కచో నుండి, ధృతరాష్ట్రు నాతని దేవిఁ బేరు
కొని వారి కొడుకు లెల్లను ద్రుంగి రని వార, లతివృద్ధు లెట్లొకో యడవిఁ గలరొ
యున్నా రనియు నింక నెన్నాళ్ళు లుండెడి, గొంతి వనంబునఁ గూరదినుచు
ననియును బంధుల నదయతఁ దునిమితి, మలుక ధైర్యంబున నడఁపమైతి

తే. మనియు నభిమన్యు వీరుని నతనితమ్ము
గట్టులను గర్ణు నాఱడిఁ గోలుపోయి
యొంటి వడితి మనియుఁ గడు నుమ్మలంపు
మాట లాడుదు రప్పురిజనుల్ మఱుఁగుచుండ. 15

వ. ఇట్లనుదినంబును ఘనచింతాక్రాంతులై యలంత నొందుదురు. 16

చ. విదురుని సంజయుం దలఁచి వేదనఁ బొందుదు రట్లు నెవ్వగల్
హృదయముఁ గుందఁ జేయఁ జెలువేది మనోజ్ఞములైన భోగము
ల్వదలి వినోదముల్ సలుపు లాలసితం బెడఁబాసి రాజ్యసం
పద నరయం దలం పెడలి పాడఱి యుండుదు రేమి సెప్పుదున్. 17

క. ద్రౌపదియు సుభద్రయు సంతాపం బందుదురు పాండుతనయులు దలరన్
భూపాల భవజ్జనకుని మాపం దఱిమానసముల శోకము నదుమున్. 18

ఆ. పరమధీరులైన పాండుతనూభవు, లిట్లు ధైర్యసార వెడలి వికలు
బుద్ధు లగుచు నుండి కోపం గడంగి ర,య్యంధనృపతిఁ జూడ నధిపముఖ్య. 19

వ. అట్టియెడ సహదేవుండు పాండవాగ్రజునకుం బ్రణమిల్లి భక్తివినయంబుల. 20

క. ఏను మును చెప్ప వెఱచితిఁ, గాని యధిప గొంతిఁ జూడఁగా నునుటర్థం
బైనపని యింత కేదెస, దా నొందునో విపినవాసదాస్థిత్యమువన్. 21

తే. గొంతి ప్రాణంబుతో నుండఁ గురువరేణ్య
యచ్చటికిఁ జని యొకమరి యమ్మహాను
భావ దర్శింప వలవదె బావ నప్పు
ననుసరించుచు నెట్లున్నయది సాధ్వి. 22

క. ధృతరాష్ట్రుఁడు గాంధారియు, నతిమృదులాంగకులు కల్ములాజినధరులై
వ్రతచర్యల వన్యాహారతఁ నలఁగుచు నున్నవారు రాజవరేణ్యా. 23

ఉ. వారలఁ జూడఁ బోఁ దగు నవశ్యము దుర్దశఁ బుట్ట కుండ ముక్
మీ రని చెప్ప నప్పుడు సమీపమునం జెవి దార్చి నెవ్వగం
గూరుచు నున్న ద్రౌపది యకుం గరణీయము బంధుధర్మముల్
తారక మాకు నీతఁ డుచితంబుగఁ జెప్పిన కార్య మెన్నఁయున్. 24

తే. గొంతికోడండ్రెల్లను గురువరేణ్యు లొత్తినడుగులు నున్నవా రత్తపస్వి

1. గ. దుచితజ్ఞత.

నీవరిష్ఠ దర్శింపంగ § బోవఁ గోరి, యనియె నట్టు లయ్యెరువురు § నాడుటయును.

పాండవులు బంధుసహితంబుగా ధృతరాష్ట్రుఁ జూడఁ బోవుట

వ. అమ్మానవనాథుండు కాననగమనంబు నిశ్చయించి పడవాళ్ళం బిలిపించి ధృత రాష్ట్రు దర్శింప బోద మనతిబహుళంబును బ్రధానచతురంగసముదీర్ణభంగి కంబునుం గా బలంబుల సమకట్టుం డందలంబులునుం బాటబండ్లునుం గాఁ బెక్కాయితంబు సేయుం డనేకశకటంబులుం బటకుటీరప్రకరంబును నానా విధభక్ష్యభోజ్యంబులునుం గొనివచ్చునట్లుగా నిపుణపరిచారకుల నియమింపుఁడు పౌరజనంబు లారాజుం జూచువేడ్క నెవ్వారు వచ్చినను వారలయోగక్షేమంబు లరసి సురక్షితంబుగా నడపింపఁ దగువారి నియోగింపుం డెల్లి పయనం బని చాటింపుం డని పనిచిన వార లటు సేయ మఱునాఁడు యుయుత్సునిం గృపా చార్యుని ధౌమ్యుని రావించి మీరు పురరక్షణంబునకు నిలువుం డని య త్యాదరంబునం జెప్పి. 26

సీ. [1]ఏనికగములతో § నేతెమ్ము నీవని, బాహుదర్పోజ్జ్వలుఁ § బవనతనయుఁ
దేరులగమి సెలు § వారు నీచే నని, దేవసమాను గాం § డీవధనుని
గుఱ్ఱపుదళములకు § గొమరు నీ కలవడు, నని చారుతనుసునో § హరు నకులుఁ
గాల్బల మమరు నీ § కలసివచ్చుట యని § సన్నుతచేష్టితుఁ § బిన్నతమ్ముఁ

తే. బనిచె వార లమ్మెయిఁ దూర్య § నినద మెసఁగ, నాతపత్రావళిధ్వజ § వ్రాతకలిత
రత్నరోచులు రోదోంత § రంబు నిండ, నరుగుదెంచిరి వైభవ § మతిశయిల్ల. 27

వ. ద్రౌపదీప్రముఖవధూజనంబులనుం దక్కుంగలభరతభార్యల నందలంబులను [2]గునకంబుబండ్లను నిడికొని రం డని యంతఃపురాధికారుల నబ్భూరమణుండు నియమించిన వార లట్ల చేసిరి తానును మణిభాసమానంబును నీలవాల శోభితషోడశశ్వేతాశ్వవ్యూఢంబును నైనరథం బెక్కి మౌక్తికప్రాలంబమాలి కాద్యోతితంబు లగునాతపత్రంబు లుల్లసిల్ల. 28

తే. వేణువీణారవంబును § వివిధగాన,నాదములుఁ బాఠకారావ § మేదురంబు
లగుచు వందిబృందములవా § క్కౌలి బెరసి, దిశలు దీటుకొనంగఁ బ్ర § దీప్తలీల. 29

వ. వెడలి వివిధవాహనారూఢు లయి పౌరు లపూర్వరువంశవరు ననుగమించి రిత్తెఱంగున మెఱయుమహిమ నుజ్జ్వలుఁ డగుచుం జని భాగీరథి యుత్తరించి పాండవోత్తముండు కురుక్షేత్రంబు ప్రవేశించి చనుచుండ. 30

సీ. సంయమివరుఁ డైన § శతయూపమునిపతి,యాశ్రమంబునఁ దద § నంతభాగ
మునఁ గదళీశోభి § యును మృగాకీర్ణంబు, నగుధృతరాష్ట్రుని § యాశ్రమంబు
[illegible]గినవార దె § ల్లెదియంచుఁ బేర్కొని, చూపి చెప్పిన ధర్మ § సుతుఁడు దేరు
[illegible] § దిగ్గి వాహనంబులు సర్వజనులు § నప్పురుషవరుల

1. [illegible]. 2. గ. జ. ట. పౌటబండ్లను.

ఆ. ననుసరించి రజ్జనాధిపుఁ డయ్యంబి, కేయునాశ్రమంబు డాయఁ జనుచు
నచటిజనుల [1]నడిగె నయ్య వేఁడీ యని, గద్గదికఁ దెలుంగు గడలుకొనఁగ. 31

వ. అడిగిన వార లప్పుడమితేనితోడ. 32

క. యమునాస్నానంబునకును సుమతో యాహరణమునకు సువ్రతుఁడాసం
యమి సనియె ననుచుఁ దన్మార్గము సెప్పిరి నెమ్మిఁ దెలియఁగౌరవముఖ్యా. 33

పాండవులు కురుక్షేత్రంబున నున్న ధృతరాష్ట్రగాంధారీకుంతుల దర్శించుట.

సీ. చెప్పినఁ బాండవు లప్పథంబున భక్తి, నరుగుచు నెదురుగ నరుగుదెంచు
నంబికానందనుఁ డాదిగాఁ గలవారిఁ, గని రప్పు డన్నలఁ గడచి శీఘ్ర
గామియై చని తల్లి కాళ్లపైఁ బడి యేడ్చె, సహదేవుఁ డధికబాష్పప్లుతాస్య
యగుచు నబ్బాలుని నవగచుచు నాతని, నెత్తి తాఁ గౌఁగిట నిఱియఁ జేర్చి

తే. పేరుకొని చెప్పె నతని గాంధారి కంతఁ
గూడి యతఁడును దారు నక్కౌరుకుమారు
లక్కురూద్వహు నన్నియతాత్ము దేవిఁ
గాంచి రనుజీవు లెఱిఁగింపఁ గౌరవేంద్ర. 34

చ. కని మఱి తల్లి పాదములఁ గ్రందుగఁ జేర్చిరి మస్తకంబు ల
వ్వనితయు నందఱం బొదివి వత్సలతన్ మన మార్ద్రభావ మొం
ద నురలు నశ్రుబిందువులు దండడిఁ జిక్కగ గౌఁగిలించి వా
రినయనవారి చేఁ దుడిచి ప్రీతిగ దీవన లిచ్చె భూవరా. 35

తే. అట్టియెడఁ బాండవాగ్రజుఁ డధికవినయ, భరితుఁడై కాంచి భీమునిఁ బార్థుఁ గవలఁ
గనియు సంజయుఁ డంతయు గౌరవమున, నాదరించి రయ్యేవురు నతనిఁ బ్రీతి. 36

సీ. ద్రోవదిఁ దొట్టి వధూజనంబులు దక్కఁ, గలయట్టిభరతభార్యలుఁ గ్రమమునఁ
గాంచిరి కురువృద్ధు గాంధారిఁ గొంతిని, వారలు గొని వచ్చువారి కెలరి
ములు పాండురాజపుత్త్రులు పుచ్చుకొని భరియించిరి పురజను లెల్ల నధిక
వినయత నమ్మువ్వురను గని రవ్వేళ, నందఱు ముద మంది రట్లుదగిన

ఆ. వారు బలసి యునికి వారణపురమున, నున్నయట్ల కాఁగఁ దన్ముఁ దలఁచె
మదిఁ గురూద్వహుండు తదనంతరంబ నిజాశ్రమమున కెలమి నరుగుదెంచి.

ఉ. తారకశోభితాంబరవిధంబునఁ బొల్పెసఁగంగ నాశ్రమో
దారతలంబు బంధుజనతాకలనంబునఁ దాను జంద్రునో
ప్పార వహించి విస్ఫురితుఁడై తనరెం గురుభర్త వచ్చి ర
చ్చేరువ గల్గుతాపసులు సెచ్చెరఁ బార్థులఁ జూచువేడుకన్. 38

వ. వచ్చినం గని వారల నెల్లను సవినయప్రణామంబులం బ్రీతులం జేసి పాండవు
లలరుమొగంబులతో ధృతరాష్ట్రుం బరివేష్టించి యుండిరి. వనితాజనంబులు

---

1. గ. నడిగె ♦ నయ్యయేఁడీ యని; నయ్య ♦ [illegible]

కర్ణముఖయోధవీరులఁ గలఁచి తెగిన, యట్టియభిమన్యుప్రియ యుత్తరాభిధాన.

వ. అని చూపి చెప్పి నప్పు డాంబికేయుండు కౌంతేయాగ్రజున కిట్లనియె. 46

సీ. కుశలివై యుండుదే కులవంశసత్తమ, పౌరజనులు జానపదులు దెఱఁగు
తో నిన్ను ననుసరింతురె తమ్ములందఱు, సుఖులుగాఁ బెరుఁగ సుఖులె
బంధులు సంతోషభరితులే యిష్టభృత్యులు దమ కైంకర్యములు ఫలింపఁ
గ్రాలుదురే హర్షలీలలఁ బూర్వరాజన్యునడవడి సలుపఁబడునె

ఆ. నయముతోడి యప్పనముల భండారంబుఁ, బెనుతె యగ్రహారజనులమీఁద
గాలి వైన సుడియఁగానీక యరయుదే, యనఘ పుణ్యకీర్తు లతిశయిల్ల. 47

క. మిత్రనరపతుల శాత్రవధాత్రీశుల నెమ్మిఁ బరుసఁదనమున వశతా
పాత్రములుగఁ జేయుదె సుచరిత్ర యుదాసీననృపపరీతి నడచునే. 48

క. దేవతల నతిథులకుఁ బితృదేవతలకుఁ బూజనములు దృఢమైన త్రై
యీవసుధఁ జతుర్వర్ణజనావళులు నిజోతక్రియలఁ దగ మనునే. 49

తే. బాలురకును దుర్బలులకు భామినులకు, వృద్ధులకును మనంబుల వెఱపు లేని
యట్టిమెలఁకువ గలిగెడునట్లుగాఁగ, నడచునే యాజ్ఞ పురమునఁ బుడమియందు.

క. అనిన విని యానృపతి యజ్జనపతితో నిట్టు లనియె జగతీశ్వర నీ
వినుతోపదేశమున భవదనుయుక్తము లెల్ల నడచు నవికలభంగిన్. 51

వ. అని పలికి యిట్లనియె. 52

క. ఆయాసము సైరింపని, మీయొడలు తపఃక్రియలకు మెయికొనియెనె భూ
నాయక శుశ్రూషదగం, జేయుచునో కొంతి దప్పిఁ జెందక మీకున్. 53

క. మాపెద్దతల్లి యంబజకు, గోప తపోవృత్తి గడపుచున్నదియె సుత
వ్యాపాదనకారుల మముఁ, బాపాత్ములఁ దలఁచి యెట్లు వలుకునో మీతోన్.

ఆ. సంజయుండు తపసుజాలికిఁ జాలి వర్తిల్లుచున్నవాఁడె ధీరచిత్తుఁ
డిచట లేఁడు విదురుఁ డెచటి కేఁగినవాఁడొ, యతనిఁ జూడవలయు జనధిప నాకు.

వ. అనుటయు ధృతరాష్ట్రుఁడు ధర్మతనయుతోడ. 56

సీ. ఏదపంబున కోర్తు నెంతయు శుశ్రూష, యలయక గొంతి మా కాచరించు
వినుము గాంధారియు ననఘచరిత్ర త, పోనిష్ఠ కోర్చు నిశ్రమ్యాత్మనీయ
మిముఁ దలంచినయప్డు మెచ్చి దీవించు సంజయుఁడు ప్రాజ్ఞుఁడు తపశ్చరణమునకు
విసువఁడు మముఁ బాసి విదురుఁ డెచ్చటనేని, జరియించు మునిజనాశ్చర్యకారి

ఆ. యగుచు జలము లనిల మాహారముగఁ గొను
నవియు నదియుఁ గొనక యునన నుండు
శూన్యవిపినమున విశదైన్యస్వతంత్రసం
చారియై వసించుఁ గౌరవేంద్ర. 57

క. ఒక్కొక్కమారు దబ్బాటిచక్కటిఁ గానఁబడు వనిలో జనవర తోఁచెఁ

గ్రక్కున నప్పుడ విదురుం, డక్కౌంతేయాగ్రజున కనతిదూరమునన్. 58

వ. కాంతారధూళిమలినాంగుండును జటీభూత కేశపాశుండును దిగంబరుండును నగు విదురుం డట్లు డాఁచి యయ్యాశ్రమంబున నున్నజనంబులం గని మగిడి పోవం జూచి ధర్మతనయుండు దనయనుచరుల నిలువుం డనుచుం దా నొక్క రుండును సత్వరంబుగా నవ్వినుత ప్రభావుని వెనుకం జనియె నతండు గుల్మాంత రితుం డగుచుం దోఁచుచుఁ బోవం బోవ నప్పాండవాగ్రజుం డెలుంగెత్తి యో విదుర యో విదుర నిలు నిలు మేను యుధిష్ఠిరుండ నిన్నుఁ గాన వచ్చితి నని పలుకుచుం బాఱిన నమ్మహాత్ముండు మరలి కనుంగొని వివిక్తప్రదేశంబున నొక్కపాదపంబు సేరి నిలిచిన. 59

— విదురుఁడు యోగమార్గంబున ధర్మరాజునందుఁ గలియుట. —

సీ. ధర్మతనూజుండు తత్సమీపంబున, కేఁగి యయ్యోగికి నెట్టెదుర నిలిచి
యాతండు నయనంబు లర్ధమీలితము లై, యుండంగ నూరక యున్నఁ గాంచి
నిర్మలాత్మక యేను ధర్మసూనుఁడ నన్నుఁ, గను విచ్చి చూడవే యనుడు నతఁడు
ఱెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ, దప్పక చూచి యుదాత్తయోగ

తే. బలము గైకొని యింద్రియములను బ్రాణ
ములను నింద్రియములఁ బ్రాణములును గలపి
నిజశరీరంబు విడిచి యానృపతితనువు
సొచ్చె దేజోమయత్వవిస్ఫూర్తి మెఱయ. 60

ఆ. వినుము ధర్మపుత్త్రు తనువునఁ గాంతియు, లావు నప్పు డగ్గలంబులయ్యె
నొలసె బుద్ధి యధికబల మట్టు లగు టతఁ, డెఱిఁగి చోద్యమందె నెలమి నొందె.

క. తదనంతరంబ యప్పతి, విదురశవము ప్రాను సెంది వికృతిరహిత మై
నిదురవోయి నొఱగి యున్నప, గిది నుండం జూచి యగ్నిసత్కృత్యము నడపన్. 62

చ. తలఁచిన యంత నొక్కెలుఁగు ధర్మతనూజ యతిత్వగౌరవో
జ్జ్వలునికళేబరంబునకు వహ్నివిధాన మొనర్చు టర్హ మే
వల దని మ్రోసె నమ్మనుజవల్లభుఁ డప్పుని దక్కి పోయి భ్రా
తలకును దండ్రికిన్ సువిదితంబుగ సంతయునుం గ్రమంబునన్. 63

వ. ఎల్లవారును వినుచుండం జెప్పిన నందఱు నద్భుతరసంబున మునింగిరి. పదం పడి ధృతరాష్ట్రునిచే నామంత్రణంబు సేయ మునిజనులు నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబ యాంబికేయుండు ధర్మనందనునితోడ. 64

సీ. భరతకులోత్తమ ఫలమూలములు నప, యోగింపు మొనఁగెద మొదవితమకు
నెయ్యది యాహార మయ్యది యాతిథ్యంబు, దానన నడపుట ధర్మసరణి
యనవుడు నట్ల కానని ఫలంబులు మూలములు నుపయోగించె నాదపరిత్యుఁ
[illegible]

తే. మాచరించి రయ్యెందఱు * నవనిశయన
మొంది యారాత్రి నిద్రించి * రుదితసూర్య
కాల మగుటయు సముచిత*కర్మకరణ
మనుజులును దాను నడపె నమ్మనుజవిభుఁడు. 65

వ. అట్లు కాలోచితకృత్యంబులు నడపి సహోదరసహితుండును దారోపేతుండును నర్వపరివారానుగతుండును నై యాశ్రమపథంబు గలయ మెలంగి పావనస్నానపావకార్చనజపధ్యానాదితాపసధర్మచర్యావిధంబులు నానామృగనిర్భయసంచారప్రకారంబులు వివిధపక్షికులనిశ్శంక [1]కేళీవిభవంబులు నాలోకించి కృతప్రాతస్సవనకరణీయుం డై యున్న కురువృద్ధుకడకు వచ్చి వందనాభినందనవచనంబుల నతని యుల్లంబు పల్లవింపం జేసి యతండు వనుపఁ బవిత్రాసనోపవిష్టుం డై. 66

చ. అనుజులుఁ దాను భక్తిమెయి * నమ్మహనీయునిఁ గొల్చి యుండ న
య్యనికిఁ గనుంగొనంగఁ గర * ముత్సుకత౯ శతయూపుఁ డాదిగా
మునివరు లేఁగుదెంచినఁ బ్ర*మోదమునం గుశపీఠరాజిపై
నునుపఁగఁ బంచె గాథవిన*యోక్తుల నాధృతరాష్ట్రుఁ డంతట౯. 67

వ. అట్లున్న యమ్మునిజనంబులును బాండుపుత్త్రులునుం బరమధర్మమయసంభాషణంబులు సేయుచుండ నినుండు నభోమధ్యగతుం డయ్యె నప్పు డాంబికేయుండు సవినయంబుగా నత్తాపసోత్తములతో మీకు మధ్యందినకృత్యంబు లాచరింప వలయు విజయంచేయుం డనిన వారలు నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ కౌంతేయుల మాధ్యాహ్నికకరణీయంబులు నిర్వర్తించుట కరుగుం డని పనిచె నని చెప్పిన విని జనమేజయుం డప్పాండవేయు లవ్విధంబున వనంబున నెన్నిదినంబులు వసియించి రని యడిగిన వైశంపాయనుం డతని కిట్లనియె. 68

సీ. ధరణీశ పాండునందను లట్లు సాంతఃపురంబును సపరివారంబుఁ గాఁగ
నడవికి నేఁగి య*య్యంబికానందనుఁ, గాంచిన దినమునఁ * గరమునియతి
ఫలమూలసమితి నాఁకలి వుచ్చి భూమిశయనమున నిద్రించి * జాగరిష్ణుఁ
డమ్మహితాత్ముల * కర్థితో మఱునాఁ డనుజ్ఞ యిచ్చిన సుమ*నోజ్ఞములును

ఆ. సన్నుతములు నైన * యన్నపానాదుల, ననుభవించి మృదుల*హారితల్ప
ముల శయించి రట్లు * నెలనాళ్లు లయ్యెడ, నతనిఁ గొల్చి యుండి * రధిపముఖ్య.

వ. పదంపడి యొక్కనాఁ డెప్పటియట్ల పాండుపుత్త్రులు గాంధారీకుంతీసముపాసితుండయి యున్న విచిత్రవీర్యపుత్త్రుఁ బరివేష్టించి యుండ నవ్విశిష్టగోష్ఠికై శతయూపప్రభృతిమునివరులు సనుదెంచిన నక్కురువృద్ధుం డర్ఘ్యంబు లగునాసనంబులు

---

1. గ. కేళీభంగులు.

వెట్టించి సంభావించిన. 70

— వేదవ్యాసుఁడు పాండవసహితుండై ధృతరాష్ట్రాశ్రమంబునకు వచ్చుట. —

సీ. సముచితంబులు సత్కర్మములును నైనసల్లాపములఁ బెల్లు సల్లంబు లలర
వార లున్నెడ సత్యవతికొడుకు కందువ, కేతెర నందఱు నెదురువోయి
వినతులై భక్తిఁ దోడ్కొని వచ్చి [1]యతులకృష్ణాజినదర్భాస్తరాసనమున
నునిచి యమ్మునివరు ననుమతిఁ దమతమయాసనంబుల నుండి రమ్మహాత్మ
ఆ. నర్చితునిఁగఁ జేసె నాంబికేయుఁడు తద,నంతరంబ సమధికాదరమున
నతఁడు మధురమృదువిధాక్షరంబుగ నమ్మ,హీశముఖ్యుతోడ నిట్టు లనియె. 71
సీ. వనవాసమున నీకు మన మలవడియెనే, నియతిమైఁ దాపసక్రియల కోర్చి
నడపెదవే పుత్రనాశజమైనశో,కము భవదంతరంగంబునందు
లేదు గదా ధర్మవేదిని గాంధారి, యమ్మలికంబు లేకున్నయదియె
నీకుఁ బరిచర్యనిష్ఠ గల్గెనె గొంతి, శుశ్రూష మీ కొనర్చునె తగంగ
తే. రాజ్య మొల్లక వచ్చె నరణ్యవాస,మునకు నీయనుమ మీఱు రాఁ దనకు నింట
నిలువఁ దగ దని యిమ్మేలు నీకుబుద్ధి, నొలసి యుండునె కౌంతవకులపవిత్ర. 72
చ. అనఘ యజాతశత్రునెడ నాదరణాతిశయాన్వితంబె నీ
మనము వృకోదరుల్ నరుని మాద్రితనూజుల సత్ప్రియాభినం
దనముల గారవింతె వినతస్థితిఁ దద్దయు నిర్మలత్వ మొం
దెనె భవదీయచిత్తమున ధీమహితా దృఢశాంతిమూల మై. 73
వ. అని యంత నిలువక. 74
ఆ. వినుము దీర్ఘవైరవృత్తియుఁ గ్రోధదిం,తనము లేక వాక్కు మనము నొక్క
చంద మగుట సకలజనముల కనుబద్ధ,సంపదాప్తిపరమసాధనంబు. 75
వ. అని చెప్పి వెండియు. 76
సీ. వినుమండు దేహంబు విడిచిన తెఱఁ గెల్ల, నెఱిఁగితే మాండవ్యుఁ డిచ్చినట్టి
పటుశాపమున శూద్రభావంబు నొందిన, ధర్మదేవత బోధనిర్మలాత్ముఁ
డైనయమ్మహనీయుఁ డట్లగు టంబుజా,సనునియాజ్ఞాపనమున విచిత్ర
వీర్యనృపాధీనవిశ్రుతక్షేత్రంబు,నం దేఁ బ్రవర్తింప నధిప కలిగె
తే. ధర్మదేవతమాఱట తనువు సూవె
యీయుధిష్ఠిరు నుజ్జ్వలకాయ మింత
యెఱిఁగి కాదె యమ్మహితయోగీశ్వరుఁడు స
మాధ్యయోగబలంబున నితనిఁ గలసె. 77
ఆ. అట్లు దేవతామయాత్ముఁ డైనయ్యు,విభుఁడు నిన్నుఁ బ్రేష్యవృత్తి నిట్లు
గొల్చి భూమినిక బుద్ధిఁ దలపోసి సంతస,మందియుండుఁ దే కుశలాగ్రగణ్య. 78

1. [illegible]

వ. అనిన విని వైచిత్రవీర్యుండు పారాశర్యునకుఁ బరమవినయంబున నిట్లనియె. 79

సీ. వనవాస మించుకయును నాకు దుఃఖంబు, సేయదు దేహంబుఁ జిత్తమును ద
పఃక్రియలకుఁ బనుపడియున్నయవి నన్ను, గాంధారి పుత్రశోకంబు గొంత
యేనియుఁ బొందంగనీదు సద్భక్తిక, యైనవృత్తమున ధర్మాత్మజుండు
మునివర యితనిపై ననుజులమీఁద వత్సలము నాహృదయ మిద్ధరణివిభుఁడు

ఆ. దేవతాత్ముఁ డగుట దెల్లమై యునికి మ
ద్వచనవర్తనములవలన నితఁడ
యెఱిఁగి యుండు గొంతి తెఱఁగు శుశ్రూషయు
నద్భుతంబు ముదము నావహించు. 80

వ. నాకుం బరిజ్ఞానంబును మానసనిర్మలత్వంబును భవత్ప్రసాదంబునం గలిగెడుఁ గాక యనియె నాసమయంబున ద్రౌపదీసుభద్రలును దక్కటం గల్గునంగనాజనంబులును బారాశర్యసందర్శనప్రవణత్వంబునం జనుదెంచి సభక్తిక ప్రణామంబు లాచరించి యంతంత నిలిచి రయ్యలఘుజ్ఞానమాననీయుండు ధృతరాష్ట్రుతోడ. 81

ఉ. మీయెడచింత వాయఁగ సమీహితబుద్ధి యొనర్పఁ గోరి యే
నీయెడ కిప్డు వచ్చితి నభీష్టము వేఁడుము శంక దక్కి భూ
నాయక యెల్లభంగిని మనఃప్రియముం దగ నిత్తు నన్నఁ గొం
తేయు లెలర్చి రవ్వసుమతీపతి మోదము నొందె నెంతయున్. 82

వ. వ్యాసుండు వెండియు. 83

చ. అనఘ యమానుషం బనుచు నట్టిద యైనను నాతపంబు పెం
పునకు మునీంద్రు లద్భుతముఁ బొందఁగ మీ కవలీల నిత్తు నే
ననుటయు నాకురుక్షితిపుఁ డాదటఁ గోరఁగ మీర లిందు వ
చ్చినకరుణామయాదరవిశేషము కంటెను మేలు గల్గునే. 84

క. మానుషమైన నమానుష, మైనను బ్రార్థనకు విషయమైనది భవదీ
యానూనకృపకు నెక్కుడు, గా నొక్కఁడుఁ గాన నేను గారుణ్యనిధీ. 85

ఆ. సంయమీంద్ర నాదుజన్మంబు సఫలతఁ, బొందె మీరు విమలబుద్ధి నింత
యాదరించినపుడ లే దింకఁ బరలోకభీతి ధన్యతముఁడ నైతి నేను. 86

వ. అట్లయినను మీరొక్కటి గోరు మనిన నామనంబున నెప్పుడుం గలయది యెఱింగింప వలసి విన్నవించెద. 87

సీ. దుష్టచిత్తుం డగుదుర్యోధనుండు నిష్పాపస్వభావులఁ బాండుసుతులఁ
బరిభవించి సమస్తనరనాథు లనిఁ గరి, తురగయుతంబుగాఁ ద్రుంగఁ జేసి
ధరణిరాజ్యము గోరి గురుభీష్మకర్ణాది, సత్పురుషుల నెల్లఁ దెగఁజంపి కొనియె
నన్నుఁ జూచునకుఁగా మహారాజు లాంత్రను, బిడ్డల విడిచి యశోభేద్యదైన్య

తే. వృత్తి రణమృతిఁ బొంది రశ్మివిభుల కేఁది
గతిరొం యిమ్మెయి మహాధు లై కలనఁ బడిన
¹కురుకుమారకు లెల్లరు పరమబోధ
మహిత యెఱుఁగనివగ పెద్ద మాన్పు మనియె. 88

వ. అనుటయు నప్పిముదిపలుకులు విని గాంధారికిం గుంతికిం బాంచాలికి సుభద్రకు మఱియునుం గలయంగనలకుం జిత్తంబుల నెవ్వగలు క్రొత్తలయ్యె నప్పుడా సుబల నందన పట్టావృతలోచనత్వంబునన చూచి దయాధాముం డైయున్నయామాము నుద్దేశించి మోడ్చినచేతు లద్దెసకు నిగిడ్చి యి ట్లనియె. 89

సీ. మునినాథ యీరాజుతనయు లందఱును గయ్యంబునఁ దెగినది యాదిగాఁ బ
దాతేండ్లు వగలపా లగుచుఁ దత్సన్నిధిఁ, గల్గుట గోరు లోకంబు లెన్ని
యన్నియుఁ జూపంగ నైనను జాలుదు, నిర్మలతపమునఁ బేర్మి నీవు
పుత్రసాన్నిధ్య మీభూపతి కొనరించు, టెంతటిపని నీకు గొంతిద్రుపద
తే. రాజపుత్రి సుభద్ర కౌరవకుమార,శతముభార్యలు నూర్వురు సౌమదత్తి
పత్నియుత్తన్వియుత్త యప్పుడఁతియుత్త,గోరుదురు యుద్ధమృతబంధుకోటిఁ జూడ,

వ. అంతయును భవదీయదివ్యబోధంబు గనుచుండు. 91

క. పరమమునీంద్ర సమరమృత,కురువీరుల మామనము లగ్గో డుడుగ భవ
త్కరుణ వెలయ లోకం బచ్చెరు వందఁగఁ జూపవే విచిత్రపుమహిమన్. 92

చ. అనునెడ గొంతి వాడువదనాబ్జముతోడ మదిం దలంచెఁ గ
ర్ణుని నది యత్తపోధనవరుం డెదఁ గాంచి దయానురక్తి న
వ్వనితఁ గుఱించి యిట్లను భవన్మతి నొందినకోర్కి సెప్పు మే
ననఘచరిత్ర దానిఫల మంచఁగఁ జేసి యలంతఁ బాపెదన్. 93

వ. అనిన విని యక్కుంతి సంతసిల్లి యాసంయమివల్లభునకు దండప్రణామంబు సేసి చేతులు మోడ్చి లజ్జాసహితం బగునంతరంగంబుతో వినయనమ్ర యగుచు ని ట్లనియె. 94

కుంతి వేదవ్యాసునితోఁ గర్ణుఁడు దనకు జన్మించిన తెఱం గెఱింగించుట

సీ. దేవతలకు నీవ దేవత విట్టిని, న్నామమగాఁ బడసితిఁ బహితకరుణ
నన్నుఁ జూచి నాదువిన్నప మాదరింపు మేఁ, గన్యాత్వదశ నుండఁగా మదీయ
జనకునికడకుఁ గోపనుఁ డైనదుర్వాసుఁ, డన్మహాముని వచ్చె నతని సవిన
యార్చనకలనాస్యమారాధితుం డుగాఁ, జేసితిఁ బ్రీతుఁ డై చెలువ నీకు
ఆ. నిత్తు వర్త్తము తెల్పు మెయ్యది కోరిక, యనియె నతఁడు మా [illegible]
ననఘ [illegible] గల దేనా [illegible] గాని [illegible] 95

1. ఘ. [illegible]

¹సుర లద్భుతాపాద¦చరితులు కర్ణున, కట్లు గా నున్నది ¦ యగుటఁ జేసి
యేటిలో నాతని ¦ నిడి తీవ్ర కన్యాత్వ,హాని లేకున్కి. గుణలాగ్రగణ్య
వైతి భవద్వృత్త ¦ మమలిన మగుటకు. ననుమాన మించుక ¦ యైన వలవ

ఆ. దనుచు నాదరార్ద్రుఁ ¦ డయి పల్కె గాంధారి,తోడ నీవు సుతుల ¦ ద్రోడఁబుట్టు
వులను గాంతు నీదు¦చెలియలు గొంతియుఁ, గర్ణుఁ జూడఁ గాంచు ¦ గణ్యచరిత.

ఉ. ద్రౌపదియుఁ సుభద్రయును ¦ దక్కటికాంతలు భ్రాతృపుత్త్రపౌ
త్త్రోపవిలోకనోత్సవము ¦ నొందుదు రిచ్చటి కిప్డు వచ్చు లే
నీపని యాచరించుటకు ¦ నిమ్మనుజేంద్రుఁడు నీవు గొంతి చిం
తాపరితాపనోదనవి¦ధంబుగఁ గోరితి రట్లు సేసెదన్. 108

క. నీకొడుకులకు మనుమలకు, శోకింపఁగ వలదు వారు ¦ శూరత వెలయం
జేకొనిరి రణమరణమున, నాకభువనసుఖము సద్గు¦ణ స్తవనీయా. 109

ఆ. భామ విను మవశ్య¦భవితవ్య మైనభా,రతరణంబుపొంటె ¦ నతులమహిమ
మాననీయదేవ¦యోనులు జననంబు, నొంది రిందు మనుజ¦యోనులందు. 110

సీ. ధృతరాష్ట్రుఁ డనఁగ వ¦ర్తిల్లెడుమేటిగం,ధర్వుఁ డీధృతరాష్ట్ర¦ధరణివిభుఁడు
తన్వి పాండుఁడు మరు¦ద్గణమయజని ధర్మ,దేవత నూవె యు¦ధిష్ఠిరుండు
పవనుండు భీముఁ డై¦ప్రభవించె నరుఁ డను,ముని యర్జునుం డయి¦జనన మొందె
నారాయణుఁడుకృష్ణ¦నాముఁ డై జనియించెఁ, గనుగొను కవలన¦శ్వినులుగాఁగ

తే. ద్వాపరంబుగ శకునిగాం¦ధారరాజుఁ, గలిసుయోధనుఁ డయ్యె రా¦క్షసులుపుట్టి
రతనియనుజులై కర్ణుని¦నరుణకిరణుఁ,గాఁగ నభిమన్యుఁ జందుని¦గాఁగఁ గనుము.

క. అనలుఁడు ధృష్టద్యుమ్నుం, డన ద్రౌపదితోడఁ బుట్టె ¦ ననిలునియంశం
బున జనియించె శిఖండియు, ననిమిషగురుఁ డుద్భవించె ¦ నస్త్రగురుం డై. 112

తే. వినుము వసుశక్తి గాంగేయుఁ ¦ డనఁగ జనన
మొందె రుద్రాంశమున ద్రౌణి ¦ యుదయ మయ్యెఁ
దెలియఁ జెప్పితిఁ గొందఱు ¦ గలరు సుతియు
నిర్జరాసురాంశమున జ¦న్మించినారు. 113

క. అని పలికి మీమనంబుల, వనట సమస్తంబుఁ బుచ్చి¦వైచెద నాతోఁ
జనుదెండు మీరు గంగకుఁ, గనియెద రని దెగినబంధు¦గణముల నచటన్. 114

తే. అనుచు నుత్థితుఁ డగుటయు ¦ నార్పు లెలుఁగు
లాకసం బంద ధృతరాష్ట్రుఁ ¦ డాది గాఁగఁ
గలుగునాసర్వజనులు నొ¦క్కటఁ గడంగి
యరిగి రమ్మునినాథుతోఁ ¦ గురువరేణ్య. 115

క. అత్తఱిగ మునిజనములు న,చ్చెరు వందుచు నమ్మునీంద్రు ¦ సేవించి మరు

1. అ. సుర లద్భుతాపాదిచరితలు.

త్సాగుపకంఠతలమునకు, నరిగిరి కౌతుకము మనమునలందు నెలకొనఁగన్. 116

వ. అట్లు పౌరజానపదసహితు లై సకలజనంబులుం జని సాత్యవతేయుండు వనుప భాగీరథీతీరంబున విడిసి యవ్విచిత్రచరిత్రుండు దనచేయంబూనినపని మఱునాఁడు శేషకడ సేయువాఁడుగాఁ బలికిన నయ్యెందఱు నద్దినశేషంబు నాయామినియును శతసంవత్సరంబులుంబోలె నుండ సూర్యోదయసమయం బగుటయుఁ గాలోచితకృత్యంబు లాచరించి ధృతరాష్ట్రుండు పాండుతనయు లుం దపోధనులు నప్పారాశర్యుపాలికి నరిగి యమ్మునివరుం బరివేష్టించిరి గాంధారీప్రముఖభామినులు నేతెంచి యొక్కెడల నతనిం గొలిచి యుండిరి సర్వజనులు నట్టు లెత్తికొని యంత నిలిచిరి తదనంతరంబ. 117

వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణమృతుల రావించి చూపుట.

సీ. సాత్యవతేయుండు ✽ జాహ్నవీసలిలావగాహన మొనరించి ✽ గౌరవమున
నింపారు నెలుఁగున ✽ నిందు రం డనవుఁడు, నీ కేమి సెప్పుదు ✽ నీటియందు
రవ మగ్గలముగ రాజరాజుఁ దమ్ములుఁ దత్కుమారవర్గము నభిమన్యుఁ డాది
యగుపాండుపౌత్రులు ✽ నర్కజుండును బాహ్లీక ప్రముఖాఖిల ✽ కౌరవులును
తే. ద్రుపదమాత్స్యులు వారిబంధులును శకుని
యును దదీయానుజులును నాతని తనూజ
రాజియును భీష్మగురులుఁ బురస్కరించి
కొనుచుఁ దమదివ్యదేహముల్ ✽ గొమరు మిగుల. 118

ఆ. దివ్యమాల్యములును ✽ దివ్యాంబరంబులు
దివ్యభూషణములు ✽ దివ్యలేప
నములుఁ జెన్నుఁ జేయఁ ✽ దమమిత్రసుభటసం
దోహములును దారుఁ ✽ దోఁచి రధిప. 119

వ. అట్టియెడ. 120

క. తగ నా కురువృద్ధునకు నొసఁగె నాఁటికి దివ్యదృష్టి ✽ సాత్యవతేయుం
డగణితతపఃప్రభావంబు గని యధికవిస్మయంబుఁ ✽ బొందఁగ జనముల్. 121

వ. అవ్విశేషంబు విని యద్భుతప్రమదభరిత యై నిజనయనంబుల బంధించినపట్టం బపనయించి గాంధారియును గనుంగొనుచుండ. 122

క. అవ్విధమునఁ దోఁచిన మఱి, నవ్వుచుఁ దెగడుచును బెరసి ✽ నరవర పగ లే
కవ్వీరవరులు నెయ్యము, నివ్వటిలఁగ విలసనములు ✽ నెఱయ మొఱయఁగన్. 128

తే. చతురగంధర్వు లప్సరోజనులు గాన
ములఁ బ్రమోద మొనర్పంగఁ ✽ బొగడ వంది
సమితి నిరహంకృతులు హృదయములగౌర
వములు దెల్లంబు సేయంగ ✽ వచ్చి రొప్పి. 124

వ. ఇట్లు వచ్చి సకలబంధుజనంబులకుం బరమప్రమోదం బావహిల్లం గలసి సముచితాచారంబులు నడపి రాజేంద్రు దెఱంగులవారలు నర్హప్రకారంబులం బితామహాచార్య శిష్య మాతృ మాతామహ పితృ పితామహ భ్రాతృ జామాతృపుత్ర పుత్త్రీభగినీ పౌత్ర దౌహిత్ర శ్వశురశ్వశ్రూస్నుషామాతుల స్యాలక స్త్రియ ప్రియామిత్రసమాగమసుఖంబు లనుభవించుచు. 125

తే. అనఁగి పెనఁగి నాఁ డెల్ల నిచ్ఛానురూప
వృత్తి వర్తిల్లు చుండి ర | వ్విధము సకల
జనుల నద్భుతరసమున | మునుఁగఁ జేసె
నే మనఁగ వచ్చు నాసంయమీంద్రుమహిమ. 126

వ. మఱునాఁడు రేపకడ యప్పారాశర్యుఁడు వనుప నయ్యిరుదెఱంగులవారలుం బరస్పరామంత్రణంబు సేసి రాజూంజనంబులు దమతమలోకంబులకుం జనువారై జాహ్నవీజలంబులం బ్రవేశింప నన్నిలింపవందనీయుండు దానును జొచ్చి యచ్చటనుండి పతుల ననుగమింప వలసినయంగనలు గంగాతోయంబులం గ్రుంకుటకు రం డనిన విని విధవ లగువీరభార్య లెల్లను ధృతరాష్ట్రగాంధారీకుంతీధర్మనందనులయనుజ్ఞలు గొని రయంబునం జని భాగీరథీసలిలమగ్నలై మానుషదేహంబులు విడిచి దేవతనువులు దాల్చి దివ్యాలంకారసమలంకృతమూర్తులై మగలం గలసి రవ్విశేషంబు నూచి సర్వజనులు నత్యంతాశ్చర్యసంతోషాధీనమానసులై రని చెప్పి వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె.

సీ. జననాథ యీప్రియ | సంగమోత్సవకథ, వినినఁ బఠించిన | వేవిధములఁ
[1]బరమప్రియము లిందుఁ | బరలోకమున సంభ,వించు మనమ్మున | కించుభంగి
బాంధవయోగశో | భనము వర్తిల్లు న,నాయాసమున నామ | యాపగమము
గలుగు భూదేవని | కాయంబునకు దీనిఁ, దగ వినిపించిన | ధార్మికులకు

తే. నవ్యయానందసంప్రాప్తి | యావహిల్లుఁ దత్పరతఁ గొనియాడిన | దైవతములు
నీచదశఁ బొంద కుండంగ | గాచి తిరిగి, మేలొనర్తురు భరతభూ | పాలవర్య. 128

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనుతో ధృతరాష్ట్రుం డట్లు కృష్ణద్వైపాయనప్రసాదలబ్ధం బైన తత్కాలకలితదృష్టివిశేషంబున బంధులోకంబు నాలోకించి మఱి యేమివర్తనంబున నుండెఁ బాండవు లెట్లు వర్తించి రెఱింగింపవే యనుటయు నతనికి నతం డిట్లనియె. 129

ధృతరాష్ట్రుండు భాగీరథీతీరంబుననుండి నిజాశ్రమంబు ప్రవేశించుట.

సీ. అయ్యద్భుతపు వృత్త | మమ్మెయిఁ జెల్లిన, ధృతరాష్ట్రమేదినీ | పతి తపస్వి
గణము సవినయంబు | గానిజస్థానమా,నమునకు నామంత్రి | తముగఁ జేసి
యాశ్రమభూమికి | నరిగెఁ దోడన పాండు,రాజనందనులును | రా నుదాత్త

1. పా. బరమప్రియంబు లొందుఁ బరలోకమున సంభవించు మనమ్మున.

తేజు సత్యవతీతనూజు ముస్సిడికొని, యప్పు డమ్మునిపతి యతనితోడ
తే. నీవు వేదశాస్త్రార్థముల్ భావితాత్మ, లగుమునీంద్రులచే జెప్పలార వింటి
కంటి తనయుల నీకన్నకంటె నొప్పి, యుండుదురు వారు దివిసౌఖ్యయోగమెసఁగ.
ఉ. కావున నింక వారికయి కౌరవసత్తమ యుమ్మలింప శా
త్మావిలభావముం దపముతనగ్గలికం బెడఁబాపు నిన్ను సం
భావనఁ గొల్చి యొక్కెనల పాండవముఖ్యులు నిల్చె నిష్ఠమై
నీవనభూమి నీవసుమతీశ్వరుఁ బొమ్మనఁ గాదె వీటికిన్. 131
వ. అని చెప్పిన నప్పౌరవోత్తముండట్ల చేసెద నని పలికి యమ్మునిసత్తమునకుం బ్రణమిల్లి భవదీయకృపావిశేషంబున గృతార్థుండ నైతి నని యతని నామంత్రితుం జేసినం బాండవులుం దగ నప్పరమమునిపీఠ్కొని రయ్యందఱును దీవించి యమ్మహాత్ముం డంతర్హితుం డయ్యెఁ దదనంతరంబ. 132
సీ. అంబికేయుండు ధర్మాత్మజుఁ జిత్తగం, ప్రతి మోహమునఁ దోఁపఁ బేరఁ బిలిచి
వసుమతీకార్యనిర్వాహంబు పెద్దకాలు, వ్వాన నుండి నీ వనుదినము నడప
కునికి కర్తవ్యమే వినుకులు భీష్మాది, మహీపాలచేత సమగ్రభావ
మొందినయది యింక నుపదేశ మేమియు, వలవదు రంధ్ర మొకవ్వాని జనంబు
తే. వేచు ననుజానుగతుండవై వెగ బొమ్ము, దారయుతముగఁ బుత్రకి నుదారచరిత
నీకతంబున మున్న నా శోకమెల్ల, బాసెఁ దేజంబు సౌఖ్యానుభవము గంటి. 133
చ. తపము నెడఁగ మదీయమతి తత్పర గావున దాని కోర్తు నీ
వపగతఖేదమానసుడవై నను నిం దతినిష్ఠ నొందఁ బం
చి పురజనంబు సమ్మదముఁ జెందఁగ సైనికు లుల్లసిల్లఁగా
నృపవర యేఁగి రాజ్యభరనిర్వహణం బొనరింపు నావుడున్. 134
సీ. ధర్మతనూజుఁ డాతనితోడ నిట్లను, నధిప భీమాదుల నసుగఁ బనుపు
పుడమి రక్షింప నీయుడుగులకడ సేసి, నిలిచి మాతల్లుల నిచ్చుఁ గొలిచి
యంచితతపమున కనుగుణం బై సట్టి, శుశ్రూషణము సేయుచును దపోవి
యుతితోడ నుండెద వనవృద్ధు గాంధారి, యిట్లనఁ దగునన్న యీవ కాదె
తే. కురుకులమునకు సంరక్షకుఁడవు నీవు
దండ్రులకుఁ బిండ మొసఁగఁ గర్తవు భవజ్జ
నకుని పంపు సేయుము భూజనుల దలంక
కుండఁ బొమ్మది ప్రియము మా యుల్లములకు, 135
వ. అని పలికిన ధర్మాత్మజు నగ్రజుండు పాండురాజాగ్రజుహితమతి నిట్లనియె. 136
ఆ. ఇట్లు వీరు నన్ను నెంతయుఁ దనిపిన
విపినవాసి మిమ్ము వీడి పోవ
నిచ్చుకొనదు నా మనంబు ముదముతోఁ

గలుగ దిపుడు రాజ్యకాంక్ష నాకు. 137

క. విను పాంచాలురు మాత్స్యులు, వసుధాజనశేషు లైరి వారలు లేమిం
జననీ శూన్యం బై తోఁచినయది రాజ్యంబు నాదుచిత్తంబునకున్. 138

వ. అట్లుం గాక. 139

క. సమరము దీఱినఁ గోలెను, శమనిరతాత్మసంబు సారతపశ్చ
రమియింపఁ గోరు యుష్మత్సమధికతపమునకు నేను సంగడి సేయన్. 140

సీ. అన విని సహదేవుఁ డతనితో నేఁ డప, మాచరించెద వీర లందఱును
శుశ్రూష సేయు చిరయాశ్రమంబున నన్ను, నక్కుమారునిఁ గుంతియక్కఁ జేర్చి
వలవదు మీరు రా వలఁతు లై మామీఁది, భక్తినిం బెనఁగ నీపలుకు లిట్లు
వలుక మీయునికి తపమునకు విఘ్నంబ, కాక యేకాగ్రత గలుగు నెట్లు

ఆ. మాకు నియమవిధిసపర్యాచరణములపై, నింత యొఱఁగి మీర లెల్లభంగి
నరుగుట యొప్పుఁ గాని కురుకులోద్వహు మాట, గొనక యునికి సనదు తనయులార.

వ. మీకు సర్వకార్యంబులయెడను శుభంబు లయ్యెడును బోయి రం డనిన నజాత
శత్రుండు మఱి యొండు వలుకం బులులోడి ధృతరాష్ట్రునితోడం దపోమహ
నీయు లైనమిమ్ముం గొలిచి గతకల్మషుండ నైతి మీయాజ్ఞాపనంబు దల నిడి
కొని పురంబునకుం బోయి వచ్చెద ననుటయు నక్కురువృద్ధుం డతని దీవిం
చుచు నాలింగనంబు సేసి భీమసేను సాంత్వనవచనంబులం బ్రీతుం గావించి
కౌఁగిలించుకొని గాండీవిం గొనియాడి సంశ్లేషం బాచరించి కవల సంభావించి
పరిరంభణంబు నిర్వర్తించిన నయ్యేవురు నతనిపాదంబులకుఁ బ్రణమిల్లి యాశీ
ర్వాదంబులు వడసి. 142

సీ. అతిభక్తి గాంధారియడుగుల కెఱఁగిన, నద్దేవి వారల నక్కుఁ జేర్చి
దీవించె వారుఁ గుంతీచరణంబులు, ఫాలముల్ వొందంగఁ బ్రణతు లైనఁ
దప్పక కుచ్చి యందఱ నొక్కకౌఁగిటఁ, బొదివి యాశీర్వాదములు క్రమమున
నర్మిలి పెంపున నలరుమనంబుతో, వేర్వేఱ యిచ్చె నావీరజనని

తే. ద్రుపదపుత్త్రికా ప్రభృతివధూజనములు, దగు తెఱంగుల మామ నత్తలను వీడు
కొనిరి వారును వారు నగ్గురుజనముల, నల్ల వలగొని చనిరి నృపాగ్రగణ్య. 143

క. చని పరిజనములుఁ బౌరులు, ననుమోదముతోడఁ గొలువ నరిగిరి నగరం
బునకుం గన్నులపండువు, జనపదముజనం బొనర్ప జనసంస్తుత్యా. 144

వ. అరిగి సముచితవర్తనంబుల నుండిరి కొంతకాలంబు సనిన నొక్కనాఁడు
నారదమునీంద్రుం డనుజసహితుం డై యున్నధర్మతనయుకడకుఁ జనుదెంచిన
నజ్జననాథుండు దమ్ములుం దానును నమ్మహాత్మునకు భక్తిం బ్రణమిల్లి యాస
నార్ఘ్యపాద్యాదిసత్కారంబు లొనర్చి తదీయసమీపంబున నాసీను లై
తత్తనివదనంబు విలోకించి వినయం బెసఁగ నమ్మహీపతి మహాభాగ యొండుం తి

రాక యేదేశంబులఁ జరించితి రేను మీకు నేమిపని సేయుదుఁ జెప్పుం డనిన నప్పరమసంయమి యప్పుడమిఱేనితోడ. 145

నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదుల నిర్యాణంబు సెప్పుట.

సీ. భూపవరేణ్య తపోవనంబుననుండి, వచ్చితిఁ దీర్థసేవాపరత్వ
మున నేను బహుదేశములఁ జరించితి నినుఁ, గని పెద్దకాలంబు గాన చూడఁ
దవిరి యిందులకు నేతెంచితి ధృతరాష్ట్రు, చరితంబు జాహ్నవీపరిసరంబు
జనములచే వింటి ననిన నజ్జనపతి, యారాజవరుఁడు గాంధారి గొంతి
తే. సంజయుండు సమాధానసహితులై శరీరములవింత వృత్తి కున్నారె యనియె
ననుడు నద్దేవముని వారియఖిలవర్తనంబువినుమనుస్థిరహృదయంబుతోడ. 146

వ. అనిపలికి యిట్లను మీరు పోయి కాంతారంబున నక్కురువృద్ధుం గొలిచి యుండి యతం డనుమతి సేయ నిట వచ్చితిరి మఱికొన్నిదినంబులకు. 147

సీ. ఆరాజు నియతి గాంధారియు గొంతియు, సంజయుండును దోడ చనఁగ నగ్ని
హోత్రంబు గొని యాజకోత్కరంబగ్రేసరం బయి పో నిజాశ్రమము విడిచి
యరిగె గంగాద్వారపరిసరారణ్యభాగమునకు నందు దుష్కరతపంబు
వాయుభక్షుతఁ బూని చేయఁ దొడంగె గాంధారియు నీళ్ళ నాహారకలన
తే. మోపియొనరించె గొంతి మాసోపవాసనియమమూఁదివర్తించె సంజయుఁడు సప్త
భోజనాంతరితం బగుభోజనంబు, వ్రతముగాఁగఁ జరించెఁ గౌరవ్యముఖ్య. 148

తే. యాజకులు దారయక్కురురాజుభక్తి,యుక్తి నొద్దనుండఁగ నగ్నిహోత్ర హోమ
మాచరింతు రొక్కొకమరి యతఁడుపర్ణశాల వెడలి శూన్యాటవిసంచరించు.

వ. విషమప్రదేశంబుల నవ్విభునకు సంజయుండును గాంధారికిఁ గుంతియుం గన్నై మెలంగుదు రొక్కనాఁడు వార లందఱు గంగాద్వారంబునఁ గృతస్నానులై యాశ్రమంబునకు వచ్చుచుండ మహావాతోద్ధూతంబై. 150

సీ. పటుతరం బగుచటచ్చటరవ మెసఁగంగ, మ్రాఁకులఁ బొదలును గ్రాఁచికొనుచుఁ
గమరును నార్తనాదములును బెల్లుగ, నఖిలమృగంబుల నాఁగికొనుచు
లాఁగలఁ బుట్టల లోఁగినశిఖల భుజంగమండలముల మ్రింగికొనుచు
వెగడొందియుఱుము చుఱ నెగయుబల్పులుఁగులఁ, బొగ నూర్ధ్వకీలలఁ బొదివికొనుచు
తే. దెసల నన్నిటఁ దనసముద్దీర్ణగతులు, దారుణస్ఫురణమున విస్తార మొంద
ఖేచరులకును భయముగ నేచి పరఁగె, నద్భుతోద్భవంబై నమ్మహానలంబు. 151

వ. ఇట్లిరగలిచిచ్చు గవిసి చుట్టుముట్టిన నమ్మనుజనాథుండును నన్నాతులు నిరాహారులై యునికిం జేసి యొక్కచోటఁ దఱియు నుఱికి తొలంగి పోవ లావు లేరైరట్టియెడ నారాజర్షిసత్తముండు సంజయుతోడ. 151

సీ. ఒక్కింత దెఱపి నీ వెక్కడనైనను, గనుఁగొని పొమ్మగ్ని దనుక కుండ
నని చెప్పి తలఁగి పోఁ దనకు గాంధారికిఁ, గుంతిభోజాత్మజకును నశక్య

మగుటయుఁ జెప్పినఁ గడలొంది యాసూత,సుతుఁడు మీఁదను నొకచోట వెడలి
పోవుట గలిగినఁ బోదుఁ గాకేఁ దవా,గ్నికి మిన్నక నెర సేసి యకట పోదు
ఆ. నే మహాత్మ యనుఁడు నిలు వాసి యిట్లున్న,జనుల కవ్విధమున సమయు టెగ్గు
గాదు నీకుఁ బోవఁ గా వచ్చి యుండంగఁ, బోవ కునికి పాపమునకుఁ బట్టు. 153
వ. అనిపలికి యతనిం బోవ నొడంబఱిచి యప్పౌరవసత్తముండు సమాహితచిత్తుం
డై ప్రాఙ్ముఖాసీనుం డయ్యె గాంధారియుం గుంతియు నవ్విధంబునం గూర్చుండి
రప్పుడు సంజయుండు ధృతరాష్ట్రునితో యోగయుక్తుండవు గమ్మనియె నతండునట్లు
సేసెఁ దదనంతరంబ. 154
ఆ. ఒక్క తెఱపి సంజయుఁడు సని హిమశైల,మెక్కె నంత వారి నెల్ల నగ్ని
వొదివికొనియె నిట్లు వోయి రమ్మువ్వురుఁ, బుణ్యలోకమునకు భూపవర్య. 155
సీ. పదపడి నృప యేను భాగీరథీతీర,మున వచ్చుచుండి యవ్వనముదివ్య
మునులచే విని రట సని క్రమ్మఱంగ వ,చ్చినది యాదిగ నయ్యశేషవృత్త
మును నేర్పడఁగ వింటి మూఁడుకళేబర,ములుఁ గంటి నక్కురుపుంగవుండు
భార్యయుఁ బాండునిపత్నియు సద్గతి, నొందిరి నీ వింక నుమ్మలింప
ఆ. కుండు మనిన శోకమొదవి యాతఁడు బాహు లెత్తి యెలుఁగు సెలఁగ నేడ్వ దమ్ము
లడలు గదిరి యేడ్చి రవ్వార్త నంతఃపు,రమున రోదనార్తరవము చెలఁగ. 156
వ. అవ్విశేషంబు. 157
క. విని పౌరజనసమూహము,లనఘుంబును వనట మునిఁగి హాహారవముల్
వినువీథి ముట్ట రోదన, మొనరిచె నవ్వేళఁ గరుణ మూత్కటమయ్యెన్. 158
క. నారదుఁ డుపశమఫణితులఁ, గౌరవసత్తముని దేర్పఁ గ్రమమున నాక్రం
దారతము లుడిగె బంధుజ,నారబ్ధము లైన యనునయాలాపములన్. 159

—ధర్మరాజు ధృతరాష్ట్రప్రభృతులు మృతులగుటకు శోకించుట.—

వ. అట్లు సమస్తజనంబులును విగతఖేదను లైర ప్పుడు కౌరవనాథుండు నారదముని
యాననం బాలోకించి యిట్లనియె. 160
సీ. ఎఱుఁగంగ వచ్చునే యెవ్వరికి తత్తఱి, నేదెస యగునో మునీంద్ర యేము
గలుగంగ దెస లేక పులుమానిసికిఁ బోలె, నక్కురువృద్ధున కట్టిచావు
వాటిల్లె సముదీర్ణబాహుదర్పోజ్జ్వలు, లైనపుత్రులు నూర్వు రట్లు గలిగి
బలము నాగాయుతప్రాణసమం బగు,నమ్మహారాజు జట్టడవి చచ్చు
తే. వలనఁ దెగటాఱె సేమనఁ గలదు కమల, ముఖుల తాళవృంతానిలముల సుఖించు
ప్రభుడు కంకగృధ్రాదిపక్షిపత్రవాయు, వడర నిలఁ బడి యున్నవాఁ డకటకట.
క. కలమృదుమాగధగానం,బుల మేల్కను రాజు గృధ్రఘులునుం గాకం
బులు సెలవఁగ నిద్దురనిద్దుర, నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడు గటా. 162
సీ. వల్ల[illegible] [illegible]తమ్ముఁ జూచినఁ జూనుఁ, దదవ్వలిత నూనాసి సాళ్వభారదమతని

పోయినగతిఁ బోయె ✽ నాయముకై యంత, నగవఁ బుత్త్రులరాజ్యవైభవంబు
విడిచి [1]మే యోమక ✽ యడవికిఁ బోయిన,తల్లికి వగచెద ✽ ధర్మసుతుఁడు
భీమసేనుండును ✽ భీభత్సుఁడును దన,కడుపునఁ బుట్టినకొడుకులట్టె
తే. [2]యొగ్గతంబునఁ దానుఁ గాకరగ్గిఁ గాలె,నటి యనాథ యై దీపికి ✽ నంతరంగ
మలఁదురకతల్లడిల్లక ✽ యూరటమున,నుడుక కలమటఁబడక యొట్లుండుఁ జెపుమ.
క. విను ఖాండవదహనంబునఁ, దనకుఁ బ్రమోదంబు శక్రతనయుఁ డొసఁగెనా
తనితల్లిఁ గాల్ప దగునే, యనలునకుం గడుఁ గృతఘ్నుఁడయ్యె మునీంద్రా. 164
సీ. మఱియొక్కనెవ్వగ ✽ మనమున జనియించె, నాంబికేయుండు గాకరగ్గి నెరిసె
దానికి నెయ్యది ✽ యేను జేయుదునొక్కొ, యనవుడు నారదుం ✽ డా నృపాలు
తోడ నబ్బరతవృద్ధుఁడు శాంతి యెక్కుడై, సవిశేష మైనపూజావిధాన
మున నుపాసించి తగినయిష్టి సేసి య,గ్నులఁదొలునాఁడ పీడొక్కనియె ననియు
తే. నపుడు యాజక జనములయ్యగ్నిచయము
నడవిలోన నుద్వాసించి ✽ [3]యరిగె ననియుఁ
జేర్చి యది యవ్వనం బెల్ల ✽ నేర్చె ననియు
వింటి నాత్మాగ్నిఁ గాలె నావిభుఁడు వత్స. 165
ఉ. కావున నెవ్వగం బొరయఁగాఁ బని లేదు నరేంద్ర గొంతియుఁ
బావకు నప్పకుం గరము ✽ భక్తిఁ దగం బరిచర్య సేసి దే
వావలి ప్రస్తుతింపఁగ నిరామయలోకము నొందె వారికి
నీ వుదకంబు లీ వలయు ✽ నిష్ఠమెయిన్ దిలసంయుతంబుగన్. 166

యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రాదులకుఁ దిలోదకప్రదానంబు సేయుట.

క. అనుజన్ములు నంతఃపుర,వనితాజనములును నీవు ✽ వసుధేశ్వర వే
చని నడపుఁ డుదకవిధి నీ,జనకునకును జననులకును ✽ జాహ్నవిలోనన్. 167
ఆ. అనిన లెస్స గాక ✽ యని ధర్మసుతుఁ డేక వస్త్రధరణనియతి ✽ వఱల నెల్ల
వారునట్ల యేఁగుదేరఁగఁ బౌరులు, బలసి చనఁగఁ జనియెఁ ✽ బౌరవేంద్ర. 168
వ. ఇట్లు సని గంగాస్నానం బాచరించి యమ్మహీపతి మొదలగు సర్వజనంబులు ధృతరాష్ట్రునకు గాంధారికిం గుంతికిం దిలోదక ప్రదానంబులు నిర్వర్తించి నివృత్తులై యశుచిత్వం బపనయించుటకుం బురబహిరంగణంబునఁ బటకుటీర ప్రకరంబుల వసియించి రట్టియెడ. 169
సీ. ఆంబికేయాదులయస్థిపుంజముల గం,గాద్వారసలిలసంగమవిశిష్ట
సంస్కారమునఁ గూర్పఁ ✽ జాలెడుసంశుద్ధ,జనముల రావించి ✽ సబహుమాన
ఫణితుల వారి కప్పని యేర్పడఁగఁ జెప్పి, పనిచె నక్కౌరవజనవిభుండు
శ్రాద్ధవార దినమున ✽ వృద్ధానుమతి నతం, డక్కురువృద్ధున ✽ కతనిసతికి

1. చ. మెయ్యాడక యడవికి. 2. గ. యతనదహనమునఁ దాను. 3. గ. యరిగి రనియు.

తే. గౌంతికిని రత్నకాంచనగోతురంగ, హస్తికన్యాధరిత్రీగృహాదిదాన
విధుల సర్వజనంబులు విస్మితులుగ, నియతిమెయిఁ బారలౌకికక్రియలొనర్చె.
ఆ. మునిజనములు వచ్చి యనుమోద మందఁగ, సకలబంధుజనులు సంతసిల్ల
నన్నపర్వతముల నాజ్యనదుల బిత్రు, మేధ ముల్లసిల్లె మేదినీశ. 171
క. ద్వాదశదినములు నారదుఁ, డాదరమున నొద్ద నుండి యంతయుఁ గనిస
మ్మోదంబుతోడ నాశీ,[1]ర్వాదం బొనరించెఁ బాండవప్రవరునకున్. 172
వ. అమ్మునీంద్రునిం దక్కునుం గల తపస్విసత్తముల సమర్చితులం గావించి యుధిష్ఠిరుం డామంత్రితులం జేసిన నాసంయమివరులు నిజనివాసంబులకుం జని రా నృపకుంజరుండు బంధుమిత్త్రసహితుండై కుంజరపురంబు ప్రవేశించె నిత్తెఱంగున నాంబికేయునకు భారతరణంబు పిదప దానాదిపుణ్యక్రియాకలాప కరణంబులం బురంబునం బదియేనును దపోనియమంబున వనంబున మూఁడు నుంగాఁ బదునెనిమిదిసంవత్సరంబులు సనియె నివ్విధంబున వైచిత్రవీర్యుని[2]సంసేవన సమస్త ప్రకారంబుల సంఘటించి కృతార్థతానందంబు నొంది ధర్మనందనుండు జనంబు లభినందించుచందంబున సామ్రాజ్యంబుఁ బాలించె నని యిట్లు ధృతరాష్ట్రునియాశ్రమవాసంబువిషయం బైనవర్తనంబు వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుండు మహాత్మా యిట్లు కృతకృత్యతం బొందినపాండవాగ్రజుండు భూభారంబు నిర్వహించుచుండఁ బదంపడి పుట్టినవిశేషంబు లెఱింగింపవే యనుటయు. 173
శా. కారుణ్యాత్మకదృక్ప్రచార గతసంకల్పాంతరంగస్థిత
స్మేరాకార పతంగమధ్యమమరీచివ్యాప్తిమూర్ఛత్సుధా
ధారారూపవిహార నిర్మితజగ[3]త్సంసార నానాగమ
క్షీరోద్యన్నవనీతలాలసిత నిశ్చిత్తత్త్వ[4]సంభాసితా. 174
క. నిర్మలసంవిదుపాస్యా, [5]ధర్మకరణదుర్వికాస్య దైత్యశ్రేణీ
నిర్మథన కేళినిర్జర, శర్మకృతివిహారశీల సంయమిలోలా. 175
మాలిని. సమదవిమదదూరాసన్నరత్నప్రసన్నా
శమశుభమయమూర్తిస్ఫార దుర్లక్ష్యసారా
దమవిభవసముద్యద్ధామ నిస్సీమభూమా
సముహృదయలసత్సంసర్గ[6]సానందవర్గా. 176
గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున నాశ్రమవాసపర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము. 177

1. క. ర్వాదంబుల నొసఁగె. 2. గ. సమస్తప్రకారంబుల సాధించి కృతా. 3. గ. త్సం[illegible]. 4. క. సంభావితా. 5. గ. ధర్మాన్వితదుర్వికారదైత్య. 6. చ. సఖ్యస్ఫీతవర్గా.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## మౌసలపర్వము, ఏకాశ్వాసము.

———o———



ధర్మకామహృదయప
మాధానాధానకారకాంఘ్రిసరోజా
బోధఘనవ్యాసపరప
మాధిసమాలీఢతేజ హరిహరనాథా. 1

ధర్మజారాజ్యంబున నుత్పాతంబులు దోఁచుట.

క. దేవా జనమేజయధాత్రీవల్లభ విను సుదాత్త తేజోదీప్తుం
డా వైశంపాయనుఁడు ప్రియావేశస్మేర చిత్తుఁడై యిట్లనియెన్. 2

సీ. భారతసంగ్రామపారీణుఁడై జయపరమయుల్లసిల్ల సామ్రాజ్యమునకుఁ
బాండవముఖ్యుఁడు పట్టంబు గట్టిన యది యాదిగాఁగ ముప్పదియు నైదు
సంవత్సరంబులు సన ననంతరవత్సరంబునఁ బ్రజకు భయం బొనర్చు
నుత్పాతములు పుట్టె నుర్వీశ విను, మహావాయువు శర్కరావర్షి యగుచు

ఆ. వీచె నర్కునుదయవేళల బింబంబు, బలసి తోఁచు ఘనకబంధసమితి
నీరదములు లేక నిర్ఘాతపాతముల్, గలుగు నుల్క లెల్లకడల డుల్లె. 3

క. పరివేషము లినరజనీకరులకు నతిరూక్షరుచులు గలిగి కలుగు నం
బర మెల్లఁ గప్పి వేసవిఁ, బరఁగుం బెనుమాడ్కి మంచు పౌరవముఖ్యా. 4

సీ. ఇట్లను దినమును నెన్నియేనియును మహోత్పాతములు పుట్టుచుండఁ గొంత
కాలంబుపోవంగఁ గౌంతేయముఖ్యుండు, వినియె నొండొరులతోఁ బెనఁగి సర్వ
యాదవులును దెగి రంబుజనాభుండు, హలధరుండును దక్క ననినరేంద్ర
విని భీమసేనుని విజయు నకులుని, సహదేవు రావించి సంభృతార్తి

తే. యగుచు నవ్వార్త చెప్పినఁ గ్రిక్కిరిసిన చెడుగులను, వార లెవ్వరు నెవ్వగల్ గూరు మాన
సములు గలఁగ నత్యంతవిషణ్ణులైరి, సకలజనకోటులును శోకజలధి మునుఁగ. 5

తే. అనిన విని యమ్మహీపతి యాదవులకుఁ, బోరు దమలోనఁ గలిగిన కారణంబు
వారివృత్తాంతమును వినవలతుఁ జెప్పు, మనుడు నమ్ముని యిట్లను నతనితోడ. 6
క. ద్వారవతికిఁ గణ్వుండును, నారదమునివరుఁడు గాధినందనుఁడును బెం
పారంగఁ దొల్లి వచ్చిరి, నారాయణుఁ జూచువేడ్క నరవరముఖ్యా. 7
సీ. చనుదెంచి పురవీథిఁ జనునవసరమున, వృష్ణికుమారులు విధివశమున
మనముల నవినీతి జనియింప సాంబున, కంగనాలంకార మమరఁ జేసి
కొని వచ్చి యమ్మహామునివర్గమునకు మి,థ్యావినయమున వందనము సేసి
నిభృతులై కారుణ్యనియతాత్ములార యీ, భామిని బభ్రునిభార్య ప్రజలఁ
తే. గనునె యిది యని యడిగినఁ గారవేంద్ర, యత్తపోధనవర్యు లయ్యాగడమున
కాత్మలందుఁ గ్రోధానలమగ్గలముగ, నెలయ నక్కుమారులతోడ నిట్టులనిరి.
క. అంబుజనాభునికొడుకీ,సాంబుఁడు గను యాదవక్షయాపాదనస
ల్యాం బగుముసలము మావచ,నంబున కన్యృతంబు లేదు నమ్ముఁడు మీరల్. 9
సీ. దామోదరుఁడు హలధరుఁడును దక్కంగ, యాదవు లెల్ల నన్నముసలము
నన్నుతశక్తిఁ గీటడఁగుదు రబ్బల,దేవుండు దన దైవదేహ మధిక
నిష్ఠమై విడిచి వార్నిధిఁ బ్రవేశించు భూ,శయ్య నుండంగ నాచక్రధరుని
జర యనురాతసి వెరవునఁ [1]బట్టి క్రమించుఁ బొం డని చెప్పి మెచ్చుగాదు
ఆ. మనము కృష్ణు నింకఁ గను టనియెడుబుద్ధి, నమ్మహామునీంద్రు లపుడు మరలి
యాత్మవాసములకు నరిగిరి తదనంత,రంబ కృష్ణుఁ డవ్విధంబు వినియె. 10
క. విని కాలవేది యగున,వ్వనజాక్షుఁడు నియతి నగునవస్థకుఁ దలఁపం
జన దన్యథాత్వకరణం, బని యూహించుచు నుపేక్ష యాత్మ నొలయఁగన్. 11
క. తనచుట్ల నున్నబంధులఁ, గనుఁగొని యిట్టిది విధాతృకరణీయం బి
ప్పుని మనవారలయొప్పని,తనమున మూఁడె నని వంతఁ దలపోయుచుఁడీ. 12

మునిశాపంబున సాంబునికడుపున ముసలంబు పుట్టుట.

సీ. అని పల్కి యభ్యంతరావాసమున కేఁగె, మఱునాఁడు సాంబకుమారుకడుపు
లోనుండి జముదూత వోనిభయంకర,నిష్ఠురముసలంబు నిర్గమించె
దానికి సత్యద్భుతంబును భయమును, గదురంగ వసుదేవుకడకుఁ బాటి
బంధు లయ్యాదవపతి కెఱిఁగించిన, నలఁదురి వెలువెల్ల నగుచుఁ గొంత
తే. ప్రొద్దు నివ్వెఱఁ గంది యాభూవరుండు,కడురయంబున రోఁకలి పొడిగఁ జేసి
వనధిలోపలఁ జల్లంగ వారిఁ బనిచె, వారలును నట్ల చేసిరి కౌరవేంద్ర. 13
క. మునిశాపశక్తి మాన్పుమ,మునఁ ద్రోవఁగ రాని యుల్లసములఁ దలఁపక య
జ్జనపతియు బాంధవులు న, ట్లొనర్చి యూఱడిలి యుండి రుర్వీనాథా. 14
క. పదపడి ధృతరాష్ట్రమహీశ, యదయహృదయ వైసమస్తయాదవులకు బె

1. గ. బిట్టా క్రమించు.

ట్టిద మగుశాపం బిచ్చుట, విదిత మయిన సజ్జనములు । నెఱుచుచు నుండన్. 15

క. కాలం బగుటయుఁ గురుభూపాలోత్తమ యాదవేంద్ర । పట్టణమున హ్రా
త్కాలువ్యసనప్రాపాదన, శాలిమహోత్పాతముల్ ప్ర। జాతము లయ్యెన్. 16

తే. అరుణములు ఘూర్ణితంబులు । నైనలోచ
నములు మెఱయ మహోగ్ర దండము ధరించి
తిరుగు నొక్కొక్కచోటను । దృశ్యుఁ డగుచు
నంతకుం డిదె యదె తోఁచె । ననఁగ నధిప. 17

ద్వారకాపురంబున మహోత్పాతము లనేకములు పుట్టుట.

తే. నీలపింగళ దేహ యా। భీలభంగి, కముగ నమ్మెఱ్ఱు వర్తించు । జముఁడు సకల
వృష్ణిభోజాంధకోత్సాది। విహారణమున, మునులశాపంబు ప్రేరేప । మనుజనాథ.

సీ. చిలుకలు గూబల । యెలుఁగులఁ దందంబు, దోఁపంగ నఱచు రా। త్రులను దివము
లందును నక్కల । యట్లు మేఁకలు గూయు, మొదవ్వపింపునకు గా। డిదలు పుట్టు
ముంగుల కుదయించు । మూషికంబులు గుక్క, లెల్లను బిల్లుల । నీను బలుఁడు
హరియును దక్కఁగ । యాదవనివహంబు, బ్రాహ్మణప్రతతికి । బాధసేయు

తే. గురుల కవమాన మొనరించుఁ । దిరుగు లజ్జ
విడిచి యభిలాషముల వెంట । విభులపంపు
సేయ కున్మార్గములఁ దమ । చిత్తములకు
వచ్చినట్లు వర్తింతురు । వనిత లధిప. 19

క. అనలములు హోమకాలంబున నానాభూతవర్ణ । ములతోడ శిఖల్
మను జేశ్వర వామావర్తన మొందఁగ నుగ్ర గంధ । రౌద్రంబు లగున్. 20

క. విను కూడుఁగూరపాకము, గనుఁగొని ప్రాయి వాపి డింపఁ । గా నప్పుడు సం
జనితములై పువ్వులు గల, గొన మిలమిల మెదలు నందుఁ । గురుకులముఖ్యా. 21

సీ. అనుదినంబును నిట్టు । లశుభసూచకములు, దోఁపంగ సర్వవి । దుండు కృష్ణుఁ
డంతరంగమున స । మాలోచనము సేసి, గాంధారి పుత్త్రశో । కమునఁ జేసి
కోపంబు గదిరిన । శాపంబు ముప్పది, యాఱవునేఁ డెల్ల । యాదవులకు
నాశ [1]మన్యోన్యవా। సనమున నగుటకు, నిచ్చె నిష్టించి య। య్యేఁడు వచ్చెఁ

ఆ. దప్ప దది ఫలించు । దానికిఁ దీర్థస, మీపభూమి యైన । మేలు గాదె
యని నరేంద్ర యమ్మ । హాత్ముఁ డీభంగి నూహించి తెలుఁగు నిశ్చ । యించెఁ దివిరి. 22

ఆ. అట్లు నిశ్చయించి । యాదవనివహమ్ము, నంబు దివ్యబుద్ధి । నరసి యపర
దివసకలిత మగుటఁ । దెల్లంబుగాఁ గని, కొని యతండు పెద్ద । కొలువులోన. 23

ఉ. జాతర సేయఁగా వలయు । సర్వజనంబులు నంబురాశికిన్
బ్రాతిగ భక్తితోడ నని । బంధుల కెల్లను జెప్పి వీట వి

1. క. మన్యోన్యవాసన మగుటకు నిచ్చె, నిష్టించి యయ్యేఁడు ◆ స్వేఁడు వచ్చె.

ఖ్యాతిగ నప్డు పాటుటకు నర్హునిఁ బంచిన ఘంటికాస్వనో
పేతము గాఁగ వాఁ డెలమిఁ బెద్దయెలుంగునఁ జాటె నెల్లెడన్. 24

సీ. ఆరేయి గల నెల్లవారును గోరదా,డలును నల్లనిమేను గలనెలంత
రొక్కత యిలు సొచ్చి యువిదల నీడిచి, కొనిపోవ శస్త్రాస్త్రకోటి కేతు
చయమును భూషణసమితియు రాక్షసు, లపహరింపఁగఁ గని రపరదినము
నం దగ్నిదత్తంబు నబ్జనాభంబును, నైనకృష్ణునిచక్ర మద్భుతముగ
ఆ. నెగసి యఖిలజనులు నీక్షింప దివమున, కరిగె నమ్మహాత్ము గరుడకేత
నంబుఁ దోన చనియె నరవర రోహిణీ, తనయు తాటిసిడము ననుసరించె. 25

తే. వినుముసుగ్రీవమును శైబ్యమునువలాహ,కంబు మేఘపుష్పంబునాఁగలుగునట్టి
వాహనంబులతోఁ గూడ వాసుదేవు, తేరు తదవసరంబున దివికి నరిగె. 26

క. వెడలుండు తీర్థయాత్రకుఁ, గడువేగం బనిరి సురలు గగనంబున న
ప్పుడు సువ్యక్తముగా నొ,క్కడెలుంగులు సెలఁగ రాజకులమౌళిమణీ. 27

క. అవి గనియు వినియు నులుకక, నవరణ లొప్పార నపు డసంభ్రములై యా
దవులు మనోజ్ఞము లగుశీ,ధువులును మాంసములు వేడ్కతో నింటింటన్. 28

యాదవు లందఱుఁ గృష్ణసహితులై సముద్రతీరమునకుఁ బోవుట.

సీ. సమకట్టికొనుచు భోజ్యములు భక్ష్యంబులు, నానావిధములు నొనర్చికొనుచు
క్షీరశర్కరలును ఘృతబహుభంగిక,వ్యంజనంబులు వివిధాన్నపాన
ములును నక్షతగంధములును బుష్పంబులు, గావించుకొని బలుగావళులును
దలమోపులును బండ్లుఁ దమతోడ నొప్పారి, చనుదేరఁ గరులును నశ్వములు వరద
తే. ములు నలంకారవిరచనములు నుదాత్త
లలితరేఖంబు లగుమాల్యములును భూష
ణములు నాలేపనములు వస్త్రములు వింత
చెన్ను సేయఁ జేష్టలు విలసిల్లుచుండ. 29

క. తనరథము లేమి నొండొక,ఘనరథమును దారుకుండు గైకొని యెలమిం
గొని రా వెడవెడ గైసే,సినకృష్ణుఁడు నిర్వికారచిత్తత వెడలెన్. 30

ఆ. తొడవు చీర పూఁత తొంటియట్లులు గాఁగ, నేమివాహనంబు నెక్కికొంచు
కేని వికృతి లేనిహృదయంబు మిత్రసం,భాషణంబు గలిగి బలుఁడు వెడలె. 31

క. ఆందోళికాదివాహన,సందోహంబున నితాంతచారుత్వము చె
న్నొందఁగ సమలంకృత లగు,సుందరు లేతేర విభవశోభితభంగిన్. 32

చ. వెలువడి లీల నేఁగి మును వేడ్క నొనర్చినమేటి చప్పరం
బుల నెలమిన్ మహార్ణవముపొంత వసించిన నుద్ధవుండు దా
నలఘుతపం బొనర్చుటకు నై విపినంబున కేఁగువాఁడు గాఁ
[illegible] 33

వ. *అంత బలుండును గోవ నిశ్చయించి చెప్పిన. 34

చ. పలుకక మ్రొక్కి వీడుకొలుపఁగ వనంబున కప్పుడో హితుం
డలఘువినిశ్చయంబు వగ వంతయు మాన్పఁగఁ బోయె నాతనిన్
హలధరుఁ డన్పఁ బోయి వినయంబును భక్తియుఁ దోఁప నయ్యనా
కులు నట వచ్చి యొక్కెడ నకుంఠితనిర్ణయశాంతచిత్తుఁడై. 35

క. విను మొక్కఁడు నొకభూరుహ, మునమూలంబున నిరస్తమోహాంధత్వం
బున వెలుఁగుబుద్ధివిజ్ఞ,,యనిరూఢతఁ జేసి యుండె నాసీనుండై. 36

ఉ. భూమిసురావళీమహితభోజనతంత్రముఁ దీర్పఁ బూని హృ
ద్యామలరాజితంబు లగుకన్ల ట్లొనరించినకూడుగూర లా
కోమలు లాఁగఁగాఁ గడఁగి కోఁతుల కన్నియుఁ బంచి వెట్టి రు
ద్దామవిహారలీల వసుధావర యాదవు లేమి సెప్పుదున్. 37

చ. పదపడి గీతవాద్యగతిబంధురనృత్యము లుల్లసిల్లఁగా
నుదధికి నంచితాతతమహో త్తరగంధవిశిష్టపుష్పసం
పదలు బహుప్రకారములఁ బ్రస్తుతి సెక్కఁగఁ బూజసేసి పెం
పొదవ నివేద్య మిచ్చిరి సమజ్జ్వలహృద్యషడార్ధకోటులన్. 38

చ. విను తదనంతరంబ మదవిహ్వలభావము సేయఁ జాలి యిం
పొనరినయాసవంబులు సముత్సుకతం గనకంపుఁగోరలం
గొని హరిసన్నిధానమునఁ గ్రోలిరి యాదవు లంతరంగమో
దనకరణంబులై నయపదంశములం గొనుచున్ మహీశ్వరా. 39

తే. సాత్యకియుఁ గృతవర్మయుఁ జారుదేష్ణుఁ
డును గదుండును బ్రద్యుమ్నుఁడును మొదలుగఁ
గలుగుయాదవు లెల్లను గాంతిఁ బాన
విధి యొనర్చిరి పెల్లుగ విధివశమున. 40

తే. వృష్ణిభోజాంధకులు కురువీర యిట్లు, రేఁగి మద్యపానం బొనరించి, మదముఁ
బొంది కేళిసలాడుచుఁ బొందు వదని,పలుకు లెసఁగంగఁదిరిగి నవ్వులు సెలంగ.

—సాత్యకికృతవర్మలకు రోషజనకంబుగాఁ గలిగినసంవాదము.—

సీ. ఉన్మార్గవర్తులై యుండిరి విను మట్టి,యవసరంబున ఘూర్ణితారుణంబు
లయినేత్రముల సాత్యకి కృతవర్మని, వదనంబు గనుఁగొని మదము మెలర్ప
నొద్ద నిల్చున్నప్రద్యుమ్ను చే సటచూచు, నవహాస మేర్పడ [illegible]భంగిఁ
బలుచ నవ్వి యరాతిబృందంబు నిద్రావశత్వంబుఁ బొందఁగఁ జావుబోని

తే. దుష్టదశ నొంది యుండంగఁ [illegible].
నడరి వధియించుటఁగాఁ బోరఁ [illegible] రాజ

---

* [illegible]

తనయుఁ డంతపాపంబు సేయునె యితండు
పొడిచెనట యిస్సిరో యిట్టిపోటుఁ బోటు. 43
తే. అనఁ బ్రద్యుమ్నుఁ డిది నీచు | లయినవారి, తెరవు వృష్ణివంశోత్తమ | దీనినిట్లు
నీకు వాక్రువ్వ నేటికిఁ | బోవ విడువు, జను లితనిఁ బ్రువ్వఁ దిట్టుటసాల దెట్లు.
చ. అన విని రోషచిహ్నవికృతాననుఁ డై కృతవర్మ సాత్యకిం
గనుఁగొని సిగ్గు లేక యొరుకయ్యము నీ కిటు లుగ్గడింపఁగాఁ
జనునె కిరీటిచే నఱక | శాంతత నొందినసోమదత్తనం
దనుతల ద్రుంపవే మఱచితా యిసిరో యిది పోరిపాడియే. 44
సీ. అనియె దానికి హరి | యాభోజపతిమీఁదఁ గడునెఱ్ఱ నైనక్రేఁగంటిచూడ్కి-
నిగిడించి సక్రోధ | మగుమానసంబుతో, నఖిలభోజులఁ గలయంగఁ జూచె
నప్పుడు సాత్యకి | హరితోడఁ గృతవర్మ,ననుజుండు శతధన్వుఁ | డనుచితోద్య
మమున సత్రాజిత్తు | మహితాత్ము మానసీ,యుని శమంతమణికిని వధించెఁ,
తే. గాదె యని వారిదెసఁ గీడు | గానుపింపఁ
బలికె నవ్వాదు విని సత్యభామ కోప
మడరి వనితాస్వభావోద్గతాస్రపూర
యగుచు హరియగ్రతలమున | కరుగుదెంచె. 45
క. కనుఁగొని హరి కతిరోషము, జనియించెను దానిఁ జూచి | సాత్యకి యద్దే
వునకును దేవికి నిం బ్రియ, మొనరించెద నని తలంచి | యుద్వృత్తుం డై. 46
మ. కృతవర్మం బటుదృష్టిఁ జూచి కినుకం | గెంపారువక్త్రంబుతో
నితఁ డాచార్యసుతుండు దోడ్పడఁగ రే | యెల్లన్ వడిం గిట్టి క
ష్టతరోత్సాహత ద్రౌపదేయులను ధృష్టద్యుమ్నుఁ దత్సోదర
ప్రతతిం జంపిననీచు వారలగతిం | బ్రాపించు టర్హం బగున్. 47

మద్యపానమత్తు లైనసాత్యకి కృతవర్మతల నఱకుట.

మ. అనుచున్ సంయమిశాపజాతముసలాత్యంతాద్భుతస్ఫీతశ
క్తినిరూఢంబుగ నూనినట్టినిజనిస్త్రింశంబు శీఘ్రంబునం
గొని తద్దీధితిరాజిచే నతనిచూడ్కుల్ విహ్వలత్వంబు నొం
ద నుదగ్రోద్ధతిఁ ద్రుంచెఁ దద్గళము రక్తాంబుప్రసారంబుగన్. 48
తే. అట్లు కృతవర్మఁ దెగటార్చి | యాతఁ డంత
నిలువ కుద్ధతుఁ డయి భోజకులముమీఁదఁ
గవిసె బాహావిలాసంబు | ఖడ్గదీప్తి
చయము మెఱయంగ సంరంభసత్వరముగ.
చ. కవిసినఁ జూచి యాఁగుటకుఁ గా నలినాక్షుఁడు పోవునంత నా

---

౧. రక్తంబుల్ ప్రసారంబుగన్. ౨. గ. ఖచరదృష్టి చయము నొదిఁగింప.

హావఖురు లైనభోజులును సంధకవీరులు నొక్కఁడై దెసల్
చెప్పుడు వడంగ నార్చి యతిశీఘ్రత సాత్యకిఁ జుట్టుముట్టి ర
ప్డు విమలబోధుఁ డాహరి కనుంగన లొందియుఁ గాలవేదితన్. 50

ఉ. తమ్మునిఁ గాచునట్టిసముదగ్రతఁ గైకొని నొల్లఁ డయ్యె నే
గమ్మున రుక్మిణీసుతుఁ డఖండపరాక్రమ మొప్పఁ గిట్టి శౌ
ర్యమ్ము భుజాబలమ్ము మెఱయం గని సాత్యకి సంతసిల్లి ద
ర్పమ్మునఁ బేర్చి మెచ్చొలసి ప్రస్తుతి సేసిరి చూచుఖేచరుల్. 51

చ. కనుఁగొని వృష్ణివీరులు నికామసముజ్జ్వలరోషవహ్ని నె
మ్మనమున నుత్థితంబుగ సమత్సరశౌర్యము విక్రమోద్ధతిం
బెనుపఁగ వార లిద్దఱకుఁ బ్రీతి యెలర్పఁగ సింహనాదము
ల్ఘనపథ మెల్ల నిండఁగ బలంబుఁ జలంబును నుల్లసిల్లఁగన్. 52

క. భోజాంధకసంగమనవి, రాజిత మగునబ్బలంబు రౌద్రోద్రేక
భ్రాజితు లయి తాఁకి పెనఁగి, రేజాలియు లేక కృష్ణుఁ డీక్షింపంగన్. 53

క. అయ్యెరు దెఱఁగున కప్పుడు, కయ్యముకకుఁ బరమసాధకంబుగఁ గలిగెన్
ముయ్యంచుకొనంగ యచ్చట, దయ్యము నేర్పు విను చెప్పెదం గురునాథా. 54

చ. మునివరశాపసంభవదమోఘగతిన్ ముసలంబు సాద్భుతం
బును నతిదారుణంబు నగుభూరిసముద్భటశక్తిఖేలనం
బున ముసలత్వవిస్ఫురణముం గలిగించె బ్రవేశిలఁ గై
కొని సమర ప్రవర్తనము ఘోరతరంబుగ నెల్లతుంగలన్. 55

క. పొడి గాఁగఁ జేసి యమ్మెయి, జడనిధిలో వృష్ణివరుఁడు సల్లించినసుం
జెడ దయ్యె మునివరులయొ,క్కఁడుశక్తిని ముసలశక్తి కురువంశవరా. 56

సీ. యాదవవీరుల కాసమయంబున, మద్యపానోద్భూతమదము పేర్మి
మునివరామోఘవచనదివ్యశక్తినిఁ, జేసి కల్గద తుంగ ప్రేసినంత
టన ప్రతిభటునకుఁ దనుపడ గలుగునే, యనువివేకము దానిఁ గొనివిరోధి
నడిచినయప్పుడు మిసుక లేకిలఁ బడఁ, గని యిది యెట్లొకో యని తలంచు
తే. టయునుగావున సమర మిట్టులపుథంగిఁ, జెల్లెఁ గృతిమముసలచండోల్లసనము
లతిశయిల్లంగ వారి కన్యోన్యవధవి,హారదుర్వారసంచారఘోర మగుచు. 57

ఆ. తండ్రి పుత్త్రుఁ డన్న దమ్ముఁడు నాక యు,య్యెరుదెఱంగువారు నేవు రేఁగి
మడియ మోఁద గాలిఁబకుమ్రాకుగముల తెఱఁగు దోఁచె నేమనంగఁగలను.

క. మునిశాపము వారలమది, ననయము నన మొక్కఁ జేయ నం దొకఁడైనన్
వినుమరలుట దెరలుట లే, కని బెట్టుగఁ జేసి రధిప యాన్పులు సెలఁగన్. 59

తే. అట్టియెడ విను భోజులు నంధకులును
బాలఁగలుగుటఁ బ్రబలుండు సాత్యకియు స

మగ్రశక్తి ప్రద్యుమ్నుఁడు | నాదిగాఁగ
మడిసె వారిచే వృష్ణిసమాజ మెల్ల. 60

సీ. అనిరుద్ధుఁ బ్రద్యుమ్ను | సాంబుని సాత్యకి, గదుసని మఱియును | గలుగువృష్ణి
వరుల నంధకభోజవర్గపరాక్రమ, క్రీడల సమసి యాక్షితితలమునఁ
బడియుండఁ గనుఁగొని | పరమమునీంద్రశాపంబుమహాశక్తిఁ | బద్మనాభుఁ
డును దీవ్రకోపాగ్ని | తనదుచిత్తమున నుద్ధురమై జనింపఁగ | దురములోనఁ

తే. బడక శేషించి మెఱసినప్రతిభటాళి, మీఁదఁ గవిసి తుంగలఁగొని మోఁదినిరవ
శేషముగఁ జేసె నిట్లు లశేషయాదవులును మౌసలవిస్ఫూర్తిఁ | బొలిసి రధిప.

క. నారాయణుఁ డప్పుడు గాంధారీవాక్యంబు తెలిఁగు | దలఁచి మనమునం
బారంబుఁ బొందెనే యిది, యారూపున ననుచు సంగరావని నొకఁడున్. 62

క. నిలుచున్నఁ జూచి రణసంకులతఁ బడకయున్నదారుకుఁడు బభ్రుఁడు న
జ్జలరుహనాభుసమీపస్థలికిం జని యిట్లు లని రతనితోడ నృపా. 63

తే. అఖిలజనమును సంహృతమయ్యె నిచట, నేల బలభద్రదేవుఁ డున్నెడ ముకుంద
యరసికొనిపోయి యాతనిచరితమునకు ననుగుణంబైన వర్తనమాచరింపు 64

చ. అనుటయు నట్ల కాక యని | యంబుజనాభుఁడు బభ్రుదారుకు
ల్మనములు దల్లడిల్లఁగఁ గలంకుల రా బలభద్రదేవుపో
యినదెస నాదరం బెసఁగ | నేఁగి కురుక్షితిపాగ్రగణ్య యా
ఘనతరమూర్తి నవ్వలనఁ | గాంచె మహీజముపొంత నుండఁగన్. 65

యాదవు లెల్ల మడిసినపిదపఁ గృష్ణుఁ డర్జునుం దోడ్తేర దారుకుం బంపుట.

సీ. కాంచి దారుకుదెసఁ | గనుఁగొని నీవు వే, పాండుతనూజులపాలి కరిగి
వారికి యాదవవర్గసంక్షయవిధ, మెఱిఁగించి యర్జును | నిందుఁ దెమ్ము
నావుడు నతఁడు మహావేగవంతంబు, లగురథ్యములఁ బట్టి | యలఁతియరద
మునఁ బూన్చికొని రయంబున నేఁగె నప్పుడ, మ్ముక్రవైరి బభ్రుని మోముఁ జూచి

ఆ. యతివపిండుఁ గుంజరాదులఁ బురిఁ జేర్చి, యరుగుదెమ్మి వేగ | మనిన నాతఁ
డట్ల చేయుపనికి | నరుచు చన నొకబోయ, త్రుంగఁ జేసె నతనిఁ | దుంగ త్రేసి.

ఆ. హరికిఁ గానవచ్చునంతదవ్వుల నట్లు, వడియె బభ్రుఁ డతనిపాటుఁ జూచి
సదయమింద్రశాపశక్తికి నద్భుత, మంది యమ్ముకుందుఁ డన్నతోడ. 67

క. సామజరథతురగములను, భామలఁ బురి సేర్చి యే మరలి వచ్చెద నీ
భూమిజముకడన నిలువుద యామము నా రాక వార్చి | యనియె నరేంద్రా. 68

సీ. త్రసన్యగజాదుల సతికులలను గొని పురి కేఁగి, వసుదేవుఁ గాంచి యుగ్రవ్యసనమతిమ
... గన్నీళ్లు నించి | దొల్లి కౌరవకులక్షయము నూఁచితి నేఁడు | సకలయాద
వులనాశమును గంటి | నలఘుతేజోధన, యఖిలబాంధవహీన | ముఖమున...
...మునువున వర్తింప | మనను గొల్పదు... యున్న, ...యున్న ...కడిఁదినాఁడు

తే. భవ్యతపమున నాబభ్రుభద్రుఁ గూడి, యేను దప మాచరించెద నింక మీర
లరసికొనుఁడు సర్వంబును నరుఁడు వచ్చు, నింక మీపంపు సేఁత కైకొమ్మి నేఁడు.

క. అనుచు నతని పాదంబులు, దనఫాలతలంబు సోఁకఁ దాత్పర్యముగా
వినతి నడపె నంతకమును, వినియె జనులచేత సమరవిధ మతఁ డధిపా. 70

చ. విని బలుజీవి వోయె మది విహ్వలమై మెయి మ్రానుపాటు నొం
ద నునికి మీఁదఁ గేశవుఁడు దానును రాముఁడు నిల్లు వాసి కా
ననమున నుండువారల మని నైష్ఠికతం బలుకంగ నున్నచే
తనయు నడంగఁ జేష్టితము దక్కి శవాకృతి నుండె నత్తఱిన్. 71

క. తనమాటలు నజ్జననాథునవస్థయు విధియుఁ గనియు గురపిల్లి సతీ
జను లొక్కటఁ బెల్లాక్రందన మొనరించిన మురారి దయమది నొలయున్. 72

సీ. అందఱ నూరార్చి యర్జునుం డిప్పుడ, వచ్చు నిచ్చటికి మీ వంత లెల్లఁ
దీర్చు నక్కురుకులదీపకుం డని యుప, శమవాక్యములఁ దేర్చి జనకుపాల
నాసీనుఁ డయి తదీయాంఘ్రిపద్మంబులు, దనచారుపాణిపద్మముల మెత్త
మెత్తన యొత్తుచు మెలుపొందఁ గర్జంపుఁ, బలుకులఁ జిత్తవిభ్రమము మాన్చి
తే. మఱియుఁ బార్థునిరాక పల్కులును జెప్పి
యన్నయాధ్యుఁడు పని సేయ నున్నవారిఁ
గరితురంగాదికముల మీ రరసికొనుఁడు
వినుఁడు కర్తవ్య మిట్టిది వేయు నేల. 73

క. అని తగఁ బలికి యతని వీడ్కొని రాముని కడకుఁ జని యకుంఠితభక్తిన్
వినతుం డయి మనజనకుని, ననుమతి వచ్చితి మహాత్మ యనియె నరేంద్రా. 74

బలరాముఁడు శరీరంబు విడిచి యనంతునియందుఁ గలయుట.

సీ. తదనంతరంబ యద్దామోదరుఁడు రాము, వదనసరోజంబువలన వెడలఁ
గనియె మహాభుజంగము నరుణచ్ఛాయ, మై పొల్చువక్త్రసహస్రకంబు
మణుల వెలింగెడుఫణములఁ దెలుపారి, పర్వతాభోగనిభంబు నైన
మేనిపెంపును గలదాని నట్లాబల, భద్రుండు నిజయోగబలముపేర్మిఁ
ఆ. దనదుతనువు విడిచి చనియె వియద్వీథి, నంబునిధికి నమ్మహాత్ము నెదురు
కొనియె వరుణుఁ డధికవినయంబుతో నాగ, కులము లెల్ల వచ్చి కొలిచె భక్తి.

ఆ. అహికులాగ్రగణ్యుఁ డైన వాసుకియుఁ గర్కోటకుండుఁ దక్షకుండు వారు
ణుండుఁ గుంజరుండును గుముదుండును, దుర్ముఖుండునుం బృథుశ్రవుండు. 76

తే. హ్రాదుఁడును వక్రదంతుండుఁ గ్రోధనాము
కుండు శంఖుండుఁ బుండరీకుండు మిశ్రి
యును నజేయుండు ధృతరాష్ట్రుఁడును మొదలుగ
నరుగుదెంచిరి యద్దేవు నర్థిఁ గొలువ. 77

ఆ. పరమకౌతుకంబు భవ్యభక్తియు నొలయంగ వచ్చి కొలిచె నాగణేంద్రు
గంగ యాది గాంగ గలమహానదులు ప్ర, ముజ్జ్వలాభిరామమూర్తు లొంది. 78

క. అంతయును దివ్యదృష్టిఁ, గ్రాంతి యెసఁగు పురాంతకుఁడు గనుఁగొన నమర్త్యా
ర్త్యాంతరము గలపికొనియె న,నంతుఁడు తనపరమమూర్తియందు నరేంద్రా. 79

సీ. అట్లగ్రజుఁడు చన్న నచ్చోటు వాసి యం
తంతఁ గ్రుమ్మరుచు మురారి సకల
లోకపాలనకు భూలోకంబునందుఁ దాఁ
బుట్టంగ వలసినయట్టిమేటి
పను లెల్లఁ దీఱుట మనమునఁ దలపోసి
తనువిముక్తికి నిమిత్తంబు దలఁచి
మునులవాక్యము తెలియఁగను దొల్లి దుర్వాసు
నవయవసమితిఁ బాయసము పూయు

తే. నప్పు డటకాలఁ బూయమి నత్తపస్వి
యచట [1]నవిలంఘ్య మైయపాయంబు గలుగు
ననినమాటయుఁ జర్చించి మనసు నింద్రి
యములు నడఁగించి గాఢసమాధి నొందె. 80

క. జలనిధిశయనుండు మహీ,స్థలశయనుం డయ్యె నట్టిసమయమునం దా
నలుకుచుఁ దత్కాంతార, స్థలి కల్లన నరుగుదెంచె జర కురుముఖ్యా. 81

ఆ. అరుగుదెంచి యచటఁ దిరిగెడునొకవేఁట,కానిఁ గాంచి వాఁడు కమలనాభు
నొడలు సూచి తెంకి నున్న [2]యేణం బను, నట్లు సేసి మాయ యావహించె.

మ. ధరణీనాథ యతండు శాతశర ముద్యద్వృత్తి సంధించి యు
ద్ధురభంగిం దెగ నిండఁగా దిగిచి [3]యత్యుగ్రంబుగా నేసె నా
హరి శ్రీపాదతలంబుఁ దూరఁ గొని యయ్యస్త్రంబు మీఁగాల ని
ష్ఠురవేగంబున నుచ్చిపోయె వెస వాఁడుం జేరెఁ గైకొంటకున్. 83

క. చేరి తెలియఁ గనుఁగొని పెం, పారుపురుషుఁ డగు తెలిసింగి యత్యంతార్తిం
గూరి పడఁకి తచ్చరణాం,భోరుహములఁ దనశిరంబు వొందం బడియెన్. 84

క. పడి యేడ్చినఁ గృష్ణుండు దగు,నొడువుల నూరార్చి తనమనోరథ మిమ్మై
నొడఁగూడిన మానుష మగు,నొడలు విడిచి నిజపదంబు నొందుట కరిగెన్. 85

శ్రీకృష్ణుఁడు శరీరంబు విడిచి పరమపదంబునకుఁ బోవుట.

సీ. ఊర్ధ్వలోకమునకు నూర్జితతేజస్కుఁ, డగుకృష్ణుఁ డరిగిన నచటి దివ్య
మునివరులును సిద్ధులును రుద్రవసుమరు,దాదిత్యవిశ్వముఖామరులును
సంక్రందనుండును సంభృతసంభ్రము, లగుచు భక్తియు విస్మయంబు నెఱయఁ

---

1. త. నవిలంఘ్యమగునపాయంబు. 2. గ. యేణమునవియట్లు. 3. ఘ. [illegible]. 4. క. యత్యుగ్రం[illegible]

గా నెదుర్కొని చరణానతు లై పర, మస్తుతివాక్యముల్ విస్తరిల్ల
ఆ. బలసి రెండు దేవపతి యల్లఁ జేరి క, రములు మొగిచి ధర్మరక్షణమున
కై దయావిధేయ మగు ఖేలనంబున, నవని నవతరించి తాదిపురుష. 86
ఆ. అవతరించి కంసుఁ డాదిగాఁ గలదేవ, శత్రుకోటి నెల్ల సమయఁజేసి
భరతకులముకసటు వాపి సంశుద్ధప్రతిష్ఠఁ గూర్చి యరుగుదెంచి తీవ. 87
క. అమృతం బజరం బవ్యయ, మమలం బవితర్క్యమచల మాగమగమ్యం
బు మహాత్మ భవత్పద మ, య్యామేయతత్త్వంబుఁ బొందు మపరిహార్యగతిన్. 88
క. కృప నిట్లు యవతరింపుము, ప్రపన్నులగువారి యార్తిఁ బాపుట కై య
జ్ఞపురుష యుగయుగమున న, త్యపరిమితగుణాఢ్యరూప మభినుతి నొందన్. 89
క. అని సంస్తుతిఁ బలుకఁగ నువ, చనములు సత్యాదరం బెసఁగ వినినముకుం
దునిపైఁ బెల్లు గురిసె న, య్యనిమిషపతి పుష్పవర్ష మతులితభక్తిన్. 90
ఉ. అప్పుడు బ్రహ్మ వచ్చి హరియంఘ్రులకుం బ్రణమిల్లి భక్తిమైఁ
దప్పక చూచుచున్ మది ముదంబునఁ దేల సలక్షణస్వరం
బొప్పి చెలంగ నాగమికసూక్తులఁ బ్రస్తుతి సేసెఁ బ్రీతుఁడై
యప్పురుషోత్తముండు కరుణార్ద్రనిరీక్షణమున్ నిగుడ్చఁగన్. 91
సీ. అప్పరమేశ్వరుం డయ్యండజుని జూచి, యనిరుద్ధనామకం బైనయదియుఁ
ప్రద్యుమ్నతాప్రతిభాసమానమును సం, కర్షణభావ[1]వికాసితంబు
వాసుదేవాత్మక[2]వరరూపమున నేక, తావిధవత్సమాధానసిద్ధి
నొందించుకొంటి నానందబోధనిరంజ, నామేయమత్పదప్రాప్తి పరమ
ఆ. మంగళానుభూతి నంగీకరించెద, సుఖుల రగుఁడు మీరు సుకృతులార
యనినవచనసమితి యతిమృదుమధురత, నింపు నొసఁగ సురలు రెల్లవారు. 92
క. ఆదేవదేవుఁ డత్యం, తాదరసంభాషణంబు లమ్మెయి బ్రహ్మేం
ద్రాదులతోడ నొనర్చియు, నాదినిరవసాననిజపదావాస్థితుఁ డయ్యెన్. 93
తే. ఇంద్రియాగోచరుం డైనయీశు నపుడు
బుద్ధిఁ జూచుచు నిర్భరాద్భుతకరంబు
లగుతదీయగుణమ్ముల నభినుతించు
చరిగి రాత్మవాసముల కజాదు లెల్ల. 94

దారుకుఁడు పాండవులకు సకలయాదవక్షయంబు సెప్పుట.

సీ. అవనీశ వినుమంత నద్దారుకుఁడు సని, పాండవేయులఁ గని పరమమునులు
యాదవకులముఁ బేరలుకమైఁ దొల్లి శ, పించుట మును దలంపించి పిదప
జలధితీరమున నాసవపానమత్తులై, వృష్ణిభోజాంధకవీరు లెల్ల
మునివరనిర్దిష్టముసలాత్మకము లైన, ముయ్యంచుతుంగల మోఁదులాటఁ

1. గ. వికాసితము. 2. గ. వరరూపమున నేకతావిధవత్స మాధానసిద్ధి.

తే. చేర్చి రెయెండోఁ గుప్పులఁ బరిమార్చుటయును
రామకృష్ణులయునికియు నాము[illegible]రి
దన్నుఁ బుత్తెంచుటయు సవిస్తారభంగిఁ
జెప్పె వారలు వెనువగఁ జేడ్పడంగ. 95

తే. సర్వయాదవసంఘంబు చావు విన్న
ద్రౌపదీప్రముఖాఖిలాంతఃపురాంగ
నలును శోకించి యాక్రందనములు సేసి
రతికరుణముగఁ బురజను లార్తిఁ బొదల. 96

సీ. దారుకుం డత్యంతధర్మవినీతి మై, నర్జునుతో నన్ను నచ్యుతుండు
నినుఁ దోడి తెమ్మని పనిచిన వచ్చితి, నని చెప్పెఁ జెప్పిన నతనిఁ జూచి
యాదవకులవిమర్దయం బైనయొప్పని,పలుకు నావీనులఁ జిలుకునట్టి
యచటికి వేగంబ యరుగక యిచటఁ గాల్దన్ని యుండెడునట్టిధైర్య మెందుఁ
ఆ. గలదు నాకు నీవు పిలువ నే లని పల్కి, యున్నతోఁ దగంగ నాడియాతఁ
డక్కులాగ్రగణ్యు ననుమతితో ద్వారవతికి నరిగె శ్రీఘ్రగతి నరేంద్ర. 97

చ. అరిగి మగండు సచ్చినకులాంగనయుం బలె శశి గ్రుంకినట్టిశ
ర్వరియును బోల్పఁ బట్టగుచుఁ వారిజనాభుఁడు లేనిదీనతం
బొరసి కృపైకభాజనతఁ బొందినయప్పురిఁ జూచి మానసం
బెరియఁగఁ జొచ్చె నేటి కెదు రీదినచాడ్పున నేమి సెప్పుదున్. 98

క. దారుకుఁడు దోడఁ జనుదేఁ, బౌరజనము లంతఁ దన్నుఁ బరమాశ్వాసం
బారెడుమనములతోడను, గారవమునఁ జూడఁగా నగరికిం జనియెన్. 99

చ. చనుటయుఁ గ్రొత్తపేరడలు సైఁపఁగ లేక మురాంతకప్రియాం
గనలు పదాఱువేలును మొగంబులఁ గప్పఁగ బాష్పవారిరో
దనరవముల్ సెలంగఁగఁ బదంబులు దొట్రువడంగ దైన్యముల్
తనువులు దాల్చినట్లు దెరలం జనుదెంచిరి పార్థుపాలికిన్. 100

ఉ. వారలఁ గాంచి శోకమునివారణఁ జిత్తము వెల్లగింప న
క్కౌరవసత్తముం డెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచుం
దే రొకభంగి డిగ్గియులఁ దెళ్ళినయద్దురవస్థ జూచినన్
వైరుల కైన డెందములు వ్రయ్యలుగా వగ దాఁకు భూవరా. 101

తే. రోదనధ్వని లెసఁగంగ రుక్మిణియును, సత్యభామయు నప్పుడా సవ్యసాచి
కడకు నేతెంచి పుడమిపైఁ బడిరి పనట, వెల్లిమునిఁగి యుల్లంబులు వెగడునొంద.

క. తక్కను గలమహిషీజను, లక్కుంతీతనయుచుట్టు నవని నొఱగి లో
నెక్కొనినవగలఁ బొగిలిరి, దిక్కెవ్వరు మాకు ననుచు దీనత దోఁపన్. 103

క. వినుము ధనంజయుఁ డప్పుడు, దనుఁ దాఁ దేర్చికొని తొల్లితరుణుల నూరా

ర్చె నతఁడు దోడ్కొని హరిజనకునికడకుం జనియె దారుకుం డట్టిమొకన్. 104

సీ. యాదవుల్ సమసిన సంయోగవిభుండు కాక యుష్మత్పితాజనంబు
నందు దైన్యముతోడ మర్త్య తశోకస, మాకులత్వముఁ దోఁచె నస్త్రదీను
మకుచి త్తపుఁనవీక్రయూతువత్వము గన్న, యంతన కొందల మతిశయిల్లెఁ
గాన విశేషంబు గల్గదు కృష్ణుని, దశ యెట్టిదో యనుత్తల్లడంబు

ఆ. నెవ్వ రాకొక- దీని నెఱిఁగించువా రను, నెవ్వగయును గదిరెఁ గవ్వడికిని
సధిప దారుకానకు నట్లసుయ్య నాన్రుప్రు,కడ నెఱుంగువారుగాఁగఁ దాడు. 105

—అర్జునుఁడు సకలస్వజనక్షయదుఃఖితుం డగు వసుదేవునిం గాంచుట.—

క. తలఁకుచుఁ జని యతనిం గనఁ, బలువగలం బొగిలి సెజ్జపై మే నిడి య
శ్రులు గ్రమ్మనున్న యువ్విభుఁ, డలమట గ్రొత్తయయి మనసు నలమికొనంగన్.

ఆ. లేచి యడలి సవ్యసాచిఁ గౌఁగిటఁ జేర్చి, గద్గదిక నెలుంగు గడలుకొనఁగ
నడరి పెలుచ నేడ్చె నాఱుసీఁ బోయినప్రజలఁ బేరు గ్రుచ్చిపనవి పనవి 107

క. మనుజాధిపుఁ డమ్మెయి రోదన మటు సేయంగ నరుఁ డతని నూరార్చెఁ
విను మవ్వసుదేవుండి, ట్లను నాలుక దొట్రుపడఁగ నాతనితోడన్. 108

చ. మనుజులమాత్ర గాక సురమాన్యపరాక్రమ ముల్లసిల్లఁగా
దనుజులఁ దాఁకి గీటడఁచుదర్పమునం బెను పొంద మాఱు లే
క నెగడి రట్టిబిడ్డలు కకారణరోషమునం బరస్పరా
హననము కల్గి [1]చా వలసె నందఱు కక్కట దైవ మల్గినన్. 109

క. విను నీశిష్యులు సాత్యకి,యును బ్రద్యుమ్నుండు నిమ్మహాగ్రపుసమరం
బునఁ దొలుపీనుఁగు లై రని, వినియు బ్రదికినాఁడ నేన వీఁడ జగతిన్. 110

క. తొలితొలి సాత్యకికృతవర్మలు రేఁపఁగఁ బుట్టె సంగరము దానను వా
రల దూఱ నేల మునిము,ఖ్యులశాపం బిట్టిచేతకుం [2]దగి యుండన్. 111

చ. వలసిన నెట్టికార్యమును వావిరి నెట్టుగ నైనఁ జేయఁగా
వలఁతి మృతుం బరిక్షితుని వత్సలతన్ బ్రతికించె శౌరి యి
క్కులమున యాదవుల్ పెనఁగఁగాఁ గని మాన్పఁ డుపేక్ష సేసె నీ
పొలియు టవశ్యభావ్య మని బుద్ధిఁ దలంచుట గాన నయ్యెడున్. 112

క. ఇది విధివశత్వమున నై,నది యని శోకంబు దొఱఁగునట్టివివేకం
బొదవదు ఫల్గున యాఱడి, యదువంశం బెల్ల సమసె ననుపగపేర్మిన్. 113

—వసుదేవుఁ డర్జునునకు యాదవనాశనంబు తెలియఁ గెఱింగించుట.—

క. అనునెడఁ గ్రీడి యితఁడు కృష్ణును పేక్షయ చెప్పెఁ గాని శోక మడరియుం
బనవఁడు కృష్ణునిఁ గావున, ననుమానము వలవ [3]దమ్మహాత్మునికిన్. 114

సీ. అని మదిఁ జర్చించె నప్పు డవ్వసుదేవుఁ, డతనితో ననియె సశమ స్తయాద

1. క. ఛా వొలసె నందఱు కొక్కట 2. ట. దెగి యుండన్. 3. గ. దన్నహాత్మునికతికిన్.

వులును మహామునీం§ద్రు ఘోరశాపంబు, ఘనశక్తి నుద్భవిం§చినమహోగ్ర
ముసలంబువిలసన§ముస ముసలాయుధమ్మ,నము లైనతుంగల § సమదవృత్తి
నన్యోన్యవినిహతి § యాచరించి గతాసు, లగుటయు నొక్కండు § నతివసించు

ఆ. గరులఁ దురగములను § నరపంబులను గొని, యరుగుదెంచెఁ గృష్ణుఁ§డనిన నాథ
నంజయుండు దనమ§నంబు దల్లడిల్ల, నమ్ముగంకుఁ జెచటి § కరిగె నధిప. 115

క. అని యడిగిన వసుదేవుఁ డతని కిట్లను నట్లు వచ్చి § దామోదరుఁ డే
వినటం బొందుచు నుండఁగ, నను నూరార్చుటకుఁ గాఁగ § నరవర నాతోన్. 116

సీ. విధివశంబునఁజేసి § వృష్ణిభోజాంధక,నాశంబు నాటిల్లె § నరున కేను
జెప్పిపుచ్చినవాఁడ § నిప్పుడ యక్రూర,వాగ్రణి యుప్పురి § కరుగుదెంచు
నీయొక భక్తుండు § నినుఁ గొల్చి యుండెడుఁ, బనిచినపని యొన§ర్పంగ వలతి
యమ్మహాభుజుఁడు కా§ర్యజ్ఞుండు శౌర్యప,యుగ్రుండు విక్ర§మసమహితుఁ డతఁడు

ఆ. నాఁగ నే ననంగ § నరనాథ భేద మిం, చుకయు లేదు వినుపు § శోక మతనిఁ
జేతఁ బట్టి నీవు § మాతంగతురగాది,కములబంధుజనులఁ § గాచికొనుము. 117

క. అతఁడు వనితలను బాలుర, నతిప్రయత్నమున నరసి § యాపద బాపుఁ
ధృతిసారమహిత యంబుధి, కతిపయదినములను ముంపఁ § గల దిప్పురమున్. 118

సీ. యాదవుల్ దమలోన § నాహవం బొనరింప, కటమున్న బలదేవుఁ § డడవి కరిగి
యత్యంతనిష్ఠమై § నధికతపోవర్తనంబునఁ దగిలి యు§న్నాఁడు నాకు
నదియ యొప్పెడు తెరు § వై యుండుఁ గర్తవ్య, మిట్టిది వేయును§నేల యింక
నొండువిచారంబు § లుడిగి దయాలోల, యనుమతి సేయు మ§ప్పనికి నన్ను

తే. నా ధనంజయుచెప్పిన§యట్ల సకల
కార్యజాతంబు నడపి నె§గడు మతండ
సమరమృతయాదవుల కెల్ల § సముచిత ప్ర
కారమునఁ జేయు నగ్నిసం§స్కార మనియె. 119

క. అతఁడు కాలాంతరమున, బ్రాఁతిగ భవదీయభవ్య§పరలోకవిధుల్
చేతోగతి భక్తిపరిస్ఫీతములుగఁ జేయు ననియుఁ § జెప్పెఁ గుమారా. 120

క. చెప్పిన నేను నొడంబడి, యప్పురుషోత్తముని నెమ్మి § ననిచితి నిట నీ
చెప్పినయట్టులు సేయుట, యొప్పైనను గలదు నీకు § నొక్కఁడు సెప్పన్. 121

ఉ. పీడఁగు పెంటగాఁ బడిన§బిడ్డల నెల్లఁ దలంచు చుప్పుడున్
మానఁగ రాదిం తెల్ల మిది § మానసముం గలఁగింప నన్నయుం
బానము నెమ్మెయిన్ రుచికిఁ § బట్టగు నట్లును గాక యుద్దెసం
దానిఁ [1]సహించి యేమిగతిఁ § [2]దావుకొనన్ మెయిఁ బ్రాణ మర్జునా. 122

క. [illegible] వనితలఁ బ్రజలకు దం,తావళముఖవస్తువులను § దగుచందమునన్

1. [illegible]సహించి. 2. క. గ. చ. దావికొనన్.

నీ వరసికొనుము బాహులు, శ్రీవిభుని ǂ కృష్ణునుపు ǂ చెల్లింపవగా. 123

సీ. అన విని ఫల్గునుం ǂ డాస్పృష్టిపతిహృద,యము దేహాంతరసేతుఁ ǂ మగుడ వెఱచెంగి
దొంకంబు నెవ్వగఁ ǂ బొంది నమ్మేదినీ,రమణుతోఁ గృష్ణసోదరహిత మైన
యుద్దేశమున వసియుంపంగ నాకుఁ జి,త్తము గొల్పునే ధర్మతనయభీము
లును నేను మాద్రినందనులును బాంచాలి,యును నేకచిత్తుల ǂ మనఘ వినుము

తే. ధర్మతనయుఁ డికార్యంబు ǂ దలఁచి యున్న
నిశ్చయించి బాలకులను ǂ నెలఁతపింపుఁ
దగుధనమును నింద్రప్రస్థనగరమునకుఁ
జేర్పవలయుట మాకెల్లఁ ǂ జెప్పినాఁడు. 124

ఉ. కావున నప్పురంబున సుఖస్థితి నుండెడునట్లు గాఁగ బృ
థ్వీవర సంప్రయత్నమున ǂ వీరల నందఱ నంద పెట్టెదన్
నీవు పురస్సరుండ వయి ǂ నెమ్మిఁ జనం గొనిపోయెదన్ భవ
ద్భావమునుమ్మలంబుఁ బెడఁబాపుము తప్పునె దైవకృత్యముల్. 125

క. అని పలికి దారుకునిఁ గనుఁగొని యాతనిచిత్తవృత్తి ǂ గుందుట బుద్ధిం
గని యిట్లనుఁ గృష్ణునిపోయినవంక నెఱింగి పోద ǂ మేనును నీవున్. 126

ఉ. ఇచ్చటికార్యముల్ నడపుఁడి ǂ ట్లని నెమ్మి నమాత్యకోటికిం
బొచ్చెము లేక చెప్పి మఱి ǂ పోవుట యుక్తము నిల్చి వారలం
దెచ్చుట కీవ పొమ్మనిన ǂ దిగ్గన నాతఁడు పోయి యందఱం
దెచ్చె సుధర్మ యన్సభకు ǂ దేవపతిప్రియసూనుఁ డుండఁగన్. 127

సీ. అమ్మండపమ్మున ǂ కరిగినయమ్మంత్రి,వర్యులకౌరవవంశవర్యు
వినయ మారఁగఁ బరివేష్టించి రమ్మహా,త్మ్ముండుఁ గరమునునార్ద్రుఁడగుచు
గారవంబున వారిఁ ǂ గలయఁ గనుంగొని, యంతరంగంబు ǂ శోకాగ్ని నెరియ
వారలతో నిప్డు ǂ పౌరజనంబుల, నెల్లను బిలిపింపుఁ ǂ డేను మీకు

తే. వారికిని నెఱిఁగింపంగ ǂ వలయునట్టి,పనులు గల వని చెప్పిన ǂ విని రయమున
వారు బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రు, లాదిగాఁ బ్రజ రావించి రధిపముఖ్య.

తే. అరుగుదెంచి యాప్రజ లుచితాసనమున
నున్నయయ్యింద్రనందనుఁ ǂ గన్న నతఁడు
గరము నెమ్మి నయ్యందఱఁ ǂ గలయఁ జూచి
యి ట్లనియె మోమునను దైన్య ǂ మొసఁగ మెసఁగ. 129

క. వననిధి నేఁటికి నేఁడవ,దినమున నిప్పురము ముంచు ǂ దివిజులు గగనం
బుననుండి చెప్పఁగా నే, వినినది యిది వెడలవలయు ǂ వేగమ మనకున్. 130

క. వినుఁ డింద్రప్రస్థపురం,బునకు నధీశుఁడుగ వజ్రుఁ ǂ బోఁడిమితోనే
నునిచెద మీ రెల్ల నతఁడు, మనుపంగాఁ దొంటియట్ల ǂ మనుఁ డచ్చోటన్. 131

క. సరకులు భారవహులకును, భరియింపఁగఁ గొలఁది యయినభంగిని మోపుల్
వెరవుపడఁగఁ గట్టుఁడు సె,చ్చెరఁ శకటములాయితంబు సేయుఁడు మీరల్. 132

ఆ. వాహనములు వానివాని[1]ముట్లు నొక్క,వంక నొనర్చి నలసినపుడ
కట్టి వెడలి పోవునట్టితెఱంగున, కనువు గాఁగఁ జేసికొనుఁడు వేగ. 133

క. ఈదేశము ప్రజ ధర్మజు,నాదరసంభావనముల నాజ్ఞాసిగతిన్.
యాదవవీరుల కలనాఁ, డేది తెఱం గట్టిమునికి యొసఁగఁ బోరున్. 134

క. అని చెప్పి పురజనులఁ బోఁ, బనిచి సచివకోటితో నిశ్చయము లాదిగ నా
హనముల సవరణ బెరయం, గొని రాఁ దగినపరిచారకుల మునుముట్టన్. 135

క. నియమింపుఁడు నగరిసరకు, లయినవి యిట్టిట్టిభంగి నక్షీణము లై
యొయిదం గలవారలఁ గని, పయనము తెఱఁగు సమకట్టునని మఱవకుఁడీ. 136

క. సుందరులకు బాలురకును, నందలములు వేసడములు నాయితములుగాఁ
గందక కుందక చనువిధ, మొందఁగ సమకట్టుఁ[2] డెడలకుండుఁడు తాల్మిన్. 137

తే. గతము లయిన కార్యంబులు గ్రమ్మఱింప, రాదుగాన మనకుధర్మరాజుగలఁడు
క్షేమజనరక్ష కొడయనిఁ జేయవచ్చు, వాసుదేవునిమనుమని వజ్రదేవు. 138

క. అని వారి నిండ్లకును బోఁ, బనిచి మదిని వగలు మిగులఁ బార్థుం డారే
యనవద్యచరిత కృష్ణుస,దనమున వసియించె సముచితప్రవృత్తమునన్. 139

చ. తెలతెల వేగునప్డు వసుదేవుఁడు నిర్మలయోగనిష్ఠ మే
నిల నిడి వర్ణనీయగతి నేఁగినఁ దత్సదనాంతరంబునం
జెలఁగె ననేకరోదనవిశేషము లవ్వసుదేవవల్లభల్
నలువురు నెమ్మిఁ గూడి మరణంబున కై కయిసేసి రత్తఱిన్. 140

—వసుదేవుఁడు శరీరంబు విడిచి పరమగతికిఁ బోవుట.—

సీ. ఆసమయంబున నర్జునుఁ డచటికి, నేతెంచి వైభవ మెసక మెసఁగఁ
బ్రాలంబమాలికాపంక్తులఁ గదళికా, స్తంభంబులను శాతకుంభకలశ
శిఖరంబులను బెంపుఁ జెలువును విలసిల్ల, యానంబు గల్పించి యాదవేంద్రు
శవము సుస్నాతంబు జందనచర్చాప, మేతంబుఁ జీనాంబరాతిశోభి

తే. తంబు నాభరణస్ఫురితంబు మాల్య,యోజితంబును గాఁ జేసి యాజకప్ర
యుక్తమంత్రతంత్రస్ఫుటహోమ మింపా,నర్పనేతెంచె సామగానంబు సెలఁగ.

క. విను దేవకియును రోహిణి,యును భద్రయు మదిరయును సముచితవిధానం
బున నొనరించినయానము, లనూనపరికర్మరుచిర లయి యెక్కెఁ దగన్. 142

క. చెలులుం జుట్టలు దాపట, వలపట నేతేరఁ దెలివు వదనసరోజం
బుల నొప్పం దగియెడుమా,టల వారలవగలు మాన్పుటలు నుతికెక్కన్. 143

క. ఆనృపునివల్లభలు శవ,యానంబుపిఱుంద నిట్లు యరిగిరి విధి స

1. గ. వానిముట్లును నొక్క. 2. జ. డోడకుండుఁడు.

న్మానితగతి ముందట వి,ప్రానీకము సనియె నుజ్జ్వలాగ్నులు గొంచున్. 144

తే. ద్వారకావాసు లెల్లను దల్లడంబు, నుల్లములఁ గప్ప మోములను సురుల బాష్ప
ధార లతికరుణమున హాహారవంబు, లెసఁగ నేఁగిరి [1]వెనుక ననుసరు దెసలను. 145

సీ. ఇమ్మెయిఁ గొని చని యమ్మహీశుఁడు వేడ్క, మెలఁగెడు తోఁటలో పలసమగ్ర
చందనాగురుకాష్ఠచయముల మున్న కా,వించినసాదకు సద్విధియుతముగ
నప్పాడె చేర్పించి యర్జునుఁ డయ్యాద, వేంద్రుని పితృమేధ మెల్లజనులు
నభినుతి సేయంగ నచ్చితియం దాశ్వవంబు నారోపింపఁ బనిచి యగ్ని

తే. దీప్త మగునట్లు సేయింప దేవకీప్ర,ముఖులు నలువురు నప్పు డా శిఖిఁ బ్రవేశ
లీల నంగీకరించి రా బాలవృద్ధ, మైనసకలజనంబులు నార్తినొంద. 146

క. ఘృతములు పైఁ జల్లఁగ న,చ్చితి చేర్చిన సప్తజిహ్వశిఖలరవము నూ
ర్జితసామగాననాదో,ద్గతియును హాహారవంబుఁ గలసి చెలంగన్. 147

క. తదనంతరంబ వజ్రుఁడు, మొదలగుపురుషులు సతీసమూహముఁ దగుమై
నుదకప్రదానవిధి య,య్యదుముఖ్యుల కాచరించి రన్వయముఖ్యా. 148

తే. అప్పు డందఱు బంధుల నాదరమునఁ, దనుసముచితాలాపసంతానకలన
ననునయించి పురంబున కరిగెఁ దాను, వారు వగ మదిఁ గదుర విశ్వాచ్ఛుఁడధిప.

తే. ఇత్తెఱంగున సత్క్రియా[2]యత్తుఁ డైన,యర్జునుఁడు పితృమేధము నభినుతముగఁ
జలిపి వృష్ణిభోజాంధకసమరధరణి,తలమునకు బుధజనసహితంబు గాఁగ. 150

సీ. అపరదినంబున నరిగె నప్పుడు వృద్ధ,బాలకాంతాజనప్రకరములకు
నని నిర్గతప్రాణులై పడి యున్నభో,జులను నంధకుల వృష్ణులను గలయఁ
జూడంగ నుత్కటశోకంబు గదిరిన, నఱిముఱి మేదిని నొఱగువారు
విప్రలాపంబు నానాప్రకారంబులఁ, జేయువారును నిరు చేయు నెత్తి

తే. యలఁత నాక్రందనములు హాహారవముల
తో నొనర్చువారును నైన నానరుండు
దద్ద యడలి దారుకు భాషితములఁ దేఱి
యఖిలజనులకు నుపశమ మావహించె. 151

క. తదనంతరంబ రణమృత,యదుసంఘములకు సమంచితానలసంస్కా
రదశాపూతత్వము నా,విదితయశుఁ డొనర్చె విప్రవితతిఘటకుఁ డై. 152

ఆ. నిఖిలబంధుజనుల కఖిలమృతులకును, దగఁ దిలోదకప్రదాన మాచ
రించునట్లు గాఁగఁ బంచి యలుప్తక్రియత్వ మొనర నడపె నకిరీటి. 153

క. ఇవ్విధమున విశ్రుతముగఁ, గవ్వడి నియతుఁ డయి బంధుకార్యము లెల్లన్
సవ్వగలు దనమనంబున, నివ్వటిలఁగ నాచరించె నృపసంసేవ్యా. 154

1. క. వెనుక నిర్దేశల నధిప. 2. క. వృత్తుఁ డైన.

—అర్జునుఁడు రామకృష్ణుల వెదకుచు వనంబునకుఁ బోవుట.—

సీ. పదపడి యాదవ§భామినీబాలక,వృద్ధజనంబు నా§మగ్నబుద్ధి
గలయంగఁ గనుఁగొని § పలుకుల మార్దవ, మారఁ బురంబున § కరుగఁ జెప్పి
రామకృష్ణులు తపో§రతులై ప్రవర్తించు,వనభూమి యారసి§కొని తదీయ
సందర్శనమునకుఁ § జనియెద నని వారి,నామంత్రితులఁ జేసి § యేమి యనుచు
ఆ. టకును శోకమార్పు§టకును దారుకుఁ డాది, యయిన తగినవారి § సర్వవచన
రచన మెఱయఁ బనిచి§యుచితాప్తకతిపయ, జనులు దోడ రాఁగ§జనియె నధిప.
క. చనిచని మనమున ని ట్లను, నసుఁ బిలువఁగఁ బనిచి జనకు§నకుఁ గావలి గా
నునిచినవాఁ డయి నెమ్మదిఁ, జనినహరికిఁ జావు సెప్పఁ § జనియెద నకటా. 156
సీ. ఆ రాజు సచ్చుట § నారాయణున కేల, సెప్పఁ దపోనిష్ఠఁ § జెంది యున్న
యమ్మహాత్మునిహృద§యము నకు మెరమెర, వుట్టింప నేటికిఁ § బోయి కాంచి
పంచినపని యాచ§రించెదఁ గాక స,వినయభక్తికముగ § ననుచు మఱియు
వివిధచింతారూప§విధులు చిత్తమ్మునఁ, బొఱ గాంధారిశా§పంబు తెఱఁగుఁ
తే. దలఁచి యయ్యవ్వ యతఁ [1]డగ్గ§తంపుఁజోట
నరయ ది క్కెవ్వరును లేని§యట్టి తెగుట
నొందఁ గలవాఁడుగాఁ బల్క § నొద్ద నుండి
వింటి నకట నిప్పను జెవ § లంటు నొక్క. 157
క. అనుచుఁ బెనుఁగలఁక నొందిన,మనంబుతో వలయుదిక్కు § మతి నరయక వే
చను చుండె నొండుదెస కే, మనఁ గలదు విధాతచేఁత § కడ్డముగలదే. 158
క. విను మనుచరు లాతనిమో,మునఁ దోఁచువిషాదభావ§ముం గని వెగ డొం
దినవారన నట్లు గా ది,ట్లని చనియెడువంక సాల § రై రెఱఁగింపన్. 159
ఆ. అట్లు దిక్కు దప్పి § యడవిఁ బోపలఁ గొన్ని,దినము లిట్టు నట్టుఁ § దిరుగ నొక్క
బోయ నూఁచి యెం క c § బోయెద రనవుడు, హరి తపంబు సేయు§నచటి కనిరి.
క. అని విని యొక్క డొక్కఁడు, గనుఁగొంటిం గృష్ణుఁ జూపఁ§గా వచ్చెద నా
వనభూమి నాతఁ డింకొ c, జనునో నిలుచునో యెఱుంగఁ§జను దెండనుచున్. 161
తే. అక్కిరాతుండు సన నాని § ననుగమించి
వెన్నురుచిరదేహము పడి § యున్నచోటు
సేరి తెలియంగఁ జూచి మూ§ర్ఛిల్లి పుడమిఁ
బడియెఁ గవ్వడి యనుచరు § లడలు నొంద. 162

—అర్జునుఁడు రామకృష్ణుల కళేబరంబులు సూచి పలవరించుట—

క. మఱి కొంతసేపునకుఁ దె,ప్పిఱి లేచి ముకుందుమేను § పెద్దయునుం బ్రో
ద్దిఱియం గౌఁగిటఁ జేర్చెం, బఱివోయినతాల్మి నూమ్మ§బాష్పము లురులన్. 163

1. 'డగ్గతంపుఁజోట' అని పెక్కుప్రతులు.

క. అను చరులలోని భూసురు, లను నయవచనములఁ దేర్ప నతఁ డంకిలి దే
ఱినమతితో నశ్రులు మఱి, యును గ్రమ్మం గరతలమున నొత్తుచుఁ జూచున్.

ఉ. ఏమిట నిట్టు లయ్యెనొకొ యిమ్మహితాత్మకుఁ డంచు నున్మిష
ద్ధామము లైన యంగములఁ దాఁ గలయం బఱికించి యోగిహృ
ద్యామలపాదపద్మగత [1]మైనవిశేషము సూచి రుద్రతే
జోమయుఁ డైనసంయమివచోగతి గాంచి సువిస్మితాత్ముఁడై. 165

క. అవికృతమును రుచిరమునై, యవయవములు నిమురవోయినప్పటి క్రియనుం
డ వఱలుకృష్ణుని దేహం, బవిరతచక్షురభిముఖత నాలోకించెన్. 166

ఉ. అమ్మెయి నూరకుండ ననుయాయిజనమ్ములు పెక్కు లాడి చి
త్తమ్ముకలంక దేర్చి యుచితక్రియకుం మొగకొల్పి బంధుసం
ఘమ్ముల నిందుఁ దెత్తెమొ వికారవిదూర యుపేంద్రభవ్యదే
హ మ్మిట గొంచుఁ బోదమొ సమర్థవిధం బొకఁ దేర్పరింపుమా. 167

చ. అని యడుగంగ దైవగతి సంబుధి పట్టణ మాక్రమించు నీ
ద్దినమున నొక్కొ యన్యగ మదిం జొనిపెం గురునాథ యప్పు డ
ద్వినుతగుణాభిరాముఁ డడవిం దమత్రిమ్మటఁ జన్నప్రొద్దు ల
య్యనుచరకోటితోడఁ దెలియం దలపోయఁగ లెక్క దోఁచినన్. 168

క. మఱునాఁడ యగుట లెస్సగ, నెఱిఁగె నినుం డపుడు వేఁడి యొసలినదీప్తుల్
దఱఁగలిగొనఁ బశ్చిమగిరి, చఱికి ననతిదూరమున విశదుఁడై తోఁచెన్. 169

సీ. దాని కజ్జనములుఁ దాను నుత్తల మంది, చర్చించి కార్యంబుచాయఁ గాంచి
మనము కృష్ణునిఁ గని చనుదెంచినార మై, పురమున నివ్వార్త పుట్టకుండ
నడఁచి [2]యప్పటిమాటలవి కొన్ని [3]ఘటియించి, చెప్పియుం రేయి సెచ్చెరఁ బ్రయాణ
మునకుఁ గృత్యము లగుపనులెల్ల సమకట్టి, వేగంగ గ్రక్కున వెడలవలయుఁ

ఆ. గాని వెడల కున్న భానూదయంబున, వనధి పురము ముంచికొనిన గణన
సేయరానియట్టి సేగియు ప్రత్యవాయంబు వగయు నెల్లభంగిఁ గలుగు. 170

అర్జునుఁడు రామకృష్ణులకు నగ్నిసంస్కారంబు సేయుట.

ఉ. కావున వేగ మగ్నియును గాష్ఠములుం సమకూర్చి సద్విధి
శ్రీ విలసిల్లఁ గృష్ణునిశరీరము సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱం
బోవుట బుద్ధి యంచు మఱి భూసురకోటియుఁ దాను గాఢసం
భావనతోడఁ జేసె దృఢభక్తికుఁడై పితృమేధభద్రమున్. 171

చ. హలధరునిం దలంచి మును లాడినమాట తెఱంగు దప్ప దం
చలయక తత్ప్రదేశమున నారసి కాంచి తదీయ దేహముం
బలయు తెఱంగునం బరమవహ్నికి నాహుతి సేసె నయ్యనా

1. గ. మైనవిభేదము చూచి. 2. గ. యప్పటిమాట. 3. క. గణియించి,

కులహృదయుండు భూమిసురకోటియుఁ దాను సత్వరంబుగన్. 172

సీ. అబ్బంగిఁ గృతకృత్యుఁ డైనయప్పార్థుండు, యాదవపురమున కరుగుచున్న
యెడ ననుచరులతో నిట్టికార్యంబును, నడపక తక్కిన నాథుచన్న
గతికిఁ బోవుటకునై కడఁగెడురుక్మిణీ, ప్రభృతుల మనకు నిశ్చల్పంగ వలెమె
రే యెల్ల నిప్పని సేయువిధములక, వ్యయ మగు నంతకు వచ్చునబ్ధి

ఆ. మేలు సేయఁ బోయి యాలోక మంతయుఁ, దిట్టునట్టికీడు దెచ్చికొనఁగ
వచ్చునే స్వదేశవర్తుల పై చూచి,కొండ మెల్లపనియు రండు వేగ. 173

తే. అనుచు నరిగి తాఁ దలఁచినయట్ల యెల్ల
తెఱఁగుపనులు నారాత్రిలోఁ దీర్చి ప్రొద్దు
పొడుపునను మున్న వెడలించెఁ బురముసకల
జనములను జీవధనముల సరకు నతఁడు. 174

సీ. అప్పుడు కృష్ణునియంతఃపురాంగనా,జనము షోడశసహస్రమ్ము నతని
మహిషీజనుల రాముమహిళల నుచితవా,హనముల నిడికొని యర్హపురుషు
లేతేరఁ దేరుల నేనుంగులను గుఱ్ఱ,ములను దత్పరిచారకులు ప్రయత్న
మున సవరణతోడఁ గొనిరా నగరిసర,కులుఁ దదీయాధికారులు బహుప్ర

ఆ. కారశకటములను గావళ్ళ నెత్తించి, యరసికొని కడంక నరుగుదేర
విగతనాథ లైనయగువల గారాము, సెడక యుండునట్లు నడపికొనుచు. 175

క. విను వజ్రముఖ్యయాదవ,జనము నుచితవృత్తి నడపి సర్వంబున క
య్యనఘుండు దాన దిక్కయి, చనియె నరదమునను మది విషాదము గదురన్.

క. ఇమ్మెయి నరుండు సకలజ,నమ్ము వెడల నిచ్చు పూర్వనగ మెక్కను వే
గమ్మున ముంచికొనియె నగ,రమ్ము పయోరాశి భరతరాజవరేణ్యా. 177

ద్వారకానగరంబు సముద్రమున మునింగిపోవుట.

క. వననిధి పురంబు ముంపఁగ, మనుజేశ్వర యెల్లజనులు మరలఁబడి కనుం
గొని యద్భుతరసపూరం, బున పెన్నిట్టఁ దమచిత్తములు మునుఁగంగన్. 178

తే. అపుడు రెండవజలనిధి యనఁగఁ జాలి
యద్భుతోద్భూతవాక్యచయంబు పెర్మి
మ్రోయునాజనసంఘంబు రవిరోధి
మఱఁది నడపించె దర్శితమార్గుఁ డగుచు. 179

క. నడపించి పంచవటమున, విడియించెను వీఁడు చోరవీరులు గని యె
క్కుడుధనములు గల వీమ్రుక్కడిప్రజలో లేరు దీనిఁ గావఁగ యోధుల్.

క. కవ్వడి యొక్కఁడ కంటిరె, చివ్వనఁ జేరుద మితండు సేడ్పడఁగా నిం
దెవ్వరుఁ గడంగ లేరివి, ద్రవ్వపడినధనము లెఱిగితిమి లోఁ దెల్లన్. 181

క. అని వారొండొరువులతో, మనముల నుత్సాహ మెసఁగ మానితధనముల్

గొనునగ్గలికం బలుకుచు, ననేకబలకోటు లగుట నలు కేది వఱిన్. 182

క. బాలురు వృద్ధులుఁ జూడ్కి, యాలమునకుఁ గడఁగ నొక్కఁడయినను లేఁడీ
స్త్రీలం బొదువుద మనుచును, నేల యవిసి మూఁగినట్లు నిర్భరభంగిన్. 183

క. ఏ పెనఁగ రేఁగి యట్లు, ప్పాపాత్మక మగుకిరాతబలము సమగ్రా
టోపమునఁ గవిసి వివిధధ,నాపహరణ మాచరింప నారంభించెన్. 184

బోయ లర్జును నోర్చి యాదవాంగనలసొమ్ముల నపహరించుట.

సీ. కనుఁగొని జంభారితనయుఁడోరోరి యీ
ప్రజ కేన చుండు సంరక్షకుండఁ
దొలఁగి పొం డడియాస దొద్దకుఁ జొచ్చినఁ
దల లేఱి యుర్వికి బలి యొనర్తు
నని యదల్చినను వా రఱవాయి గొనక య
ప్పలుకు లన్నియును రజ్జులుగఁ గొనుచుఁ
జామల నచటనచ్చట నొల్చికొనఁగ నా
లోకించి యవ్వీరలోకవరుఁడు
తే. గాండివం బెక్కు వెట్టి ప్రచండబాణ
నికర మక్కాతులమీఁద నిగుడఁజేయ
నలఘుచర్మసంవృతగాత్రు లగుచుఁ దుచ్ఛ
బాణపాషాణలగుడముల్ పరఁగఁ జేసి 185

క. ఆబోయలు నిర్భయమతు. లై బీభత్సుపయిఁ గవియ నతఁడు మహాస్త్ర
ప్రాబల్యంబును మెఱయుటఁ, దా బుద్ధిఁ దలంచి మంత్రతతి దోఁపమికిన్. 186

క. ఇది దైవవిరోధం బని, మది దా నూహించి ప్రకృతిమార్గణములు బె
ట్టిదముగ నేయఁగ నవియుం, దుదిముట్టఁగ రిత్తలయ్యె దానలు నరేంద్రా. 187

సీ. అప్పుడు కాలపర్యయమున కాశ్చర్య.మును విషాదముఁ దనమనములోనఁ
బిరిఁగొన బాహువిస్ఫురణకోదండదం,డమున నాబోయల సమదవృత్తి
నెట్టకేలకు నొకయెడ మాన్చి రుక్మిణి, యాదిగాఁ గలకృష్ణునగ్రమహిషు
లెనమండ్ర బలదేవువనితల మఱియును, గతిపయయాదవాంగనలఁ గాచెఁ
తే. దక్కఁగలయింతిగముల నాదస్యు లడరి, పట్టికొని యేచి వీడ్లు బన్నపడఁగ
దొద్దగొని రథకుంజరతురగతతులు,దమకు వలనకునికి దిగఁ ద్రావి చనిరి. 188

క. ఇమ్మాడ్కిం బఱిపోయిన,యమ్మొత్తము నడవికొనుచు నతిదైన్యము చి
త్తమ్మలఁపంగఁ గురుక్షే,త్రమ్మునకుం జనియె నరుఁడు ధరణీనాథా. 189

క. చని యచటనచటఁ దన్నుం, గనునాప్తజనంబుతోడఁ గాలవశత్వం
బున బొందినయద్దశఁ దగ, వొనర నతఁడు సెప్పెఁ బొచ్చె[1]మురివినమదితోన్.

---

1. గ. మారిలినమదితోన్.

సీ. కోపించి గాంధారి । శాప మిచ్చినయది, యాదవసంతతియ । మగుట యెట్లుఁ
దప్పదు మనము తద్బాలవృద్ధస్త్రీజనంబుల నెల్ల నర్థాంబు లైన
తావుల [1]సత్ప్రతిష్ఠావిశేషంబులఁ గాఁ జేయవలయు నక్కాలమునకు
[2]నోదవి యత్తెఱఁగున । కుత్సహించుట కృత్య, మర్జున నీ కనియాడుచుండఁ
ఆ. బలుమఱును దలంచి । పాండవాగ్రజుఁ డది, కారణముగ నతని । కరుణపెంపు
నొప్పు నెఱుఁగుఁ గాన । యప్పార్థుఁ డయ్యెను, నికర శేషజనుల నెమ్మి నిలిపె. 191
సీ. నిలిపిన తెఱఁగెల్ల । నృపవర చెప్పెద, విను కృతవర్మనందనునిఁ జూచి
నీతల్లియును నీవు । నీతోడఁబుట్టిన, వారును మృత్తికావతపురమున
నిలుఁ డని బహుసంపదలఁ బొల్చునప్పట్టణంబుఁ దదీయ దేశంబు నిచ్చి
యభిషిక్తుఁ జేసిన । నాతండు నిజపరిజనములుఁ దాను హర్షం బెలర్ప
తే. నందుఁబోయె సరస్వతి । యనఁగఁ బరఁగు
ఘననగరమున సాత్యకితనయు నట్ల
నెయ్యమును గారవంబును । నెఱయ నిలిపి
యనుప ముదమున నందుల । కతఁడు సనియె. 192
సీ. తక్కటివారి నింద్రప్రస్థనగరంబు, నకుఁ గొని చని వజ్రు । నాథుఁ గాఁగ
నందుఁ బట్టము గట్టి । హస్తితురంగర, థంబుల విభజించి । తగినభంగి
నమ్మువ్వురకును సమర్పితంబులు సేసి, యయ్యాప్తబంధుల । నందు నందు
నందును నిలుచున । ట్లొందఁగ నియమించి, యక్రూరుభార్యల నాత్మజులను
తే. వజ్రునకు నప్పగించె నవ్వాసుదేవుపౌత్త్రుఁ డతివినయంబునఁ । బట్టువఱుప
వారు నిలువక పోయిరి వలచు నెడకు, దాని విని యూరకుండె భీమానుజుండు.

అర్జునుఁడు రామకృష్ణులనిర్యాణంబును యాదవస్త్రీల కెఱిఁగించుట.

క. యాదవకుటుంబముల నత్యాదరమున నట్లు నిలిపి । హలధరుఁడును దా
మోదరుఁడుఁ దెగుట వారల, గాదిలిపొలఁతులకుఁ జెప్పఁగాఁ దలఁచె మదిన్. 194
చ. తలఁచి యతండు మందగతిఁ । దానును సర్వజనోత్కరంబువా
రలకడ కేఁగి శోకవిధురం బగుచిత్తముతోడఁ దారు గా
నల కటు వోయి పంకరుహనాభుని రాముని రోసి పల్దినం
బులు భ్రమ సంచరించుటయు బోయ దమ్ముం గని యార్ద్రచిత్తుఁ డై. 195
క. కందువచోటికిఁ గొనిపోవం దారుకుఁడయుఁ జెప్పి । వనట గదిరినఁ
డెందము గలంగఁ గన్నీ, రందంద మొగంబుమీఁద । నగ్గల మురులన్. 196
సీ. తల వాంచి యేమియుఁ బలుకక యప్పార్థుఁ, డున్న నయ్యువిదలు వెన్నుఁ డూర్ధ్వ
గతి కేఁగు టెఱిఁగి శోకము మూర్ఖలొందిన, తెఱఁగునఁ బొగిలియు । ధీరభావ
మాత్మల నెలకొన్న । నన్న నీ విం తేల, యడలెదు కాలపర్యయము నుడుప

---

1. క. సంప్రతిష్ఠావిశేషంబులఁ. 2 జ. నొదవిన తెఱఁగున నుత్స.

వశమె యెవ్వరికిని ‡ వార్తలకొలఁదిఁ జెప్పెదము మాకు ననుడు నప్పుణ్యచరితు

ఆ. డడవిలోన నేము ‡ దడసినదినము లన్నియు గణించి యంబు‡నిధి పురంబు
రేపకడయ ముంచు ‡ నేపాట నిమ్ముఖు, వచ్చునెడరుదలఁగు ‡ వారమొక్కొ. 197

చ. అనుతలఁ బాత్ర నొందుటయు ‡ నప్పటి కద్దెస మీకు నెల్లఁ జె
ప్పిన యుచితంపుభంగులకుఁ ‡ బెద్దయుఁ బ్రొద్దు సనంగ నప్పురం
బున గలవిప్రముఖ్యజన ‡ ముల్ పయనంబున కర్హ మైనవ
ర్తన మొనరింప లేమి జల ‡ రాశి మునుంగుదు రట్లు గావునన్. 198

చ. హరికిని రామదేవునకు ‡ నర్హవిధానము లాచరించి యె
వ్వరికిని జెప్ప కెల్లపరి ‡ వారముఁ బౌరులు సామజాదులున్
సరకులు నాయితంబు లగు ‡ సంఘటనం బొనరించి నాఁటికిం
గర మవధానయుక్తి సమ ‡ కట్టితి నెవ్వగతోఁ బ్రయాణమున్. 199

తే. వినుఁడు యాదవభామినీ ‡ వృద్ధబాల,జనుల నందఱ ననుచితవ ‡ ర్తనము తోడఁ
బ్రొద్దువోడువక మందర ‡ పురజనప్రయుతముగాఁ బురివెలువరిం ‡ చితిఁ గడంగి 200

ఆ. దానఁ జేసి మీరు ‡ నేనును బ్రుయ్యఁ బాపంబు లేక వెడలఁ ‡ బడితి మిదియ
తల్లులార కరము ‡ తప్పయి తోఁచుట, నుల్ల మలఁత పేర్మి ‡ నురియుచుండు. 201

క. వినుఁ డీతప్పిన దోషము, దనుకక యుండంగ నన్ను ‡ దయతోఁ జూడుం
డనుచు నిలఁ జాఁగి మ్రొక్కినఁ, గని యందఱు నెత్తి యతని ‡ గారవ మెసఁగన్.

క. ఊఱార్చి యింక నుచితా, చారంబులు నడపుటయు యి ‡ చటఁ గృత్యము దు
ర్వారం బగువిధిచేఁతకు, నేరికి నడ్డపడ వశమె ‡ యేల యలఁదురన్. 203

రుక్మిణీదేవి మొదలగుకృష్ణభార్య లగ్నిప్రవేశము సేయుట.

సీ. అని పల్కి రప్పిండు ‡ నందు రుక్మిణియు జాంబవతియు లోనగు ‡ పద్మముఖులు
గొందఱు గోరిరి ‡ కురునాథ యనుమరణమునకు బంధుజ ‡ నంబు లెల్ల
శోకార్తులై రోద ‡ నాకులత్వము నొంది, రనుమృతికలనకు ‡ సమరి యున్న
యాబలదేవము ‡ రాంతకమహిషుల, కతివిభవం బైన ‡ యానకల్ప

తే. నంబు నాకల్పరచనంబు ‡ నడపి నయుఁడు, చందనాగురుమయచితా ‡ సంవిధాన
మాచరించియుర్వప్రకా ‡ రాగ్నివిధియు, నర్చె మహనీయవిప్రజ ‡ నంబుఁ బనిచి. 204

క. విను సత్యభామ లోనగు, వనితాజను లధికనియతి ‡ వనములకుఁ దపం
బొనరింపఁ బూని కొందఱు, సని రవ్విధమున నలుప్త ‡ సత్కర్ముండై. 205

తే. అఖిలబంధుజనంబుల ‡ నాప్తజనుల, సర్వవాక్యప్రయుక్తి నూ ‡ ఱార్చి యుచిత
మార నామంత్రితులఁ జేసి ‡ యస్త్రలురులఁ, బోయె నా క్రీడి సాత్యవ ‡ తేయుఁ గుఱిచి.

అర్జునుఁడు వేదవ్యాసుని యొద్దకుఁ బోయి యాదవక్షయంబు సెప్పుట.

సీ. పోయి మరున్నది ‡ పాంతయాశ్రమమున, నర్హాసనమున నే ‡ కాంతనిరతి
నాసీనుఁడై యున్న ‡ యమ్మహాత్మునిఁ గని, యత్యంతభక్తి సా ‡ ష్టాంగవినతి

యాచరించినఁ జూచి § యమ్మహానీయవి, ద్యానిధి నేరంగ § నతనిఁ బిలిచి
తనసమీపంబున § నునిచి తద్వదనమ్ముఁ, గనుఁగొని ని న్నెఱుఁగంగ రాదు
తే. వెడ మొగంబైన దిదియేను § విజయ యెట్లు, కేలకెత్తఁగితి నిదియేమి § గినుక వొడమి
వధమునకు నయోగ్యుండగు § వానిఁ జంపి, తే పరాజితుఁడై తెనీ § తెలుఁగు సెపుమ.

చ. అనవుడు నార్తిఁ డిట్టులను § నమ్మహితాత్మునితోడఁ బద్మలో
చనుఁడు నవాంబుదప్రతిమ § చారుతనూలసితుండు దేవకీ
తనయుఁడు రామదేవుఁడును § దానును మేను దొఱంగి పోయె నే
మనఁ గల దెల్లయాదవులు § నాఱడిఁ బోయిరి సంయమీశ్వరా. 208

క. మహితాయుధసంప్రహతులు, సహించుదృఢ దేహధృతుల § సడిసన్న మహో
త్సహనులు యాదవవీరులు, నిహతు లయిరి దుంగలను మసనిమి ప్రవరా. 209

తే. అట్లు రామకృష్ణులు సర్వ § యాదవులును, దెగినఁ జిత్తంబుపొగులంగ § ముగువపింపు
బాలవృద్ధులఁ గొనిరాఁగఁ § బథము నంపు, నన్ను బోయలు దాఁకిన § నగుచు నేను.

చ. ఘనతర బాహుశక్తియును § గాండివశక్తియు నస్త్రశక్తియు
న్మనమున నచ్చి యప్డు మనినాథ కడంగితి నెట్ట కేలక
ద్ధనువు గుణంబుఁ గూర్చితి నుదగ్రత బాహుల లేక యుండెన
స్త్రనికరమంత్రతంత్రములు § సంస్మృతిఁ బొందవ యేమి సెప్పుదున్. 211

క. బోయలసంహృతికిఁ బ్రకృతి, సాయకసంపాతనములు § సాలవె యని యే
నేయఁ దొడఁగ దొనలు సెనటు, లైయుండె నొకండుఁ జేయు నది లేదయ్యెన్.

క. నెవ్వగయు నచ్చెరువు మది, నివ్వటిలఁగ నప్పు డేను § నివ్వెఱపడితిక
జివ్వన ముసరి కిరాతులు, గ్రొవ్వెసకం బెసఁగఁ జూఱగొని రజ్జనులన్. 213

ఆ. చాపదండనిహతి § నోపినభంగిఁ గి, రాతకోటి నాఁగి § రామకృష్ణ
వల్లభాదులైన § వనితలఁ గొందఱు, వృద్ధబాలకులను § వెరవుతోడ. 214

క. తొడికొని వచ్చితి గనా, నేచినయట్లచటనచట § నిలిపితి మునినా
థా చేటును భంగంబును, నై చిత్తము శోకమునకు § నగ్గం బయ్యెన్. 215

తే. పడనిపాటు వాటిల్లిన § వెగ మొగంబు, వడక యెట్లుండ వచ్చుఁ ద § పఃప్రకీర్ణ
నీయ యింకిట యే నేమి § సేయువాఁడ, నెసఁగుదయతోడ నానతి § యిమ్ము నాకు.

—♦ వేదవ్యాసుఁ డర్జునునకు హితోపదేశము సేయుట. ♦—

సీ. అన విని యమ్మహా § ముని కిరీటికిట్లను, సంయమదత్తోగ్ర § శాపనిహతి
నఖిలయాదవులును § నస్తైరి దానికి, నడలంగఁ బని లేదు § హరి యెఱుంగు
మున్న యాసంక్షయ § మన్న చెప్పెద వినుఁ, బ్రాప్తకాలం బగు § పనికి నడ్డ
పడనేల యని యాత్మ § భావించి యతఁ డుపేక్షాపరుఁడై యుండె § గాక మాఁడు
తే. భువనములు నన్యథాత్వంబుఁ § బొందఁ జేయఁ

జాలువాఁడు కణ్వాదులశాప ముడుప
శక్తి లే కుండెనే యవశ్యంబు భావి
యైనయది గాన యదునాశ మయ్యెఁ జువ్వె. 217

ఉ. నీ పని సేయ నీవలని నెయ్యమునం గృప నన్యసైన్యముం
డా వధియించు శూలధర తాస్ఫురణం బెసఁగంగ ముందర
ద్దేవుఁడు దానిఁ గాంచు భవదీయసమంచితదృష్టియుక్తి నినుం
గావఁడ యామురాంతకుఁడు కాలవిపర్యయ మావహిల్లుటన్. 218

చ. ధరణిభరంబు వాప నవతారము నొందినవిష్ణుఁ డత్తెఱం
గరుదుగ నిర్వహించి యజరామరనిష్కలనిర్వికారభా
స్వరనిజసత్పదంబు నుపశాంతిపరుం డయి పొందె దానికిం
గురుకులవర్య శోకమునఁ గుందుదురే మిముబోఁటిబోధనుల్. 219

మ. అవనీభారము వాపి తా హరికిఁ దోఁడై భీమసాహాయ్యగా
రవదుర్దాంతపరాక్రమంబునఁ గృతార్థత్వంబునం జేసి య
స్త్రవితానంబును నిన్నుఁ బాసి చనియెన్ దైవప్రకారజ్ఞ నీ
దువరిష్ఠాచరణంబునన్ సురలు సంతోషించి రవ్వీరులన్. 220

క. బలమును బుద్ధియుఁ జేవయు, నలఘుమతీ యుల్లసిల్లు నగుకాలమునం
బొలియుం గాలవిపర్యయ,కలనంబున బుధుల కుబ్బుఁ గలఁకయుఁ గలవే. 221

తే. కాలమూలంబు సర్వంబుఁ గాన దీని, కొంకుతలఁపులు దక్కి మీరుత్తమంపు
గతికిఁ జనుడు[1] నిశ్చింతవికారతనులు విడిచి యార్యజనంబులు వినుతిసేయ. 222

సీ. అన విని శోకమోహంబులు వాసిన, డెందంబు నిర్భరానంద మొంద
నధికభక్తియు వినయంబును దలకొన, నర్జునుఁ డమ్మహాత్ము వీడు
కొని వారణపురికిఁ జనుదెంచి ధర్మజుఁ, గని తనపోయివచ్చిన తెఱంగు
వినిపించె సర్వంబు నని యిట్లు సంయమి,సుతుఁడు వైశంపాయనుండు రామ

తే. కృష్ణు లాదిగఁ [2] గల్గినవృష్ణిచయము, భోజసంతతి యంధకరాజి నూత్న
వృత్తములు జనమేజయవిభునకింపు, [3] సెవులఁదళుకొత్తనేర్పడఁ జెప్పుటయును.

శా. కాలస్వైరవిహారభంజనకళాకౌతూహలత్తవ్య దు
శ్శీలాంతఃకరణావిభావ్య కరుణాశ్రీమందిరాపాంగ మం
త్రాళీవాచ్యసుధామయాంగ పవనవ్యాపారరోధక్రియా
శాలిస్వాంతసముల్లసద్విహరణా సంసారనిస్తారణా. 224

క. హృదయకమలమధురూపా, విదారితదురంతతాప వేదస్తోమా
స్పదపారాశర్యమన,స్సదనా దివిజశుభకృద్వచనపరవదనా 225

---

1. క. నిశ్చింతవికారచిత్త-చ. నిశ్చిత్తవికారచిత్త, తనువు లార్యజనంబులు. 2. క. గల యన్న వృష్ణిచయము. 3. క. చెలువు.

మాలిని. అమరగణవిరోధివ్యాపదాపాదికోపా
శమితవినతచిత్తాసంగిగాఢత్రితాపా
యమనియమవికాసిధ్యానగేహప్రదీపా
దమశమకలితానందప్రకాశస్వరూపా. 226

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునందు మౌసలపర్వంబు సర్వంబును నేకాశ్వాసము.



శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## మహాప్రస్థానికపర్వము, ఏకాశ్వాసము.

—:0:—



[1]పదసీమావాప్తిస

మాపాదన కేళికౌతుకాధీనదయా

వ్యాపార సకలవేదో

హాపోహాతీతసార హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె నట్లు కృష్ణునిపరమానంద పదప్రాప్తియు బలభద్రునియనంతత్వసిద్ధియు సకలయాదవమౌసలాహవప్రకారంబును నెఱింగి పదంపడి పాండవులెత్తెఱంగున వర్తించిరి మునీంద్రా యెఱింగింపుము. 2

క. అని యడిగిన వైశంపాయనుఁ డక్కురువంశవరునకు మాదరణంబున్
వినయంబుఁ గౌతుకము మెం, పును సంభావించి యవ్విభున కిట్లనియెన్. 3

సీ. అర్జునుం డమ్మెయి నచ్యుతరామాది,యాదవజనులవృత్తాంతములును
దనదు తెఱంగు నత్యవతీతనూభవు,హితభాషణంబులు నేర్పడంగఁ
జెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు,నకు మది యొఱయ నన్నరునితోడ
నఖిలభూతంబుల నవఘు పాకంబుఁ బొం,దించుఁ గాలుండు మదీయబుద్ధి

తే. కర్మసంత్యాగకలనంబు కార్య మిప్పు
డనువినిశ్చయ మొందె నీమనము నరయ
నిదియ మేలుగఁ గనుచున్కి విదిత మయ్యె
నాకు ననవుడు నయ్యింద్రనందనుండు. 4

వ. అన్నరేంద్రున కిట్లనియె. 5

క. కాలము నే మన వచ్చును, గాలముఁ గాలంబ పోలుఁ గా కొంటికి నీ

---

1. క. పదసీమా.

లీలలు గలవే లెస్సగ, నాలోకించి తిది హితము ♦ నభిమతము నగున్. 6

చ. అని తనమాట కియ్యకొను♦నన్నరుపల్కులకిచ్చి మెచ్చి య
జ్జనపతి భీమునిం గవలఁ ♦ జయ్యనఁ బిల్వఁగఁ బంచి యత్తెఱం
గు నెఱి నెఱుంగఁ జెప్ప ననుకూలత వారలయందుఁ దద్ద గ
ల్గిన దెలి వగ్గలింప నెఱిఁగించె యుయుత్సున కవ్విశేషమున్. 7

క. ఎఱిఁగించి రాజ్యతంత్రముఁ, దెఱఁగుపఱిచి నడపు వెరవు ♦ తేటపడంగఁ
గఱపి గృహాంతశ్చరితము, నెఱి నుపదేశించె నధిప ♦ నెయ్యం బలరన్. 8

క. ఆయనుజుని నట్లు మహా,నాయకుఁగాఁ జేసి భటజ♦నముఁ గూర్చి మహీ
నాయకుఁ డార్యులు కీర్తన, సేయఁ బరిక్షితుని రాజుఁ ♦ జేసె ధరణికిన్. 9

వ. ఇట్లభిమన్యుపుత్త్రు నభిషిక్తుం జేసి యతనికిం బూజ్యసామ్రాజ్యపరిపాలనప్రకారంబు
లుపదేశించి కురుకులపవిత్ర సముచితచరిత్ర భద్ర యగు సుభద్ర కిట్లనియె. 10

మ. [1]భవదీయాత్మజునాత్మజుండు కురుభూ♦భారోద్వహుం డయ్యె యా
దవవంశోత్తరుఁ డైన వజ్రునకు నిం♦ద్రప్రస్థరాజ్యంబు గా
రవదీప్తంబుగ నిచ్చినాఁడ సుచరి♦త్రా రక్షణీయంబులై
నవి యీయిండులు రెండు నీవు దృఢధై♦ర్యం బొప్ప రక్షింపుమీ. 11

క. విను శేషించినయాదవ,జనులకు నావజ్రనృపతి ♦ సంరక్షకుఁ డా
తనిఁ బోషించుట ధర్మం, బనఘా యది లేమి ధర్మ♦హాని యగుఁ జుమీ. 12

క. అని తారు గృహంబు దొలఁగి, చను నెడ నవ్వనిత పిఱుఁదఁ ♦ జను దేఁ కుంతిన్
జననాథ యతెందు నియమిం,చి నవాఁ డై యూఱఁగిల్లెఁ ♦ జిత్తములోనన్. 13

చ. పదపడి భారతాజిమృత♦బాంధవకోటికి మానసాజి ను
న్మదు లయి పడ్డయాదవజ♦నంబులకుం బరలోకసౌఖ్యసం
పద కయి చేసె నక్కురునృ♦పాలవరిష్ఠుఁ డనేకదానముల్
రదనితురంగగోకనక♦రత్నమయంబులు గా ముదంబునన్. 14

క. భూదానంబులు నం గ,న్యాదానంబులును జేసె ♦ నన్నరపతి వా
జోదానంబులు నత్యా,తాదరమున నాచరించి ♦ యరదములిచ్చెన్. 15

తే. ఇట్లు ధౌమ్యాదివిప్రుల ♦ కెల్లఁ దృప్తి
యొసఁగ బహువస్తుకోటుల ♦ నొసఁగి కృపుని
ధనమునను బహుమానంబు♦నను బ్రమోద
భరితుఁగాఁ జేసెఁ గురుపతి ♦ కురువరేణ్యా. 16

వ. శేషించిన కాంచనరత్నాదు లాత్మీయసతి పరిక్షితునకుఁ బరమాదరంబున సమ
ర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌరజానపదప్రవర

1. క. భవదీయాత్మజసంభవుండు.

జనంబుల రావించి. 17

సీ. [1]ఆపార్థపౌత్త్రునిఁ జూపి మాయేవుర, మాఱుగా మీరిక్కుమారవరునిఁ
గైకొని తగ నెల్లకార్యజాతంబును, నడపుచు ననురక్తి నాఁడునాఁటి
కెక్కుడగుచు నుండ నీతనియుల్లంబు, రంజిల్ల సమ్యగారాధనంబు
నందు సంప్రవణులరగుఁడయ్య యని పల్కి, తమనిశ్చయంబు నుదాత్తభంగిఁ

తే. జెప్పటయు వారు మొగములు సిన్నఁబోవ
మము నుపేక్షించి యిటు సేత సముచితంబె
నీదుచిత్తంబు కారుణ్యనిలయ మేము
దరతరంబ యాశ్రితులము ధర్మశీల. 18

వ. అని గద్గదకంఠు లగుచు నాడినమాటలకు నమ్మనుజేంద్రుం డగు తెఱంగున మఱుమాట లాడి తమగమనంబులకు సజ్జనంబుల నియ్యకొల్పి నప్పు డందులోనం గొందఱు గొందఱనివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు కలియుగంబు ప్రవేశించుటం జేసి కాదె యిట్టివి పుట్టెడు నని తలంచి నవ్వి నరనాథునకుం జెప్పిన నప్పౌరవోత్తముండు నవ్వుచు మనమనువులు సాలు నని పలికి సర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినంబులు ధరియించినం దమ్ములు ద్రౌపదియు నట్ల చేసి రందఱుం దత్కాలోచితంబు లగునిష్టావిధానంబు లాచరించి యగ్నుల నంబుగతంబులు సేసి మొగంబులం దెలి వగ్గలింప గృహంబు వెలువడి రప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠం బోవ సప్తము లైరి యొక్కసారమేయంబు వారలవెనుకఁ జనియె నప్పుడు. 19

సీ. పౌరజనంబు లాబాలవృద్ధంబుగా, వచ్చి రక్కురువంశవరులఁ జూడఁ
దత్సమయంబు జూదమునాఁడు వెడలి వా, రరిగెడునయ్యవసరముఁ బోలె
భటసమేతముగ నపాండుతనూజులతోన యుయుత్సుండు దాను నరిగె
భవదీయజనకుఁ డభ్యంతరసతు లెల్ల, ననుగమించిరి వారి మనుజనాథ

తే. యిట్లు కరిపురి వెలువడియేఁగె ధర్మతనయుఁ డందఱు నెంతయు దవ్వు గాఁగ
సాలయుకేఁగి శోకళ్ళనుఁ జూచి నిలువు, మనఁడు తలవాంచి యారాజు సనుచునుండె.

చ. తనువులు దూల నందఱుఁ బ్రదక్షిణముల్ వినుత ప్రణామముల్
వినయసమేతులై నడపి వీడ్కొని రానృపతిం గ్రమక్రమం
బున నిటు లమ్మలంబు మనములు పొగిలింపఁగ వచ్చి చొచ్చి ర
జ్జనములు నంబరిక్షితుఁడు సామజపట్టన మస్ఫురద్గతిన్. 21

వ. ఆసమయంబున. 22

తే. జనకుకడకు నులూచి భుజంగలోకముసకుఁ బోయెఁ జిత్రాంగద తనతనూజుఁ
డైనబభ్రువాహను పాలికరిగెఁ దక్కఁ, గలుగుసతు లెల్ల నీతండ్రికడననిలువ.

1. క. ఆపార్థసత్పునిఁ జూపి.

వ. అప్పుడు. 24

సీ. కృపుఁడు ధౌమ్యుండు నా నృపతినిఁ దగువారి, సర్వభాషణముల ననునయించి
యెలమి చిత్తంబులఁ దలకొల్పి పౌరులఁ, దగఁ దేర్చి పనుల నుత్సాహ మెసఁగ
వర్తింపఁ జేసిన వారణపురి పూర్వ,భంగి సంపత్పరిభరిత మయ్యె
నట ధర్మజుండు ముందటఁ జనఁ గ్రమమున, ననుగమించిరి పవనాత్మజుండు
తే. నర్జునుఁడు నకులుఁడును దేవవరజుండు, ద్రౌపదియు నిట్లు సనుచుండఁ దగిలి వారి
వెనుక విడువక శునకంబుఁ జనియె నవ్వి,ధమున వారు మహాపథగమనమునకు.

వ. పూని యుపవాసవ్రతపరులై భాగీరథీప్రాంతమునం జని యంతనుండియుఁ బ్రాఙ్ముఖ
వర్తనంబు గైకొని యోగబలంబున నరిగి గిరిసరిదరణ్యంబు లనేకంబులు గడచి
పూర్వసముద్రంబుతీరంబు సేరి రట్టియెడ. 26

క. దిక్కులు మేఘపథంబును, బిక్కటిలఁగ నవయవములు భీషణములుగా
నొక్కయెడ నగ్నిదేవుం, డక్కురువంశవరులయగ్రతలమునన్. 27

అగ్నిదేవుఁ డర్జునుచేతి గాండీవంబు సముద్రంబున వైపించుట.

సీ. నిలిచి బీభత్సుండు నిర్భరస్నేహంబు,కతమున విడువక గాండివంబు
గొనివచ్చుచున్న నాతనితోడ నవ్వాయు,సఖుఁ డో ధనంజయ శౌరిచక్ర
మెన్నఁడే దివమున కేఁగె నీ వేల గాం,డీవంబు విడువవు దేవకార్య
మునకుఁగా వరుణదేవునిచేత నేను దె,చ్చినయది యీధనుశ్శ్రేష్ఠ మమ్మ
తే. హానుభావుని కొప్పింపు మనిన లెస్స, యట్లు సేయుదుఁగా కని యక్కిరీటి
యగ్రజానుజులకుఁ జెప్పి యాదరమున, నాతఁ డచ్చాప మంబుధియందుఁ బెట్టె.

వ. తదనంతరంబ కృశానుం డంతర్ధానంబు సేసె నయ్యోగపరాయణులు పదంపడి. 29

ఆ. దక్షిణాభిముఖతఁ దలకొని యిలకుఁ బ్ర,దక్షిణంబు గాఁగ దమమనముల
దద్ద ముదము నొంద నద్దెస వార్ధియు, ప్రాంతమునకు నేఁగి రధిపముఖ్య. 30

వ. అచ్చటనుండి. 31

క. పడమర మొగమై పశ్చిమ,జడనిధితీరంబు సేరఁ జని యుత్తర మె
క్కుడునియతి నడచి వారిధిఁ, బొడ వడఁగినయాదవేంద్రపురి సేరువగన్. 32

చ. అట సని యశ్రమంబున హిమాచలముం సమతిక్రమించి వా
రటవులు భూములున్ నదులు నద్రులునుం గడుఁ బెక్కు లంచితో
త్కటదృఢయోగసేవననితాంతనిరాకులవర్తనంబు నొం
దుట గతఖేదులై కడచి తూలక మేరుసమీపభూమికిన్. 33

ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట.

సీ. చనునప్పు డయ్యేవురును నతిస్థిరయోగ,సాధనపరు లయి సత్వరముగఁ
బోవంగఁ బాంచాలభూపపుత్రిక యోగ, మెడలిన మేదినిఁ బడియె నధిప
పడిన సమీరణుఁ డొడుకు గనుంగొని, యన్నతోఁ జెప్పి యయ్యతివ వలనఁ

